# కడప జిల్లా శాసనాలు

# సంస్కృతిచరిత్ర

డా॥ అవధానం ఉమామహేశ్వర శాస్త్రి

సాహితీ సామ్రాజ్యము

1995

కడప జిల్లా శాసనాలు – సంస్కృతిచరిత్ర

శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంనుండి పి.హెచ్.డి. పట్టం పొందిన పరిశోధన నిబంధం, 1992


Publishers : SAHITI SAMRAJYAMU, PRODDATUR.

First Edition : 1995

Copies : 1,000





Cover Design : SEELAVI

Cover Photo : S. Bhasha Jan & S. Chand

Rs. : 45/-

For Copies :
Dr. A. Umamaheswara Sastry,
Mitra Jyoti,
6/24, Gandhi Road,
PRODDATUR – 516 360.





Laser Typesetting : Lakshmi Graphics, 2–1–476, Nallakunta, Hyderabad – 44.
Processing & Printing : Navya Printers, Badam Sona Apartments, Raj Bhavan Rd., HYD.
Cover Printing : Charita Graphics, Chikadpally, Hyderabad.

# కృతజ్ఞతలు

ఈ నిబంధ నిర్మాణానికి ఆధారమైన పరిశోధనకు పర్యవేక్షకునిగా బాధ్యతను స్వీకరించడంతోపాటు పరిశోధనకాలంలో అడుగడుగునా పొడసూపిన అడ్డంకులను అధిగమించడంలో నాకు చేయూతనిచ్చిన ఆచార్య పి.ఎల్. శ్రీనివాసరెడ్డి గారికి.

ఈ పరిశోధనకు సంబంధించిన సర్వావస్థలలో నాకు చేదోడువాదోడుగా నిలిచిన కె. శ్రీనివాసులు (చరిత్ర మరియు పురావస్తు శాస్త్రాధ్యాపకుడు, మలయాళస్వామి ప్రాచ్య కళాశాల, ప్రొద్దుటూరు) గారికి, కె.యస్.బి. కేశవ (సాంకేతిక సహాయకుడు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పురావస్తు మరియు పురావస్తు ప్రదర్శనశాలల శాఖ) గారికి,

ఈ పరిశోధనాంశానికి సంబంధించిన ఎన్నో సందేహాలను నివృత్తి చేసిన పురాభిలేఖా శాస్త్రజ్ఞులు డా॥ ఆర్. శేషశాస్త్రి గారికి,

ఈ పరిశోధనకు ఉపకరించిన శాసనాలను పరిష్కరించి సంకలనం చేసిన పండితులకు, వివిధ గ్రంథ రచయితలకు,

ఈ పరిశోధనను చేపట్టడానికి నాకు అనుమతి ఇచ్చిన శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయ అధికారులకు,

ఈ పరిశోధన కాలంలో ఐదు సంవత్సరాపాటు ఫెలోషిప్ ఇచ్చి ఆర్థిక సహాయాన్ని అందించిన యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ వారికి,

ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయాన్ని అందించిన తిరుమల తిరుపతి దేవస్థానములు మరియు తెలుగు విశ్వవిద్యాలయం వారికి,

ఈ గ్రంథాన్ని ఆమూలాగ్రం వివేచించి 'ఆప్తవాక్యాన్ని' అందించిన ఆచార్య హెచ్.ఎస్. బ్రహ్మానంద గారికి,

ముఖపత్రానికి ఉపయోగించిన ఫోటోలను తయారు చెయ్యడంలో నాకు సహకరించిన ఎస్. భాషాజాన్, చాంద్ సోదరులకు; జింకా సుబ్బారావు, సురేష్ సోదరులకు,

ముఖపత్ర శిల్పి శీలా వీర్రాజు గారికి,

లక్ష్మీ గ్రాఫిక్స్ మూర్తి, నవ్య ప్రింటర్స్ రామకృష్ణారెడ్డికి,

ఈ గ్రంథ ముద్రణ కార్యాన్ని తన స్వంత పనిగా నిర్వర్తించిన సహృదయులు వాసిరెడ్డి నవీన్ గారికి,

నిరంతరం నా పురోభివృద్ధిని కాంక్షించి నన్ను ప్రోత్సహించి సమయోచిత సహాయ సహకారాలందజేసిన మిత్రులకు,

నా కృతజ్ఞతలు.

– **అవధానం ఉమామహేశ్వర శాస్త్రి**

ఆచార్య పి.ఎల్. శ్రీనివాసరెడ్డి
కుల సచివులు
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం
అనంతపురం

# సుహృల్లేఖ

"History is nothing but the continuous transformation of human nature" – Marx

కాలావధుల్ని అధిగమించి జాతి జీవన ప్రవాహంలోని సర్వ విషయాల్ని తన పరిధిలోకి సంలీనం చేసుకుంటుంది సంస్కృతి. అది సంస్కృతి వైశిష్ట్యం.

అన్ని పాఠ్యాంశాలు పాఠాల్ని నేర్పుతాయి. చరిత్ర పాఠ్యాంశాలు మాత్రం పాఠాలతో బాటు గుణపాఠాల్ని నేర్పుతాయి. అది చరిత్ర గొప్పదనం.

ఈ రెండింటి సమన్వయమైన సంస్కృతిచరిత్రను గురించి తెలుసుకోవడం అత్యంతావశ్యకం. అందుకు ప్రధానమైన మూలాధారాలు రెండు. ఒకటి కావ్యాలు; రెండు శాసనాలు. ఆంధ్ర సంస్కృతిచరిత్రపైన ప్రాచీన కావ్యాల ఆధారంగా జరిగినంత పరిశోధన శాసనాల ఆధారంగా జరగలేదు. ఇలాంటి పరిశోధనలో ఆద్యుడు, అధ్యుడు సురవరం ప్రతాపరెడ్డి గారు. ఆయన మార్గాన్ని పట్టి ముందుకు సాగిన రచనలు చాలా తక్కువ. ఈ పరిశోధన ఆ లోటును తీర్చే ప్రయత్నం చేసింది.

అతి విస్తృతమైన విషయాన్ని గ్రహించి కొంత పరిశోధిస్తే – స్థూలంగా చెబితే – అది సిద్ధాంత వ్యాసం కావడం ఒక పద్ధతి. అత్యంత సూక్ష్మమైన విషయాన్ని గ్రహించి దానిలో వున్న సమస్తాంశాల్ని తలస్పర్శిగా పరామర్శించి ఆవిష్కరిస్తే – అది సిద్ధాంత వ్యాసం కావడం ఇంకొక పద్ధతి. ఇది తౌడు నుండి నూనె తీయడం లాంటిది. ఈ రెండవ కోవకు చెందుతుందీ సిద్ధాంత గ్రంథం.

ఉత్తమ పరిశోధకునికి తల, పట్టుదల రెండూ అవసరం. అవి రెండూ ఈ రచయితకు పుష్కలంగా వున్నట్టు ఈ గ్రంథం నిరూపిస్తోంది. రెండో అధ్యాయంలోని విషయ విశ్లేషణ చరిత్ర విషయంలో రచయితకున్న ప్రావీణ్యానికి దర్పణం పడుతున్నది. ఈ గ్రంథంలో సందర్భోచితంగా కొన్ని ప్రాచీన పదాల అర్థ వివరణ కోసం చూపిన ఉపపత్తులు గమనించదగినవి. రచయిత వివరించిన 'చాసరక్షేత్ర' వంటి పదాలు సంస్కృతాంధ్ర నిఘంటువుల్లో చేరవలసిన అవసరం వుంది.

ప్రతిపాదించిన అంశాలు హేతబద్ధంగా వుండడం, విషయం సమగ్రం కావడం, విశ్లేషణ చక్కగా వుండడం, ప్రతిపాదన శాస్త్రీయం కావడం వల్ల ఈ పరిశోధన గ్రంథం ఉత్తమ లక్షణాల్ని సంతరించుకొనింది. విషయ సేకరణలో వహించిన జాగ్రత్త, జాగ్రత్తగా సేకరించిన విషయాన్ని విశ్లేషించి ఆవిష్కరించిన తీరుతెన్నులు అసదృశాలు.

ఈ రచయితకి పరిశోధనాంశాల మీద గట్టి పట్టు వున్నట్టు గ్రంథాన్ని అలవోకగా చదివిన వాళ్లకు కూడా అవగతమవుతుంది. భాషమీద కూడా అదికారం వుండడం విశేషం. అతి గహనమైన విషయాన్ని అందరికీ అర్థమయ్యే రీతిలో సరళ సుందరమైన శైలిలో వ్రాయడం అభినందనీయం.

విషయ సేకరణ విశ్లేషణ ఒక ఎత్తయితే వస్తువరణం (Selection of the Topic) ఒక ఎత్తు. చెప్పిన దాన్ని క్లుప్తంగా, సమగ్రంగా శ్రద్ధాసక్తులతో చెప్పడం రచనకు, ముఖ్యంగా సిద్ధాంత గ్రంథ రచనకు ప్రాణం. అల్పాక్షరాల్లో అనల్పార్థ రచన చేయాలన్న తిక్కన వాక్యం ప్రతి వ్రాతా 'పకడ్బందీ'గా వుండాలంటోంది. ప్రాచీనులైన పాణిన్యాదుల మతం కూడా ఇదే. స్థూలంగా చెబితే చదువు స్వార్థం, రచన పరార్థం.

వస్తువరణంలోనూ, పదాల్ని ఏరుకోవడంలోనూ, వాక్యాల్ని కూర్చడంలోనూ, ముద్రణాది సామగ్రిని సమకూర్చుకోవడంలోనూ - ప్రతి చిన్న విషయంలోనూ అత్యంత శ్రద్ధ వహించడం తనకు మాత్రమే వీలవుతుందేమో ననిపిస్తుంది. తన ఇంటిపేరు 'అవధానం' కావడం అందుకు కారణమేమో.

ఆధునికుల్లో ఈరకమైన సంస్కృతిచరిత్ర పరిశోధనకు ఉద్యుక్తుడై, కృతకృత్యుడైనప డాక్టర్ అవధానం ఉమామహేశ్వర శాస్త్రిని అభినందిస్తూ, ఈ కోవలో తాను ఇంకా ఇతోధికమైన కృషిచేసి ఆంధ్ర భాషా యోషకు అనర్ఘ రత్నాల్ని సమకూరుస్తాడని ఆకాంక్షిస్తున్నాను.

అనంతపురం
24-5-95

(సం.) పి.ఎల్. శ్రీనివాసరెడ్డి

– ఆచార్య హెచ్.ఎస్. బ్రహ్మానంద
ఆంధ్రభారతి, శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం

# ఆప్తవాక్యం

మా శాఖ విద్యార్థి డా॥ అవధానం ఉమామహేశ్వర శాస్త్రి 'కడప జిల్లా శాసనాలు - సంస్కృతిచరిత్ర' అనే ఈ గ్రంథం ద్వారా ఆంధ్రదేశానికి గ్రంథకర్తగా పరిచయం అవుతున్నందుకు అధ్యాపకులుగా మా అందరి సంతోషాన్ని 'ఆప్తవాక్యం'గా వ్యక్తం చేయదలచి ఈ నాలుగు మాటలూ రాస్తున్నాను. ఇలాంటి ఉత్తమ పరిశోధన చేయించిన మిత్రులు ఆచార్య పి.ఎల్. శ్రీనివాసరెడ్డి గారి పర్యవేక్షణ సామర్థ్యాన్ని ప్రశంసిస్తూ ఈ గ్రంథం చదవటం వల్ల మనం గుర్తించగల కొన్ని అంశాల్ని ప్రస్తావించదలచుకున్నాను.

మన తెలుగు పరిశోధన శాసనాలలో గిడుగు వారి తరంలోనే మొదలైనా ఎందుకో ఈనాడు విశ్వవిద్యాలయాల్లో కూడా ఈ రంగంమీద కృషి చేయగలవారు తగ్గిపోయారు. పాఠ్యాంశాలలోనూ 'శాసన భాగం' తగ్గిపోయింది. ఈ నడుమ వచ్చిన మంచి పరిశోధన డా॥ నరసింహాచార్యులు రచించిన 'కాకతీయుల కాలంనాటి శాసనాలు - భాషా పరిశీలన' (1987). ఇప్పుడీ గ్రంథం. ఇలాంటి గ్రంథాలు చూస్తుంటే శాసనాలమీది పరిశోధన ఇంకా కొన్ని కోణాల నుంచీ జరగాలని అనిపిస్తుంది. ముఖ్యంగా భాషా విషయంగా.

'భాష సాంస్కృతికంగా అబ్బే వారసత్వ సంపద' - అని అందరూ నిర్వచన ప్రాయంగా అంగీకరించినా పరిశోధనలో మాత్రం సంస్కృతి నాధారంగా భాషను విశ్లేషించే ప్రయత్నం చాలా తక్కువగా జరిగింది. బహుశా పరిశోధనలో ద్రావిడ భాషా విజ్ఞానంలో భాగంగా 'తెలుగు భాషాచరిత్ర' తయారు చేయటం ఒక అవసరంగా భావించి శాసన భాషను కూడా భాషా నిర్మాణంలో వచ్చిన మార్పుల కోసమే అధికంగా చూస్తూ వచ్చాం. డా॥ బూదరాజు రాధాకృష్ణ, డా॥ కందప్పచెట్టి, డా॥ రంగనాథాచార్యులు వంటి ప్రముఖ పరిశోధకులంతా ఈ దృష్టితోనే తమ కృషిని చేశారు. అదనంగా వ్యావహారిక భాష శాసనాల్లో ఎలా మిగిలి ఉందో కూడా నిరూపించారు.

కాని శాసనం అంటే ఏమిటి? శాసనాలు ఎన్నిరకాలు? ఏఏ రకాల శాసనాలు ఎందుకు వేసేవారు? ఏయే సందర్భాలలో? వీటి వెనుకనున్న సామాజిక సాంస్కృతిక నేపథ్యం ఏమిటి? - ఈ ప్రశ్నలకు సమాధానాలు బాగా తెలిసిన తరువాతే శాసనభాష పట్ల సమగ్రమైన అవగాహన కలుగుతుందని ఈ గ్రంథం చదివిన ఎవరికైనా తెలుస్తుంది. ఈ దృష్టితో ఇతర ప్రాంతాలలోని శాసనాలమీద సాంస్కృతికాధ్యాయనం జరిపిన తరువాతే 'శాసనభాషా చరిత్ర' బాగా రూపు దాలుస్తుందని ఎవరికైనా నమ్మకం కలుగుతుంది.

ఇక - కడపజిల్లాకు ఆంధ్రప్రదేశ్ చరిత్రలోనే కొన్ని వైశిష్ట్యాలు ఉన్నాయి. మౌర్యులు, శాతవాహనులు, ఇక్ష్వాకులు, పల్లవులు, రేనాటి చోళులు మొదలైనవారు పాలించిన భూభాగం ఇది. చోళులు పరసీమల నుంచి వచ్చి ఈ ప్రాంతాన్ని ఏలారు. ఈ ప్రాంతంలోని ప్రజలకు తమ ఆజ్ఞలను తెలపవలసి వచ్చి దేశభాషలో శాసనాలు వేయటం ప్రారంభించారు. అలా

వచ్చిందే తెలుగు శాసనాలలో మొదటిదిగా గుర్తింపబడిన ధనంజయుని కలమళ్ల శాసనం (క్రీ.శ. 575) - డా॥ శాస్త్రి ఈ విషయాన్ని గుర్తిస్తూ శాసనాల ద్వారా గుర్తించిన వివరాలను చరిత్రతో సమన్వయించటంలో ఉన్న చిక్కును గురించి ఇలా రాస్తున్నాడు :

"లిపి శాస్త్రం అందిస్తున్న సాక్ష్యం అమోఘమైంది కాదు". (చూ.పు. 19) - ఈ సందర్భం మొత్తం చదివితే శాసన పరిశోధనలో చరిత్ర పరిజ్ఞానం ఎంత క్షుణ్ణంగా అవసరమో గుర్తించవచ్చు. అలాగే భాషా జానపద విజ్ఞానాల పరిశోధనకు కూడా చారిత్రక పరిజ్ఞానం అవసరమన్న విషయాన్ని ఇలాంటి చర్చల ద్వారా మనం తెలుసుకోగలం.

★ ★ ★

ౘ్ర - అన్న లేఖనాన్ని శాస్త్రి చాలాచోట్ల ఉపయోగించాడు. దంతమూలీయ త (న్తు) [t] వర్ణంగా భాషా విజ్ఞానులు గుర్తించిన ధ్వనినే ్ర (thra) గా శాసన పరిశోధకులు గుర్తించారు. *న్త > న్ట > ణ్డ లుగా మారింది. (వాన్తు > వాన్టు > వాణ్డు > వాడు అయింది). ఇంతవరకు - న్త - లేఖనంలో మిగిలి ఉన్న సందర్భాన్ని భాషాచరిత్ర చర్చల్లో మనం చూడలేదు. ఇక్కడ దాన్ని శాస్త్రి గుర్తించి ఉండడం కూడా ఆసక్తికరంగా ఉంది.

★ ★ ★

శాసనాలలోని సామాజిక, ఆర్థిక, ధార్మిక జీవనాల విషయం ఈ గ్రంథంలో విస్తారంగా చర్చింపబడింది. ఈ శాసనాలలోని మాటలు, ఊర్ల పేర్లతో సహా ఇప్పటికీ రాయలసీమలో - అందులోనూ ముఖ్యంగా కడప జిల్లాలో మిగిలి ఉన్నాయి. సి.పి. బ్రౌన్ తన నిఘంటువుల్లో కడప మాండలిక పదాలనే రికార్డు చేశాడు కూడా. దీన్నిబట్టి సంస్కృతికి తరతరాలుగా నిలిచి ఉండే లక్షణం ఉందని తెలుస్తుంది. దీనిలో భాగంగానే భాష కూడా తన జీవ లక్షణాన్ని నిల్పుకొని ఉంటుంది. ఉదాహరణకు శాసనాల్లో కనిపించే 'ఒట్లు' (పుట 13) చూడండి. ఇవి ఇప్పటికీ కడపలో, రాయలసీమలో చాలావరకు ఇలాగే ఉన్నాయి.

ఛాయాస్తంభాలు, వీరగల్లులు - వీటిమీద ఈ గ్రంథంలోనే తెలుగులో మొదటిసారిగా చర్చ కనిపిస్తోంది. (కన్నడంలో డా॥ ఆర్. శేషశాస్త్రి గారు 'వీరగల్లు'ల మీద విస్తారంగా పరిశోధించారు). అర్థోదయం, వ్యతీపాతం, ఏకోద్దిష్ట భుక్తం - ఇత్యాది విషయాలు చదువుతూ వుంటే ఏనాడో గిడుగు రామమూర్తి పంతులు కీల్‌హార్న్ వంటి పండితులతో జరిపిన చర్చలు గుర్తుకు వస్తాయి. 'చేను-మడి' వీటి మధ్య ఉన్న తేడా తెలియాలన్నా, 'చెప్పల్లి' అన్న ఊరుపేరు వ్యుత్పత్తి (>చెర్పలియ) తెలియాలన్నా - కేవలం సోదర రూపాలతో పోలిక, జానపద వ్యుత్పత్తులు చాలవని చరిత్ర తెలియాలని ఈ గ్రంథం చదివితే తెలుస్తుంది.

ఇది కడప సాంస్కృతిక చరిత్రకు సంబంధించిన ఒక మంచి డాక్యుమెంటు. ఒక రిపోర్టు. రచయిత శైలిలో కూడా ఇదే ఉంది. అందుకే రచన ఉన్నట్టుండి ఆగిపోయిన భావన కలుగుతుంది. 'మంగళ మహాశ్రీ' - వంటిది కనిపించదు. మరో పరిశోధన అక్కడ మొదలు కావాలని అర్థం. డా॥ శాస్త్రికి మా అందరి అభినందనలు. పాఠకులకు స్వాగతం.

అనంతపురం
30-11-94

(సం) హెచ్.ఎస్. బ్రహ్మానంద

# విషయసూచిక

# ప్ర స్తా వ న

భారతదేశంలో తొలితరం చారిత్రక పరిశోధకులు ప్రధానంగా రాజకీయ చరిత్రను ఆవిష్కరించే దృక్పథంతోనే శాసనాలను అధ్యయనం చేసినారు. తరువాతికాలంలో రాజవంశాల చరిత్రతోపాటు ఆ యా కాలాలలోని సాంస్కృతిక విశేషాలను వివరించే ప్రయత్నం జరిగింది. ఇటీవలి కాలంలో పరిశోధకులు సామాజిక, ఆర్థిక, ధార్మికాది విషయాల అధ్యయనంపట్ల మొగ్గు చూపడంతో, చరిత్రరచనాశాస్త్రంలో క్రొత్త వరవడి రూపుదిద్దుకునింది.

ఈ వరవడిలోనే కొన్ని రాజవంశాల పరిపాలనకాలాలకు సంబంధించిన సంస్కృతిచరిత్రను వెలుగులోకి తెచ్చిన గ్రంథాలు వెలువడినాయి. ఈ నేపథ్యంలో ప్రాంతీయ చరిత్రలను సాంస్కృతిక దృష్టితో అధ్యయనం చెయ్యవలసిన అవసరం వుంది. ఈ విధమైన రచనలు సమగ్ర భారతీయ సంస్కృతిచరిత్ర పునారచనానికి తోడ్పడతాయి. ఇదే ప్రస్తుత అధ్యయనానికి ప్రేరణ.

కడప జిల్లాలో లభిస్తున్న శాసనాలు ఆధారంగా సంస్కృతిచరిత్రను పునారచించడం ప్రస్తుత అధ్యయన ప్రధానోద్దేశం.

ఒక జాతి సామూహిక అవ్యక్తచేతనానియంత్రితాలై వ్యక్తరూపంలో కనిపించే వివిధ జీవన దృక్కోణాల సమాహారాన్ని సంస్కృతి అని చెప్పవచ్చు. కాబట్టి భిన్నకాలావధులను అధిగమించి ఒక జాతి జీవనస్రవంతిలో భాగాలుగా ప్రవర్తిల్లిన రాజకీయ, సామాజిక, ఆర్థిక, ధార్మిక, కళాసంబంధమైన విషయాలు; భాషా సాహిత్యాలు సంస్కృతి పరిధిలోకి వస్తాయి.

ఈ జిల్లాలో లభించిన శాసనాలలో కళాసంబంధి విషయాల ప్రస్తావన దాదాపు లేనందువల్ల, భాషానుశీలనం విస్తృత పరిధి కలిగిన ప్రత్యేక అధ్యయన విభాగం కావడం వల్ల ఈ రెండు విభాగాలను ప్రస్తుత అధ్యయన పరిధినుండి మినహాయించడం జరిగింది.

ఈ పరిశోధన నిబంధంలో ఐదు అధ్యాయాలున్నాయి. మొదటి అధ్యాయంలో కడప జిల్లాలో లభిస్తున్న శాసనాల స్వరూప స్వభావాలను; రెండవ అధ్యాయంలో ఈ జిల్లా రాజకీయ నేపథ్యాన్ని; మూడవ అధ్యాయంలో ఈ జిల్లాలోని శాసనాల ద్వారా తెలుస్తున్న సామాజిక వ్యవస్థను, ప్రజా జీవనాన్ని, సామాజిక మూల్యాలను; నాలుగవ అధ్యాయంలో ఆర్థిక వ్యవస్థను; ఐదవ అధ్యాయంలో ఈ జిల్లాలో ప్రాభవాన్ని పొందిన వివిధ ధార్మిక సంప్రదాయాలను వివరించడం జరిగింది.

# సంకేతపద సూచిక

| | | |
|---|---|---|
| A.R. | = | (Archaelogical) Annual Reports |
| C.I.I. | = | Corpus Inscriptions Indicarum |
| E.I. | = | Epigraphia Indica |
| I.A.P., C.D. | = | Inscriptions of Andhra Pradesh, Cuddapah District. |
| L.R. | = | Local Records |
| S.I.I. | = | South Indian Inscription |
| క్రీ.శ. | = | క్రీస్తు శకము |
| వి.శ. | = | విక్రమ శకము |
| శా.శ. | = | శాలివాహన శకము |

# ప్రాచీన లిపి సంకేతాలు

| | | |
|---|---|---|
| ఴ | = | Retroglex fricative [Z] |
| ఱ | = | Alveolar [tt] — (recognised as 'thr' by epigraphists) |
| [illegible] | = | [nttu] |
| [illegible] | = | [ttla] |

# మొదటి అధ్యాయం

# శాసనాధికారం

## 1. శాసనం

శాశ్వతంగా నిలిచే పదార్థం మీద చెక్కబడిన వ్రాతను 'శాసనం' అని వ్యవహరిస్తున్నాం. శిలలు, లోహ ఫలకాలపైనే కాక ఏనుగు దంతంతో చేసిన వస్తువులు, మృణ్మయ పాత్రలు, ఇటుకలు మొదలైన వాటిపై చెక్కబడిన శాసనాలు కూడ భారతదేశంలో లభిస్తున్నాయి.

పరిపాలకులు తాము సాధించిన ఘనకార్యాలను ప్రజలకు తెలియజేయడానికి శాసనాలను జారీ చేసేవారు. అంతేకాక వారు బ్రాహ్మణులకు లేదా దేవాలయాలకు దానాలను ఇచ్చినప్పుడు, కొన్ని పన్నులను మినహాయించినప్పుడు, కొన్ని ప్రత్యేక విషయాలను ప్రకటించడానికి శాసనాలు జారీ చేయబడేవి.

ప్రాచీన కాలంలో శాసనం అంటే రాజశాసనమనే అర్థం. శాసన రచనను 'లేఖ్యకరణం' అనేవారు. మహీపతి భూదానాన్ని ఇచ్చినప్పుడు, లేదా ఒక నిబంధాన్ని చేసిన తరువాత, రాబోయే తరాల రాజులకు తెలియడం కోసం ఒక లేఖ్యాన్ని తయారు చేయించాలని, ఆ తరువాత చిరకాలం నిలిచే విధంగా వస్త్రంపై కాని, తామ్ర ఫలకంపై కాని పై భాగంలో తన ముద్రికను వేసి, తన పూర్వీకులను గురించి, తనను గురించి తెలిపి; దాన పరిమాణాన్ని, దాన విభాగ వర్ణనను, దాన కాలాన్ని పేర్కొంటూ తన చేవ్రాలుతో కూడిన శాసనాన్ని తయారు చేయించాలని యాజ్ఞవల్క్య స్మృతిలోని

*"దత్త్వా భూమిం నిబంధం వా కృత్వా లేఖ్యం తు కారయేత్ ।*
*ఆగామి భద్ర నృపతి పరిజ్ఞానాయ పార్థివ: ॥*

*పటే వా తామ్రపట్టే వా స్వముద్రోపరిచిహ్నితం ।*
*అభిలే ఖ్యాత్మనో వంశ్యా నాత్మానం చ మహీపతి: ॥*

*ప్రతిగ్రహ పరీమాణం దానచ్ఛేదోపవర్ణనం ।*
*స్వహస్త కాల సంపన్నం శాసనం కారయేత్ స్థిరం॥ "*[1]

అనే శ్లోకాలు నిర్దేశిస్తున్నాయి. ఇందులో ప్రతిగ్రహీతను గురించి ప్రత్యేకంగా చెప్పకపోయినా అతని పేరును కూడ శాసనంలో పేర్కొనాలనే, యాజ్ఞవల్క్యుని అభిప్రాయమని మనం ఊహించవచ్చు.

యాజ్ఞవల్క్య స్మృతి పేర్కొన్న 'శాసనం' అనే పదాన్ని "శిష్యన్తే (శాస్యన్తే అని పాఠాంతరం) భవిష్యన్తో నృపతయో2— నేన దానాచ్ఛ్రేయోనుపాలనం ఇతి శాసనం కారయేత్......... దాన మాత్రేణైవ దానఫలే సిద్ధే శాసనకరణం భోగాభివృద్ధ్యా ఫలాతిశయార్థం" - అని; 'కాల' అనే పదాన్ని "కాలేన చ ద్వివిధేన శకనృపాతీత రూపేణ సంవత్సర రూపేణ చ దానకాలేన చంద్ర సూర్యోపరాగాదినా సంపన్నం" - అని మితాక్షర వ్యాఖ్య వివరించింది. శాసనాన్ని తయారుచేసే పని సంధివిగ్రహి వంటి ఉన్నతాధికారుల పర్యవేక్షణలో జరుగుతుందని పై వ్యాఖ్య పేర్కొనింది.

శాసనం అంటే రాజాజ్ఞ అని, సంధి విగ్రహాలకు శాసనాలు మూలం కాబట్టి రాజులు శాసన ప్రధానులని అర్థశాస్త్రం పేర్కొనింది. అర్థక్రమం, సంబంధం, పరిపూర్ణత, మాధుర్యం, ఔదార్యం, స్పష్టత్వం అనేవి లేఖకు (రాజశాసనానికి) వుండవలసిన గుణాలని ఈ గ్రంథం తెలుపుతూ వుంది. సమస్త శాస్త్రాలను సమగ్రంగా పరిశోధించి, ప్రయోగాన్ని కూడ పరిశీలించి, రాజుల కోసం శాసనవిధిని రచించినట్లు కౌటిల్యుడు చెప్పుకున్నాడు.[2]

శాసనాన్ని తయారు చెయ్యడానికి ముందు సుద్దముక్కతో రాతిమీద కాని, భూమిపై కాని వ్రాసి ఎక్కువ తక్కువలను పరిశీలించిన తరువాత పత్రంపైకి ఎక్కించాలని, వ్యాసప్రోక్తమైందిగా శబ్దకల్పద్రుమంలో చెప్పబడిన

*పాండులేఖ్యేన ఫలకే భూమౌ వా ప్రథమం లిఖేత్ ।*
*ఊనాధికం తు సంశోధ్య పశ్చాత్ పత్రే నివేశయేత్॥*[3] –

అనే శ్లోకం వివరిస్తూ వుంది. దీనిని బట్టి శాసనానికి మొదట చిత్తు ప్రతిని తయారు చేసి దోష రహితంగా పరిష్కరించిన తరువాత శుద్ధ ప్రతిని తయారు చెయ్యడం సంప్రదాయమని తెలుస్తూ వుంది.

భవదూర మహీపతి, తటాక నిర్మాణాన్ని పురస్కరించుకొని పోరుమామిళ్లలో వేయించిన శాసనాన్ని రచించిన లింగయ మాచనార్యకవి ఆ శాసన ప్రారంభంలో శాసన శ్లోక లక్షణాన్ని క్రిందివిధంగా వివరించినాడు.

*(1)* *శ్రీబీజ మాదౌ వక్తవ్యం ప్రణవేషు చ పంచసు ।*
*రు(ఋ)త్వాద్రి దశ రుద్రేషు చకటాహాన్ వివర్జయేత్ ॥*

*(2)* మో భూమి స్త్రిగురు శ్శుభం బహులఘు ర్నో సౌ విధత్తే ధనం
యో వా ర్యాదిలఘుశ్చ హేమ దినకృత్ మధ్యేగురు ర్జో రుజం ।
రో గ్ని ర్మధ్యలఘు ర్భయం లఘుయుగ ప్రా క్సస్సమీర: క్షయం ।

ఖం తోంతేలఘు రీశతాం కృతిముఖే భో బ్జ శ్శ మాదౌ గురు: ।

(3) అవిసర్గాంత పూర్వార్థ మసమస్త పదాదికం ।
విసర్గ శేఖరం రమ్యం శాసన శ్లోక లక్షణం ॥[4]

ఐదు బీజాక్షరాలలో మొదట 'శ్రీ' బీజాన్ని చెప్పాలని ఆరు, ఏడు, పది, పదకొండు స్థానాలలో చ, క, ట, హ - అనే అక్షరాలను విడిచిపెట్టాలని మొదటి శ్లోకం తెలుపుతూ వుంది. శ్లోకంలో నిబంధించే గణాలను, వాటి అధిదేవతలను, స్వరూపాన్ని, ఆ గణాల ప్రయోగంవల్ల కలిగే ఫలాన్ని రెండవ శ్లోకం తెలుపుతూ వుంది. ఆ వివరాలు క్రింది పట్టికలో చూపబడినాయి.

| గణం | అధిదేవత | స్వరూపం | ఫలం |
|---|---|---|---|
| మగణం | భూమి | మూడు గురువులు | శుభం |
| నగణం | ఇంద్రుడు | మూడు లఘువులు | ధనం |
| యగణం | జలం | ఆది లఘువు | హేమం |
| జగణం | సూర్యుడు | మధ్య గురువు | రుజం★ |
| రగణం | అగ్ని | మధ్య లఘువు | భయం |
| సగణం | సమీరుడు | అంత గురువు | క్షయం |
| తగణం | ఆకాశం | అంత లఘువు | ఈశత్వం |
| భగణం | చంద్రుడు | ఆది గురువు | సౌఖ్యం |

(★ దీని అర్థం రోగమని కొందరు; కాని, కాంతి అని అప్పకవి నిర్ణయించినాడు.)

మూడవ శ్లోకంలో, శాసన శ్లోక పూర్వార్థం చివర విసర్గ వుండకూడదని, మొదటి పదం సమస్త పదం కారాదని, శాసన శ్లోకం చివర విసర్గ వుండాలని చెప్పబడింది.

పై విధంగా శాసన రచనకు సంబంధించిన లక్షణాలను స్మృతికారులు, శాసన కవులు పేర్కొన్నప్పటికీ అన్ని శాసనాలూ పై లక్షణాలకు లోబడి రచించబడి వుండవు. శాశ్వతమైన పదార్థం మీద చెక్కబడిన ఒకే గుర్తు లేదా పదం కూడ శాసన శబ్దంతో వ్యవహరించబడుతుంది. ఒక వ్యక్తి ఒక పుణ్యక్షేత్రాన్ని దర్శించినప్పుడు ఆ యాత్రకు గుర్తుగా తన పేరును దేవాలయం గోడలపైగాని లేదా ప్రత్యేకంగా ఒక రాతిపైగాని చెక్కించడం కొన్నిచోట్ల కనిపిస్తుంది. ఇటువంటి వాటిని కూడ శాసనాలుగానే ఈనాడు పరిగణిస్తున్నాం.

## 2. శాసనాలు - వర్గీకరణ

వశిష్ఠుడు స్మృతిచంద్రికలో, 'లౌకికం' (ప్రజలకు సంబంధించినవి), 'రాజకీయం' (రాజులకు సంబంధించినవి) అని శాసనాలు రెండు రకాలని పేర్కొన్నాడు[5]. ఆధునిక కాలంలో పురాభిలేఖా శాస్త్రజ్ఞులు కూడ పైవిధంగానే శాసనాలను రెండు వర్గాలుగా విభజించినారు.

1. రాజులు లేదా వారి అధికారులు వేయించిన శాసనాలు.

2. సాధారణ వ్యక్తులు వేయించిన శాసనాలు.

రెండవ వర్గానికి సంబంధించిన శాసనాలలో ఎక్కువ భాగం ఆ వ్యక్తులు దేవాలయాలకు ఇచ్చిన దానాలను గురించి, లేదా వారు నిర్వహించిన దేవతా ప్రతిష్ఠలను గురించి తెలుపుతున్నాయి.

శాసనంలో పేర్కొనబడిన విషయాలను ఆధారంగా శాసనాలను అనేక రకాలుగా వర్గీకరించవచ్చు. ఈ జిల్లాలో లభిస్తున్న కొన్ని విధాల శాసనాలు క్రింద వివరించ బడినాయి.

### *2.1 దాన శాసనాలు*

మనదేశంలో లభించిన శాసనాలలో ఎక్కువ భాగం ఈకోవకు చెందినవే. ప్రాచీన కాలం నుండి భారతదేశంలోని రాజులు, వారి సామంతులు, అధికారులు, సాధారణ ప్రజలు పుణ్య సంపాదన కోసం దేవ బ్రాహ్మణులకు దానాలను ఇవ్వడం, తాము ఇచ్చిన దానాన్ని చిరస్థాయిగా నిలపడం కోసం శాసనాలను వేయించడం జరుగుతూ వుంది. పరిపాలకులు శాసనాన్ని జారీచేసినప్పుడు ఆ శాసనంలో రాజముద్రిక, మంగళ వాచకం, దాత వంశావళి, శాసనాన్ని జారీచేసిన స్థలం, దాన కాలం, దాన వివరాలు, దాన గ్రహీత పేరు మొదలైన విషయాలు పేర్కొనబడతాయి. ఈ విషయానుక్రమణిక, సాధారణంగా యాజ్ఞవల్క్యుడు మొదలైన స్మృతికారులు చెప్పిన విధంగానే వుంటుంది.

ఒక గ్రామాన్ని దానమిచ్చినప్పుడు వేయించిన శాసనాన్ని కొన్ని సందర్భాలలో 'గ్రామ శాసనం' లేదా 'గ్రామదాన శాసనం' అని పేర్కొనడం జరిగింది. సాళువ గోవిందరాజ వొడయలు తనకు శ్రీకృష్ణదేవరాయలు నాయంకరంగా ఇచ్చిన గండికోట సీమకు చెల్లే గండ్లూరు గ్రామంలోని పాళపల్లె గ్రామాన్ని తమ తండ్రి మాచిరాజు అయ్యవారికి పుణ్యంగా సూర్యగ్రహణ పుణ్యకాలంలో గండికోట రాఘునాథ దేవునికి సహిరణ్యోదక దానధారాపూర్వకంగా ఇచ్చిన విషయాన్ని నమోదు చేసిన శా.శ. 1439, ఈశ్వర సంవత్సర జ్యేష్ఠ బహుళ అమావాస్య, గురువారం (క్రీ.శ. 1517, జూన్ 19వ తేదీ) నాటి కొళ్లిపాడు శాసనం[6], 'గ్రామ శాసనం'గా పేర్కొనబడింది. గండికోట సీమకు చెల్లే సకలిసీమలోని శంఖవరానికి చెల్లే ముదిరెడ్డిపల్లె గ్రామాన్ని సదాశివరాయల నాయంకరుడైన నందేల నారపరాజు యొక్క ప్రతినిధి ముప్పినేని పర్వతనాయుడు, శంఖవరం చెన్నకేశవ పెరుమాళ్ల అమృతపళ్లకు, అంగ వైభవాలకుగాను ప్రథమైకాదశి పుణ్యకాలంలో సహిరణ్యోదక ధారాపూర్వకంగా సమర్పించి ఆ విషయాన్ని తెలుపుతూ గ్రామదాన శాసనాన్ని జారీ చేసినాడు[7].

భూదాన మిచ్చిన సందర్భాలలో వేయించిన కొన్ని శాసనాలు 'భూదాన ధర్మ శాసనాలు'గా పేర్కొనబడినాయి. విప్రవినోదులు తమకు లభించే వర్తనలను దేవాలయాలకు దానమిచ్చినప్పుడు వేయించిన శాసనాలను 'విప్రవినోది ధర్మశాసనా'లని పేర్కొన్నారు. కొందరు

విప్రవినోదులు మేడిగుడిదిన్నె గ్రామంలో తమకు వచ్చే వర్తనలను ఆ గ్రామంలోని చెన్నకేశ్వర దేవునికి, హనుమంత దేవునికి దశమీ మహోత్సవానికిగాను శ్రీరామనవమి పుణ్యకాలంలో ఇచ్చిన విషయాన్ని నమోదు చేసిన, శా.శ. 1477, ఆనంద సంవత్సర, చైత్ర శుద్ధ దశమి నాటి మేడిదిన్నె శాసనం[8], 'విప్రవినోది ధర్మశాసనం'గా పేర్కొనబడింది.

## 2.2 ప్రశస్తి శాసనాలు

ఈ విభాగానికి చెందిన శాసనాలలో, శాసనాన్ని వేయించిన రాజుయొక్క వంశవృక్షం; ఆ రాజు, అతని పూర్వికులు సాధించిన యుద్ధ విజయాలను గురించి, వారి దాన, కళాపిపాసను గురించి వర్ణనలుంటాయి. కొన్ని సందర్భాలలో ఆ రాజులకు పౌరాణిక దేవతలతో సామ్యాన్ని ఆపాదించడం కనిపిస్తుంది. కడప జిల్లాలో లభిస్తున్న శాసనాలలో రాష్ట్రకూట చక్రవర్తి మూడవ కృష్ణునికి సంబంధించిన రామేశ్వరం శాసనం[9], కాకతీయ చక్రవర్తి గణపతి దేవునికి సంబంధించిన పొందలూరు శాసనం[10], తెలుగుచోడ వంశానికి చెందిన జగతాపి గంగయ దేవచోడ మహారాజు వేయించిన తాళ్ల ప్రొద్దుటూరు శాసనం[11] మొదలైన శాసనాలు ఈ విభాగానికి చెందినవి. రామేశ్వరం శాసనం రాష్ట్రకూట వంశానికి చెందిన దంతిదుర్గ, కృష్ణ (రెండవ), ప్రభూతవర్ష, ధ్రువ, జగత్తుంగ, కృష్ణ (మూడవ) – అనే రాజుల యొక్క వారసత్వ క్రమాన్ని, వారి పరాక్రమాన్ని, యుద్ధ విజయాలను, ధర్మానురక్తిని, త్యాగశీలతను, దాన నిరతిని కావ్యశైలిలో వర్ణించింది. పొందలూరు శాసనం గణపతిదేవుని పరాక్రమాన్ని, అతని సామంతుడైన జన్నిగదేవుని గుణగణాలను వర్ణించింది. రాతికి నాలుగు వైపుల చెక్కబడిన తాళ్ల ప్రొద్దుటూరు శాసనంలో మొదటివైపు గంగయ దేవచోడమహారాజు యొక్క పరాక్రమం, యుద్ధ విజయాలు, దాన నిరతి వర్ణించబడినాయి. రెండు, మూడు, నాలుగు వైపులలో అపురూపమైన కల్పనలతో ఆ రాజుయొక్క పరాక్రమ వర్ణన ఛందోబద్ధమైన రచనతో కనిపిస్తుంది. ఇందులో చంపకోత్పలాలు, సీస పద్యాలు వున్నాయి.

## 2.3 జ్ఞాపిక

యుద్ధంలో మరణించిన వీరుల స్మృత్యర్థం ఈవిధమైన శాసనాలను వేయిస్తారు. వీరగల్లులు, స్మారకశిలలు ఈ కోవకు చెందినవే. ప్రవక్తలు, మతాచార్యులు మొదలైన మహాపురుషుల నిర్యాణ సమయంలోకూడ ఈ శాసనాలను వేయించేవారు. కడప జిల్లాలో వీరగల్లులపై చెక్కిన శాసనాలు వైదుంబుల కాలానికి సంబంధించినవి ఎక్కువగా వున్నాయి. జ్ఞాపిక శాసనంలో శాసనకాలం, రాజ్యపాలకుని ప్రశస్తి, మరణించిన వీరుని ప్రశస్తి, అతని హోదా, పరాక్రమ వర్ణన, యుద్ధంలో సాధించిన విజయాలు, అతడు మరణించిన సంఘటనకు సంబంధించిన వివరాలు పేర్కొనబడతాయి. వైదుంబరాజు గండత్రిణేత్రుడు నోళంబులతో జరిపిన యుద్ధాలలో ప్రముఖమైన సంఘటనగా చెప్పదగిన సొరమేణ్టికోట ముట్టడిలో 'వళాకంబు' అనే ప్రదేశాన్ని పరిపాలిస్తున్న ఒక రాజప్రముఖుడు మరణించిన విషయాన్ని బండపల్లిలోని ఒక శాసనం[12] నమోదు చేసింది. ఈ శాసనంలో, ఆ యుద్ధంలో మరణించిన

వీరుని పరాక్రమ వర్ణన గుణగణాల ప్రశంస, ఆ వీరుడు కొందరు ప్రత్యర్థుల ఏనుగులను, గుఱ్ఱాలను చంపి తానుకూడ మరణించిన విషయం వున్నాయి.

### 2.4 క్రయ శాసనాలు

ఏదైనా భూమినిగాని, తమకు వంశపారంపర్యంగా వస్తున్న వృత్తులను గాని వేరొకరికి అమ్మినప్పుడు, ఆ ఒప్పందాన్ని ప్రకటిస్తూ వేసిన శాసనాలను క్రయ శాసనాలంటారు. ఈ శాసనాలలో ఉభయ కక్షిదారులు పేర్కొనబడతారు. అమ్మేవారు ఆ భూమిలో లేదా వృత్తిలో భాగస్వాములైన తమ దాయాదుల అనుమతిని పొందవలసి వుంటుంది.

శా.శ. 1491, శుక్ల సంవత్సర బహుళ ఏకాదశి నాటి వనిపెంట శాసనం[13], వెంకటయ్య, అతని తమ్ముడు అప్పయ్య అనే వ్యక్తులు ఏకస్థులై, తమ తండ్రి నుండి వారసత్వంగా సంక్రమించిన ఒక గ్రామాన్ని (పేరు చెరిగిపోయింది) తమ అవసరం నిమిత్తం వనిపెంట చెన్నకేశవస్వామికి నూట డెబ్బై వరహాలకు అమ్మినట్లు తెలుపుతూ వుంది. ఈ అమ్మకం, 'తత్కాలోచిత మధ్యస్థ పరికల్పిత [లక్షణ] లక్షిత ఉభయవాది ప్రతిసంపన్న'మని శాసనంలో చెప్పబడింది. దీనినిబట్టి క్రయ విక్రయాలు మధ్యవర్తుల సమక్షంలో ఇరుపక్షాల వారికి ఆమోదయోగ్యమైన రీతిలో జరిగేవని తెలుస్తూ వుంది. పై శాసనం 'గ్రామ క్రయ శాసనం'గా పేర్కొనబడింది.

దేవాలయాలలోని అర్చకులు దేవతా సేవకులకు సంబంధించి తమ అధీనంలో వున్న హక్కులను ఇతరులకు అమ్మే పద్ధతి కూడ వుండేది. ఈ విధమైన లావాదేవీలను నమోదు చేసిన శాసనాలు కూడ క్రయ శాసనాలుగా చెప్పబడినాయి. శా.శ. 1316, భవసంవత్సర కార్తిక బహుళ ద్వాదశి నాటి దేవగుడి శాసనం[14], ముగ్గురు అన్నదమ్ములు తలకంటిదేవి స్థానంలో తమ భాగానికి చెందిన నాలుగు దినాల హక్కులను నూట ముప్పై అయిదు టంకాలకు అమ్మిన విషయాన్ని నమోదు చేసింది.

### 2.5 తాంత్రిక శాసనాలు

కొన్ని విధాలైన మంత్రాలను లేదా యంత్రాలను రాళ్లమీద చెక్కి ఊరి పొలిమేరలలో నాటించడం కొన్నిచోట్ల కనిపిస్తుంది. ఈ విధమైన శాసనాలను తాంత్రిక శాసనాలు అనవచ్చు. క్షుద్ర దేవతల తృప్తి కోసం లేదా భూత పిశాచాది దుష్ట శక్తులను పారద్రోలడం కోసం లేదా మనుష్యులకు, పశువులకు వచ్చే అంటువ్యాధులను నివారించడం కోసం గ్రామస్థులు ఇటువంటి శాసనాలను వేయిస్తారు. పశువులకు వచ్చే ఖురరోగ నివారణ కోసం వేయించిన రెండు శాసనాలు ఎల్లటూరు[15], పొత్తపి[16] గ్రామాలలో వున్నాయి. ఈ రెండు శాసనాలూ ఒకేవిధంగా వున్నాయి. ఓబలం[17], బుక్కాయపల్లె[18] గ్రామాలలో కూడ పశువ్యాధుల నివారణ కోసం వేయించిన శాసనాలున్నాయి. ఇవికాక ఇంకా కొన్ని తాంత్రిక శాసనాలు ఈ జిల్లాలో లభించినాయి. కాని ఆ శాసనాల అర్థం కాని, ఉద్దేశం కాని తెలియడం లేదు.

పైన వివరించిన శాసనాలే కాక వివిధ దానాలను, ఒప్పందాలను, భాగ పరిష్కారాలను గురించి తెలుపుతున్న శాసనాలు ప్రత్యేకమైన పేర్లతో వ్యవహరించబడినాయి. కడప జిల్లాలో లభించిన ఈ విధమైన శాసనాలు క్రింద వివరించబడినాయి.

## 2.6 సుంక ధర్మశాసనం

పరిపాలకులు లేదా వారి అధికారులు కొన్ని గ్రామాలలో పన్నులను మినహాయిస్తూ జారీ చేసిన శాసనాన్ని 'సుంక ధర్మశాసనం' అంటారు. అచ్యుత దేవరాయల కాలంలో మహా మండలేశ్వర నంద్యాల తిమ్మయదేవ మహారాజు కుమారుడు నారపరాజు ఆనతితో విక్రమల్లమ రాజు (విక్రమ మల్లరాజు?) అనే అధికారి, పూర్వం శ్రీకృష్ణదేవరాయలు కొప్పోలు గ్రామాన్ని గ్రామకట్నం, సుంక స్థావరాలతో సహా పన్నులను మినహాయించి ఆ గ్రామంలోని మహాజనాలకు అగ్రహారంగా తామ్రశాసనపూర్వకంగా ధారవోసి ఇచ్చివుండినప్పటికీ, ఆ ప్రాంతంలోని సుంకరులు ప్రభుత్వానికి తెలియకుండా అడుగుకోలు (పన్నువసూలు) చేసిట్లు తెలుసుకొని ఆ గ్రామంలో పూర్వ మర్యాద ననుసరించి పన్నులను మినహాయిస్తూ సుంకధర్మశాసనాన్ని[19] జారీ చేసినాడు.

## 2.7 కానాపకమ్మ

బహుశ: ఇది కాణపుకమ్మ కావచ్చు. కాణము (కాణాచి) అంటే వంశపరంపరాగతమైన భూమి మొదలైనవాని అనుభవమని అర్థం. శా.శ. 1471 (శా.శ 1472?) సాధారణ సంవత్సర శ్రావణ (?) ఏకాదశి నాటి చిడిపిరాల శాసనం[20], వీరశివ సిద్ధభిక్షావృత్తయ్యవారి శిష్యుడు నందేల వీరయ్య, చిడిపిరాల గ్రామంలో వీరముష్టులకు చెల్లే వర్తనలను ఆ గ్రామంలోని అగస్త్యేశ్వర దేవుని ఆరగింపువేళ దీపారాధనకుగాను ధారవోసి ఇచ్చిన విషయాన్ని పేర్కొంటూ కానాపకమ్మను వ్రాయించి ఇచ్చినట్లు తెలుపుతూ వుంది.

## 2.8 పాలివూటు శాసనం

పాలి అంటే బలి లేదా పూజోపహారం. దేవుని సేవలకోసం ఇచ్చిన భూమి, ధనం మొదలైన వాటి వివరాలను తెలుపుతూ వేయించిన శాసనాన్ని 'పాలివూటు శాసన'మంటారు. శా.శ. 1490, పింగళ సంవత్సర ఆషాఢ బహుళ ఏకాదశి (పింగళ సంవత్సరం శా.శ. 1479తో సరిపోలుతుంది. క్రీ.శ. 1557, జూలై, 22వ తేదీ గురువారం) నాటి నందలూరు శాసనం[21], సదాశివరాయల నాయంకరుడైన మహామండలేశ్వర అవుభళరాజు పుత్రుడు ఓబుళరాజు, నెలందలూరి చొక్కనాథునికి, కొందరు ఆళ్వారులకు కొన్ని భూములను, కొన్ని భూముల నుండి లభించే కట్టుగుత్తను సమర్పించి పాలివూటు శాసనం వేయించినట్లు తెలుపుతూ వుంది.

## 2.9 నమ్మిక శాసనం

అధికారులు అక్రమంగా ప్రవర్తించడంవల్ల ప్రజలకు కలిగిన ఇబ్బందులను తొలగించి

పూర్వం జరిగిన అకృత్యాలు పునరావృతం కావని ప్రజలకు హామీ ఇస్తూ పరిపాలకులు జారీచేసే శాసనాన్ని 'నమ్మిక శాసనం' అంటారు. అధికమైన పన్నులు కట్టలేక, అధికారులు పెట్టే బాధలు భరించలేక పులివెందల సీమలోని ప్రజలు ఇతర ప్రాంతాలకు వలస పోతున్నట్లు తెలుసుకొని తిమ్మరాజు సలకయ్యదేవ మహారాజు కార్యకర్త అయిన తుళువ ఎల్లప్ప నాయకుడు, పూర్వం వసూలు చేసే విధంగానే పన్నులు వసూలు చేస్తామని, ఏ నేరం చేసినా పన్నెండు రూకలకంటె ఎక్కువ అపరాధం వసూలు చేయబోమని హామీ ఇస్తూ ఆ సీమలో వున్న సెట్టి, పట్నస్వామి, రెడ్లు, కరణాలు, అష్టాదశ ప్రజలు మొదలైన కాపులకు శా.శ. 1457 (క్రీ.శ. 1535)లో ఒక నమ్మిక శాసనాన్ని జారీచేసినాడు[22].

### 2.10 దశబంధ శాసనం

చెఱువులు, కాలువల నిర్వహణ బాధ్యతను కొంతమంది వ్యక్తులకు అప్పగించి అందుకు ప్రతిఫలంగా పరిపాలకులు వారికి కొన్ని మాన్యాలను ఇచ్చేవారు. ఈ మాన్యాలను 'దశబంధ మాన్యాలు' అంటారు. ఈ విధమైన ఒప్పందాలను నమోదు చేస్తూ జారీచేసిన శాసనాలు 'దశబంధ శాసనాలు'గా పేర్కొనబడినాయి. మొదటి దేవరాయలకు నాయంకరుడైన అబ్రచింతల మలానాయుడు, పెండ్లిమఱ్ఱి ఊరి పడమటి పెద్ద చెఱువు కట్టమీద మన్నువేసి కట్టడంకోసం ఆ గ్రామంలోని కొందరు వ్యక్తులకు కొన్ని భూములను మాన్యంగా ఇచ్చి, ఆ వివరాలను పేర్కొంటూ 'దసవందము శాసన పత్రాన్ని' జారీ చేసిన విషయం, నందన సంవత్సర మాఘ శుద్ధ పాడ్యమి, సోమవారం (శక సంవత్సరం పేర్కొనబడలేదు. ఈ నందన సంవత్సరం శా.శ. 1334తో సరిపోలుతుంది.) నాటి పెండ్లిమఱ్ఱి శాసనంలో[23] నమోదు చేయబడింది.

### 2.11 చిడికల్లు శిలాశాసనం :

మహామండలేశ్వర మాచిరాజు, తురిమిళదిన్నె కాపులకు 'చిడికల్లు శిలాశాసనాన్ని' ఇచ్చినట్లు తుడుమలదిన్నె లోని కాలనిర్ణయం లేని ఒక శాసనంలో[24] పేర్కొనబడింది. 'చిడికల్లు' అనే పదానికి అర్థం తెలియదు. తురిమిళదిన్నె లోని కాపులకు ఒక తూము చేను దున్నడానికి పాతిక గద్యాణం లెక్కన ఇచ్చేటట్లుగా ఒప్పందం కుదుర్చుకున్న విషయం పై శాసనంలో చెప్పబడింది.

### 2.12 వినిమయ పత్రిక

వృత్తులకు సంబంధించి వివిధ వ్యక్తులకు భాగాలను నిర్దేశిస్తూ వ్రాయబడే దస్తావేజు 'వినిమయ పత్రిక'. సంబటూరు గ్రామంలోని చెన్నరాయని స్థానం వారు - అయగాండ్లు గృహారామ క్షేత్రాల విషయమై తగాదాపడి, గండికోట సీమ నాయంకరుడైన నంద్యాల నారయదేవ మహారాజును మధ్యవర్తిత్వం కోరగా, ఆయన వారిమధ్య రాజీ కుదిర్చి గృహారామ క్షేత్రాలను పంచిపెట్టి, 'వినిమయ పత్రికలను' వ్రాయించి, శాసన మర్యాదను అనుసరించి నడుచుకునే ఏర్పాటు చేసినట్లు, శా.శ. 1473, విరోధికృతు సంవత్సర జ్యేష్ఠ బహుళ అమావాస్య

నాటి సంబటూరు శాసనం[25] తెలుపుతూ వుంది.

### 2.13 పాళ్లకమ్మ

వివిధ వ్యక్తుల మధ్య భూమి మొదలైన వాటి పంపకం విషయమై జరిగిన ఏర్పాటును తెలిపే పత్రిక 'పాళ్లకమ్మ'. శా.శ. 1475, ప్రమదీచ సంవత్సర ఆశ్వయుజ శుద్ధ షష్ఠి నాటి చిడిపిరాల శాసనం[26], కొందరు స్వర్ణకారులు కమలాపురం మొదలైన పదకొండు గ్రామాలలో తమ అనుభవంలో వున్న కాణాచులను, వోజరికాలను పంచుకొని 'పాళ్లకమ్మ' వ్రాసుకున్నట్లు తెలుపుతూ వాటి వివరాలను కూడ పేర్కొనింది. ఈ వివరాలనే పేర్కొంటున్న ఇంకొక శాసనం కమలాపురంలో[27] కూడ వుంది.

### 2.14 సమయకమ్మ

వృత్తి పనివారు తమ కుల సమయాలు నిర్ణయించిన విధంగా వివిధ గ్రామాలలో వర్తనలు లేదా వృత్తి పన్నుల ద్వారా తమకు లభించే ఆదాయానికి సంబంధించిన భాగ పరిష్కారాలను పేర్కొంటూ వేసే శాసనం 'సమయకమ్మ'. శా.శ . 1471 (శా.శ. 1472?), సాధారణ సంవత్సర చైత్ర శుద్ధ పంచమినాడు కొందరు స్వర్ణకారులు, తమ కాణాచి గ్రామాలు పన్నెండింటిలోని ఆదాయానికి సంబంధించి తమ పాలివారితో జరిగిన భాగ పరిష్కారాన్ని తెలుపుతూ కమలాపురంలో 'సమయకమ్మ'ను వ్రాయించి ఇచ్చినారు[28].

## 3 శాసన విషయానుక్రమణిక

రాజ శాసనాలలోని విషయాన్ని (1) ప్రస్తావన, (2) ప్రకటన, (3) ఉపసంహారం - అని స్థూలంగా మూడు భాగాలుగా విభజించవచ్చు. భిన్న కాలాలకు సంబంధించిన, భిన్న రాజవంశాలకు సంబంధించిన లేదా ఒకే రాజవంశానికి చెందిన భిన్న పరిపాలకులకు సంబంధించిన శాసనాలు వైవిధ్యాన్ని కలిగి వుండి పైన చెప్పబడిన విభాగాలలోని విషయాలలో మార్పులు చేర్పులు కలిగి వుంటాయి.

### 3.1 ప్రస్తావన

ఇందులో 1. మంగళవాచకం, 2. శాసన కాలం, 3. శాసనాన్ని జారీచేసిన స్థలం, 4. దాత ప్రశస్తి వుంటాయి.

#### 3.1.1 మంగళ వాచకం

సాధారణంగా శాసనాలు మంగళ వాచకంతో ప్రారంభమౌతాయి. ప్రాచీన శాసనాల ప్రారంభంలో 'సిద్ధం' అనే మంగళ వాచకం ఎక్కువగా కనిపిస్తుంది. ఈ పదం 'సిద్ధిరస్తు' అనే వాక్యార్థాన్ని సూచిస్తుంది. పాణినీయానికి వాక్యకారుడైన కాత్యాయనుడు 'సిద్ధే శబ్దార్థ సంబంధే' అని మొదటి వార్తికాన్ని 'సిద్ధే' అనే పదంతో ప్రారంభించడం తాను చేపట్టిన రచన

నిర్విఘ్నంగా పరిసమాప్తి కావడం కోసమని పతంజలి మహాభాష్యంలో పేర్కొన్నాడు. దీనినిబట్టి మంగళవాచకంతో రచనను ప్రారంభించడం కాత్యాయనుని కాలం నాటికే భారతీయ సంప్రదాయంలో ప్రసిద్ధమైందని చెప్పవచ్చు. ఈ సంప్రదాయానుసారంగానే పరిపాలకులు తాము ఏర్పరచిన నిబంధం అవిచ్ఛిన్నంగా అమలు జరగాలనే ఉద్దేశంతో 'సిద్ధం' వంటి మంగళ వాచకాలతో శాసన రచనను ప్రారంభింప జేసినారు.

తరువాతి కాలంలో 'సిద్ధం' స్థానంలో ఆ పదాన్ని సూచించే గుర్తులు శాసనాలలో కనిపిస్తున్నాయి. ఈ గుర్తు తరువాత సాధారణంగా 'స్వస్తి' అనే పదం వుంటుంది. మధ్యయుగం నాటి కొన్ని శాసనాల ప్రారంభంలో 'ఓం' - దాని తరువాత 'స్వస్తి' వుండడం కనిపిస్తుంది. ఈ పదాలే కాక 'శుభమస్తు', 'అవిఘ్నమస్తు' 'నిరంతరాయోస్తు' వంటి వాక్యాలు కొన్ని శాసనాల ప్రారంభంలో కనిపిస్తున్నాయి. ఏ కార్యక్రమమైనా నిర్విఘ్నంగా పరిసమాప్తి కావడం కోసం విఘ్ననాయకుడైన గణపతి పూజతో ఆ కార్యక్రమాన్ని ప్రారంభించడం సంప్రదాయం. ఈ సంప్రదాయాన్ని శాసన రచనలో కూడా అనుసరించిన సందర్భాలున్నాయి. 'శ్రీ గణాధిపతయే నమః' అనే గణపతి స్తుతితో శాసనాన్ని ప్రారంభించడం కొన్నిచోట్ల కనిపిస్తుంది. భాస్కర భవదూరుని పోరుమామిళ్ల శాసనం[29] "అవిఘ్నమస్తు। గురుభ్యోనవః। పుష్టిమద్భ్య గణపతిభ్యోనమః।" - అనే వాక్యాలతో ప్రారంభమైంది. శాసన ప్రారంభంలో, ఆ శాసనాన్ని వేయించినవారి ఆధ్యాత్మిక సంప్రదాయాన్ని ప్రతిఫలించే వాక్యాలు కొన్ని సందర్భాలలో కనిపిస్తున్నాయి. దానవులపాడులోని విజయ దండనాయకుని 'నిశిధి'[30] 'భద్రమస్తు జినశాసనాయ' - అనే వాక్యంతో ప్రారంభమైంది. అచ్యుత దేవరాయలకు, సదాశివరాయలకు సంబంధించిన కొన్ని శాసనాలలోని మంగళ వాచకాలలో 'శ్రీమతే రామానుజాయనమః' - అనే వాక్యం కనిపిస్తుంది.

కాలక్రమంలో శాసన ప్రారంభంలోని మంగళ వాచకాలు మరింత విస్తృతాలై గుర్తులు, పదాలు, చిన్న చిన్న వాక్యాల స్థానంలో వాక్య సముదాయాలు, ప్రార్థన శ్లోకాలు చోటుచేసుకున్నాయి. రేనాటి చోళుల శిలాశాసనాల ప్రారంభంలో కేవలం 'స్వస్తి/స్వస్తిశ్రీ' అనే మంగళ వాచకం మాత్రమే కనిపిస్తుంది. తామ్ర శాసనాలలో 'స్వస్తి'తో పాటు ప్రార్థన శ్లోకాలు కూడా శాసన ప్రారంభంలో కనిపిస్తాయి. పుణ్యకుమారుని దొమ్మరి నంద్యాల తామ్ర ఫలకాలలోను, శ్రీకంఠచోళుని మద్రాస్ మ్యూజియం తామ్ర ఫలకాలలోను 'స్వస్తి' తరువాత శివస్తుతితో కూడిన శ్లోకాలున్నాయి.

ప్రసిద్ధ గ్రంథాలలోని ప్రార్థన శ్లోకాలను శాసనాలలో ఉపయోగించడం కొన్నిచోట్ల కనిపిస్తుంది. బాణుని 'హర్షచరిత' లోని -

*నమ స్తుంగశిరశ్చుంబి చంద్రచామర చారవే*
*త్రైలోక్యనగరారంభ మూలస్తంభాయ శంభవే -*

అనే శివస్తుతి క్రీ.శ. 13వ శతాబ్ది నుండి ఈ జిల్లాలోని కొన్ని శాసనాలలో చోటుచేసుకునింది.

తెలుగు కావ్యాలలోని దేవతాస్తుతికి సంబంధించిన పద్యాలకు సంస్కృత భాషాను కరణలు కూడ శాసనాలలోని ప్రార్థన శ్లోకాలలో చోటుచేసుకున్న సందర్భాలున్నాయి. శ్రీకృష్ణదేవరాయల కాలంలో చెన్నూరు, పొట్లదుర్తి సీమల నాయంకరుడైన జూపల్లి పెదసింగ మహీపాలుని ఉప్పరపల్లె శాసనంలోని[31] -

*"పాయ ద్వో గణనాయకః పశుపతే రగ్రే (రంకే) చిరం సంస్థితో*
*వామార్ధాంగవిరాజితాం గిరిసుతాం జ్ఞాత్వా నిజాం మాతరం*
*తుండాగ్రం ప్రవిసార్య సస్మితముఖః పీత్వా స్తనం చాపరం*
*పాతుం ప్రీత మనా స్తనం (స్పయో) మృగయతే విఘ్నాంతక స్సర్వదా" -*

అనే విఘ్నేశ్వర స్తుతి మను చరిత్రలోని -

*"అంకముజేరి శైలతనయాస్తనదుగ్ధము లానువేళ బా*
*ల్యాంకవిచేష్ట దొండమున నవ్వలి చ న్గబళించబోయి యా*
*వంక కుచంబు గాన కహివల్లభహారము గాంచి వే మృణా*
*ళాంకురశంక నంటెడు గజాస్యుని గొల్తు నభీష్ట సిద్ధికిన్" -*

అనే పద్యానికి అనుకరణమనే విషయం స్పష్టం. (మనుచరిత్ర క్రీ.శ. 1517-20 మధ్యకాలంలో రచించబడింది. ప్రస్తుత శాసనకాలం క్రీ.శ. 1525)

శాసనాలలోని ప్రార్థన శ్లోకాలు సాధారణంగా దాత ఇష్టదేవతా స్తుతికి సంబంధించి వుంటాయి. కాని కొన్ని సందర్భాలలో ఒకేరాజు వేయించిన శాసనాలలో వేరువేరు దేవతలకు సంబంధించిన స్తుతి కనిపిస్తుంది. ఇటువంటి సందర్భాలలోని ప్రార్థన శ్లోకాలు శాసన కవియొక్క ఇష్టదేవతా స్తుతికి సంబంధించినవని భావించవచ్చు. కొన్ని శాసనాలలో రెండు, మూడు అంతకంటె ఎక్కువ శ్లోకాలలో భిన్న దేవతలకు సంబంధించిన స్తుతి కనిపిస్తుంది.

ఈ జిల్లాలోని శాసనాలలో కనిపిస్తున్న ప్రార్థన శ్లోకాలు వాటి క్రమం క్రింద చూపబడినాయి.

(1) *జయతి ధృతచంద్రరేఖం విపులామల తారకాశుభం లోకే ।*
*గగనమివ సుప్రసన్నం వపు రప్రతిమం లకుటపాణేః ॥*
(పుణ్యకుమారుని దొమ్మరినంద్యాల తామ్ర ఫలకాలు)[32]

(2) *నమ స్తస్మై సురేశాయ మౌళౌ య స్యైన్దవీ కలా ।*
*భాతి గంగాజలానీతా సక్తా నౌ రివ రాజతి ॥*
(శ్రీకంఠచోళుని మద్రాస్ మ్యూజియం తామ్ర ఫలకాలు)[33]

(3) *శ్రీమన్మానస మానిధాయ విధివ ద్ధృత్పద్మ సన్మ [ధ్య] మే*
*ఛిత్వా క్లేశక పాశరాశి మనిశం [పా] రేతమ స్సంస్థితం ॥*

రుధ్వా మారుత మామనంతి మునయ స్సంసారవిచ్ఛిత్తయే
యం శ్రీధురదంకకారనృపతిం రామేశ్వరో రక్షతు ॥
(రాష్ట్రకూట మూడవ కృష్ణుని కాలం నాటి రామేశ్వరం శాసనం)[34]

(4) జయ త్యావిష్కృతం విష్ణో ర్వరాహం క్షోభితార్ణవం ।
దక్షిణోన్నతదంష్ట్రాగ్ర విశ్రాన్త భువనం వపు: ॥
(చాళుక్య త్రిభువన మల్లదేవునికి సంబంధించిన పెద్దముడియం శాసనం)[35]

(5) నమ స్తుంగశిరశ్చుంబి చంద్రచామర చారవే ।
త్రైలోక్యనగరారంభ మూలస్తంభాయ శంభవే ॥
(యాదవ సింగణదేవుని పుష్పగిరి శాసనం[36], కాయస్థ గంగయసాహిణి గంగవరం శాసనం[37], ప్రౌఢదేవరాయల పంచలింగాల శాసనం[38])

(6) హరే ర్లీలావరాహస్య దంష్ట్రాదండ స్స పాతు వ: ।
హేమాద్రికళశా యత్ర ధాత్రీ ఛ్చత్ర శ్రియం దధౌ ॥
నమస్తుంగ శిరశ్చుంబి . . . . . . . . ఇత్యాది.
(వీర బుక్కరాయల రామాపురం శాసనం)[39]

(7) శ్రీ స్సౌభాగ్యకరీ సదా త్రిజగతాం భూయాత్ కృపారూపిణీ
హేరంబస్స చరాచరాత్మకజగత్సందోహసందర్భితం ।
ధాతా పద్మసముద్భవోపి మన సై వేదం సువర్ణోజ్వలం
బ్రహ్మాండం జలమండలస్థ మసృజత్ యస్యా: ప్రసాదోన్నతే: ॥
వారాహాకృతి రచ్యుత స్త్రిభువనం పాయా దపాయోజ్ఝితం
దంష్ట్రాగ్రేణ మహీం మహాజలనిధౌ మగ్నాం సముద్ధృత్య య: ।
త త్రైకత్ర నిధాయ పుణ్య మతులం పద్మాకరస్థాపనాత్
తాదృ క్సమ్య గభావత: తులయితుం యే నాద్భుతం స్వీకృతం ॥
సవ్యాసవ్యవిలోచనే త్రిజగతాం వృష్ట్యోషధీపోషకే
ఫాలే వారిపితా సఖా ధనపతి: శ్రీరత్నగర్భా రథ: ।
యస్య శ్రీగిరి రాలయ: స కృపయా హేమచల: కార్ముక:
పాయా ద్వ: శివతాతి రాశ్రితజనానందైకసందాయక: ॥
సప్తద్వీపాయవ విలసత్ రూపిణీ మేరుమూర్ధా
చంచత్ క్షీరోదధి వరకుచా భూషితా రోహణాద్యై: ।
రాజత్ రత్నాకరసువసనా సంతతం పాతుయుష్మాన్
ప్రోదిన్యబ్జాకరవిలసితా పూర్ణసస్యా ధరిత్రీ ॥
(భాస్కర భవదూరుని పోరుమామిళ్ల శాసనం)[40]

(8) *శ్రీవాగ్గౌరీవరాద్యా యం పూజయంతి త మాశ్రయే ।*
*స్థితి సృష్ట్యాది కామ్యే(ర్యే)షు కారణం గణనాయకం ॥*
*పాయా ద్వారాహరూపేణ పృథ్వీ ముద్ధృత్య సాగరాత్ ।*
*జలాత్మా పూర్ణసస్యాం తాం యః కరోతి హరి స్సదా ॥*
*పాతు వందారు మందార శ్చాష్టమూర్తి స్సదాశివః*
*సురాసురగురో ర్యస్య పాదపీఠో జగత్త్రయం ॥*
(బుక్కరాయలకు సంబంధించిన దూలం వారిపల్లె శాసనం)[41]

(9) *నమ స్తుంగశిరశ్చుంబి . . . . . . . . ఇత్యాది*
*హరే ర్లీలావరాహస్య . . . . . . . . . ఇత్యాది*
(శ్రీకృష్ణదేవరాయల రామేశ్వరం శాసనం)[42]

(10) *పాయా ద్వో గణనాయకః పశుపతే రగ్రే (రంకే) చిరం సంస్థితో*
*వామార్ధాంగవిరాజితాం గిరిసుతాం జ్ఞాత్వా నిజాం మాతరం ।*
*తుండాగ్రం ప్రవిసార్య సస్మిత ముఖః పీత్వాస్తనం చాపరం*
*పాతుం ప్రీతమనాః స్తనం (స్సయో) మృగయతే విఘ్నాంతక స్సర్వదా ॥*
*దంష్ట్రాగ్రేణ ధరా మురస్యభిమతాం లక్ష్మీం కరాంభోరుహే*
*ష్వంభోజం జలజం సుదర్శన మథో కౌమోదకీం ధారయన్ ॥*
*సర్వాంగేషు చ సప్తతంతునివహా న్సాంగా న్సమస్తాగమాన్*
*పాయా దాదివరాహరూపరుచిరః కారుణ్యరత్నాకరః ॥*
*నాగాజినధరం నాగనాథేశం నాగభూషణం ।*
*నాగారిం నగరాజాత్మజార్ధం నగచరం భజే ॥*
*యస్యార్ధేందు ర్మూర్ధ్ని గంగా చ గౌరీ*
*వామార్ధాంగే భాతి నిత్యానపాయా ।*
*పాయా త్స్వే వః పార్వతీశో మహేశః*
*సద్భక్తానా మాహితైశ్వర్యహేతుః ॥*
(జూపల్లి పెదసింగ మహీపాలుని ఉప్పరపల్లె శాసనం)[43]

### *3.1.2 శాసన కాలం*

చాలా శాసనాలలో శాసన కాలం పేర్కొనబడి వుండదు. కొన్ని శాసనాలలో శాసనాన్ని జారీచేసిన సంవత్సరం మాత్రం చెప్పబడుతుంది. శాసన కాలానికి సంబంధించిన పూర్తి వివరాలు ఇచ్చినప్పుడు ఆ వివరాలు శాసనం మొదట కాని, మధ్యలో కాని లేదా శాసనం చివర కాని చెప్పబడతాయి. అంటే, శాసనకాలం శాసనంలోని మూడు ప్రధాన భాగాలలో దేనిలోనైనా వుండవచ్చు. కొన్నిచోట్ల శాసనకాలం పదాలలో చెప్పబడినప్పటికీ మళ్లీ అంకెలలో చూపబడుతుంది. కొన్ని శాసనాలలో ప్రకటనలో ఒక పద్ధతిలోను, శాసనాంతంలో ఇంకొక

పద్ధతిలోను శాసనకాలం పేర్కొనబడుతుంది. శాసన సంవత్సరం ఏదైనా శకానికి సంబంధించిన సంవత్సరంగా కాని, ఆ శాసనాన్ని జారీ చేసిన రాజుయొక్క రాజ్య సంవత్సరంగా కాని వుంటుంది. కొన్ని శాసనాలలో మాసం, పక్షం, తిథి, వారం మొదలైన వివరాలు పేర్కొన బడినాయి. క్వాచిత్కంగా నక్షత్రం, యోగం మొదలైన వివరాలు శాసనకాలంలో చెప్పబడినాయి. దానం ఇవ్వడానికి యోగ్యమైన పుణ్యకాలాలుగా భావించబడే పౌర్ణమి, అమావాస్య, సూర్య చంద్ర గ్రహణ కాలాలు; సంక్రమణ కాలాలు, వ్యతీపాతం, అర్ధోదయం వంటి యోగాలు కొన్ని శాసనాలలో పేర్కొనబడినాయి. శాసనకాలాన్ని చెప్పేటప్పుడు ఇతర వివరాలతో పాటు 'వారం' పేర్కొనబడితే, ఆరోజుకు సంబంధించిన వివరాలను సరిచూచుకోవడానికి, ప్రస్తుతం వ్యాప్తిలో వున్న క్రీస్తు శకానికి సంబంధించిన తేదీలలో గుర్తించడానికి వీలవుతుంది. కొన్ని శాసనాలలో పేర్కొనబడిన శక లేదా శాలివాహన శక సంవత్సరం-సంవత్సరం పేరు, సరిపోలవు. ఇటువంటి శాసనాల కాలాన్ని నిర్ణయించడం కష్టం. శాసనంలో పేర్కొనబడిన వ్యక్తుల జీవితకాలానికి సంబంధించిన సమాచారం ఇతర శాసనాల ద్వారా లభించినప్పుడు మాత్రం సవరణలు చెయ్యడానికి అవకాశముంటుంది.

రేనాటిచోళుల శిలాశాసనాలలో పుణ్యకుమారుని తిప్పలూరు శాసనం[44], అతని రాణి వసన్తిపోఱి చోఱి మహాదేవి రామేశ్వరం శాసనాలలో[45] తప్ప వేనిలోను శాసనకాలం పేర్కొన బడలేదు. తిప్పలూరు శాసనంలో, "కాత్తిఖ చీకుర బిదియ సోమవారంబు పునరు పుష్యంబు బృహస్పతి హోరకాను" - అని శాసనాంతంలో చెప్పబడింది. శాసనాన్ని జారీ చేసిన సంవత్సరం పేర్కొనబడలేదు. మాసం, పక్షం, తిథి, వారంతో పాటు నక్షత్రం, హోర పేర్కొనబడినాయి. సోమవారం బృహస్పతి హోర మూడు పర్యాయాలు వస్తుంది. వాటిలో పునర్వసు వెళ్లి పుష్యమి వచ్చే కాలాన్ని చెప్పడం కోసం పునరుష్యంబు అని రెండు నక్షత్రాలను పేర్కొనడం జరిగింది. రామేశ్వరం శాసనంలో మంగళ వాచకం తరువాత "ప్రవర్ధమాన రాజ్య సంవత్సరంబుళ్ యేనగు నాణ్డు" - అని కేవలం పుణ్యకుమారుని రాజ్యసంవత్సరం మాత్రమే పేర్కొనబడింది. దొమ్మరి నంద్యాల తామ్ర ఫలకాలలో[46] దాత వంశ ప్రశస్తి తరువాత, "అస్మాభి: దశమే వర్షే . . . . . . . ఫల్గుణ్యాం పౌర్ణమాస్యాం" - అని పుణ్యకుమారుని రాజ్య సంవత్సరం, మాసం, తిథి పేర్కొనబడినాయి.

ఈ జిల్లాలోని శాసనాలలో వైదుంబరాజు భువనత్రిణేత్రుని కాలం నుండి శక సంవత్సరాన్ని పేర్కొనే సంప్రదాయం మొదలైనట్లు చెప్పవచ్చు. భువనత్రిణేత్రుడు జారీ చేసిన మద్రాస్ మ్యూజియం తామ్ర శాసనం[47], శక సంవత్సరం 893, ఆషాఢ శుద్ధ సప్తమి, గురువారం, దక్షిణాయన సంక్రాంతి నాటిదిగా పేర్కొనబడింది. ఈ రాజు పట్టాభిషేక సందర్భాన్ని నమోదు చేసిన ఉప్పరపల్లి శాసనం[48] శక సంవత్సరం 894 నాటిదిగా పేర్కొనబడింది. ఈ వంశానికే చెందిన ఇరుగెయ మహారాజు, తమ తండ్రి ఉత్తర క్రియల సందర్భంలో సూర్యక్రమవేది అనే బ్రాహ్మణునికి ఏకోద్దిష్టభుక్తదక్షిణను ఇచ్చిన విషయాన్ని నమోదు చేసిన అనిమెల శాసనం[49] శక సంవత్సరం 878 కార్తిక - - - శుక్రవారం నాటిదిగా చెప్పబడింది. ఈ శాసనంలో పక్షాన్ని,

తిథిని పేర్కొన్న భాగం చెరిగిపోయింది. పై మూడు శాసనాలలో తప్ప వైదుంబుల శాసనాలు వేటిలోనూ శాసనకాలం పేర్కొనబడలేదు.

తెలుగుచోడ వంశానికి చెందిన తిరుకాళత్తిదేవ మహారాజుకు సంబంధించిన మద్దు లేటిగడ్డ శాసనంలో[50] దాత ప్రశస్తి తరువాత శాసనకాలం పేర్కొనబడింది. తిరుకాళత్తిదేవుని సామంతుడైన కంటపా నాయకుని బెడుసుపల్లి శాసనంలో[51] శాసనకాలం, ఖర సంవత్సర మకర సంక్రాంతి, [శక] 1153వ సంవత్సరంగా, ప్రకటన చివరి భాగంలో చెప్పబడింది. చాళుక్యరాజు త్రిభువన మల్లదేవునికి సంబంధించిన పెద్దముడియం శాసనంలో[52] రాజ్యపాలకుని ప్రశస్తి, దాత ప్రశస్తి తరువాత శాసనకాలం శక వర్షం 1046, [చాళుక్య] విక్రమ కాలం 49, క్రోధి సంవత్సర ఉత్తరాయణ సంక్రాంతిగా పేర్కొనబడింది. తెలుగుచోడ వంశానికి చెందిన నల్లసిద్ధి రాజుకు సంబంధించిన దొంగలసాని శాసనంలో[53] (ఈ శాసనం కన్నడ, తెలుగు, తమిళ, మరాఠి భాషలలో వుంది.) శక సంవత్సరం 1081, ప్రమాది సంవత్సర మాఘ బహుళ అమావాస్య అర్ధోదయం, శాసనకాలంగా పేర్కొనబడింది. (కన్నడ శాసనంలో మాఘ. సు. 15 అని వుంది. ఇది ప్రామాదికం). పుష్య మాసంలో కాని, మాఘ మాసంలో కాని అమావాస్య తిథి, ఆదివారం, శ్రవణ నక్షత్రం, వ్యతీపాత యోగం కలసిన యోగం అర్ధోదయం. ఈ యోగం తటస్థించిన కాలం మహా పుణ్యకాలంగా భావించబడుతుంది.

జన్నిగదేవుని పొందలూరు శాసనంలో[54] శాసనకాలం, అతని అధిరాజు గణపతిదేవుని 62వ రాజ్య సంవత్సరం, శక సంవత్సరం 1182, రౌద్రి సంవత్సర చైత్ర శుద్ధ ఏకాదశి, గురువారం నాటి మేష సంక్రమణ కాలంగా చెప్పబడింది. భాస్కర భవదూరుని పోరుమామిళ్ల శాసనంలో[55] తటాక నిర్మాణాన్ని ప్రారంభించిన కాలం

*"ధాతు: పరార్ధకాలే చ కల్పే శ్వేతవరాహకే ।*
*వైవస్వతే మనౌ తత్ర చాష్టవింశత్తమే యుగే ॥*

*దివ్యే తద్దేశభాగే చ కలౌ ప్రథమ పాదకే ।*
*చతుస్సహస్రసంయుక్త చతుశ్శతసనప్తతి ॥*

*గతేషు మానుషాబ్దేషు (2270) భూనందాక్ష్యేక సంఖ్యయా ।*
*(1291) వత్సరేషు శక స్యేవం సౌమ్యాబ్దే కార్తికాహ్వయే ॥*

*మాసే శుక్లచతుర్దస్యాం గురుపుష్యదినే శుభే ।*
*లగ్నే కర్కటకే చైవ శుభే గ్రహ సువీక్షితే ॥"*

అని విపులంగా చెప్పబడింది. కలియుగ సంవత్సరం, శక సంవత్సరం శ్లోకంలో పదాలలోను తరువాత కుండలీకరణాలలో అంకెలలోను చూపబడినాయి. తటాక నిర్మాణాన్ని ప్రారంభించినప్పటి నక్షత్రం, లగ్నం కూడ పేర్కొనబడినాయి. పైన చెప్పబడిన కాలానికి రెండు సంవత్సరాల తరువాత తటాక నిర్మాణం పూర్తి అయింది. కాబట్టి ఈ శాసన కాలం, శాసనంలో

చెప్పబడిన కాలానికి రెండు సంవత్సరాల తరువాతిది.

సాళువ కంపరాజు చియ్యవరం శాసనంలో[56] మంగళవాచకం తరువాత శాసనకాలం "శకాబ్దం వేయి మున్నూట ఇరవై ఆరు మిందచెల్లె అటుపటి పార్తి౹వ సంవత్సర [- -]కసు పంచమిని సోమవారాన రోహిణి నక్షత్రాన విదిపాథపుణెకాలాన" - అని చెప్పబడింది. 'విదిపాథ' - వ్యతీపాత శబ్దభవం. అమావాస్య, ఆదివారం లేదా పౌర్ణమి, సోమవారం - వీటి కలయికతో ఏర్పడే యోగం వ్యతీపాతం. పై శాసనం పంచమి తిథి నాటిదిగా చెప్పబడింది. బహుశః ఇది పౌర్ణమి నాటిది కావచ్చు.

వీరవిజయ బుక్కరాయల కుమారుడు వీరప్రతాప కుమార దేవరాయలకు సంబంధించిన మోపూరు శాసనంలో[57], శాసనం మొదట "జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు 1347 అగు నేంటి విశ్వావసు సంవత్సర ఆశ్వీజ బ 3 ఆ" - అని వాక్యరూపంలోను, శాసనం చివర "శాకే శైలజలత్రిచంద్రగణితే విశ్వావసోర్వత్సరే। మాసే చాశ్వయజే చ భైరవపుర: శుభ్రేతరే-" - అని ఛందోబద్ధంగాను శాసనకాలం పేర్కొనబడింది. ఈ జిల్లాలోని శాసనాలలో 'శాలివాహన శకవరుషంబులు" అనే ప్రయోగం మొదటిసారిగా ఈ శాసనంలో కనిపిస్తూ వుంది. తరువాతి కాలంలోని శాసనాలలో క్వాచిత్కంగా మాత్రమే 'శకవరుషంబులు' అనే ప్రయోగం కనిపిస్తుంది.

### *3.1.3 శాసనాన్ని జారీ చేసిన స్థలం*

సాధారణంగా శాసనాలు రాజధాని నుండి జారీ చేయబడతాయి. ఇటువంటి సందర్భాలలో శాసనాన్ని జారీచేసిన స్థలం పేర్కొనబడదు. దండయాత్రా కాలంలో లేదా తీర్థయాత్రా సమయంలో లేదా పరిపాలనా వ్యవహారాలను పర్యవేక్షించడానికి ఇతర ప్రదేశాలలో రాజు విడిది చేసినప్పుడు జారీ చేసిన శాసనాలలో శాసనం జారీచేయబడిన స్థలం పేర్కొనబడుతుంది. శిలా శాసనాల విషయంలో సాధారణంగా శాసనాన్ని జారీచేసిన స్థలం, ఆ శాసనాన్ని వేయించిన స్థలం ఒకటిగానే వుంటుంది. తీర్థయాత్రా సమయంలో దానాన్ని ఇచ్చినప్పుడు ఏ పుణ్యక్షేత్రంలో దానమిచ్చిందీ శాసనంలో చెప్పబడుతుంది. ఇటువంటి సందర్భాలలో ఆ పుణ్యక్షేత్రమే శాసనాన్ని జారీచేసిన స్థలంగా భావించవచ్చు. శాసనంలో దాత ప్రస్తావనకు ముందుకాని, తరువాత కాని శాసనాన్ని జారీచేసిన స్థలం పేర్కొన బడుతుంది. పెద్దముడియం శాసనంలో[58], త్రిభువనమల్లదేవునికి సామంతుడైన చిద్దణచోళ మహారాజు ముదివేము (పెద్ద ముడియం) గ్రామాన్ని ఆ గ్రామంలోని మహాజనాలకు అగ్రహారంగా అహోబిల నారసింహదేవుని సన్నిధిలో ధారాపూర్వకంగా ఇచ్చినట్లు చెప్పబడింది.

### *3.1.4 దాత ప్రశస్తి*

తొలి రోజుల్లోని శాసనాలలో దాత పేరు మాత్రమే పేర్కొనబడేది. క్వాచిత్కంగా అతని తండ్రి పేరు, కొన్ని సందర్భాలలో పితామహుని పేరు కూడ చెప్పబడతాయి. తరువాతి

కాలంలోని శాసనాలలో దాత పేరుతోపాటు అతని వంశవృక్షాన్ని, బిరుదాలను పేర్కొనడం కనిపిస్తుంది. దాత పేరు, అతనికి సంబంధించిన వివరాలు చారిత్రక సమాచారాన్ని సేకరించడానికి ప్రధానమైన ఆధారాలుగా ఉపయోగపడతాయి. తొలి రోజుల్లో సంక్షేప రూపంలో వుండిన దాతను గురించిన వివరాలు రానురాను విస్తృతిని పొంది దాత వంశవర్ణన, దాతయొక్క, అతని పూర్వికులయొక్క బిరుదాలు, యుద్ధ విజయాలు, దాన నిరతి, కళాపిపాస, త్యాగశీలత మొదలైన గుణగణాలతో కూడిన వర్ణనలు శాసనాలలో చోటుచేసుకున్నాయి. శాసనంలోని ఈ భాగాన్ని 'ప్రశస్తి' అంటారు. కొన్ని శాసనాలలో ఈ భాగం శాసన విషయం కంటె ఎక్కువగా వుండడం కనిపిస్తుంది.

రేనాటిచోళుల శిలాశాసనాలలో పుణ్యకుమారుని శాసనాలలో తప్ప తక్కిన శాసనాలలో కేవలం దాత పేరు మాత్రమే పేర్కొనబడింది. తిప్పలూరు శాసనంలో[59] పుణ్యకుమారుని వ్యక్తిత్వాన్ని తెలిపే బిరుదాలు, వసన్తిపోతి చోళి మహాదేవి రామేశ్వరం శాసనంలో[60] పుణ్య కుమారుని పేరు, అతడు ధరించిన 'పృథివీవల్లభ' అనే బిరుదు పేర్కొనబడినాయి. దొమ్మరి నంద్యాల తామ్ర ఫలకాలలో[61] రేనాటిచోళ వంశానికి మూలపురుషుడైన కరికాలచోళుని ప్రశస్తి, అతని తరువాత ఆ వంశానికి చెందిన నందివర్మ నుండి పుణ్యకుమారుని వరకు వారి వంశవృక్షం; మహేంద్రవర్మ, పుణ్యకుమారుల బిరుదాలు పేర్కొనబడినాయి. శ్రీకంఠచోళుని మద్రాస్ మ్యూజియం తామ్రశాసనం[62], కుశునివరకు వున్న ఇక్ష్వాకు వంశ ప్రభువులను పేర్కొని వారు సమ్రాట్టు లని, కొందరు రాజులు అర్ధ సమ్రాట్టులని, కరికాలుడు పాదసమ్రాట్టులైన చోళ వంశానికి చెందినవాడని తెలుపుతూ వుంది. చోళులు ఇక్ష్వాకు వంశ ప్రభువులకు సామంతులుగా ధర్మవర్తనులై ప్రాచీనకాలం నుండి రాజ్యపాలన చేస్తున్నట్లు ప్రకటించడం, పై వర్ణనయొక్క ఆశయం కావచ్చు. ఈ వర్ణన తరువాత కరికాలుని వంశంలోని సుందరనందుని నుండి శ్రీకంఠచోళుని వరకు వున్న రాజుల వారసత్వ క్రమం, వారి గుణగణాలు వర్ణించ బడినాయి. వైదుంబుల శాసనాలలో "అనేక సమర సంఘట్టణోపలబ్ధ జయలక్ష్మీ సమాలింగిత వక్షస్థల" - అనే ప్రశస్తి వాక్యం, తరువాత పరిపాలకుని పేరు పేర్కొనబడినాయి. రాష్ట్రకూట రాజు మూడవ కృష్ణునికి సంబంధించిన రామేశ్వరం శాసనంలోని[63] 128 పంక్తులలో 91 పంక్తుల ప్రశస్తి భాగం 23 సంస్కృత శ్లోకాలలో వుంది. 98వ పంక్తి నుండి 'స్వస్తి' అనే పదంతో శాసన విషయం ప్రారంభమైంది. ఈ భాగం కన్నడ భాషలో వుంది. గంగయదేవ చోడ మహారాజు తాళ్ల ప్రొద్దుటూరు శాసనంలో[64] మొదటి వైపున్న 39 పంక్తులలో 32 పంక్తులు అతని గుణగణాలను, యుద్ధ విజయాలను తెలిపే బిరుదాలను పేర్కొన్నాయి. మిగిలిన మూడు వైపులలో అతని పరాక్రమాన్ని వర్ణించిన పద్యాలున్నాయి. 70 పంక్తులున్న శ్రీకృష్ణదేవరాయల రామేశ్వరం శాసనంలో[65] 52 పంక్తుల ప్రశస్తి భాగం వుంది.

### *3.2* ప్రకటన

ఇందులో 1) దాన వివరాలు 2) గ్రహీత పేరు 3) దాన ఉద్దేశం 4) దానమిచ్చిన

భూమి సరిహద్దులు చెప్పబడతాయి. ఈ వివరాలన్నీ ప్రతి శాసనంలోను వుండకపోవచ్చు. పైన చెప్పిన క్రమం కూడ ఒక్కొక్క శాసనంలో ఒక్కొక్క విధంగా వుంటుంది.

### 3.2.1 దాన వివరాలు

దాన విషయం సాధారణంగా భూదానం లేదా అగ్రహార దానం గురించి వుంటుంది. దానమిచ్చిన భూమి లేదా గ్రామం, రాజ్యంలోని ఏ విభాగానికి చెందిందీ చెప్పబడుతుంది. దానమిచ్చిన భూమియొక్క విస్తీర్ణం, ఆ కాలంలో వ్యాప్తిలో వుండిన మరుతురు, పుట్టి (ఖండుగ) మొదలైన కొలతలతో చెప్పబడుతుంది. కొన్ని శాసనాలలో ప్రత్యేకంగా కొలతను పేర్కొనకుండా కేవలం సంఖ్యను మాత్రం పేర్కొనడం కనిపిస్తుంది. రేనాటిచోళుల కాలంలో భూమి కొలతకు ప్రమాణం 'మరుతురు'. దొమ్మరి నంద్యాల తామ్ర ఫలకాలలో[66] పై ప్రమాణాన్ని పేర్కొనకుండా 'రాజమానేన పంచదశం క్షేత్రం దత్తమ్' అని మాత్రమే చెప్పబడింది. అంటే దానమివ్వబడిన భూమి విస్తీర్ణం పదహైదు మరుతుర్లు అని అర్థం.

ప్రజలపై విధించిన కొన్ని పన్నులను పరిపాలకులు మినహాయించడం కూడ దానంగానే భావించబడేది. శ్రీకృష్ణదేవరాయలు ఘనగిరి, గుత్తి, కందనవోలు రాజ్యాలలో, గండికోట స్థలంలో, సిద్ధవటం సీమలో, చంద్రగిరి రాజ్యంలో, నాగమంగళ సీమలో, ముల్నాడు, రాయదుర్గం రాజ్యాలలో ప్రజల నుండి వసూలు చేసే పెండ్లి సుంకాన్ని తుంగభద్రానదీ తీరంలో విరూపాక్ష సన్నిధిలో ధారాపూర్వకంగా సర్వమాన్యం చేసినట్లు రామేశ్వరం శాసనంలో[67] ప్రకటించబడింది. కొన్ని గ్రామాలలో పన్నుల ద్వారా వసూలయ్యే ఆదాయాన్ని పరిపాలకులు దేవాలయాలకు దానంగా ఇచ్చిన విషయాన్ని కొన్ని శాసనాలు నమోదు చేసినాయి.

### 3.2.2 గ్రహీత పేరు

దానగ్రహీత ఒకే వ్యక్తి కాని అనేకమంది గ్రహీతలు కాని వుండవచ్చు. ఒకరికంటె ఎక్కువమంది దానగ్రహీతలున్నప్పుడు దానమిచ్చిన భూమిలో లేదా గ్రామంలో వారి వారి భాగాలను పేర్కొనడం కొన్ని శాసనాలలో కనిపిస్తుంది. కొన్ని శాసనాలలో ఈ విధమైన భాగ నిర్దేశనం వుండదు. ఇటువంటి సందర్భాలలో గ్రహీతలందరికీ సమానమైన హక్కులుంటాయని భావించవచ్చు. దానగ్రహీతలు సాధారణంగా బ్రాహ్మణులై వుంటారు. శాసనంలో దాన గ్రహీత పేరు, అతని తండ్రి పేరు, కొన్ని సందర్భాలలో అతని పితామహుని పేరు పేర్కొనబడతాయి. అంతేకాక గ్రహీత ఏ గోత్రానికి, ఏ వైదిక శాఖకు చెందినవాడైందీ చెప్ప బడుతుంది. కొన్ని శాసనాలలో దానగ్రహీత యొక్క గుణగణాలను వర్ణించడం కనిపిస్తుంది.

దొమ్మరి నంద్యాల తామ్ర ఫలకాలలో[68] శాండిల్య గోత్రుడు ఇరుగశర్మ పుత్రుడు దేవశర్మ, భారద్వాజ గోత్రుడు ఆదిశర్మ పుత్రుడు కవిలశర్మ, ఆత్రేయ గోత్రుడు కొణ్డశర్మ పుత్రుడు దోణశర్మ, శాండిల్య గోత్రుడు మారసింహుని పుత్రుడు దుగ్గశర్మ, భారద్వాజ గోత్రుడు దేవశర్మ పుత్రుడు వేదిశర్మ - అనే ఐదుమంది బ్రాహ్మణులు దానగ్రహీతలుగా పేర్కొన

బడినారు. త్రిభువనమల్లదేవుని సామంతుడైన చిద్దణచోళ మహారాజు పెద్దముడియం గ్రామాన్ని ఆ గ్రామంలోని మహాజనాలకు అగ్రహారంగా ఇచ్చినట్లు శా.శ. 1046 (క్రీ.శ. 1124) నాటి పెద్దముడియం శాసనంలో[69] చెప్పబడింది. ఈ శాసనంలో దాన గ్రహీతల ధర్మవర్తన, విద్యా వైశారద్యం మొదలైన గుణగణాల ప్రశంస వుంది.

దేవాలయాలను దానమిచ్చిన సందర్భాలలో ఏ దేవునికి లేదా దేవతకు దానమిచ్చిందీ చెప్పబడుతుంది. సిద్ధార్థి సంవత్సర వైశాఖ శుద్ధ అక్షతదియనాటి పుష్పగిరి శాసనం[70], కాయస్థ రాజు జన్నిగదేవుడు (పుష్పగిరిలోని) ఇంద్రేశ్వర దేవరకు అంగరంగ భోగాలకుగాను తురుమిడ్లపాడు గ్రామాన్ని ధారాపూర్వకంగా ఇచ్చినట్లు తెలుపుతూ వుంది.

### *3.2.3 దాన ఉద్దేశం*

సాధారణంగా దాతలు తమకు, తమ పితరులకు పుణ్యప్రాప్తి కోసం దానాలను ఇస్తారు. ఈ విషయం చాలా శాసనాలలో చెప్పబడి వుంటుంది. కొన్ని శాసనాలలో దాన ఉద్దేశం పేర్కొనబడి వుండదు. కొందరు సామంతులు, అధికారులు తమకు, తమ అధిరాజుకు పుణ్యం లభించడం కోసం దానాలను ఇచ్చినట్లు కొన్ని శాసనాలు తెలుపుతున్నాయి. వీరముష్టులు, దొమ్మరులు మొదలైన వర్గాల వారు తమకు లభించే ఆదాయాన్ని దేవాలయాలకు దానమిచ్చినప్పుడు తమ కులం వారందరికీ పుణ్యంగా ఆ దానాన్ని ఇచ్చినట్లు చెప్పుకున్నారు. క్రత్వాది అనుష్ఠానాలు అవిచ్ఛిన్నంగా నిర్వర్తించడం కోసం పరిపాలకులు బ్రాహ్మణులకు భూ, గ్రామ దానాలను ఇచ్చినట్లు కొన్ని శాసనాలు తెలుపుతున్నాయి. దేవాలయాలలో నిత్యపూజ నైవేద్యాలు, అఖండ దీపారాధన, ఉత్సవాలు మొదలైన వాటి నిర్వహణ కోసం; మఠాలు, ఘటస్థానాల నిర్వహణ కోసం ఇచ్చిన దానాలను గురించి కొన్ని శాసనాలు తెలుపుతున్నాయి. ఏ విధమైన దానాలను ఇచ్చినప్పటికీ వాటి ప్రధాన ఉద్దేశం దాతకు పుణ్య సంపాదనమే. దాననిరతి యశస్సాధకం కూడ. అందుకే శ్రీకృష్ణదేవరాయలు తన సామ్రాజ్యంలోని కొన్ని ప్రాంతాలలో ప్రజలపై విధించే పెండ్లి సుంకాన్ని ధారాపూర్వకంగా సర్వ మాన్యం చేసినప్పుడు 'పుణ్యాయ యశసే చాపి' అనే దాన ఉద్దేశాన్ని తెలిపినాడు[71].

### *3.2.4 దానమిచ్చిన భూమి సరిహద్దులు*

కొన్ని శాసనాలలో దానమిచ్చిన భూమియొక్క సరిహద్దులు ప్రత్యేకంగా పేర్కొనబడి వుండవు. ఇటువంటి సందర్భాలలో ఆ భూమియొక్క సరిహద్దులు గ్రామ ప్రజలందరికీ సుపరిచితమని భావించాలి. కొన్ని శాసనాలలో దానమిచ్చిన భూమికి నాలుగువైపుల సరిహద్దులను పేర్కొనడం కనిపిస్తుంది. సాధారణంగా తూర్పు, దక్షిణం, పడమర, ఉత్తర దిశలలో సరిహద్దులు పేర్కొనబడతాయి. శా.శ. 1292 (క్రీ.శ. 1370) నాటి చిన్నదాసరిపల్లి శాసనంలో[72] ఈశాన్య, ఆగ్నేయ, నైరృతి, వాయువ్య దిశలలోని సరిహద్దులు పేర్కొనబడినాయి. దానమిచ్చిన భూమికి చతుస్సీమలలో, నదులు, కొండలు, చెట్లు, తోటలు మొదలైన వాటిని

అవధులుగా చెప్పడం కొన్ని శాసనాలలో కనిపిస్తుంది. కొన్ని సందర్భాలలో సరిహద్దులను తెలుపడం కోసం సీమా స్తంభాలు నిలుపబడతాయి.

### 3.3 ఉపసంహారం

ఇందులో - 1) అభ్యర్థన 2) శాపాశీస్సులు 3) సాక్షులు 4) శాసనాన్ని తయారు చేసినవారి పేర్లు వుంటాయి.

### 3.3.1 అభ్యర్థన

పరిపాలకులు తాము ఇచ్చిన దానాన్ని రక్షించమని భావి పరిపాలకులను అభ్యర్థించడం కొన్ని శాసనాలలో కనిపిస్తుంది. ఈ విధమైన అభ్యర్థనతో కూడిన శ్లోకాలు, ఈక్రింద చూపబడినవి, ఈ జిల్లాలోని శాసనాలలో కనిపిస్తున్నాయి.

*"సామా న్యోయం ధర్మసేతు ర్నృపాణాం*
*కాలే కాలే పాలనీయో భవద్భిః*
*తస్మా దేతాన్ భావినః పార్థివేంద్రాన్*
*భూయో భూయో యాచతే రామచంద్రః[73]"*

*"మద్వంశజాః పరమహీపతివంశజా వా*
*పాపా దపేతమనసో భువి భావిభూపాః*
*యే పాలయంతి మమ ధర్మ మిమం సమస్తం*
*తేషాం మయా విరచి తోంజలి రేష మూర్ధ్ని[74]"*

*"మద్వంశజాః పరమహీపతివంశజా వా*
*యే భూమిపా స్సతత ముజ్జ్వలధర్మచిత్తాః*
*మద్ధర్మ మేవ పరిపాలన మాచరంతి*
*తత్పాదుకాద్వయ మహం శిరసా వహామి[75]"*

అనూచానంగా శాసనాలలో ఉటంకించబడుతున్న పై శ్లోకాలే కాక, శాసన కవులు సందర్భోచితమైన శ్లోకాలను రచించి శాసనాలలో పొందుపరచడం కూడ కనిపిస్తుంది. శా.శ. 1291 (క్రీ.శ. 1369) నాటి పోరుమామిళ్ల శాసనంలోని[76]

"యద్వ త్సేతు ర్లంఘనీయో న చాబ్దేః
భూపాంబోధే ర్ధర్మసేతు స్తథైవ
తస్మా దస్మద్ధర్మరక్షార్థ ముర్వ్యాం
యాచే యాచే పార్థివాన్ భాస్క రోహం"

- అనే శ్లోకంలో భవదూర మహీపతి, తాను నిర్మింపజేసిన అనంతరాజసాగరమనే తటాకాన్ని ఖిలం కాకుండా రక్షించమని భావి పరిపాలకులకు చేసిన విన్నపం వుంది.

### 3.3.2 శాపాశీస్సులు

ఒక దాన శాసనాన్ని జారీచేసినపుడు ఆ దానాన్ని రక్షించినవారికి పుణ్యం లభిస్తుందని లేదా ఆ దానఫలం సిద్ధిస్తుందని, దానిని నాశనం చేసినవారు వివిధ పాపాలకు పాల్పడిన వారౌతారని చెప్పడం శాసనాంతంలో సాధారణంగా కనిపిస్తుంది. ఈ విధమైన ప్రకటనలను శాపాశీస్సులని వ్యవహరిస్తున్నాం. శాపోక్తులు, ఆశీర్వాక్యాలు ఆ దానాన్ని చిరస్థాయిగా రక్షించడం అనే ఒకే లక్ష్యం కోసం రచించబడినాయి. కొంతమంది పుణ్య సంపాదన కోసం దానాన్ని రక్షిస్తే మరికొంతమంది శాపోక్తులకు భయపడి దానిని చెడపకుండా వుంటారు. శాపాశీస్సులతో కూడిన సంస్కృత శ్లోకాలు చాలా శాసనాలలో ఉద్ధరించబడినాయి. కడప జిల్లాలోని శాసనాలలో కనిపిస్తున్న ఈ విధమైన శ్లోకాలు ఈ క్రింద చూపినవిధంగా వున్నాయి.

*"స్వదత్తాం పరదత్తాం వా యో హరేత వసుంధరాం*
*షష్టి ర్వర్షసహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమి:[77]"*

*"స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం*
*పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్"[78]*

*"దానపాలనయో ర్మధ్యే దానా చ్ఛ్రే యోనుపాలనం*
*దానా త్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతం పదం"[79]*

ఈ శ్లోకాలు దానాన్ని అపహరించినవారికి కలిగే పాప ఫలాన్ని, దానాన్ని రక్షించినవారికి లభించే పుణ్య ఫలాన్ని గురించి తెలుపుతున్నాయి. కొన్ని శాసనాలలో

*"దేవస్వం తు విషం ఘోరం న విషం విష ముచ్యతే*
*విష మేకాకినం హంతి దేవస్వం పుత్రపౌత్రకం"[80]*

*"దేవద్రవ్యం గురుద్రవ్యం విప్రద్రవ్యం త థైవ చ*
*ఉపేక్షితాని భక్ష్యాణి కులక్షయ మిదం భవేత్"[81]* - అని

హెచ్చరికతో కూడిన శ్లోకాలు ఉటంకించబడినాయి. బ్రాహ్మణుల కిచ్చిన భూమిని ఆక్రమించి అనుభవించరాదని దానిపై పన్ను విధించరాదని నిర్దేశిస్తున్న

*"ఏ కైవ భగినీ లోకే సర్వేషా మేవ భూభుజాం*
*న భోగ్యా న కరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా"[82]* - అనే శ్లోకం

కొన్ని శాసనాలలో కనిపిస్తుంది.

పైన పేర్కొనబడిన శ్లోకాలే కాక శాపాశీస్సులను ప్రకటించే వాక్యాలు కూడ శాసనాలలో చోటుచేసుకున్నాయి. "దీని కాచి నడపినవారికి భూమి దానంబు ఫలంబు[83]", "దీని సల్పిన వానికి వేగుడ్లు, వేసెఱువులు. . . . . నిల్పిన పుణ్యంబు[84]", "తేని రక్షించి కుడిపిన వాన్కి అడుగు అడుగు అస్వమేదంబున ఫలంబు కాంచున్[85]", "నడపినవారు అనేక పుణ్యఫలం

ముక్తింబొందువారు[86]" - మొదలైన ఆశీర్వాక్యాలు శాసనాలలో చెప్పబడినాయి.

శాసనాలలో కనిపిస్తున్న శాపోక్తులు ప్రత్యేకంగా గమనించదగినవి. క్రీ.శ. 7వ శతాబ్ది వరకు వున్న దాన శాసనాలలో ఆ దానాన్ని చెఱిపినవారు పంచ మహాపాతక సంయుక్తులౌతారని చెప్పే శాపోక్తి మాత్రమే కనిపిస్తుంది. బ్రహ్మహత్య, సురాపానం, దొంగతనం, గురుతల్ప గమనం, ఈ విధమైన పాతకాలు చేసినవారితో సంసర్గం అనే ఐదు పనులు పంచమహా పాతకాలుగా చెప్పబడినాయి. ఈ శాపోక్తి క్రీ.శ. 9వ శతాబ్ది వరకు శాసనాలలో కనిపిస్తూ వుంది. తరువాతి కాలంలో ఈ శాపోక్తి శాసనాలలో విరళంగా వుంది. క్రీ.శ. 7వ శతాబ్ది నుండి దాన శాసనాలలో ఆ దానాన్ని నాశనం చేసినవారు వారణాశిలో గోబ్రాహ్మణులను చంపిన పాపాన్ని పొందుతారనే శాపోక్తి కనిపిస్తుంది.

విజయనగర కాలంలోను, తదనంతర కాలంలోను శాసనాలలోని శాపోక్తులలో అశ్లీలమైన వాక్యాలు చోటుచేసుకున్నాయి. ఈ జిల్లాలోని శాసనాలలో కనిపిస్తున్న కొన్ని శాపోక్తులు కాలక్రమానుసారంగా ఈక్రింద చూపబడినాయి.

1. *పంచమహాపాతక సంయుక్తుండగు*

(కలమళ్ల, క్రీ.శ. 6ం వ శతాబ్దం)[87]

2. *తేని ఱిచ్చువాణ్డు . . . . . . . . . . బారణాసి వేవుర వధిసిన వఱు*

(నల్లచెఱువు పల్లె, క్రీ.శ. 7వ శతాబ్దం)[88]

3. *దీనికి వక్రబు వచ్చు వఱు పుత్ర్యవద్య స్త్రీవద్య గోవద్య*
*పంచమహాపాతకం చేసినవాని లోకం జన్వా ఱు*

(మాలెపాడు, క్రీ.శ. 8వ శతాబ్దం)[89]

4. *వక్రంబు వచ్చిన వాఱు వారణాశి వేవ్రు పాఱు వేదేవగులంబుళు*
*వేసెఱువులు వేగవిలళు . . . . . .*

(రామాపురం, క్రీ.శ. 8వ శతాబ్దం)[90]

5. *దీనికి వక్రంబు వచ్చినవారు వారణాశి శ్రీపర్వతంబును ఱిచ్చినవారు. వేవురు బ్రాహ్మణులను వేయుగవిలల నఱిసినవారు.*

(బల్లియచోళ మహారాజు మద్రాస్ మ్యూజియం
తామ్ర ఫలకాలు, కాలనిర్ణయం లేదు)[91]

6. *దేవస్వంబు లంచంబు గొణ్బవాఱు*

(పెద్ద ముడియం, క్రీ.శ. 8-9 శతాబ్దం)[92]

7. *దీనికి వక్రంబు వచ్చువాఱు వారణాసి వేవ్రుపాఱను వేగవిలళు వేసెఱువుళు*
*వేకన్యాళు చ్చిన వఱు*

(కొఱ్రపాడు, క్రీ.శ. 8వ శతాబ్దం)[93]

8. దీని స్థితి దపువాడు గోబ్రహ్మ ఘాతకుండు

(అనిమెల, క్రీ.శ. 976)[94]

9. పాఱను బాలళను స్త్రీళను తప [సులను] జంపినవాణ్డు ఇరువది నాలుగు అగ్రహారంబుళు బారనాసియు శ్రీపర్వతంబును నాలుగు వాకిణ్ణ నాలుగు స్రిడ్లు ఎఱిచ్చినవాణ్డు

(అరకటవేముల, క్రీ.శ. 10వ శతాబ్దం)[95]

10. దీనికి వక్రంబు వచ్చువాండు బారనాసియు సిద్ధవటంబును మహానందిఱిచ్చిన పాపంబు . . . . . . . . వాండు

(ముత్తుకూరు, కాలనిర్ణయం లేదు)[96]

11. దీనికి వక్రంబు వచ్చిన వారికి నరకంబు . . . . . . .

(వేల్పుచెర్ల, కాలనిర్ణయం లేదు)[97]

12. ఈప్రవృత్తికి దురాత్మురు చెర్పం దలచినవారు శిశువధ గోవధ గంగకఱ్తు వేయు గవిలలుం జంపి పెద్దకొడ్కు కపాళమునం గుడ్చినవారు.

(ఓగూరు, క్రీ.శ. 1238)[98]

13. ఈ వైభవాలకు విఘ్నం తలంచినవారు గంగకరుత కపిలధేనువులను పదివేలు వధించిన పాపానం పోవువారు.

(అట్లూరు, క్రీ.శ. 1268)[99]

14. మీకు బెటినటువంటి మడికి యెవ్వరు దపినాను గోవువధ బ్రహ్మహత్య గురుతల్పం సురాపానం వర్ణసెయం మొదలయిన పంచ అది పాతకాలు సేసిన పాపాన బోదురు.

(ముచ్చుమఱ్ఱి, క్రీ.శ. 1440)[100]

15. ఈ భూదానానకు యవ్వరు తప్పినాను వానాలిని గుఱ్ఱప్పాట్టే వానికిన్ని గొడుగుపట్టే వానికిన్ని ఇచ్చినవాండు.

(కత్తెరగండ్ల, క్రీ.శ. 1525)[101]

16. ఈ పుణ్యాన్కు యవ్వరు తప్పినాను తమ చెల్లికి తప్పినవారు.

(పోరుమామిళ్ల, క్రీ.శ. 1526)[102]

17. ఈ ధర్మానకు యవరు తప్పినాను . . . . . . . . తమ మానాభిమానాలు ఇరువయి నాలుగు కులాలవారి గాడుదలు కాచెవానికి ఇచినవారు.

(తిప్పలూరు, క్రీ.శ. 1527)[103]

18. ఈ పుణ్యానకు యవ్వరు తప్పినాను . . . . . . స్త్రీ హత్య శిశు హత్య

శేశిన పాపన బోవువారు.

(పందిళ్లపల్లి, క్రీ.శ. 1528)[104]

19. ఈ కాలువ సాగనియ్యక యవ్వండు ఖిలం సేసును ఆ ఖిలం సేసినవారి ఆలికి వారి అయ్యవరుసుకు గోవగాపడు వాండె మగండు.

(కుచ్చుపాప, క్రీశ. 1530)[105]

20. ఇందుకు యవారలు తప్పికొన్నను యల్లప్పనాయని అయ్యావారి గురం పట్టేవానికి తన పెండ్లామును ఇచ్చినవాండు.

(పులివెందల, క్రీ.శ. 1535)[106]

21. ఈ ధర్మానకు యవ్వరు గనక తప్పి మంగలిపన్ను కొన్నాను . . . . . . . . . వారు వొక తల్లికిన్ని వొక తండ్రికిన్ని జన్మించినవారు గారు.

(చిలమకూరు, క్రీ.శ. 1546)[107]

22. ఇందు్క తప్పి యవ్వరు పన్ను కొన్నాను . . . . . . . తమ తల్లికి తపినవారు.

(పోరుమామిళ్ల, క్రీ.శ. 1546)[108]

23. ఈ ధర్మానకు యవ్వరు తప్పినాను . . . . . . బెస్తబోయిండు వానాలికి మిండండు వానాలికి గార్ధభమే మగడు.

(లోమడ, క్రీ.శ. 1547)[109]

24. ఈ ధర్మానికి యవ్వరు అడ్డమైనాను వారు చెల్లెలింని తల్లినిం జంపినవారు.

(కొత్రపాడు, క్రీ.శ. 1547)[110]

25. ఈ ధర్మానకు యవరు తపినాను తమ మాతాపితళ్లను వారణాసిలోను వధియించిన పాపానం బోవువారు గంగలోను గోవు బ్రాంహ్మల చంపిన పాపానం బోవువారు.

(కోడూరు, క్రీ.శ. 1548)[111]

26. ఈ ధర్మానకు యవ్వరు తపినాను కుక్క మాంనముంను సురాను సేవించ్చినవారు మంగ్గలవారి దపిన కొడుకులు.

(జొన్నవరం, శా.శ. 146 - )[112]

27. ఇందుకు యవరు తప్పికొన్నను తమ తల్లితండ్రుల వారణాశిన కుతికలు కోసిన పాపాల పోదురు గంగావతిలోను గంగెవును చంపిన పాపాన పోదురు శుణక మాంసం సుర శేవించిన పాపాన పోదురు.

(నెమళ్లదిన్నె, క్రీ.శ. 1558)[113]

28. ఈ ధర్మానకు యవ్వరు తప్పినాను . . . . . అఖండ తిరువళికె ఆరినట్టె

వంశక్షయమైపోదురు.

(లోమడ, క్రీ.శ. 1566)[114]

29. ఇందుకు తపినవాండు తమకు చప్పులు గుట్టే మాద్గివాన్కి మానమిచిన వాండు.

(బెడదూరు, కాలనిర్ణయం లేదు)[115]

30. మాతాపితళ్లను గయలోను వధించిన పాపాన బోవువారు మాతృగమనం శేసిన దోషాన పోవువారు.

(భీమగుండం, కాలనిర్ణయం లేదు)[116]

భిన్న కాలాలలో శాసనాలలో కనిపిస్తున్న శాపోక్తులు ఆయా కాలాలలోని సామాజిక, ధార్మిక విలువలను ప్రతిఫలిస్తున్నాయి. మొదటి దశల్లో మంచి మాటలతో మందలించినట్లు కనిపించే శాపోక్తులలో రానురాను అసభ్య పదజాలంతో దూషించే పద్ధతి చోటుచేసుకొనింది. ఈ మార్పు సార్వజనీనమని చెప్పడానికి వీలులేదు. కాని కాలం మారుతున్న కొద్దీ కొన్ని శాసనాలలో దూషణలు తీవ్రతరం కావడం సమాజంలో నైతిక మూల్యాలు రానురాను తగ్గిపోయిన స్థితిని సూచిస్తూ వుంది.

### 3.3.3 సాక్షులు

కొన్ని శాసనాలలో, శాసనంలో ప్రకటించబడిన దానానికి లేదా క్రయానికి లేదా ఒప్పందానికి సాక్షులను పేర్కొనడం కనిపిస్తుంది. ఒకే సాక్షి కాని అనేకమంది సాక్షులు కాని శాసనాలలో పేర్కొనబడతారు. క్రయ శాసనాలలోను, భాగ పరిష్కారాలకు సంబంధించిన శాసనాలలోను తప్పనిసరిగా సాక్షులు పేర్కొనబడతారు. దాన శాసనాలలో క్వాచిత్కంగా మాత్రమే సాక్షుల ప్రసక్తి కనిపిస్తుంది. శా.శ. 1473 (క్రీ.శ. 1551) నాటి సంబటూరు శాసనంలో[117]

"అదిత్యచంద్రా వనిలో నల శ్చ
ద్యౌ భూ(ర్భూ)మి రాపో హృదయం యమ శ్చ
అహ శ్చ రాత్రి శ్చ ఉభే చ సంధ్యే
ధర్మ శ్చ దేవా స్సహ సాక్షి ణోత్ర" - అని

సాక్షులుగా వ్యక్తులను గాక ప్రకృతి శక్తులను పేర్కొనడం గమనించదగింది.

### 3.3.4 శాసనాన్ని తయారుచేసినవారి పేర్లు

శాసనాలలో ఉపయోగించబడిన 'లిఖితం' అనే పదాన్ని వివరించడం చాలా సందర్భాలలో కష్టం. ఈ పదం శాసన పాఠాన్ని తయారు చెయ్యడాన్ని కాని, శాసనాన్ని లోహఫలకంపై లేదా శిలపై మలచడాన్ని కాని, శాసనాన్ని చెక్కే వ్యక్తికి మార్గదర్శకంగా శాసన పాఠాన్ని ఫలకంపై వ్రాయడాన్ని కాని సూచిస్తుంది. ఇదేవిధంగా 'వ్రాసె' అనే పదం శాసన

పాఠాన్ని తయారు చెయ్యడాన్ని లేదా దాన్ని శాసన ఫలకంపై వ్రాయడాన్ని సూచిస్తుంది. కొన్ని శాసనాలలో క్త్రొచ్చె, క్రొచ్చె, కొట్టె, మలచె మొదలైన పదాలు కనిపిస్తున్నాయి. ఈ పదాలు శాసనాన్ని శిలపై చెక్కడాన్ని తెలుపుతున్నాయి. శాసన పాఠాన్ని తయారుచేసిన తరువాత దాన్ని లోహఫలకంపై లేదా శిలపై మలచడానికి ముందు శాసనాన్ని మలచే వ్యక్తికి మార్గదర్శకంగా శాసన పాఠాన్ని, శాసనాన్ని చెక్కే ఫలకంపై వ్రాసే పద్ధతి వున్నట్లు కొన్ని శాసనాల ద్వారా తెలుస్తూ వుంది[118]. సాధారణంగా 'అసివైరువు లిఖితం'[119], 'విజీపజితి కమ్మటి వినియణ వ్రాసె'[120], 'పసిణ్డి మిజె కొటూచ్చె'[121], 'ఈ శాసనం మలిచిన వేల్పుచర్ల వడ్లకాణాచికాండు తింనోజు...'[122] మొదలైన వాక్యాలు శాసనాలలో కనిపిస్తున్నాయి. క్రీ.శ. 8వ శతాబ్ది నాటి వెల్దుర్తి శాసనంలో[123], కంచెఋపటి ఎఋమ వ్రసిరి కొద్దలి కుణన్దళువ కొట్టె' - అని శాసనాన్ని ఫలకంపై వ్రాసిన వ్యక్తి, శాసనాన్ని మలచిన వ్యక్తి పేర్కొనబడినారు. శా.శ. 1291 (క్రీ.శ. 1369) నాటి పోరుమామిళ్ల శాసనంలో[124] 'శ్రీమల్లింగయ మాచనార్య కవినాప్రోక్తం శుభం శాసనం' - అని శాసన కవి మాత్రమే పేర్కొనబడినాడు. శా.శ. 1432 (క్రీ.శ. 1510) నాటి రామేశ్వరం శాసనంలో[125] 'మల్లనాచార్య వర్యేణ సైకేణ లిఖితం తథా' - అని శాసన లేఖకుణ్ణి, 'చాగదొర్తి బసవోజు కొడుకు చిటోజు మలిచిన శాసనం' - అని శాసనాన్ని మలచిన వ్యక్తిని పేర్కొనడం కనిపిస్తుంది. శాసన పాఠాన్ని తయారుచేసిన వ్యక్తిని (శాసన రచయితను), శాసనాన్ని లోహఫలకంపై లేదా శిలపై వ్రాసిన వ్యక్తిని, శాసనాన్ని మలచిన వ్యక్తిని - ఈ ముగ్గురిని పేర్కొనడం శాసనాలలో క్వాచిత్కంగా మాత్రమే కనిపిస్తుంది.

# సూ చి క లు

1. 1–13–318, 319, 320.
2. 2–10–1, 6, 63
3. D.C. Sircar : Indian Epigraphy; p. 105.
4. I.A.P., C.D., Part II, No. 11
5. పి. కృష్ణమూర్తి, యస్. శ్రీపతినాయుడు: పురావస్తు శాస్త్రము; 1983.
6. I.A.P., C.D., Part II, No. 76
7. Ibid. No. 197
8. Ibid. No. 237
9. Ibid. Part I, No. 88
10. Ibid. No. 142
11. Ibid. No. 159
12. Ibid. No. 61
13. Ibid. Part II,No. 266
14. Ibid. No. 24
15. Ibid. Part III, No. 40
16. Ibid. No. 187
17. Ibid. No. 233
18. Ibid. No. 240
19. Ibid. Part II, No. 165
20. Ibid. No. 213
21. Ibid. No. 248
22. Ibid. No. 120
23. Ibid. No. 34
24. Ibid. No. 147
25. Ibid. No. 220
26. Ibid. No. 230
27. Ibid. No. 232
28. Ibid. No. 211
29. Ibid. Part II No. 11
30. Ibid. Part I No. 168
31. Ibid. Part IINo. 87
32. Ibid. No. I
33. Ibid. No. II
34. Ibid. No. 88
35. Ibid. No. 123
36. Ibid. No. 138
37. Ibid. No. 141
38. Ibid. Part II,No. 17
39. Ibid. No. 6
40. Ibid. No. 11
41. Ibid. No. 14
42. Ibid. No. 73
43. Ibid. No. 87
44. Ibid. Part I No. 11
45. Ibid. No. 14
46. Ibid. No. I
47. Ibid. No. III
48. Ibid. No. 65
49. Ibid. No. 74
50. Ibid. No. 107
51. Ibid. No. 109
52. Ibid. No. 123
53. Ibid. No. 128
54. Ibid. No. 142
55. Ibid. Part II. No. 11
56. Ibid. No. 31
57. Ibid. No. 37
58. Ibid. Part I No. 123
59. Ibid. No. 11
60. Ibid. No. 14
61. Ibid. No. I
62. Ibid. No. II
63. Ibid. No. 88
64. Ibid. No. 159

65. Ibid. Part II, No. 73
66. Ibid. Part I, No. I
67. Ibid. Part II, No. 73
68. Ibid. Part I, No. I
69. Ibid. No. 123
70. Ibid. No. 139
71. Ibid. Part II, No. 73
72. Ibid. No. 12
73. Ibid. Part I, Nos 88 etc.
74. Ibid. No. 123
75. Ibid. Part II, No. 187
76. Ibid. No. 11
77. Ibid. Part I, Nos. 45 etc.
78. Ibid. Nos. 157 etc.
79. Ibid. Part II, Nos. 11 etc.
80. Ibid. Part I, No. 83
81. Ibid. Part II, No. 82
82. Ibid. Nos. 11 etc.
83. Ibid. Part I, No. 13
84. Ibid. No. 17
85. Ibid. No. 22
86. Ibid. No. 111
87. Ibid. No. 2
88. Ibid. No. 9
89. Ibid. No. 17
90. Ibid. No. 37
91. Ibid. No. IV
92. Ibid. No. 27
93. Ibid. No. 43
94. Ibid. No. 74
95. Ibid. No. 100
96. Ibid. No. 102
97. Ibid. No. 104
98. Ibid. No. 111
99. Ibid. No. 143
100. Ibid. Part II, No. 41
101. Ibid. No. 89
102. Ibid. No. 90
103. Ibid. No. 95
104. Ibid. No. 97
105. Ibid. No. 106
106. Ibid. No. 120
107. Ibid. No. 178
108. Ibid. No. 179
109. Ibid. No. 191
110. Ibid. No. 192
111. Ibid. No. 198
112. Ibid. No. 201
113. Ibid. No. 256
114. Ibid. No. 263
115. Ibid. No. 274
116. Ibid. No. 285
117. Ibid. No. 220
118. D.C. Sircar : Opp. Cit., P. 146
119. I.A.P., C.D. Part I, No. 3
120. Ibid. No. 14
121. Ibid. No. 9
122. Ibid. Part II, No. 175
123. Ibid. Part I, No. 18
124. Ibid. Part II, No. 11
125. Ibid. No. 73

# రెండవ అధ్యాయం

# రాజకీయ నేపథ్యం

## 1. మౌర్యులు

ఈ జిల్లా రాజకీయ చరిత్రకు సంబంధించిన మొదటి స్పష్టమైన ఆధారం అనంతపురం జిల్లాలోని ఎర్రగుడిలోను, కర్నూలు జిల్లా పత్తికొండ తాలూకా రాజుల మందగిరి లోను (ఇది కడప జిల్లాకు వాయువ్య దిశలో దాదాపు 50 కి.మీ. దూరంలో వుంది) దొరికిన అశోకుని (క్రీ.పూ. 274-236) శాసనాల[1] వల్ల లభిస్తూ వుంది. 'చు-లి-య' దేశపు రాజధానికి ఆగ్నేయ దిశలో అశోకునిచే నిర్మించబడిన బౌద్ధ స్తూపం వున్నట్లు హ్యూన్‌త్సాంగ్ పేర్కొన్నాడు[2]. ఈ స్తూపం కడప జిల్లాలోని ఆడపూరులో వున్న బౌద్ధ స్తూపంగా గుర్తించబడింది. కాబట్టి కడప జిల్లా అశోకుని సామ్రాజ్యంలో భాగంగా వుండిందని చెప్పవచ్చు.

## 2. శాతవాహనులు

మౌర్య సామ్రాజ్య పతనానంతరం ఈ ప్రాంతం శాతవాహనుల పరిపాలనలోకి వచ్చింది. గౌతమీబాలశ్రీ వేయించిన నాసిక్ శాసనంలో గౌతమీపుత్ర శాతకర్ణి 'ములక' (ములకనాడు) ప్రభువుగా పేర్కొనబడినాడు[3]. ములకనాడు కడప జిల్లాలోని కొంత ప్రాంతమని చారిత్రకులు నిర్ణయించినారు. పెద్ద ముడియం, దొమ్మరి నంద్యాలలలో శాతవాహనులకు సంబంధించిన సీసపు నాణేలు లభించినాయి. దొమ్మరి నంద్యాలలో 42 × 21 × 7 సెం.మీ. కొలతలు కలిగిన శాతవాహనుల కాలం నాటి ఇటుకలు కూడ బయటపడినాయి. నందలూరు - ఆడపూరులో జరిగిన త్రవ్వకాలలో శాతవాహనులకు సంబంధించిన 1600 సీసపు నాణేలు, క్రీ.శ. 1 లేక 2వ శతాబ్ది నాటి బ్రాహ్మీ శాసనం బయటపడినాయి[4].

శాతవాహనుల కాలం రోమ్‌తో పాటు అనేక ఇతర రాజ్యాలతో సముద్ర వ్యాపారానికి ప్రసిద్ధి చెందింది. నాగార్జునకొండ, నంద్యాల, నెల్లూరు, ఒంగోలు మొదలైన ప్రదేశాలలో రోమన్ నాణేలు లభించినాయి. ఈ జిల్లాలో రాజంపేట తాలూకాలోని అత్తిరాల వద్ద ఒక కొండ పక్కన కట్టెలు ఏరుకుంటున్న ఒక స్త్రీకి క్రీ.శ. 1838లో ట్రాజన్ రాజు (క్రీ.శ. 117)కు

సంబంధించిన బంగారు నాణెం దొరికింది[5]. పై ఆధారాలు ఈ జిల్లాతో శాతవాహనులకున్న సంబంధాన్ని స్పష్టం చేస్తున్నాయి.

## 3. ఇక్ష్వాకులు

క్రీ.శ. 3వ శతాబ్ది ప్రథమ పాదం చివరి ప్రాంతంలో శాతవాహనుల పాలన ఇక్ష్వాకు వంశ స్థాపకుడైన మొదటి శాంతిమూలుని చేతిలో అంతమైంది. ఇక్ష్వాకులు హిరణ్యకులతో వివాహ సంబంధాలను ఏర్పరచుకున్నారు. హిరణ్యకులు హిరణ్య రాష్ట్రం నుండి వచ్చినవారు కావచ్చు. హిరణ్య రాష్ట్రంలో కడప జిల్లాలోని కొన్ని భాగాలున్నాయి. ఇక్ష్వాకు రాజైన పురీషదత్తుడు నాగార్జున కొండలో వేయించిన బ్రాహ్మీ లిపిలోని ప్రాకృత శాసనంలో హిరణ్మక వంశానికి చెందిన మహాతలవర, మహాసేనాపతి, వాసిఠీపుత కందచలికి రెమ్మణక అతని సామంతులలో ఒకనిగా పేర్కొనబడినాడు[6]. హిరణ్మక - హిరణ్యక శబ్దానికి ప్రాకృత రూపమని డా॥ యన్. వెంకటరమణయ్య గారు అభిప్రాయపడినారు[7]. కాని హిరణ్యక శబ్దానికి ప్రాకృత రూపం 'హిరణ్ణక'. కాబట్టి 'హిరణ్మక' శబ్దంలో లేఖన దోషం వల్ల 'ణ్య' - 'ణ్మ' గా చెక్కబడినట్లు భావించడం సమంజసం. ఇక్ష్వాకుల సైనిక వ్యవహారాలలో హిరణ్యకులు సమర్థవంతమైన పాత్రను నిర్వహించినారు. ఈ అంశాలు ఇక్ష్వాకులతో ఈ జిల్లాకున్న రాజకీయ సంబంధాన్ని తెలియజేస్తున్నాయి.

## 4. తొలి పల్లవులు

శాతవాహనుల తరువాత ఈ జిల్లా పల్లవుల పాలనలో వుండినట్లు కనిపిస్తుంది. వీరికి సంబంధించిన శాసనాలేవీ ఈ జిల్లాలో లభించక పోయినా నేటి గుంటూరు, నెల్లూరు జిల్లాలతో పాటు తీర ప్రాంతాన్ని పరిపాలించిన యువ మహారాజు విష్ణుగోపుడు, అతని కుమారుడు రెండవ సింహవర్మ (క్రీ.శ. 5 శ॥) వేయించిన శాసనాలలో[8] ముణ్డ రాష్ట్ర, హిరణ్య రాష్ట్రాలు వారి సామ్రాజ్యంలో భాగాలుగా చెప్పబడినాయి. క్రీ.శ. 350 ప్రాంతంలో సముద్రగుప్తుడు దక్షిణాపథంపై దండయాత్ర చేసి ఓడించిన 12 మంది రాజులలో కంచిని పాలిస్తున్న విష్ణుగోపుడు ఒకడని అలహాబాద్ స్తంభ శాసనంలో[9] పేర్కొనబడింది. సముద్రగుప్తుని దండయాత్ర ఇప్పటి కడప జిల్లాలో గొప్ప సంచలనాన్ని కలిగించింది.

## 5. పల్లవ x చాళుక్య సంఘర్షణలు

పల్లవరాజు సింహవిష్ణు కాలంలో (క్రీ.శ. 574-600) బాదామి చాళుక్యులకు, కంచి పల్లవులకు మధ్య దీర్ఘకాలిక స్పర్థలను కడప జిల్లా ఎదుర్కొనవలసి వచ్చింది. సింహవిష్ణువు తరువాత క్రీ.శ. 600 ప్రాంతంలో అతని కుమారుడు మొదటి మహేంద్రవర్మ రాజ్యానికి వచ్చినాడు. చాళుక్య రాజు రెండవ పులకేశి క్రీ.శ. 624లో వేంగీ దేశంపై దండెత్తి దాన్ని జయించి తన తమ్ముడైన కుబ్జ విష్ణువర్ధనుని వేంగీ పాలకునిగా నియమించినాడు. పరిస్థితులు

అనుకూలిస్తే ఉద్ధతుడైన చాళుక్యరాజు తన రాజ్యంపై కూడా దండెత్తే ప్రమాదం వుందని గుర్తించి, మహేంద్రవర్మ రాజ్య భద్రత కోసం కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేసినాడు. ఈ కాలంలో అటువంటి సంఘటన ఏదీ జరిగినట్లు తెలియడం లేదు. క్రీ.శ. 630లో మహేంద్రవర్మ చనిపోయినాడు. అతని కుమారుడు మొదటి నరసింహవర్మ రాజ్యానికి వచ్చినాడు. ఈ పరిస్థితులను అవకాశంగా తీసుకొని రెండవ పులకేశి క్రీ.శ. 631లో పల్లవ రాజ్యానికి ఉత్తర భాగమైన కర్మ రాష్ట్రంపై దండెత్తి దానిని వశపరచుకున్నాడు. తరువాత పల్లవ రాజధాని కంచి పైకి సైన్యాలను నడిపించినాడు. నరసింహవర్మ సరైన ప్రతిఘటన ఇవ్వలేక కోటలో తలదాచుకున్నాడు. ఈ విజయంతో పులకేశి పల్లవ సామ్రాజ్యం గుండా కావేరీ నది వరకు సేనలను నడిపించినాడు. ఈ దండయాత్ర పల్లవ సామ్రాజ్యాన్ని దాదాపు ముక్కలు చేసింది. ఉత్తర ప్రాంతమైన కర్మ రాష్ట్రం పల్లవ సామ్రాజ్యం నుండి విడదీయబడింది. చుట్టుపక్కల ప్రాంతాలలో సామంతులు తిరుగుబాటు చేసినారు. రేనాటిచోళులు ఈ అవకాశాన్ని ఉపయోగించుకున్నారు. పుణ్యకుమారుడు స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకోవడమే గాక అంతవరకు పల్లవుల అధీనంలో వున్న హిరణ్య రాష్ట్రాన్ని కూడా జయించినాడు[10]. ఈ పరిస్థితి దాదాపు ఒక దశాబ్ది పాటు కొనసాగింది.

పులకేశి చేతిలో ఓడిపోయిన నరసింహవర్మ ఈ మధ్యకాలంలో తన సేనలను పునర్వ్యవస్థీకరించడంలోను, రాజ్య భద్రతను కట్టుదిట్టం చెయ్యడంలోనూ మునిగివుండి ప్రతీకారానికి వేచి వున్నాడు. ఈ స్థితిలో క్రీ.శ. 642లో పులకేశి రెండవసారి పల్లవ సామ్రాజ్యంపై దండెత్తినాడు. ఈ పర్యాయం నరసింహవర్మ పులకేశిని ఓడించి, అతనిని రాజధానికి తరిమి కొట్టడమే కాక బాదామి కోటను ముట్టడించి వశపరచుకున్నాడు. ఈ యుద్ధంలో పులకేశి, అతని తమ్ముడు విష్ణువర్ధనుడు మరణించినారు. చాళుక్య సామ్రాజ్యం విచ్ఛిన్నమై చాలా భాగం పల్లవ సామ్రాజ్యంలోకి కలుపబడింది. కాని పల్లవుల విజయం ఎంతోకాలం నిలువలేదు. రెండవ పులకేశి కుమారుడు మొదటి విక్రమాదిత్యుని నేతృత్వంలో చాళుక్యులు తిరిగి విజృంభించినారు. పల్లవ, చాళుక్య రాజ్యాల మధ్యనున్న రేనాడు యుద్ధభూమిగా మారింది. విజయం ఇరువర్గాల మధ్య ఊగిసలాడింది. చాళుక్యుల దండయాత్రకు రేనాటిచోళులు మొదటి లక్ష్యమైనట్లు కనిపిస్తుంది.

మొదటి విక్రమాదిత్యుడు (క్రీ.శ. 654-81), పల్లవ నరసింహవర్మ బాదామిని పట్టుకోవడంతో పోగొట్టుకొన్న అధికారాన్ని, వంశగౌరవాన్ని చాలావరకు తిరిగి సంపాదించుకున్నాడు. అనతికాలంలోనే ఇతని రాజ్యం కృష్ణా, తుంగభద్రా నదుల దక్షిణ ప్రాంతం వరకు విస్తరించినట్లు అనేక శాసనాలు సాక్ష్యమిస్తున్నాయి. ఇతని ప్రథమ రాజ్య సంవత్సరానికి చెందిన తిప్పలూరు శాసనంలో ఇతడు విక్రమాదిత్య సత్యాశ్రయునిగా పేర్కొనబడినాడు[11].

అరకట వేములలోని కాలనిర్ణయం లేని ఒక శాసనం మొదటి విక్రమాదిత్యుడు ఈ ప్రాంతాన్ని జయించినట్లు తెలుపుతూ వుంది[12]. ఈ శాసనంలో శ్రీవల్లభ మహారాజాధిరాజ

పరమేశ్వర భట్టారుని సామంతుడు భూపాదిత్యుడు ఒక బ్రాహ్మణునికి భూదానం ఇచ్చినట్లు నమోదు చేయబడి వుంది. ఈ శాసనంలో పేర్కొనబడిన శ్రీవల్లభ మహారాజు మొదటి విక్రమాదిత్యుడే అని పరిశోధకులు నిర్ణయించినారు[13]. పెద్ద పసుపులలోని కాలనిర్ణయం చేయబడని ఇంకొక శాసనంలో[14] భూపాదిత్యుడు రేనాడును పరిపాలిస్తున్నట్లు చెప్పబడింది.

మొదటి విక్రమాదిత్యుని కుమారుడు వినయాదిత్యుని కాలంలోను (క్రీ.శ. 681-96), మనుమడు విజయాదిత్యుని కాలంలోను (క్రీ.శ. 696-735), చాళుక్యులకు, పల్లవులకు మధ్య యుద్ధాలు ఎక్కువగా జరిగినాయి. రెండు రాజ్యాలూ జయాపజయాల మధ్య ఊగిసలాడినాయి. దానవులపాడు లోని ఒక కన్నడ శిలాశాసన శకలం విజయాదిత్య సత్యాశ్రయుణ్ణి పేర్కొంటూ, వైదిక ధర్మావలంబియైన ఆ రాజుకు జైన దేవాలయాలపైన, మఠాలపైన వున్న అభిమానాన్ని తెలియజేస్తూ వుంది[15].

చాళుక్య విజయాదిత్యుని తరువాత రెండవ విక్రమాదిత్యుడు సింహాసనాన్ని అధిష్ఠించినాడు (క్రీ.శ. 733-44). ఇతడు అనేక యుద్ధాలలో విజయాన్ని సాధించినాడు. తన కుమారుడైన రెండవ కీర్తివర్మను (క్రీ.శ. 744-57) పల్లవ రాజ్యంపై దండయాత్రకు పంపినాడు. అందులో కీర్తివర్మ విజయాన్ని సాధించినాడు. కొత్రపాడులోని శివాలయం పైకప్పులోని రాతిపై చెక్కబడిన ఒక శాసనం కీర్తివర్మ సత్యాశ్రయ పృథివీవల్లభ మహారాజుకు సామంతుడైన పెర్బాణాధిరాజు కొట్టి పఱితిలో ఆదిత్యభట్టారనికి రాజమానంలో నాలుగు మఱుతుల నేలను ఇచ్చినట్లు తెలుపుతూ వుంది[16]. ఈ జిల్లా వాయువ్య ప్రాంతంలో బాదామి చాళుక్యులకు సంబంధించిన ఇంకా కొన్ని శాసనాలున్నాయి. రాష్ట్రకూట వంశస్థాపకుడు దంతిదుర్గ మహారాజుతో చేసిన యుద్ధంలో క్రీ.శ. 757లో రెండవ కీర్తివర్మ మరణించడంతో ఈ చాళుక్య వంశం అంతరించింది.

## 6. రేనాటి చోళులు

క్రీ.శ. 6వ శతాబ్ది నుండి క్రీ.శ. 10వ శతాబ్ది వరకు కడప మండలం కరికాల చోళుని వంశం వాళ్లమని చెప్పుకున్న ఒక చోళ శాఖ పరిపాలనలో వుండేది. ఈ చోళులు మనకు తెలిసిన మొట్టమొదటి ప్రాంతీయ రాజవంశం. వీరు పాలించిన ప్రాంతమైన 'రేనాడు' పేరుతో వీరిని రేనాటిచోళులని ఆధునిక పండితులు వ్యవహరిస్తున్నారు. 'రేనాడు' నేటి కడప జిల్లాలోని ప్రొద్దుటూరు, కమలాపురం, జమ్మలమడుగు తాలూకాలు; కర్నూలు జిల్లా కోయిలకుంట్ల తాలూకాలోని కొన్ని భాగాలతో కలిసి ఏడువేల గ్రామాలున్న మండలం. ఇక్కడి నుండి రేనాటి చోళులు తమ రాజ్యాన్ని తూర్పున రాజంపేట తాలూకా పొత్తపి వైపుకు; పడమట కర్ణాటక లోని తుంకూరు జిల్లా పావుగడ తాలూకాలోని నిడుగల్లు, ఎరిగల్‌వాడి వైపుకు విస్తరింపజేసినారు[17].

వీరి చరిత్రను తెలుసుకోవడానికి శాసనాలే ఆధారం. జమ్మలమడుగు, కమలాపురం,

ప్రొద్దుటూరు తాలూకాలలో వీరికి సంబంధించిన అనేక శాసనాలున్నాయి. ఇప్పటివరకు వీరికి సంబంధించిన 50 శిలా శాసనాలు, నాలుగు తామ్ర శాసనాలు లభ్యమైనాయి. వీరి శిలా శాసనాలన్నీ దాన శాసనాలే. శిలా శాసనాలు ఎక్కువ సంఖ్యలో లభిస్తున్నా ఈ శాసనాల ద్వారా దానకర్త, గ్రహీత, దానం - వీటికిమించి లభించే సమాచారం చాలా స్వల్పం. ఈ శాసనాలలో ప్రధానమైన భాగాలు ఎక్కువచోట్ల చెడిపోవడం వల్ల, ఎక్కువ శాసనాలు ప్రాచీనమైన తెలుగులో వుండడం వల్ల వీటినుండి సంతృప్తికరమైన విషయ సేకరణ చెయ్యడం కష్టం. వీరి చరిత్రను పునర్నిర్మించడానికి, చాలా తక్కువ సంఖ్యలో లభించినప్పటికీ, తామ్ర శాసనాలే ఎక్కువ ఉపకరిస్తున్నాయి. వీటిలో దానకర్త వంశవృక్షంతోపాటు ఆ వ్యక్తులకు సంబంధమున్న చారిత్రికాంశాలు కొన్ని సందర్భాలలో వివరించబడి వున్నాయి. రేనాటిచోళులకు సంబంధించి ఇప్పటివరకు నాలుగు తామ్ర శాసనాలు వెలుగులోకి వచ్చినాయి.

(1) పుణ్యకుమారుని మాలేపాడు తామ్ర శాసనం[18].

(2) పుణ్యకుమారుని దొమ్మరి నంద్యాల తామ్ర శాసనం[19].

(3) శ్రీకంఠచోళుని మద్రాస్ మ్యూజియం తామ్ర శాసనం[20].

(4) శ్రీకంఠమనోహరుని పెద్దచెప్పల్లి తామ్ర శాసనం[21].

పై నాలుగు తామ్ర శాసనాలలో మొదటి రెండు శాసనాలలో పేర్కొనబడిన వీరి వంశవృక్షం క్రిందివిధంగా వుంది.




తరువాతి రెండు శాసనాలలో పేర్కొనబడిన రేనాటిచోళుల వంశవృక్షం ఒకేవిధంగా వుంది. మద్రాస్ మ్యూజియం తామ్ర శాసనంలో కరికాలాన్వయంలోని సుందరనంద-నవరామ-ఎఱెయమ్మ-విజయకామ-వీరార్జున-అగ్రణిపిడుగు-కొకిళి-మహేంద్రవర్మ-ఎళంజోళ-నృపకామ-దివాకర-శ్రీకంఠచోళాధిరాజులు పేర్కొనబడినారు. పెద్ద చెప్పల్లి శాసనంలో దివాకరుడు పేర్కొనబడలేదు. చివరి రాజు శ్రీకంఠమనోహరుడు నృపకాముని కుమారునిగా చెప్పబడినాడు. ఈ రాజుల మధ్యవున్న సంబంధం ఈ శాసనాలలో ఇదమిత్థంగా చెప్పబడలేదు. దాదాపు అన్ని సందర్భాలలో వాడబడిన 'తత:' అన్న పదంతో వారిమధ్య పితా పుత్ర సంబంధాన్ని ఊహించడం కష్టం. పై నాలుగు తామ్ర శాసనాలను పరిశీలిస్తే మొదటి రెండు శాసనాలు

నందివర్మ మూడవ కుమారుడు ధనంజయుని వంశవృక్షాన్ని, తరువాతి రెండు శాసనాలు రెండవ కుమారుడు సుందరనందుని వంశవృక్షాన్ని పేర్కొన్నట్లు గమనించవచ్చు[22]. నందివర్మ మొదటి కుమారుడు సింహవిష్ణువుకు అతని కుమారులకు సంబంధించిన శాసనాలేవీ ఇంతవరకు లభించలేదు.

సాక్ష్యాధారాలు అనిశ్చితంగా వున్నందువల్ల రేనాటిచోళుల కాలక్రమణిక నిర్దిష్టంగా స్థిరీకరించబడలేదు. పెద్ద ముడియంలోని ఒక శాసనంలో[23] తప్ప వీరి శాసనాలలో ఏ శకానికి సంబంధించిన సంవత్సరమూ పేర్కొనబడలేదు. పెద్ద ముడియం శాసనంలో శాసన కాలాన్ని తెలిపే భాగం చెరిగిపోయి వుండడం వల్ల ఈ సమస్యను పరిష్కరించడానికి ఈ శాసనం కూడా ఏవిధంగానూ సహాయపడడం లేదు. పుణ్యకుమారుని తిప్పలూరు శాసనంలో[24] శాసన కాలానికి సంబంధించి 'కార్తీక చీకుర బిదియ సోమవారంబు పునరు పుష్యంబు బృహస్పతి హోరకాను ఏమ్బదియె చామణ కాలధ' అని చెప్పబడిన తిథి ఏ సంవత్సరానిదో పేర్కొనబడలేదు. కొందరు దీనిని బార్హస్పత్యమాసంలో గుణించాలని చెప్తున్నారు[25]. శాసనంలో చెప్పబడిన 'చామణకాల' అన్న పదం వ్యక్తి పేరును కాక సావన మానాన్ని సూచిస్తూ వుందేమో! ఏది ఏమైనా ఈ శాసనం కూడా వీరి కాలనిర్ణయానికి ఇంతవరకు సహాయపడలేదు. కాబట్టి ఈ వంశానికి చెందిన కాలక్రమణికను రూపొందించడానికి ఆ శాసనాలకు సంబంధించిన లేఖన సంప్రదాయాలు, శాసనాలలో పేర్కొనబడిన చారిత్రక సంఘటనలు మొదలైన పరోక్ష సాక్ష్యాలను ఆధారంగా స్వీకరించక తప్పదు. లేఖన సంప్రదాయాన్ని బట్టి మాలేపాడు తామ్ర శాసనం క్రీ.శ. 8వ శతాబ్దికి చెందినదిగా నిర్ణయించబడింది. ఈ శాసనం ప్రకటించబడినప్పటి నుండి రేనాటిచోళుల కాలక్రమణికకు ఇది నిశ్చితమైన ఆధారంగా పరిశోధకులు నిర్ణయించినారు.

లిపిశాస్త్రం అందిస్తున్న సాక్ష్యం అమోఘమైంది కాదు. ఇప్పుడున్న పరిజ్ఞానాన్ని బట్టి రేనాటిచోళులకు సంబంధించిన క్రమబద్ధమైన చరిత్రను సంకలనం చెయ్యడానికి వీలుకాదు. ఈ విషయంలో మనకు లభించిన సమాచారం చాలా స్వల్పం. శాసనాల ద్వారా సేకరించిన చారిత్రక సమాచారంలో పూరించడానికి సాధ్యం కాని ఖాళీలున్నాయి.

ఈ రాజుల శాసనాలను పరిష్కరించి ఎపిగ్రాఫియా ఇండికాలో ప్రకటించిన యం. వెంకట రామయ్య, ఆచార్య నీలకంఠశాస్త్రి గార్లు నందివర్మ నుండి ప్రారంభమైన వీరి కాలక్రమణికను రూపొందించినారు. నామ సామ్యాన్ని బట్టి క్రీ.శ. 6వ శతాబ్ది ప్రథమ పాదానికి చెందిన పల్లవరాజు నందివర్మకు ఈ నందివర్మ కొంత తక్కువ వయస్సు కలిగిన సమకాలికునిగాను, అతని సామంతునిగాను ఈ పండితులు అభిప్రాయపడినారు[26].

కొన్ని శాసనాలలో వీరి రాజధాని 'చెపఱలియ'గా చెప్పబడింది. దీనిని మదనపల్లి తాలూకాలోని 'చిప్పిలి'గా కొందరు పండితులు గుర్తించినారు[27]. కాని కమలాపురం తాలూకా లోని 'పెద్ద చెప్పల్లి' వీరి రాజధాని అని, ఈ ప్రాంతంలో ఒక తామ్ర శాసనంతో పాటు వీరికి సంబంధించిన అనేక శిలా శాసనాలు లభించడం ఆధారంగా పి.వి. పరబ్రహ్మ శాస్త్రి గారు

అభిప్రాయ పడుతున్నారు[28]. ఈ గ్రామంలో కోట ప్రాంతంలో బూడిద దిబ్బలున్న పొలాన్ని కోటచేను అని ఇప్పటికీ స్థానికులు వ్యవహరించడాన్ని బట్టి పై అభిప్రాయమే సరియైనదని విశ్వసించవచ్చు.

రేనాటిచోళులు తమ వంశానికి మూలపురుషునిగా చెప్పుకున్న కరికాల చోళుడు దక్షిణ భారతదేశ రాజులలో ప్రసిద్ధుడు. ఇతడు త్రిలోచన పల్లవుడు మొదలైన శత్రురాజులను ఓడించి వారిచేత కావేరీ నదికి ఆనకట్ట కట్టించినాడని, త్రైరాజ్య పల్లవ ప్రాంతాన్ని జయించినాడని శాసనాలు వర్ణిస్తున్నాయి[29]. రేనాటిచోళ వంశస్థాపకుడైన నందివర్మ కరికాలుని తరువాత ఎన్నవ తరంవాడో తెలియదు. కాని నందివర్మ కాలం నాటికి ఈ వంశస్థులు తమ పూర్వీకులకు సంబంధించిన కావేరీ ప్రాంతం నుండి ఉత్తర దిశగా ఆంధ్రదేశంలోకి వలస వచ్చి చెప్పలి, పొత్తపి ప్రాంతాలలో పల్లవులకు సామంతులుగా రాజ్యాలను ఏర్పరచుకున్నారు.

నందివర్మకు సింహవిష్ణు, సుందరనంద, ధనంజయులని ముగ్గురు కుమారులు. పుణ్యకుమారుని మాలేపాడు తామ్ర శాసనంలోని 'తే పుత్రానుపుత్ర్య మనుభూత రాజ్యశ్రియ:' అన్న దానినిబట్టి నందివర్మ తరువాత అతని కుమారులు రాజ్యాన్ని మూడు భాగాలుగా పంచుకొని పుత్రపౌత్ర పారంపర్యంగా పరిపాలించినారని కొందరు చరిత్రకారులు భావిస్తున్నారు. కాని ఈ అభిప్రాయాన్ని సమర్థించడానికి ఇతర ఆధారాలేవీ లభించలేదు. పుణ్యకుమారుని దొమ్మరి నంద్యాల తామ్ర శాసనంలో 'తేషా మానుపూర్వ్యానుభూత రాజ్యశ్రియాం' అని చెప్పబడి వుంది. దీనినిబట్టి మాలేపాడు శాసనంలోని 'పుత్రానుపుత్ర్యం' అనే మాటకు పుత్రుని తరువాత అతని పుత్రుడు రాజ్యాధికారాన్ని స్వీకరించినాడని అర్థం చేసుకోవాలి.

ఇంతవరకు గుర్తించిన శాసనాలలో పేర్కొనబడిన మొట్టమొదటి రేనాటిచోళ రాజు ధనంజయుడు. క్రీ.శ. 6వ శతాబ్ది చివరి పాదానికి చెందిన కలమళ్ల శాసనంలో[30] [ఎరి]కల్ ముతురాజు ధనంజయుడు రేనాడు ఏలుతున్న కాలంలో చిఱుంబూరి (చిలమకూరు) రేవణకాలు పంపున చెనూరుకాజు కొంతభూమిని దానమిచ్చినట్లు చెప్పబడింది. ఈ శాసనంలో చాలా భాగం శిథిలమైంది. ఈ కలమళ్ల శాసనం ఇంతవరకు లభించిన వాటిలో తొలి తెలుగు శాసనం.

ధనంజయుని తరువాత అతని కుమారుడు మహేంద్రవిక్రమవర్మ రాజ్యాధికారాన్ని స్వీకరించినాడు. ఇతడు వ్యాకరణాది శాస్త్ర పారంగతుడు. ఇతనికి ముదితశిలాక్షర, నవరామ, పాండ్య చోళ కేరళానా మధిపతి:, చోళ మహారాజ అనే బిరుదులున్నాయి[31]. ఇవి ఇతని గుణాలను, ఇతడు సాధించిన విజయాలను తెలియచేస్తున్నాయి. ఇతని రాజ్యకాలంలో రేనాడులో వ్యాపించిన అనేక శాసనాలు ఇతడు శాసనాలు వేయించడంలో ఎక్కువ ప్రీతి కలిగినవాడని తెలుపుతున్నాయి (ముదిత శిలాక్షర). ఇతడు యుద్ధంలో స్థిరంగా నిలిచేవాడని 'నవరామ' అనే బిరుదు సూచిస్తుంది. ఇతడు ధరించిన 'పాండ్య చోళ కేరళానా మధిపతి:' అనే బిరుదువల్ల ఇతడు పాండ్య, చోళ, కేరళ దేశాలకు లేదా ప్రజలకు ప్రభువు అని అర్థం

వస్తుంది. కాని ఈ ప్రాంతాలలో ఇతని పరిపాలనకు సంబంధించిన ఛాయలేవీ కనిపించడం లేదు. ఇతడు ఈ బిరుదాన్ని ఎలా ధరించినాడో తెలియదు. రెండు విధాలుగా దీన్ని సమర్థించవచ్చు. వంశపారంపర్యంగా లభించడం, లేదా ఈ ప్రాంతాలను జయించడం. ఇతని పూర్వీకులెవ్వరూ ఈ బిరుదాన్ని ధరించలేదు. గొప్ప బిరుదులు ధరించినా మహేంద్రవిక్రముడు పల్లవ సామ్రాజ్యంలోని ఒక ప్రాంతానికి సామంతరాజు మాత్రమే. స్వయంశక్తితో దక్షిణ భారతదేశాన్నంతా జయించడానికి తగిన సైన్య సంపత్తి ఇతనికి లేదు. అంతేకాక తన అధిరాజు అనుమతి, సహకారం లేకుండా దక్షిణ ప్రాంతాలపై దండయాత్ర చేయడానికి ఇతనికి వీలుకాదు. క్రీ.శ. 7-8వ శతాబ్దంలోని శాసనాలు బృహత్పల్లవ వంశ స్థాపకుడైన సింహవిష్ణువు కళభ్రులను పారద్రోలి చోళ, పాండ్య, కేరళ దేశాలను జయించినట్లు పేర్కొంటున్నాయి. సింహవిష్ణువుకు సామంతుడైన మహేంద్రవిక్రమవర్మకు కళభ్రులపై దండయాత్ర బాధ్యత అప్పగించబడింది. దండయాత్ర కాలంలో ఆక్రమించిన ప్రాంతాల పరిపాలనా వ్యవహారాలు చూడడానికి మహేంద్ర విక్రమవర్మ నియుక్తుడై వుండవచ్చు. ఇతడు 'పాండ్య, చోళ, కేరళానా మధిపతి:' అనే బిరుదాన్ని ధరించడానికి బహుశ: పై సంఘటనే కారణమని నిర్ణయించవచ్చు. 'పరిప్రాప్త చోళ మహారాజ శబ్ద:' అన్న పదబంధం వల్ల చోళ మహారాజ బిరుదాన్ని ఇతనికి వేరొకరు ఇచ్చినట్లు స్పష్టమౌతూ వుంది. దీనినిబట్టి కళభ్రులపై దండయాత్రలో ఇతని సేవలకు గుర్తింపుగా ఇతని అధిరాజు సింహవిష్ణువు, ఇతనికి ఈ బిరుదాన్ని ఇచ్చినట్లు ఊహించవచ్చు. ఈ సందర్భంలోనే రేనాడు ఏడువేలపై మహేంద్రవిక్రమచోళ మహారాజు అధికారం గుర్తించబడింది.

మహేంద్రవిక్రమవర్మకు గుణముదితుడు, పుణ్యకుమారుడు అని ఇద్దరు కుమారులు. పుణ్యకుమారుడు పరిపాలనా వ్యవహారాలలో ఇతనికి సహాయపడుతుండేవాడు. మహేంద్ర విక్రముని పరిపాలన కాలావధిని నిర్ణయించడానికి కావలసిన సమాచారం లభించలేదు. బహుశ: ఇతని అధిరాజు పల్లవరాజైన మొదటి మహేంద్రవర్మ కాలంలో ఇతడు మరణించి వుండవచ్చు. ఇతని మొదటి కుమారుడు గుణముదితుని ప్రస్తావన పుణ్యకుమారుని మాలేపాడు, దొమ్మరి నంద్యాల తామ్ర శాసనాలలో మాత్రమే వుంది. ఇతనికి సంబంధించిన శాసనాలేవీ ఇంతవరకు లభించలేదు. పై శాసనాలలో కూడా ఇతని పరిపాలనను గురించి ఏమీ పేర్కొనబడలేదు. అందువల్ల గుణముదితుని పాలనకు సంబంధించి గాని, ఆ కాలంలో జరిగిన సంఘటనలను గురించి గాని తెలియడం లేదు.

మహేంద్రవిక్రమవర్మ తరువాత అతని రెండవ కుమారుడైన పుణ్యకుమారుడు రాజ్యాధికారాన్ని స్వీకరించినాడు. ఇతడు రేనాటి చోళులలో ప్రసిద్ధుడు. మాలేపాడు, దొమ్మరి నంద్యాలలలో ఇతడు జారీచేసిన తామ్ర శాసనాలు లభ్యమైనాయి. తిప్పలూరు, వెల్దుర్తి, రామేశ్వరం గ్రామాలలో ఇతడు జారీచేసిన శిలాశాసనాలున్నాయి. ఇతనికి పోర్ముఖరామ, పురుష శార్దూల, మార్దవచిత్త, మదనవిలాస, మఋుత్స్ర పిడుగు, మదముదిత అనే బిరుదులున్నాయి. పుణ్యకుమారుడు సింహాసనాన్ని అధిష్ఠించిన కొంతకాలానికే పల్లవరాజు మొదటి మహేంద్రవర్మ మరణించినాడు. అతని తరువాత రాజైన అతని కుమారుడు మొదటి నరసింహవర్మ

యువకుడు, అనుభవం లేనివాడు కావడంవల్ల ఆ అవకాశాన్ని ఉపయోగించుకొని చాళుక్యరాజు రెండవ పులకేశి, పల్లవ రాజ్యంపై దండెత్తినాడు. పల్లవరాజు అతనిని ఎదుర్కొని తన రాజ్య భాగాలను రక్షించుకోలేక పోయినాడు. అతని అధికారం బలహీనమైంది. సామంతరాజులు స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకున్నారు. ఈ స్థితిలో చాళుక్యరాజ్య సరిహద్దు ప్రాంతాన్ని పాలిస్తున్న పుణ్యకుమారుడు ఈ అవకాశాన్ని వినియోగించుకున్నాడు. తన రాణి, చాళుక్యుల రాజకుమారి అయిన వసన్తిపోఱి సహాయంతో పుణ్యకుమారుడు చాళుక్యులతో పొత్తు కుదుర్చుకున్నాడు. చాళుక్యులకు సంబంధించిన 'పృథివీ వల్లభ' అనే బిరుదాన్ని ధరించి[32], తన స్వంత రాజ్య సంవత్సరాన్ని పేర్కొంటూ శాసనాలను జారీ చేసినాడు[33]. ఈ అంశాలు ఇతని హోదా సామంతరాజు నుండి స్వతంత్ర ప్రభువు స్థితికి పెరిగినట్లు సూచిస్తున్నాయి.

పుణ్యకుమారుడు హిరణ్య రాష్ట్రాన్ని ఆక్రమించుకోవడం అతని పరిపాలనా కాలంలో జరిగిన ఒక ముఖ్య సంఘటన. ఇది పుణ్య కుమారుని ఐదవ రాజ్యసంవత్సరంలో జరిగింది. ఆ సంవత్సరంలో ఇతడు జారీచేసిన మాలేపాడు తామ్ర శాసనంలోని 'హిరణ్య రాష్ట్ర సహిత స్వరాష్ట్ర నివాసిన:' అనే మాటలవల్ల హిరణ్య రాష్ట్రం అతని రాజ్యంలో భాగమని గుర్తించవచ్చు. అంతేకాక అతని పదవ రాజ్యసంవత్సరంలో జారీచేసిన దొమ్మరి నంద్యాల తామ్ర శాసనంలో ఇతడు హిరణ్య రాష్ట్రాధిపతిగా పేర్కొనబడడం ఈ విషయాన్ని ధ్రువీకరిస్తూ వుంది.

పుణ్యకుమారుడు తన స్వాతంత్ర్యాన్ని ఎక్కువ కాలం నిలుపుకోలేక పోయినాడు. ఇతని రాజ్యం పల్లవ, చాళుక్య సంఘర్షణలో చిక్కుకుని వారికి యుద్ధభూమిగా మారింది. క్రీ.శ. 642లో రెండవ పులకేశి పల్లవరాజ్యం పైకి రెండవసారి దండయాత్ర చేసినాడు. కాని ఈ యుద్ధంలో పల్లవ నరసింహవర్మ పులకేశిని రాజధానికి తరిమి కొట్టినాడు. తన రాజధానిని రక్షించుకోవడానికి చేసిన యుద్ధంలో రెండవ పులకేశి మరణించినాడు. ఈ అపజయంతో చాళుక్య రాజ్యం విచ్ఛిన్నమై అందులో చాలా భాగం పల్లవ సామ్రాజ్యంలోకి కలుపబడింది. చాళుక్యుల పక్షాన వున్న పుణ్యకుమారుడు కూడ ఈ దురదృష్టాన్ని పంచుకోవలసి వచ్చింది. పుణ్యకుమారుడు తన రాజ్యాన్ని కోల్పోయి, దేశం నుండి వెళ్లగొట్టబడినాడు. 12 సంవత్సరాల పాటు పల్లవులు చాళుక్యుల భూభాగాలపై ఆధిపత్యం చెలాయించినారు. ఈ కాలంలో పులకేశి కుమారుడు మొదటి విక్రమాదిత్యుడు తన తండ్రి పోగొట్టుకున్న సామ్రాజ్యాన్ని తిరిగి సంపాదించడానికి తీవ్రంగా ప్రయత్నించి పల్లవులపై విజయాన్ని సాధించడమే కాక తన తండ్రి సామ్రాజ్యానికి సార్వభౌమాధికారిగా గుర్తించబడినాడు. విక్రమాదిత్యుని విజయయాత్రలో పుణ్యకుమారుడు కూడ పాల్గొన్నాడు. మొదటి విక్రమాదిత్యుని ప్రథమ రాజ్యసంవత్సరానికి (క్రీ.శ. 655) చెందిన తిప్పలూరు శాసనంలో[34] పుణ్యకుమారుడు మొదటి విక్రమాదిత్యుని సామంతునిగా బాణ రాజ్యాన్ని పరిపాలిస్తున్నట్లు చెప్పబడింది. పల్లవుల ఆక్రమణ కాలంలో రేనాడు బాణుల ఆధిపత్యంలో వుండేది. విక్రమాదిత్యుడు తన దండయాత్రలో పల్లవ సామంతులైన బాణులను జయించినాడు. ఈ సంఘటనల తర్వాత పుణ్యకుమారుని గురించిన

వివరాలేవీ తెలియడం లేదు.

పుణ్యకుమారుని తరువాత రేనాటిచోళుల చరిత్రను క్రమబద్ధంగా పునర్నిర్మించడానికి వీలుకాదు. అతని వారసుల పేర్లు కాని, వారి వారసత్వ క్రమం కాని తెలియడం లేదు. కాని కాలనిర్ణయం లేని అనేక శాసనాలలో ఈ వంశానికి చెందిన చాలామంది రాజుల పేర్లు ప్రస్తావించబడినాయి. ఈ రాజులు పుణ్యకుమారుని సంతతికి సంబంధించిన వారైందీ లేక అతని పెదతండ్రులైన సింహవిష్ణు, సుందరనందుల సంతతి వారైందీ తెలియడం లేదు. మాలేపాడు లోని ఒక శాసనంలో[35] చోళ మహారాజాధిరాజ పరమేశ్వర విక్రమాదిత్య శక్తి కొమర విక్రమాదిత్యుని కుమారుడు సత్యాదిత్యుడు రేనాడు ఏడువేలు, సిద్ధివేయిని పరిపాలిస్తున్నట్లు చెప్పబడింది. ఈ శాసనంలో (మొదటి) విక్రమాదిత్య – శక్తికొమర - (రెండవ) విక్రమాదిత్య-సత్యాదిత్య అనే నాలుగు తరాల వారసత్వ క్రమం చెప్పబడింది. మాలేపాడు, దొమ్మరి నంద్యాల, మద్రాస్ మ్యూజియం తామ్ర శాసనాలలో కనిపించిన విక్రమాదిత్య నామం ఈ నాలుగు తరాలలో రెండు పర్యాయాలు ఆవృతం కావడం మరియు సత్యాదిత్య నామంలో వున్న ఆదిత్య అనే నామబంధం – ఈ రాజులు బాదామి చాళుక్యులకు సామంతులనే విషయాన్ని సూచిస్తున్నాయి. సత్యాదిత్యుడు ధరించిన చోళ మహారాజాధిరాజ పరమేశ్వర అనే బిరుదు క్రీ.శ. 8వ శతాబ్దిలో చాళుక్యుల పతనానంతరం ఇతడు రాజ్యాధికారాన్ని స్వీకరించినట్లు తెలియజేస్తూ వుంది. చిలమకూరు లోని ఒక శాసనంలో[36] పైన పేర్కొనబడిన ఇద్దరు విక్రమాదిత్యులలో ఒక విక్రమాదిత్యుడు పేర్కొనబడినాడు. ఈ శాసనంలో ఈ వంశానికి చెందిన ఎళంజోళ మహాదేవులు, ఉత్తమాదిత్య సామంతక అనే ఇద్దరు వ్యక్తులు కూడ పేర్కొనబడినారు. ఇందులో మొదటి వ్యక్తి మెయిళ్ల చెఱువు శాసనంలో[37] పేర్కొనబడిన ఎళంజోళ మహారాజుయొక్క రాణి అనే విషయం స్పష్టం. రెండవ వ్యక్తిని వెల్దుర్తి శాసనంలో[38] పేర్కొనబడిన ఉత్తమాదిత్యచోళ మహారాజుగా గుర్తించవచ్చు. ఇప్పుడు లభిస్తున్న ఆధారాలను బట్టి వీరికి విక్రమాదిత్యునితో వున్న సంబంధాన్ని నిర్ధారించలేము. వేల్పుచర్లలోని 'అరిదుర్ధరవర' ప్రశస్తితో వున్న శాసనంలోని[39] మనుచోళుడు, 'చరణసరోరుహ విహిత విలోచన' ప్రశస్తితో వున్న శాసనంలోని[40] మహీచోళ మహారాజు విక్రమాదిత్యునికి తరువాతివారని స్పష్టంగా తెలుస్తూ వుంది. అంతేకాక వీరి ప్రశస్తులను బట్టి వీరిరువురు రేనాటిచోళులలోని భిన్న శాఖలకు చెందినవారని స్పష్టమౌతూ వుంది.

మద్రాస్ మ్యూజియం తామ్ర శాసనంలోను, పెద్దచెప్పల్లి తామ్ర శాసనంలోను శ్రీకంఠచోళుని ప్రసక్తి వుంది. ఈ శాసనాల వల్ల ఇతనికి పూర్వం సుందరనంద, నవరామ, ఎరియమ్మ, విజయకామ, వీరార్జున, అగ్రణిపిడుగు, కొకిళి, మహేంద్రవర్మ, ఎళంజోళ, నృపకామ, దివాకర – అనే పదకొండు మంది రాజులు పరిపాలించినట్లు తెలుస్తూ వుంది. ఈ రాజులు నందివర్మ రెండవ కుమారుడైన సుందరనందుని సంతతివారు. మద్రాస్ మ్యూజియం తామ్ర శాసనం శ్రీకంఠచోళునికి 'చోళధీర' అనే బిరుదు వున్నట్లు, ఇతడు అనేక

యుద్ధాలలో విజయాన్ని సాధించినట్లు తెలుపుతూ వుంది. శ్రీకంఠమనోహరుడు నృపకాముని కుమారుడని పెద్దచెప్పల్లి శాసనంలో చెప్పబడింది. ఒక ప్రాచీన పాండ్య శాసనంలో పొత్తపిచోళ రాజైన శ్రీకంఠుడు, పాండ్యరాజు రెండవ వరగుణవర్మకు మాతామహుడని చెప్పబడింది. పరిపాలనా కాలాన్ని బట్టి, పరిపాలించిన ప్రాంతాన్ని బట్టి ఈ శ్రీకంఠుడు రేనాటిచోళరాజైన శ్రీకంఠుడే అని పండితుల అభిప్రాయం[41].

శ్రీకంఠుని తరువాత మనకు తెలిసిన రేనాటిచోళరాజు బల్లియచోళ మహారాజు. ఇతడు మద్రాస్ మ్యూజియం తామ్ర శాసనంలో[42] మాత్రమే పేర్కొనబడినాడు. ఈ శాసనంలో ఇతనికి సంబంధించిన వివరాలేవీ నమోదు చేయబడలేదు. "చరణ సరోరుహ విహిత విలోచన" ప్రశస్తితో శాసనాలు జారీచేసిన మొదటి తెలుగుచోళ మహారాజు ఇతడేనని, నెల్లూరు, కడప జిల్లాలను పరిపాలించిన మలి తెలుగుచోళుల పూర్వీకుడని భావించవచ్చు[43].

జటాచోడ మహారాజు రేనాటిచోళులలో చివరివాడు. ఇతని రాజ్యపాలన కాలానికి సంబంధించి ఒక శాసనం మాత్రమే ఇంతవరకు వెలుగులోకి వచ్చింది. మిడుతూరులో వున్న ఈ శాసనం[44] "హరిదుర్ధరవర" ప్రశస్తితో ప్రారంభమైంది. కలురేడు కయ్యం జరుగుతున్న సందర్భంలో జటాచోడుడు అయితశర్మ అనే బ్రాహ్మణునికి మద్దపూరు (మిడుతూరు)లో రాచమానంలో ఎనభై మఱుతుర్ల నేలను ఇచ్చినట్లు పై శాసనంలో చెప్పబడింది. వైదుంబరాజు గండత్రిణేత్రునికి సంబంధించిన అనిమెల శాసనంలో[45] జటాచోడుని ప్రస్తావన వుంది. కాని ఈ శాసనంలో చాలాభాగం శిథిలమైనందువల్ల ఇందులో పేర్కొనబడిన దానంతో జటాచోడునికున్న సంబంధం తెలియడం లేదు. కాని ఇతడు వైదుంబ రాజుకు సమకాలికుడనే విషయం స్పష్టమౌతూ వుంది.

జటాచోడుడు, అతని కుమారుడైన భీమునికి సంబంధించిన కంచి రాజసింహేశ్వర దేవాలయ శాసనంలో[46] కూడ ప్రస్తావించబడినాడు. ఈ శాసనం శా.శ. 924 (క్రీ.శ. 1002) నాటిది. ఈ శాసనం జటాచోడునికి సంబంధించిన సమాచారాన్ని అందించకపోయినా అతని కాలాన్ని నిర్ణయించడానికి ఉపకరిస్తుంది. భీముడు ఈ శాసనంలో తన తండ్రిని రేనాటి పాలకునిగా కాక పెండేకల్లు పాలకునిగా చెప్పడం వల్ల జటాచోడుడు రేనాటి నుండి వెళ్లగొట్టబడి పెండేకల్లు ప్రాంతంలో రాజ్యాన్ని ఏర్పరచుకున్నట్లు ఊహించవచ్చు. ఇతనిని రేనాటి నుండి వెళ్లగొట్టిన రాజు వైదుంబ రాజైన గండత్రిణేత్రుడు కాని, అతని కుమారుడు భువనత్రిణేత్రుడు కాని కావచ్చు. జటాచోడుని కుమారుడైన భీముడు అధికారానికి వచ్చిన వెంటనే దండయాత్ర చేసి ఓడించిన మొదటి రాజు వైదుంబ మహారాజు కావడం ఈ విషయాన్ని ధ్రువీకరిస్తూ వుంది. భీముడు ధరించిన "చోళ త్రిణేత్ర" బిరుదు ఇతడు ఓడించిన వైదుంబరాజు త్రిణేత్ర అనే పేరు కలవాడని సూచిస్తూ వుంది. ఈ వైదుంబరాజు శా.శ. 894 (క్రీ.శ. 972)వ సంవత్సరంలో పట్టభద్రుడైనట్లు ఉప్పరపల్లి శాసనంలో[47] చెప్పబడిన భువనత్రిణేత్రుడు కావచ్చు.

జటాచోడుని కుమారుడైన భీముడు గొప్ప వీరుడు. ఇతడు చోళ వంశ గౌరవాన్ని

దక్షిణాపథ మంతటా విస్తరింపచేసినాడు. భీముడు మొదట, రాష్ట్రకూట చక్రవర్తి మూడవ కృష్ణునికి సామంతుడు. చక్రవర్తి మరణంతో రాష్ట్రకూట సామ్రాజ్యం విచ్ఛిన్నం కావడం అవకాశంగా తీసుకొని భీముడు తన అధికారాన్ని త్వరితగతిలో పెంపొందించుకున్నాడు. మొట్టమొదట ఇతడు వైదుంబరాజు భువనత్రిణేత్రుని ఓడించి తన పూర్వికుల రాజ్యమైన రేనాడును ఆక్రమించుకున్నాడు. కాని ఈ ప్రాంతంలో తన అధికారాన్ని పునర్వ్యవస్థీకరించే ప్రయత్నం చేసినట్లు కనిపించడం లేదు. తరువాత ఇతని దృష్టి వేంగీ రాజ్యం పైకి మళ్లింది. భీముని బావమరిది, వేంగీ చాళుక్యరాజు, రెండవ అమ్మరాజును ఇతని సవతి సోదరుడైన దానార్ణవుడు యుద్ధంలో వధించి సింహాసనాన్ని ఆక్రమించుకొని క్రీ.శ. 970 నుండి 73 వరకు మూడు సంవత్సరాలు పరిపాలించినాడు. తన చెల్లెలు విధవయైన కారణంగా భీముడు వేంగీ రాజ్యంపై దండెత్తి దానార్ణవుని, అతని కుమారులను రాజ్యం నుండి పారద్రోలి తూర్పు చాళుక్య సామ్రాజ్యాధికారాన్ని చేపట్టి 28 సంవత్సరాలు నిరాఘాటంగా పరిపాలన సాగించినాడు. కళింగం నుండి కాంచీపురం వరకు గల తీరాంధ్ర ప్రాంతంలో ఇతని అధికారం గుర్తించబడింది. భీమునికి తంజావూరును పరిపాలిస్తున్న నవీన చోళులతో వైరం ఏర్పడింది. క్రీ.శ. 985లో సింహాసనాన్ని అధిష్ఠించిన మొదటి రాజరాజు సామ్రాజ్య విస్తరణ కాంక్ష కలిగినవాడు. ఇతడు ఆంధ్ర దేశాన్నంతా తన ఆధిపత్యంలోకి తెచ్చుకోవాలనుకున్నాడు. అందువల్ల రాజరాజు, దానార్ణవుని కుమారులతో వివాహసంబంధాలు ఏర్పరచుకొని వారిని వారి పూర్వికుల రాజ్యంలో పునస్థాపితులను చేసి క్రీ.శ. 999లో వేంగీ రాజ్యంపై దండెత్తినాడు. కాని ఈ దండయాత్రను భీముడు సమర్థతతో ఎదుర్కొని దానార్ణవుని కుమారులను తరిమికొట్టి చోళ సామ్రాజ్యంలో అలజడి సృష్టించి కాంచీ పట్టణాన్ని ఆక్రమించుకున్నాడు. భీముడు ఈ విజయాన్ని ప్రకటిస్తూ కంచిలో ఒక శాసనాన్ని వేయించినాడు[48]. రాజరాజు భీముని ఓడించడానికి పెద్ద సైన్యాన్ని సమీకరించుకొని రెండవసారి వేంగీ రాజ్యంపై దండెత్తినాడు. ఈ యుద్ధంలో భీముడు మరణించడంతో రేనాటిచోళ వంశం అంతరించింది.

## *7.* బాణులు

పురాణ ప్రసిద్ధుడైన రాక్షసరాజు మహాబలి వంశం వాళ్లమని బాణులు చెప్పుకున్నారు. వీరి చరిత్ర క్రీ.శ. నాలుగవ శతాబ్ది మధ్యప్రాంతం నుండి తెలుస్తూ వుంది. ఈ కాలంలో కదంబ మయూరవర్మ కప్పం కట్టించుకున్న రాజులలో ఒక పెర్బాణరాజు వున్నాడు. బాణులు ఇప్పటి కడప, అనంతపురం, చిత్తూరు, కోలారు జిల్లాలలో కొన్ని ప్రాంతాలను పరిపాలించినట్లు తెలుస్తూ వుంది. రేనాడు ఏడువేల ప్రాంతాన్నంతటినీ చోళ మహారాజులు పరిపాలిస్తున్నట్లు వారి శాసనాలు పేర్కొంటున్నప్పటికీ ఇప్పటి కమలాపురం, జమ్మలమడుగు తాలూకాలలోని కొన్ని ప్రాంతాలు పెర్బాణ వంశస్థుల అధీనంలో వుండినట్లు కొన్ని శాసనాలు తెలియజేస్తున్నాయి. వీరు కొంతకాలం పల్లవులకు, తరువాత చాళుక్యులకు సామంతులుగా వున్నారు. పల్లవ, చాళుక్య ఘర్షణలలో బాణులు పల్లవుల పక్షంలో యుద్ధం చేసినారు. నరసింహవర్మ, రెండవ

పులకేశిని ఓడించి చాళుక్య రాజ్యాన్ని ఆక్రమించిన తరువాత (క్రీ.శ. 642) బాణులు పల్లవులకు సామంతులుగా రేనాడును దాదాపు పన్నెండు సంవత్సరాలు పరిపాలించినారు.

రెండవ పులకేశి కుమారుడు మొదటి విక్రమాదిత్యుడు క్రీ.శ. 654లో పల్లవ సామ్రాజ్యంపై దండయాత్ర చేసి తన తండ్రి పోగొట్టుకున్న రాజ్యాన్ని తిరిగి సంపాదించుకున్నాడు. ఈ దండయాత్రలో విక్రమాదిత్యుడు, పల్లవులకు సామంతులుగా రేనాడును పరిపాలిస్తున్న బాణులను ఓడించి వారి రాజ్యాన్ని రేనాటిచోళ రాజైన పుణ్యకుమారునికి ఇచ్చినాడు. విక్రమాదిత్యుని ప్రథమ రాజ్యసంవత్సరంలో జారీచేయబడిన తిప్పలూరు శాసనం[49], పెన్నా నది వరకు విస్తరించి వున్న బాణ రాజ్యానికి అధిపతిగా విక్రమాదిత్యుడు పోర్మ్ముఖరాముని (పుణ్యకుమారుని?) నియమించినట్లు తెలుపుతూ వుంది. ఈ అపజయం తరువాత బాణులు రేనాడు సరిహద్దులోని తురుమర విషయాన్ని పరిపాలించినారు.

మొదటి విక్రమాదిత్యుని మనుమడు విజయాదిత్యుని కాలం నుండి రెండవ కీర్తివర్మ మరణంతో చాళుక్య వంశం అంతరించినంత వరకు బాణులు చాళుక్యులకు సామంతులుగా వుండినట్లు తెలుస్తూవుంది. క్రీ.శ. 8వ శతాబ్ది నాటి సుంకేసుల శాసనం[50] విజయాదిత్య సత్యాశ్రయ పృథివీవల్లభ మహారాజుకు (క్రీ.శ. 696-733) సామంతుడైన బాణరాజు తురుమర విషయాన్ని ఏలుతూవుండి పెన్నకు దక్షిణ భాగంలోని రేనాడును జయించినట్లు తెలుపుతూ వుంది. క్రీ.శ. 8వ శతాబ్ది నాటి కొట్టపాడు శాసనంలో[51] చాళుక్య కీర్తివర్మకు సామంతుడైన పెర్బాణాధిరాజు వఌగి ప్రాంతాన్ని ఏలుతూ వుండి కొట్టపఱితిలోని ఆదిత్య భటారనికి నాలుగు మఱుతుల నేలను ఇచ్చినట్లు చెప్పబడింది. ఈ గ్రామంలోని కాల నిర్ణయం లేని ఇంకొక శిథిల శాసనంలో[52] ఒక పెర్బాణాధిరాజు పేర్కొనబడినాడు. క్రీ.శ. 9వ శతాబ్ది నాటి బలపనూరు శాసనంలో[53] ధవళెయరాజు, కామయ్య అనే వ్యక్తికి రాజమానంతో నూరు మఱుతుల నేలను ఇచ్చినట్లు నమోదు చేయబడింది. ఈ గ్రామంలోని ఈ కాలానికే చెందిన ఇంకొక శాసనం[54] ధవళెయరాజు, బాణ వంశస్థుడని తెలియజేస్తూ వుంది. ఈ శాసనం ధవళెయరాజును 'జగత్రియభివన్దిత సురాసురాధీశ పరమేశ్వర ప్రతీహారీకృత మహాభలి కులోద్భవు'డని అభివర్ణించింది. ఊడవగండ్లలోని ఒక శాసనం[55] 'అగ్గప' అనే బాణరాజు ఈ ప్రాంతాన్ని పరిపాలిస్తున్నట్లు తెలియజేస్తూ వుంది. ధవళెయ, అగ్గపలు కొంతకాలం రాష్ట్రకూటులకు సామంతులుగా వుండి వారి పతనానంతరం స్వతంత్రించినారు.

## 8. వైదుంబులు

కడప జిల్లాతో సంబంధమున్న మాండలిక రాజ వంశాలలో వైదుంబులు ఒకరు. వీరు ఈ ప్రాంతంలోకి విజేతలుగా వచ్చినారు. వీరి రాజ్యం కడప జిల్లాలోని ప్రొద్దుటూరు నుండి కర్ణాటకలోని కోలార్ వరకు విస్తరించి వుండేది. కడప, చిత్తూరు, అనంతపురం, కోలారు జిల్లాలలో వీరికి సంబంధించిన శాసనాలు లభించినాయి. వీరికి సంబంధించి ఒక తామ్ర శాసనం, దాదాపు అరవై శిలా శాసనాలు ఇప్పటివరకు వెలుగులోకి వచ్చినాయి. కడప జిల్లాలో

వీరికి సంబంధించిన ఇరవై శాసనాలు క్రీ.శ. 9 లేదా 10వ శతాబ్ది తెలుగు కన్నడ లిపి లక్షణాలను కలిగి వున్నాయి. శాసనాలలో వీరి వంశ ప్రశస్తి "స్వస్త్యనేక సమర సంఘట్టణోపలబ్ధ జయలక్ష్మీ సమాలింగిత వక్షస్థళ . . . శ్రీవైదుంబ . . ." ఇత్యాదిగా వుంది.

వైదుంబులు యుద్ధప్రియులు. వీరు తమ పొరుగు రాజులైన బాణులు, రేనాటి చోళులు, నోలంబులతో తరచుగా యుద్ధాలు చేసినట్లు శాసనాలు తెలియజేస్తున్నాయి. వీరి శాసనాలలో చాలవరకు యుద్ధాలలో మరణించిన వీరుల స్మృత్యర్థం నిలిపిన వీరగల్లులు. ప్రాచీనమైన వీరగల్లులలో శాసనకాలం పేర్కొనబడకపోవడంవల్ల ఈ రాజుల కాలానుక్రమణికను రూపొందించడానికి వీలుకావడం లేదు. వీరి శాసనాలు, శాసనాన్ని జారీచేసిన రాజును తప్ప వారి పూర్వీకులను పేర్కొనకపోవడం వల్ల వీరి వంశవృక్షాన్ని పునర్నిర్మించడానికి కూడా సాధ్యం కాదు. ఈ శాసనాలు ప్రాచీనమైన భాషలో వుండడం వల్ల చాలా పదాలకు ఇప్పుడు అర్థం తెలియడం లేదు.

వైదుంబులు, రేనాటిచోళులను జయించి ఈ ప్రాంతాన్ని ఆక్రమించుకొని స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించినారు. చిత్తూరు జిల్లాలోని 'వైదుంబప్రోలు' వీరి తొలి రాజధాని కావచ్చునని పండితులు అభిప్రాయపడుతున్నారు. రేనాటిచోళులను జయించిన తరువాత వీరి రాజధానిని మదనపల్లి తాలూకాలోని 'చిప్పిలి'కి, ఆ తరువాత రాజంపేట తాలూకాలోని 'పొత్తపి'కి మార్చుకున్నారు. వీరు రేనాడు ఏడువేలను (నేటి ప్రొద్దుటూరు, కమలాపురం, జమ్మలమడుగు, పులివెందల తాలూకాలు; కర్నూలు జిల్లా కోయిలకుంట్ల తాలూకాలోని కొన్ని ప్రాంతాలు) పాలిస్తున్నట్లు చెప్పుకున్నప్పటికీ, మదనపల్లి, వాయిల్పాడు, రాజంపేట తాలూకాలు, కోలార్ జిల్లాలోని కొన్ని ప్రాంతాలలో వీరి అధికారం విస్తరించినట్లు ఆ ప్రాంతాలలో వీరు జారీచేసిన శాసనాలను బట్టి చెప్పవచ్చు. తరువాతి తరాలకు చెందిన కొందరు రాజులు మాత్రమే పైన పేర్కొనబడిన ప్రాంతాలతోపాటు కమలాపురం, జమ్మలమడుగు, కడప తాలూకాలను కూడా పరిపాలించినారు.

చిత్తూరు జిల్లా, మదనపల్లి తాలూకా రామానాయనికోట శాసనం[56] ఇంతవరకు లభించిన వైదుంబుల శాసనాలలో ప్రాచీనమైంది. లిపిశాస్త్రాన్నిబట్టి ఈ శాసనం క్రీ.శ. 8వ శతాబ్ది నాటిదిగా నిర్ణయించబడింది. కొటూరు యుద్ధంలో ఒక వీరుని మరణాన్ని నమోదు చేసిన ఈ శాసనంలో వైదుంబ మహారాజు పేర్కొనబడినాడు. వైదుంబ మహారాజును పేర్కొంటున్న ఈ కాలానికే చెందిన ఆలేటిపల్లె శాసనం[57] మహారాజు సేవకుడైన 'శ్రీకంకి' అనే వీరుడు బాణులులతో జరిగిన తిరువూళ కయ్యంలో మరణించిన విషయాన్ని నమోదు చేసింది. కాని 'వైదుంబ మహారాజ' శబ్దం ఈ వంశంలోని రాజులందరికీ సంబంధించింది కావటం వల్ల ప్రత్యేకించి ఏ రాజును పేర్కొంటూవుందో చెప్పడం కష్టం. అయినప్పటికీ పైన చెప్పబడిన ఆధారాలను బట్టి కొటూరు, తిరువూళ యుద్ధాలను పేర్కొంటున్న శాసనాలు వైదుంబుల తొలిదశ లోనివని, అవి క్రీ.శ. 9వ శతాబ్ది ప్రథమ పాదానికి చెందినవని చెప్పవచ్చు.

ఈ జిల్లాలోని అరిబల్లి శాసనం[58] [గణ్డ] త్రినేత్ర బీర మహారాజును పేర్కొంటూ వుంది. ఈ శాసనంలో, తిరువూళ కయ్యంలో మరణించిన ఒక వీరుని శిల్పం, అతని మరణానికి సంబంధించిన కథనం వున్నాయి. దీనిని బట్టి రామానాయనికోట శాసనం, తిరువూళ కయ్యం ప్రస్తావన వున్న ఆలేటిపల్లె శాసనం ఈ రాజుకు సంబంధించినవేనని చెప్పవచ్చు. వైదుంబ ప్రశస్తితో ప్రారంభమైన రెడ్డివారిపల్లె శాసనం[59] కూడా గణ్డత్రిణేత్ర శ్రీవీర మహారాజును పేర్కొంటూ వుంది. పై ఆధారాలను బట్టి రామానాయని కోట, ఆలేటిపల్లె శాసనాలలో పేర్కొనబడిన వైదుంబ మహారాజు, అరిబల్లి, రెడ్డివారిపల్లె శాసనాలలో పేర్కొనబడిన గండత్రిణేత్ర వీర మహారాజు ఒకరేనని స్పష్టమౌతూ వుంది.

రేనాడును పరిపాలించిన మొదటి వైదుంబ రాజు గండత్రిణేత్రుడు కావచ్చు. ఇతడు గొప్ప పరాక్రమశాలి. అనిమెలలోని ఈ రాజుకు సంబంధించిన ఒక శిథిల శాసనం[60] జటాచోడుని పేర్కొంటూ వుంది. జటాచోడుడు రేనాటిచోళులలో చివరిరాజు. ఇతనిని ఓడించి గండత్రిణేత్రుడు రేనాడు ఏడువేలను ఆక్రమించుకున్నాడని ప్రభుత్వ శాసన పరిశోధనాధికారి అభిప్రాయపడినారు[61].

గండత్రిణేత్రునికి సంబంధించిన బండపల్లి శాసనం[62] సోరమేటి కోట ముట్టడిని, అందులో పాల్గొన్న రాజులను పేర్కొంటూ వుంది. ఈ యుద్ధంలో వైదుంబ గండత్రిణేత్రుడు, బాణరాజు ఒక పక్షంలోను; రాచమల్ల, నోళంబి, మైన్డడి, దడిగ ఇంకొక పక్షంలోను పాల్గొన్నారు. ఈ యుద్ధంలో గండత్రిణేత్రుడు సోరమేటి కోటను ఆక్రమించుకొని విజయాన్ని సాధించినాడు. ఈ యుద్ధంలో మరణించిన వీరుల స్మృత్యర్థం వేయించిన అనేక శాసనాలు ఈ యుద్ధాన్ని పేర్కొంటున్నాయి. 'సోరమేటి' అనంతపురం జిల్లాలోని 'చోళెమఱ్ఱి'గా గుర్తించబడింది.

ఈ యుద్ధం జరిగిన కాలాన్ని గురించి, ఇందులో పాల్గొన్న రాజులను గుర్తించడంలోను పండితులమధ్య భిన్నాభిప్రాయా లున్నాయి. ఈ యుద్ధంలో పాల్గొనిన బాణరాజు, నోళంబి - వారి వంశనామంతో పేర్కొనబడినారు. 'రాచమల్ల' అనే పేరు పశ్చిమ గాంగులలో ఒకరికంటె ఎక్కువమంది రాజులకు వుంది. వీటితోపాటు ఈ సంఘటనను నమోదు చేసిన ఏ శాసనంలోను శాసనకాలం పేర్కొనబడలేదు. వైదుంబుల శాసనాలను పరిష్కరించిన ఆర్.యస్. పంచముఖి ఈ యుద్ధం రెండవ రాచమల్లు కాలానికి చెందిందని నిర్ధారించి ఈ యుద్ధం క్రీ.శ. 885 ప్రాంతంలో జరిగిందని నిర్ణయించినారు[63]. కీ॥శే॥ యం. వెంకటరామయ్య ఈ రాజును క్రీ.శ. 9వ శతాబ్దిలో గాంగ రాజ్యాన్ని పరిపాలించిన మొదటి రాచమల్లుగా గుర్తించి ఈ యుద్ధం క్రీ.శ. 825లో జరిగిందని నిర్ణయించినారు[64]. ఎ.ఆర్. బాజీ ఈ రాజును క్రీ.శ. 10వ శతాబ్ది పూర్వార్థంలో గాంగ రాజ్యాన్ని పరిపాలించిన మూడవ రాచమల్లుగా గుర్తించినారు[65]. కాని వండాడిలోని ఒక శాసనం[66] ముదిమడువు యుద్ధంలో 'ఎరెయమ్మ' అనే వీరుడు మరణించినట్లు తెలుపుతూ వుంది. ఇతడు మొదటి రాచమల్లు కుమారుడు ఎరెయగంగ కావచ్చునని డా॥ పి.వి. పరబ్రహ్మశాస్త్రి గారు అభిప్రాయపడుతున్నారు[67]. ఈ ఆధారాన్ని బట్టి

గండత్రిణేత్రుణ్ణి పశ్చిమ గాంగ రాజైన మొదటి రాచమల్లుకు సమకాలికునిగా, అంటే క్రీ.శ. 9వ శతాబ్ది పూర్వార్థానికి చెందినవానిగా భావించవచ్చు.

గండత్రిణేత్రుని తరువాత ఎవరు అధికారంలోకి వచ్చిందీ తెలియదు. వండాడిలోని ఒక శాసనంలో[68] కలిగెత్రిణేత్రుడు, ఇంకొక శాసనంలో[69] బిరుదత్రిణేత్రుడు పేర్కొనబడినారు. పెద్దబలిజపల్లిలోని క్రీ.శ. పదవ శతాబ్ది లక్షణాలున్న కాలనిర్ణయం లేని ఒక శాసనం[70] మనుజ త్రిణేత్ర వైదుంబ మహారాజు పృథివి రాజ్యం చేస్తూ వుండినట్లు తెలుపుతూ వుంది. పై ముగ్గురూ గండత్రిణేత్రునితో కలిసి యుద్ధాలలో పాల్గొన్నారు. కాబట్టి వీరు గండ త్రిణేత్రునితో సన్నిహిత సంబంధమున్నవారు అంటే కుమారులు లేదా యువరాజులు అయివుండవచ్చు.

భువనత్రిణేత్రునికి సంబంధించి రెండు శాసనాలు వెలుగులోకి వచ్చినాయి. ఈ రెండు శాసనాలలోనూ శాసనకాలం పేర్కొనబడింది. శా.శ. 893, ఆషాడ శుద్ధ సప్తమి, గురువారం, దక్షిణాయన సంక్రాన్తి (క్రీ.శ. 972, జూన్, 20వ తేదీ) నాటి మద్రాస్ మ్యూజియం తామ్ర ఫలకాలు[71], ఈ రాజు పాకనాటిలోని పొత్తపిలో విడిది చేసినప్పుడు జారీ చేయబడినాయి. భువనత్రిణేత్రుడు కడప పంద్రెండులోని కాటిచెఱువు గ్రామాన్ని భీమరాజు, బిచ్చవ్వలకు పుణ్యంగా (వీరు భువనత్రిణేత్రుని తల్లిదండ్రులని ప్రభుత్వ శాసన పరిశోధనాధికారి అభిప్రాయం) అరతురేవులలోని లోకేశ్వర భటారనికి ఇచ్చినట్లు ఈ ఫలకాలు తెలియ జేస్తున్నాయి. ఉప్పరపల్లి శాసనం[72], భువనత్రిణేత్రుడు శా.శ. 894 (క్రీ.శ. 972-73)వ సంవత్సరంలో పట్టాభిషిక్తుడైనట్లు తెలుపుతూ వుంది. భువనత్రిణేత్రుని అధికారం రేనాడు ఏడువేలపైనే గాక ములకనాడు, పాకనాటిలోని పొత్తపి వరకు విస్తరించినట్లు కనిపిస్తూ వుంది.

దాదాపు ఇదేకాలంలో రేనాడును (పూర్తిగా కాకపోయినా కొంతభాగాన్ని) పాలించిన ఇంకొక వైదుంబరాజు ఇరిగెయ మహారాజు. శా.శ. 898, కార్తిక శుద్ధ ఏకాదశి, శుక్రవారం (క్రీ.శ. 976, అక్టోబర్, 6వ తేదీ) నాటి అనిమెల శాసనం[73] ఇరిగెయ మహారాజు తన తండ్రి బెజయిత మహారాజుకు ఏకోద్దిష్టభుక్తదక్షిణగా అనిమెల పొలంలో యాభై మరుతురుల భూమిని సూరియక్రమవేది అనే బ్రాహ్మణునికి ఇచ్చినట్లు తెలియజేస్తూ వుంది. దీనిని బట్టి ఇరిగెయ మహారాజు పాలన క్రీ.శ. 976లో ప్రారంభమైందని భావించవచ్చు.

కలుకడలోని కాలనిర్ణయం లేని ఒక శాసనం[74]లో భువనత్రిణేత్ర శ్రీమత్ ఇరిగెయ మహారాజు పేర్కొనబడడాన్ని బట్టి భువనత్రిణేత్రుడు, ఇరిగెయ మహారాజు ఒకరే అని ప్రభుత్వ శాసన పరిశోధనాధికారి అభిప్రాయపడినారు. ఈ అభిప్రాయం క్రింద కారణాలవల్ల సరైందిగా కనిపించడం లేదు.

(1) మద్రాస్ మ్యూజియం తామ్ర ఫలకాలలోను, ఉప్పరపల్లె శాసనంలోను భువన త్రిణేత్రుడు 'ఇరిగెయ'గా పేర్కొనబడలేదు.

(2) భువనత్రిణేత్రుని తండ్రి భీమరాజు అని శాసన పరిశోధనాధికారి అభిప్రాయం. కాని ఇరిగెయ మహారాజు తండ్రి బెజయిత మహారాజు.

(3) భువనత్రిణేత్రుని పట్టాభిషేకం శా.శ. 894 (క్రీ.శ. 972-73)లో జరిగింది. ఇరిగెయ మహారాజు పట్టాభిషేకం అతని తండ్రి మరణానంతరం అంటే శా.శ. 898 (క్రీ.శ. 976)లో జరిగి వుండాలి. తండ్రి జీవించి వుండగానే అతని పట్టాభిషేకం జరిగి వుండవచ్చుననే అభిప్రాయం అంతగా లెక్కలోకి తీసుకొనదగింది కాదు. కాబట్టి 'భువనత్రిణేత్ర' బిరుదం ఇద్దరికీ వున్నట్టు భావించడం సమంజసం.

క్రీ.శ. 973 నుండి క్రీ.శ. 1003 వరకు తీరాంధ్ర ప్రాంతాన్ని పరిపాలించిన జటాచోడ భీముడు వైదుంబ రాజును జయించినట్లు చెప్పుకున్నాడు. కాని ఆ వైదుంబరాజు ఎవరో? అతను పరిపాలించిన ప్రాంతమేదో? తెలియడం లేదు. భీముని తండ్రి జటాచోడుని గండత్రిణేత్రుడు జయించి రేనాడు నుండి పారదోలడం వల్ల, తన తండ్రి అపజయానికి ప్రతీకారంగా భీముడు వైదుంబరాజును జయించి వుంటాడని భావించవచ్చు.

కొలవలిలోని 10వ శతాబ్ది లక్షణాలున్న కాలనిర్ణయం లేని ఒక వైదుంబ శాసనం[75] ఆ కాలంలో కమలాపురం ప్రాంతంలో వైదుంబుల అధికారం వుండినట్లు తెలియజేస్తూ వుంది.

శా.శ. 978 (క్రీ.శ. 1056) నాటి పాలగిరి శాసనం[76] కలిగత్రిణేత్ర శ్రీమద్భీమ మహారాజు అనే వైదుంబరాజును పేర్కొంటూ వుంది. ఈ రాజు చంద్ర వంశస్థుడని పై శాసనం తెలుపుతూ వుంది. రాష్ట్రకూట రాజు అకాలవర్ష కన్నారదేవుడు (మూడవ కృష్ణుడు) ఆ గ్రామంలోని సమర్థేశ్వరస్వామికి ఎనభై ఖండుగల భూమిని దానమిచ్చి శిలాశాసనం వేయించినాడని, ఈ భీమ మహారాజు ఆ దేవాలయం శిథిలమై వుండగా జీర్ణోద్ధరణ చేసి, అకాలవర్షకన్నార దేవుని దానాన్ని పునరుద్ధరించడమే గాక 200 మరుతుర్ల భూమిని దానమిచ్చినాడని ఈ శాసనం వల్ల తెలుస్తూ వుంది. కలిగత్రిణేత్ర భీమ మహారాజు వైదుంబ వంశానికి చెందిన తొలి పరిపాలకులలో చివరివాడు.

ఈ వైదుంబ వంశస్థుల సంతతివారు తరువాతి కాలంలో కలుకడపురం రాజధానిగా కల్యాణీ చాళుక్యులకు సామంతులుగా పరిపాలించినారు. కల్యాణీ చాళుక్యుల పతనానంతరం వీరు స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొని వల్లూరు పట్టణం రాజధానిగా చిన్న రాజ్యాన్ని ఏర్పరచుకున్నారు. ఇప్పటివరకు వెలుగులోకి వచ్చిన వీరి శాసనాలలో గాని, సాహిత్య గ్రంథాలలో గాని ఈ రాజుల వంశ చరిత్రను క్రమబద్ధంగా నిర్మించడానికి తగిన ఆధారాలు లభించ లేదు. వీరిలో రాయదేవ మహారాజు శక్తివంతుడైన రాజని తెలుస్తూ వుంది. ఇతనికి రక్కసగంగ అనే నామాంతరముంది. ఇతడు తన రాజ్యాన్ని విస్తరింపజేయడానికి తీవ్రమైన ప్రయత్నాలు చేసినాడు. క్రీ.శ. 1234 నాటి అబ్బవరం శాసనం[77] రాయదేవ మహారాజు మరుజవాడి మహారాజవాడి) లోని ఆండపురం (ఆడపూరు) రాజధానిగా పాలిస్తూ అబ్బవరంలోని అబ్బేశ్వర దేవర అంగరంగ భోగాలకుగాను గంగసముద్రమనే గ్రామాన్ని వృత్తిగా ఇచ్చినట్లు తెలుపుతూ వుంది. శా.శ. 1169, ప్లవంగ సంవత్సర జ్యేష్ఠ శుద్ధ త్రయోదశి వడవారము (క్రీ.శ. 1247, మే,

19వ తేదీ, ఆదివారము) నాటి జ్యోతి శాసనం[78] రక్కసగంగ దేవుని సామంతుడైన చింతరామి నాయకుడు జోతినాధుని గుడి గోపురాన్ని, తకప్రోలులో ఇరుగల దేవుని గుడిని కట్టించి, చేటూరులో రెండు చెఱువులు త్రవ్వించి గుడి కట్టించి అగ్రహారాన్ని విడిచినట్లు తెలియజేస్తూ వుంది.

పైన చెప్పబడిన రెండు శాసనాలు ఇతని రాజ్య విస్తీర్ణాన్ని తెలుపుతున్నాయి. తెలుగు చోడవంశానికి చెందిన తిక్కరాజుకు సంబంధించిన క్రీ.శ. 1208 నుండి 1238 మధ్యకాలంలోని శాసనాలు సిద్ధవటం తాలూకాలో వున్నాయి. కాబట్టి ఈ ప్రాంతం ఆ కాలంలో తెలుగు చోడుల అధీనంలో వుండినట్లు స్పష్టమౌతూ వుంది. రాయదేవ మహారాజు ఈ ప్రాంతాన్ని క్రీ.శ. 1247 ప్రాంతంలో ఆక్రమించుకొని తన రాజ్యాన్ని జ్యోతివరకు విస్తరింపజేసినాడు. ప్రకాశం జిల్లా ముండ్లపాడు సమీపంలోని నల్లమల అడవిలోని పాపిలేడు అనే ప్రాంతంలో ఇటీవల కనుగొనబడిన ఇతనికి సంబంధించిన ఒక శిథిల శాసనం[79] ఇతని అధికారం సకలి సీమలోని కొన్ని ప్రాంతాలలో కూడా విస్తరించినట్లు తెలుపుతూ వుంది.

రెండవ మనుమసిద్ధికి సంబంధించిన పులపత్తూరులోని కాలనిర్ణయం లేని ఒక శాసనం[80] నందలూరులోని క్రీ.శ. 1250[81], క్రీ.శ. 1257[82] నాటి రెండు శాసనాలు మనుమసిద్ధి రక్కసగంగదేవుని ఓడించి అతను పూర్వం ఆక్రమించుకున్న ప్రాంతాన్ని తిరిగి జయించినట్లు తెలియజేస్తున్నాయి. కాకతీయ గణపతిదేవుని సహాయంతో మనుమసిద్ధి రక్కసగంగదేవుని జయించినాడు. కాయస్థ వంశస్థుడైన గంగయసాహిణి నేతృత్వంలోని కాకతీయ సైన్యం రక్కసగంగదేవుని ఓడించి తెలుగుచోళ రాజ్యం నుండి తరిమి వేసింది. గంగయసాహిణి మేనల్లుడు జన్నిగదేవుడు కూడా ఈ యుద్ధంలో పాల్గొన్నాడు. రక్కసగంగదేవుని ఓడించి గంగయసాహిణి ఆక్రమించిన ప్రాంతానికి అధికారిగా గంగయసాహిణినే రెండవ మనుమసిద్ధి నియమించిన విషయాన్ని నిర్వచనోత్తర రామాయణంలోని ఒక పద్యం[83] సమర్థిస్తూ వుంది. ఈ యుద్ధం తరువాత రక్కసగంగదేవుడు ఏమైందీ తెలియదు. ఇతడు క్రీ.శ. 1255 కంటె ముందు మరణించి వుండవచ్చు. ఇతని తరువాత సోమేశ్వరదేవుడు రాజ్యానికి వచ్చినాడు. ఇతడు దాదాపు ముప్పై ఐదు సంవత్సరాలు పరిపాలించినాడు. శా.శ. 1190 (క్రీ.శ. 1268) నాటి చింతలపత్తూరు శాసనం[84] ఇతనిని, మహామండలేశ్వర మురారికేశవ మహారాజును సంయుక్త పాలకులుగా పేర్కొంటూ వుంది. వీరిద్దరూ కలుకడ పురవరాధీశ్వరులుగా ప్రస్తుతించబడినారు. వీరి సంయుక్త పాలన సోమిదేవుని రాజ్యపాలన కాలమంతా కొనసాగింది. వీరి పాలన ఖచ్చితంగా ఎప్పుడు మొదలైందీ చెప్పడం కష్టం. సోమిదేవుడు, గంగయ సాహిణికి సామంతునిగా పరిపాలనను ప్రారంభించినట్లు కనిపిస్తుంది. శా.శ. 1178, రాక్షస సంవత్సరం (క్రీ.శ. 1255) నాటి మాచుపల్లె శాసనం[85] వల్లూరు రాజధానిగా ములికివలనాడును పరిపాలిస్తున్న తన సామంతుడైన సోమిదేవుని నుండి గంగయసాహిణి మరుసపల్లె (మాచుపల్లె) గ్రామాన్ని తీసుకొని వాసుదేవ నాయకునికి ఇచ్చినట్లు తెలుపుతూ వుంది.

గంగయసాహిణి మరణానంతరం సోమిదేవుడు స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకున్నాడు. రుద్రమదేవి పరిపాలన ప్రారంభంలో గంగయసాహిణి వారసులు తిరుగుబాటు చేసిన సందర్భంలో ఏర్పడిన రాజకీయ కల్లోల స్థితిని అవకాశంగా తీసుకొని తన రాజ్యాన్ని విస్తరింప జేసినాడు. క్రీ.శ. 1267 నాటి ఎల్లారెడ్డి పల్లె శాసనం[86] ఇతడు వల్లూరు రాజధానిగా ముల్కి300, హొన్నవాడి 90, పెండెకల్లు 800 లను పరిపాలిస్తున్నట్లు తెలియజేస్తూ వుంది. శా.శ. 1206 (క్రీ.శ. 1284) నాటి గుండ్లూరు శాసనం[87] ఇతడు పొత్తపినాడును కూడా తన అధీనంలోకి తెచ్చుకున్నట్లు తెలుపుతూ వుంది. త్రిపురారిదేవుని తరువాత కాయస్థ సింహాసనాన్ని అధిష్టించిన అంబదేవుడు, సోమిదేవునిపై దాడి జరిపినాడు. సోమిదేవుడు తన సంయుక్త పాలకుడైన మురారి కేశవుడు, తెలుగుచోడ పరిపాలకుడు అల్లు గంగరాజులతో కలిసి అంబదేవుణ్ణి ఎదుర్కొన్నాడు. కాని ఈ యుద్ధంలో సోమిదేవుడు పరాజితుడైనాడు. శా.శ. 1212 (క్రీ.శ. 1290) నాటి త్రిపురాంతకం శాసనం[88] అంబదేవుడు వైదుంబరాజులైన సోమిదేవ, మురారికేశవులను, వారి కూటమికి చెందిన అల్లు గంగరాజును ఓడించి వారి విలువైన గుఱ్ఱాలను సంగ్రహించినట్లు తెలుపుతూ వుంది. ఈ యుద్ధంలో పరాజయం తరువాత సోమిదేవ మురారికేశవులు ఏమైందీ తెలియదు. వారి రాజ్యాన్ని అంబదేవుడు ఆక్రమించి కాయస్థ రాజ్యంలో కలుపుకున్నాడు. శా.శ. 1208 సర్వజిత్ సంవత్సరం (క్రీ.శ. 1287) నాటి అత్తిరాల శాసనంలో[89] అంబదేవుడు వల్లూరు పట్టణం రాజధానిగా గండికోట, ములికినాడు, రేనాడు, పెండెకల్లు, ఏరువ, సకిలి, పొత్తపి సీమలను పరిపాలిస్తున్నట్లు చెప్పబడింది. పైన పేర్కొనబడిన శాసనాలు క్రీ.శ. 1284 – క్రీ.శ. 1287 మధ్య కాలంలో వైదుంబుల రాజ్యాన్ని అంబదేవుడు ఆక్రమించినట్లు స్పష్టం చేస్తున్నాయి.

సోమిదేవుని పరాజయం తరువాత కూడా వైదుంబుల పాలన సాగినట్లు కొన్ని శాసనాల వల్ల తెలుస్తూ వుంది. శా.శ. 1296 (క్రీ.శ. 1374) నాటి పులివెందల శాసనం[90] వైదుంబ రాజైన భైరవేశ్వరదేవరాజు పులివెందలకు పడమటి దిక్కులో కాలువను త్రవ్వించి దశబంధాన్ని ఏర్పరచినట్లు తెలుపుతూ వుంది. భైరవేశ్వరదేవుడు, పాండ్యరాయగజకేసరి, కలుకడపురావధీశ్వర అనే బిరుదులను ధరించినట్లు పై శాసనం ద్వారా తెలుస్తూ వుంది. స్వభాను సంవత్సర శ్రావణ శుద్ధ పౌర్ణమి సోమగ్రహణం నాటి సోమిరెడ్డిపల్లె శాసనం[91] మహామండలేశ్వర, జ్యోతిరాజు కుండయదేవ మహారాజును పేర్కొంటూ వుంది. 'భువనత్రినేత్ర' అనే బిరుదాన్ని ధరించడాన్ని బట్టి ఇతడు వైదుంబ వంశానికి చెందినవాడని పరిశోధకులు భావిస్తున్నారు[92].

## 9. రాష్ట్రకూటులు

దంతిదుర్గుడు, చాళుక్య రాజు రెండవ కీర్తివర్మను ఓడించి రాష్ట్రకూట రాజ్యాన్ని స్థాపించినాడు. దంతిదుర్గునికి సంతానం లేకపోవడం వల్ల అతని మరణానంతరం అతని పినతండ్రి మొదటి కృష్ణుడు సింహాసనాన్ని అధిష్ఠించినాడు. ఇతడు చాళుక్యులను పూర్తిగా అణగద్రొక్కి వారి ఆధీనంలో వుండిన ప్రాంతాలలో రాష్ట్రకూట అధికారాన్ని స్థాపించినాడు.

మొదటి కృష్ణుని తరువాత అతని కుమారుడు ప్రభూతవర్షుడు రాజ్యానికి వచ్చినాడు. కన్నెలూరులోని కాలనిర్ణయం లేని ఒక శాసనం[93] ప్రభూతవర్షుడు పృథివీరాజ్యం చేస్తుండగా అతని సామంతుడైన రేవయరసర్ రేనాడు ఏడువేలను పరిపాలిస్తున్నట్లు తెలుపుతూ వుంది. ప్రభూతవర్షుడు విషయలోలుడు కావడం వల్ల అతని తమ్ముడు ధ్రువుడు ప్రభూతవర్షుని పదవీచ్యుతుణ్ణి చేసి సింహాసనాన్ని ఆక్రమించుకున్నాడు. కన్నెలూరులోని, ధ్రువునికి సంబంధించిన ఒక శిథిల శాసనం[94] రాష్ట్రకూట రాజు నరియనూరు (కర్నూలుకు దక్షిణంగా 12 కి.మీ. దూరంలో వున్న నర్నూరు) నుండి తుంగభద్రా తీరంలోని కిర్డోర్ వరకు వున్న ప్రాంతాన్ని పరిపాలిస్తున్నట్లు తెలియజేస్తూ వుంది. ధ్రువుని తరువాత అతని కుమారుడు మూడవ గోవిందుడు రాజ్యానికి వచ్చినాడు.

దంతిదుర్గుడు, మొదటి కృష్ణుడు, ధ్రువుడు, మూడవ గోవిందుడు పల్లవరాజులను జయించినట్లు చెప్పుకున్నారు. కాని తమ రాజ్యాధికారాన్ని పటిష్ఠం చేసుకోవడానికి పల్లవులతో వివాహ సంబంధాలను ఏర్పరచుకున్నారు. పల్లవరాజు రెండవ నందివర్మపల్లవమల్ల మరణించినంత వరకు ఈ స్నేహ సంబంధాలు కొనసాగినాయి. పల్లవమల్లుని కుమారుడు దంతివర్మ కాలంలో ఈ స్నేహ సంబంధాలు విచ్ఛిన్నమైనట్లు కనిపిస్తుంది. రాష్ట్రకూట రాజు మూడవ గోవిందునిపై అతని అన్న కంబరాజు తిరుగుబాటు చేయగా ఈ తిరుగుబాటుకు దంతివర్మ సహాయాన్ని అందించినాడు. దీనికి ప్రతీకారంగా గోవిందుడు పల్లవ రాజ్యంపై దండెత్తి దంతివర్మను జయించి అతనితో కప్పం కట్టించుకున్నాడు. మూడవ గోవిందుని తరువాత క్రీ.శ. 814లో రాజ్యానికి వచ్చిన మొదటి అమోఘవర్షుని కాలంలో పల్లవ రాష్ట్రకూట సంబంధాలు పునరుద్ధరించబడినాయి. అమోఘవర్షుడు పల్లవ రాజైన మూడవ నందివర్మకు తన కుమార్తెనిచ్చి వివాహం చేసినాడు. నందివర్మ తరువాత అతని కుమారుడు నృపతుంగుడు, అతని తరువాత అపరాజితుడు పల్లవ సింహాసనాన్ని అధిష్ఠించినారు. క్రీ.శ. 888లో చోళరాజు మొదటి ఆదిత్యుడు యుద్ధంలో అపరాజితుని వధించడంతో పల్లవ సామ్రాజ్యం అంతరించింది.

మొదటి ఆదిత్యుడు, అతని తరువాత రాజ్యానికి వచ్చిన అతని కుమారుడు మొదటి పరాంతకుడు, తాము పల్లవ రాజ్యానికి రాజకీయ వారసులమని ప్రకటించుకొని పల్లవ సామ్రాజ్యంలోని ప్రాంతాలన్నింటినీ తమ అధీనంలోకి తెచ్చుకొనే ప్రయత్నం చేసినారు. ఆదిత్యుడు కడప జిల్లా సరిహద్దు వరకు వున్న ప్రాంతాన్ని జయించినాడు. పరాంతకుడు తెలుగుచోళుల అధీనంలో వున్న పాకనాడు, వైదుంబుల అధీనంలో వున్న సిత్పులినాడు, రేనాడు ఏడువేలను కూడ తన అధీనంలోకి తెచ్చుకున్నాడు. ఈ స్థితిలో రాష్ట్రకూట రాజు మూడవ ఇంద్రుడు తెలుగుదేశంలో చోళుల విస్తరణను అరికట్టడానికి రేనాడు పైకి సైన్యాన్ని పంపి ఆక్రమించుకున్నాడు. నిత్యవర్ష ఇంద్రుని కాలంలో కడప జిల్లాలో రాష్ట్రకూటుల అధికారం స్థిరపడినట్లు కనిపిస్తుంది. కడప జిల్లాలో ఇతనికి సంబంధించిన నాలుగు శాసనాలు లభించినాయి. మాలేపాడులోని కాలనిర్ణయం లేని ఒక శాసనం[95], నిత్యవర్షుని పరిపాలనా కాలంలో పల్లవరాణి, విరిపతితిలో నూట ఎనిమిది మందికి బియ్యము, నెయ్యి దానంగా

ఇచ్చినట్లు తెలుపుతూ వుంది. శా.శ. 847 పార్థివ సంవత్సరం ఉత్తరాయణ సంక్రాన్తి (క్రీ.శ. 925, డిసెంబర్, 23వ తేదీ, శుక్రవారం) నాటి కమలాపురం శాసనం[96], నిత్యవర్షుడు రాష్ట్రకూట సామ్రాజ్యాన్ని పరిపాలిస్తుండగా, ములికి అయ్యూరునాడును పరిపాలిస్తున్న అతని మహాసామంతుడైన పల్లవధీరుడు ఏలెక్కొంటీశ్వరాయతనానికి చత్పథ (చతుష్పథ) ద్వారబంధ మండపాన్ని కట్టించి సుధాకర్మ చేయించినట్లు తెలుపుతూ వుంది. దానవులపాడులోని ఒక శాసనం[97] బలికులతిలకుడైన శ్రీ విజయదండనాయకుడు ఇంద్రుని (మూడవ ఇంద్రుని) ఆజ్ఞానుసారం భూమిని పరిపాలించినట్లు తెలుపుతూ వుంది. నిత్యవర్ష ఇంద్రుడు జైన ధర్మాభిమాని. ఇతడు జైన తీర్థంకరుడైన శాంతినాథుని స్నాపనవిధి కోసం శిలాపీఠాన్ని నెలకొల్పినట్లు దానవులపాడులోని ఒక శాసనం[98] తెలియజేస్తూ వుంది.

మూడవ ఇంద్రుని వారసులైన రెండవ అమోఘవర్షుడు, నాలుగవ గోవిందుడు, మూడవ అమోఘవర్షులకు సంబంధించిన శాసనాలు ఈ ప్రాంతంలో లభించకపోయినప్పటికీ మూడవ కృష్ణునికి సంబంధించిన రెండు శాసనాలు ఈ మండలంలో లభించడాన్ని బట్టి మూడవ కృష్ణుని కాలం వరకు ఈ ప్రాంతంలో రాష్ట్రకూటుల అధికారం కొనసాగుతూ వుండినట్లు స్పష్టమౌతూ వుంది. రామేశ్వరంలోని మూడవ కృష్ణుని ప్రశస్తి శాసనం[99], దంతిదుర్గుని నుండి మూడవ కృష్ణుని వరకు వున్న రాష్ట్రకూట వంశాన్ని, ఆయా రాజుల విజయాలను పేర్కొంటూ వుంది. పుష్పగిరిలోని కాలనిర్ణయం లేని ఒక శాసనం[100], రాష్ట్రకూట చక్రవర్తి కృష్ణకన్నిహ దేవుడు (మూడవ కృష్ణుడు) జోతి యాత్రకు వెళ్లి తిరిగిస్తూ శ్రీపర్వత దక్షిణ ద్వారమైన పుష్పగిరిలోని నాగేశ్వర దేవునికి, సర్పేశ్వర దేవునికి, నైవేద్య, ధూప, దీప భోగాలకు, అభ్యాగత పరిచర్యలకు పన్నెండు మత్తరుల భూమిని, నందనవనాన్ని ధారాపూర్వకంగా ఇచ్చినట్లు తెలుపుతూ వుంది.

మూడవ కృష్ణుని వారసులైన కొట్టిగ, నాలుగవ ఇంద్రుడు అసమర్థులైనందు వల్ల వీరికాలంలో అనేకమంది సామంతరాజులు తిరుగుబాటు చేసి స్వాతంత్ర్యాన్ని ప్రకటించు కోవడంతో ఈ ప్రాంతంలో రాష్ట్రకూటుల సార్వభౌమాధికారం అంతరించింది.

## *10. చోళులు – కళ్యాణీ చాళుక్యులు*

పదవ శతాబ్ది చివరి పాదంలో దక్షిణ దేశంలో చోళులు, దక్కన్ ప్రాంతంలో చాళుక్యులు తమ సామ్రాజ్యాలను విస్తరించే ప్రయత్నంలో వుండినారు. రాష్ట్రకూటుల పతనం తర్వాత మధ్యాంధ్ర ప్రాంతంలో రాజకీయ అనిశ్చిత పరిస్థితి ఏర్పడింది. ఈ పరిస్థితిని అవకాశంగా తీసుకొని చోళులు, చాళుక్యులు తమ అధికారాన్ని ఆ ప్రాంతంలో విస్తరింపజేసే ప్రయత్నంలో పరస్పరం యుద్ధాలలో మునిగిపోయినారు. మధ్యాంధ్ర దేశానికి మధ్యప్రాంతంలో వున్న కడప జిల్లా వీరికి యుద్ధభూమిగా మారింది.

కడప జిల్లా ప్రాంతాన్ని మొదట చోళులు ఆక్రమించుకున్నారు. మొదటి పరాంతకుడు

రేనాడు ఏడువేలను, పొత్తపిని పరిపాలిస్తున్న వైదుంబులను జయించినాడు. కాని క్రీ.శ. 949-50లో తక్కోళమ్ యుద్ధంలో రాష్ట్రకూట రాజు మూడవ కృష్ణుని చేతిలో అపజయం పొందిన తరువాత చోళుల అధికారం ఈ ప్రాంతంలో తగ్గిపోయింది. దాదాపు నలభై సంవత్సరాలు వీరు తమ స్వంత రాజ్యానికి మాత్రమే పరిమితమైనారు. క్రీ.శ. 985లో మొదటి రాజరాజ అధికారంలోకి వచ్చిన తరువాత కొన్ని సంవత్సరాలకే కేరళ, తమిళకాలను జయించి, తన రాజ్యానికి ఉత్తర సరిహద్దులో వున్న కర్ణాటక, ఆంధ్ర ప్రాంతాల పైకి సేలను నడిపించి గంగవాడి, తడిగైవాడి, నోలంబవాడులను ఆక్రమించుకున్నాడు. రాజరాజు కడప ప్రాంతాన్ని జయించినట్లు, అతని శాసనాలేవీ పేర్కొనక పోయినప్పటికీ, ఇతడు రేనాడులోని కొన్ని ప్రాంతాలనైనా జయించినట్లు తెలుస్తూ వుంది. ఉత్తర ఆర్కాట్ జిల్లా తిరువళ్లం లోని ఒక శాసనం[101], మహారాజపాడిలోని ఇనగల్లూరునాడును పరిపాలిస్తున్న వైదుంబ రాజైన తుక్కాౖ కుమారుడు నన్నిమారాయార్, రాజరాజుకు సామంతుడని తెలుపుతూ వుంది.

మొదటి రాజరాజు పరిపాలనా కాలం తరువాతి కాలంలో మహారాజపాడి చోళు ప్రత్యక్ష పరిపాలనలో వుండినట్లు తెలుస్తూ వుంది. కోలార్ జిల్లా మిండిగల్ (దిగువపల్లి లోని శా.శ. 970, సర్వజిత్ సంవత్సరం (క్రీ.శ. 1048) నాటి ఒక శాసనం[102] మొదటి రాజరాజ 30వ రాజ్యసంవత్సరంలో, అతని దండనాయకుడైన అప్పిమయ్య వల్లూరు రాజధానిగ మహారాజవాడి ఏడువేలను పరిపాలిస్తున్నట్లు తెలుపుతూ వుంది. మొదటి రాజాధిరాజ చాళుక్యులకు బద్ధశత్రువై తన పరిపాలనా కాలమంతా వారితో యుద్ధాలతోనే గడిపినాడు ఈ యుద్ధాలలో కొంతకాలంపాటు ఇతడు కృతకృత్యుడైనప్పటికీ క్రీ.శ. 1054లో తుంగభద్ర తీరంలోని కొప్పం వద్ద జరిగిన యుద్ధంలో మరణించినాడు. ఇతని వారసుడైన రెండవ రాజేంద్ర చోళుడు ఈ అపజయాన్ని అధిగమించి కొల్లాపురం (మహబూబ్‌నగర్ జిల్లా)లో జయస్తంభం నాటించినప్పటికీ, గంగవాడి, నోలంబవాడి, ప్రాగాంధ్రములలోని చోళ ప్రాంతాలన చాళుక్యులకు వదలివేసి తన స్వంత రాజ్యం నుండి పరిపాలన సాగించినాడు. ఇతని పరిపాలన చివరి దశలో ఇతని తమ్ముడు వీర రాజేంద్రుడు కడప ప్రాంతాన్ని తిరిగి జయించడానికి ప్రయత్నం చేసినాడు. పొత్తపిని పరిపాలిస్తున్న తెలుగుచోళరాజు, రేనాడును పరిపాలిస్తున్న వైదుంబరాజు, ఇంకా కొందరు ఆంధ్ర, కర్ణాటక ప్రాంతాలలోని సామంతరాజులు చాళుక్యులతో చేరి కూటమిగా ఏర్పడి చోళులను ఎదుర్కొన్నారు. క్రీ.శ. 1063లో రెండవ రాజేంద్రుడు మరణించగా వీరరాజేంద్రుడు చోళ సింహాసనాన్ని అధిష్ఠించినాడు. ఇతడు తన నాలుగవ రాజ్య సంవత్సరంలో (క్రీ.శ. 1067) వేంగీ రాజ్యంపై దండయాత్ర చేసినాడు. చాళుక్యు సామంతులైన పొత్తపిరాజు, ధారాజననాథుని తమ్ముడు ఇతని దండయాత్రను ఎదుర్కొన్నారు వీరిని యుద్ధంలో వధించి వారి రాజ్యాలను వీరరాజేంద్రుడు తన రాజ్యంలో కలుపుకున్నాడు ఇతడు సింహాసనాన్ని అధిష్ఠించిన వెంటనే తన అధికారాన్ని అన్ని దిక్కులలోను విస్తరింపజేసి పొత్తపి రాజుకు, ధారాజననాథుని తమ్మునికి శిరచ్ఛేదం చేసినట్లు ఇతని నాలుగవ రాజ్యసంవత్సరం నాటి కరవూరు శాసనం[103] తెలుపుతూ వుంది. ఉన్నమేడు నదీ తీరంల

జరిగిన యుద్ధంలో ఇతడు రేనాడును పరిపాలిస్తున్న వైదుంబరాజుకు శిరచ్ఛేదం చేసి, ఆరుగురు చాళుక్య సేనాపతులను బందీలుగా పట్టుకున్నాడు[104].

వీరరాజేంద్రుని మరణానంతరం చోళుల అధికారం క్షీణించడం మొదలైంది. అవకాశమున్నప్పుడల్లా చాళుక్యులు చోళ ప్రాంతాలను ఆక్రమించుకొనే ప్రయత్నం చేసినారు. కాని వీరరాజేంద్రుని తరువాత రాజ్యానికి వచ్చిన మొదటి కులోత్తుంగుని కాలంలో చాళుక్యులు చోళులపై విజయాన్ని సాధించలేక పోయినారు. క్రీ.శ. 1119లో కులోత్తుంగుని మరణానంతరం అతని కుమారులు పరాంతకుడు, విక్రమచోళుడు సింహాసనంకోసం పరస్పరం కలహించుకోవడాన్ని ఆసరాగా తీసుకొని చాళుక్యరాజు త్రిభువనమల్ల ఆరవ విక్రమాదిత్యుడు తీరాంధ్ర ప్రాంతంపై దండెత్తి, కళింగం నుండి కాంచీపురం వరకు వున్న ప్రాంతాన్ని ఆక్రమించుకున్నాడు. ఈ దండయాత్రలోనే చాళుక్యులు కడప జిల్లా ప్రాంతాన్ని జయించినారు. చోళ సింహాసనం కోసం జరిగిన వారసత్వ యుద్ధంలో విక్రమచోళుడు విజయాన్ని సాధించి వెలనాడును పరిపాలిస్తున్న దుర్జయులు మొదలైన సామంతరాజుల సహకారంతో కృష్ణానదికి దక్షిణ భాగంలో వుండే భూభాగాన్నంతటినీ క్రీ.శ. 1126 ప్రాంతంలో తిరిగి జయించినాడు. పొత్తపి, నెల్లూరులతో సహ పాకనాడు ప్రాంతమంతా ఇతని అధీనంలోకి వచ్చింది. తెలుగు చోళులు ఇతని సార్వభౌమత్వాన్ని అంగీకరించినారు. చాళుక్యులు కడప జిల్లాలోని పశ్చిమ ప్రాంతాన్ని మాత్రం నిలుపుకోగలిగినారు. కడప, కమలాపురం, జమ్మలమడుగు తాలూకాలలో వున్న త్రిభువనమల్ల ఆరవ విక్రమాదిత్య, భూలోకమల్ల మూడవ సోమేశ్వర, రెండవ జగదేకమల్ల, మూడవ నూర్మడి తైలుల శాసనాలు ములికినాడు, రేనాడులు క్రీ.శ. 1160లో కాలచుర్య బిజ్జలుని చేతిలో చాళుక్యవంశం అంతరించినంత వరకు, వారి అధీనంలోనే వుండినట్లు స్పష్టం చేస్తున్నాయి.

త్రిభువనమల్ల ఆరవ విక్రమాదిత్యుని కాలంలో చాళుక్య రాజ్యం అత్యున్నత స్థితిని పొందింది. ఇతడు సింహాసనాన్ని అధిష్ఠించినప్పటి నుండి (క్రీ.శ. 1075) చాళుక్య విక్రమ శకం మొదలౌతుంది. ఇతని కాలంలో రాజ్య పరిపాలనా బాధ్యతలను సామంతులకు అప్పగించినట్లు తెలుస్తూ వుంది. చాళుక్య విక్రమ శకం 49, శా.శ. 1046, క్రోధి సంవత్సర ఉత్తరాయణ సంక్రాన్తి (క్రీ.శ. 1124) నాటి పెద్దముడియం శాసనం[105], త్రిభువనమల్ల విక్రమాదిత్యుని సామంతునిగా రేనాడు డెబ్బై, అవుకు సీమలను పరిపాలిస్తున్న తెలుగుచోళ వంశస్థుడైన అత్యనచోళ మహారాజును, అతని సామంతుడైన చిద్దనచోళ మహారాజును పేర్కొంటూ వుంది.

ఆరవ విక్రమాదిత్యుని తరువాత అతని కుమారుడు భూలోకమల్ల మూడవ సోమేశ్వరుడు రాజైనాడు. వీరునిగాకంటె ఇతడు పండితునిగా లబ్ధప్రతిష్ఠుడు. ఇతడు 'అభిలషితార్థ చింతామణి' అనే గ్రంథాన్ని రచించినాడు. చాళుక్య విక్రమ శకం 56 (క్రీ.శ.1132) నాటి చిలమకూరు శాసనంలో[106] సోమేశ్వరుని సామంతునిగా మహామండలేశ్వర త్రైలోక్యమల్ల

మల్లిదేవ మహారాజు ములికి మున్నూరునాడును పరిపాలిస్తుండగా అతని సామంతునిగా భైవరాస చిలమకూరును ఏలుతున్న కాలంలో మహాప్రధాన, సంధివిగ్రహి సింగరాస యొక్క ప్రతినిధి సింగెయ తల్లి నలికబ్బె, ఆ ప్రాంతంలో ఒక చెఱువును నిర్మించినట్లు చెప్పబడింది. ఇది ఈ జిల్లాలో తటాక నిర్మాణాన్ని నమోదు చేసిన మొదటి శాసనం. శా.శ. 1061 (క్రీ.శ. 1139) నాటి పుష్పగిరిలోని రెండు శాసనాలు మల్లిదేవుణ్ణి పేర్కొంటున్నాయి. వీటిలో ఒక శాసనం[107] ఇతడు భూలోకమల్లుని సామంతునిగా వల్లూరు నుండి పరిపాలిస్తున్నట్లు తెలుపుతూ వుంది. వల్లూరులోని ఒక శిథిల శాసనం[108] కూడా భూలోకమల్ల మహారాజును పేర్కొంటూ వుంది. భూలోకమల్లుని 70వ సంవత్సరం (క్రీ.శ. 1201) నాటి ఇందుకూరు శాసనం[109] మహామండలేశ్వర త్రైలోక్యమల్ల హెమ్మడిదేవ మహారాజు ఆ ప్రాంతాన్ని పరిపాలిస్తున్నట్లు తెలుపుతూవుంది. పై శాసనాలు మూడవ సోమేశ్వరుని కాలంలో ఈ జిల్లా చాళుక్యుల అధీనంలో వుండినట్లు స్పష్టం చేస్తున్నాయి.

మూడవ సోమేశ్వరుని తరువాత అతని కుమారుడు రెండవ జగదేకమల్లుడు సింహాసనాన్ని అధిష్ఠించినాడు. ఇతని కాలంలో సామంతుల ద్వారా పరిపాలన సాగించే పద్ధతికి బదులు, చక్రవర్తి వివిధ ప్రాంతాలలో తన ప్రతినిధులను నియమించి వారి ద్వారా పరిపాలన నిర్వహించే పద్ధతి ఏర్పడింది. జగదేకమల్లుడు, కడప జిల్లా ప్రాంతంలో తన ప్రతినిధిగా కటకచంద్ర దండనాయకుణ్ణి నియమించినాడు. కురుమారి (దానవులపాడు), పెద్దపసువుల గ్రామాల సరిహద్దు విషయంలో ఆ గ్రామాల ప్రజల మధ్య ఏర్పడిన వివాదాన్ని పరిష్కరించడానికి కటకచంద్ర దండనాయకుడు చేసిన ప్రయత్నం విఫలమై యుద్ధంగా పరిణమించింది. ఈ యుద్ధంలో కటకచంద్ర దండనాయకుడు, అతని బావమరిది మధువరస, స్థానిక నాయకుడు భీమరస, మల్లోజ సేవకుడు మరణించినారు[110]. దేవగుడిలో వీరి స్మృత్యర్థం నిలిపిన వీరగల్లులున్నాయి. ఇవి జగదేకమల్లుని 13వ రాజ్య సంవత్సరం నాటివి. కటకచంద్ర దండనాయకుని తరువాత కాకరాజును ములికినాడు సీమలో తన ప్రతినిధిగా త్రైలోక్యమల్ల మూడవ తైలుడు నియమించినట్లు గండికోట దుర్గం కైఫీయత్తు[111] తెలుపుతూ వుంది. త్రైలోక్యమల్ల మూడవ తైలుడు, తన అన్న జగదేకమల్లుని కాలంలో కూడా రాజ్యాధికారంలో వుండినాడు. గొల్లపల్లిలోని కాలనిర్ణయంలేని ఒక శాసనం[112] నూర్మడి తైలపదేవుడు కల్యాణపురం రాజధానిగా పరిపాలిస్తున్నట్లు తెలుపుతూ వుంది.

## 11. కాకతీయులు

కల్యాణీ చాళుక్య సామ్రాజ్యం పన్నెండవ శతాబ్ది చివరి పాదంలో అంతమైంది. కాని వారి ప్రత్యర్థులైన చోళుల అధికారం ఇంకొక అర్ధశతాబ్ది పాటు ఆంధ్ర దేశంలో కొనసాగింది. చోళుల చివరి పరిపాలనా సంవత్సరాలలో వారు తమ సామంతుల పరిపాలనలో ఏ విధమైన జోక్యం కలిగించుకోక పరిపాలనను నిర్లక్ష్యం చేయడంతో సామంతులు స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొని తమ తమ రాజ్యాలను విస్తరింప జేసుకొనే ప్రయత్నాలు చేసినారు. స్థానిక

నాయకుల రాజ్యవిస్తరణ కాంక్షవల్ల ఆంధ్ర దేశంలో శాంతి కొరవడి కల్లోలిత పరిస్థితి ఏర్పడింది. ఈ స్థితి ఇతర ప్రాంతాలకంటె కడప జిల్లాపై ఎక్కువ ప్రభావాన్ని చూపింది. ఈ కాలంలో కడప జిల్లా నెల్లూరు తెలుగుచోళులు, కలుకడ పురవరాధీశ్వరులైన వైదుంబులు, వల్లూరు పట్టణం రాజధానిగా పరిపాలిస్తున్న కాయస్థుల అధీనంలో వుండింది. కాకతీయులకు నెల్లూరు తెలుగుచోళుల వారసత్వ యుద్ధాలలోను, వారు వైదుంబులతో జరిపిన యుద్ధాలలోను జోక్యం చేసుకొనే అవకాశం కలిగింది. రెండవ మనుమసిద్ధి కాలంలో వారి రాజ్యభాగమైన పొత్తపినాడును వైదుంబరాజు రక్కసగంగదేవుడు ఆక్రమించుకోగా గణపతి దేవుడు మనుమసిద్ధికి సహాయంగా తన సైన్యాన్ని పంపి రక్కసగంగదేవుణ్ణి జయించినాడు. అందుకు ప్రతిఫలంగా మనుమసిద్ధి, గణపతి దేవునికి పొత్తపి ప్రాంతాన్ని ఇచ్చినాడు. గణపతిదేవుడు ఈ ప్రాంతం యొక్క పరిపాలన బాధ్యతను తన సామంతుడైన గంగయసాహిణికి అప్పగించినాడు. అప్పటినుండి ఈ ప్రాంతంపై కాకతీయుల ఆధిపత్యం ప్రారంభమైంది.

కాకతీయులు ఈ ప్రాంతాన్ని ప్రత్యక్షంగా కాక తమ సామంతులైన కాయస్థుల ద్వారా పరిపాలించినారు. గంగవరంలోని శా.శ. 1179, పింగళ సంవత్సర శ్రావణ శుద్ధ పౌర్ణిమ, గురువారం నాటి గంగయసాహిణి శాసనం[113] ఈ జిల్లాలో కాకతీయులకు సంబంధించిన మొదటి శాసనం. ఈ శాసనంలో గణపతిదేవుడు, గంగయసాహిణికి అధిరాజుగా పేర్కొనబడినాడు. గంగయసాహిణి, అతని తరువాత రాజ్యానికి వచ్చిన అతని మేనల్లుడు జన్నిగదేవుడు, గణపతిదేవునికి సామంతులుగా ఈ ప్రాంతాన్ని పరిపాలించినారు. గణపతిదేవుని మరణానంతరం రుద్రమదేవి పరిపాలనా కాలంలో కూడా జన్నిగదేవుడు మొదటి త్రిపురారి దేవుడు ఆమెకు సామంతులుగా రాజ్యపాలన చేసినారు. మొదటి త్రిపురారిదేవుని తరువాత రాజ్యానికి వచ్చిన అంబదేవుడు కాకతీయులపై తిరుగుబాటు చేసి స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకున్నాడు. శా.శ. 1213 (క్రీ.శ. 1291) ప్రాంతంలో కాకతీయ యువరాజు ప్రతాప రుద్రుడు, రాణి రుద్రాంబ తరఫున అంబదేవునిపై దండెత్తి అతని రాజ్యంలోని ఉత్తర ప్రాంతాలను జయించినప్పటికీ అంబదేవుణ్ణి పూర్తిగా లొంగదీసుకోలేక పోయినాడు. అంబదేవుని మరణానంతరం అతని కుమారుడు రెండవ త్రిపురారిదేవుడు రాజ్యానికి వచ్చిన వెంటనే కాకతీయులు అతనిపై దండయాత్ర చేసి ఓడించడమే గాక కప్పం వసూలు చేసినారు. ఈ అపజయం తరువాత రెండవ త్రిపురారిదేవుడు కొంతకాలం కాకతీయులకు సామంతుడుగా వుండినప్పటికీ మరల వారిపై తిరుగుబాటు చేసినాడు. కాకతీయులు ఈ తిరుగుబాటును అణచివేసి త్రిపురారిదేవుణ్ణి వధించడంతో ఈ ప్రాంతం మరల కాకతీయుల అధీనంలోకి వచ్చింది. ఈ విజయం తరువాత కడప జిల్లా, కాకతీయ సామ్రాజ్యం అంతరించినంతవరకు వారి సామంతుడైన జుట్టయలెంక గొంకారెడ్డి అధీనంలో వుండింది.

## *12. కాయస్థులు*

కాయస్థులు ఆంధ్ర దేశంలోకి ఇతర ప్రాంతాలనుండి వలస వచ్చినవారు. వీరి

వంశమూలాన్ని గురించి తెలుసుకోవడానికి తగిన ఆధారాలు లభించడం లేదు. వీరు ఈ ప్రాంతంలో ఎప్పుడు స్థిరపడిందీ ఇదమిత్థంగా తెలియదు. కాయస్థుల రాణుల పేర్ల చివర 'బాయి' అనే పదం వుండడాన్నిబట్టి వీరు మహారాష్ట్ర ప్రాంతం నుండి వచ్చి వుంటారని యన్.వి. రమణయ్య గారు అభిప్రాయపడినారు[114]. ప్రారంభంలో వీరు కాకతీయులకు సామంతులుగా వుండి, రుద్రమదేవి పరిపాలన తొలి సంవత్సరాలలో కాకతీయ సామ్రాజ్యంలో చెలరేగిన అస్థిరత్వాన్ని ఆధారంగా చేసుకొని స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకున్నారు. కాయస్థులు పానుగల్లు నుండి మహారాజవాడి వరకు వున్న ప్రాంతాన్ని పరిపాలించినట్లు వారి శాసనాలు తెలుపుతున్నాయి. శా.శ. 1161 నుండి 1226 (క్రీ.శ. 1239-1304) వరకు ఐదుగురు కాయస్థ రాజులు కడప ప్రాంతాన్ని పరిపాలించినారు.

శాసనాల ద్వారా తెలుస్తున్న మొదటి కాయస్థ రాజు గంగయసాహిణి. శా.శ. 1161 (క్రీ.శ. 1239) నాటి గుండ్లపాడు (గుంటూరు జిల్లా, పల్నాడు తాలూకా) శాసనం[115] ఇంతవరకు లభించిన ఇతని శాసనాలలో మొదటిది. ఈ శాసనంలో ఇతడు 'గండపెండార గంగయసాహిణి' అని మాత్రమే పేర్కొనబడినాడు. ఈ శాసనంలో ఇతని అధిరాజు ప్రస్తావన లేదు. కాని శా.శ. 1164 (క్రీ.శ. 1242) నాటి తురిమెళ్ల (ప్రకాశం జిల్లా, కంభం తాలూకా) శాసనం[116] ఇతడు కొచ్చెర్ల రాజధానిగా ఏలువ ప్రాంతాన్ని గణపతిదేవునికి సామంతునిగా పరిపాలిస్తున్నట్లు తెలుపుతూ వుంది. ఇతనికి 'అతివిషమహయారూఢ', 'ప్రౌఢరేఖారేవంత' అనే బిరుదులున్నాయి. ఈ బిరుదులు ఇతడు గొప్ప అశ్వికుడనే విషయాన్ని తెలియజేస్తున్నాయి. గంగయసాహిణికి వున్న ఈ సామర్థ్యం వల్లనే గణపతిదేవుడు ఇతనిని తన అశ్వికదళాధ్యక్షునిగా నియమించినాడు. పై బిరుదాలను ఇతని తరువాతి కాయస్థ రాజులు కూడ ధరించినారు. శా.శ. 1181, సిద్ధార్థి సంవత్సర పుష్య శుద్ధ ఏకాదశి నాటి మైదుకూరు శాసనం[117] గండపెండార గంగయదేవ మహారాజును గణపతిదేవుని అగ్రసేనాపతిగా వర్ణిస్తూ వుంది. ఇతడు పశ్చిమరాయ దామోదరుణ్ణి, వైదుంబ రాజైన రక్కసగంగదేవుణ్ణి జయించినాడు. వీరిపై ఇతడు జరిపిన యుద్ధాలలో ఇతని బావమరది అంబక్మాపాలుడు, మేనల్లుళ్ళు జన్నిగదేవ, త్రిపురారిదేవ, అంబదేవులు పాల్గొన్నారు. పై రాజులందరూ 'పశ్చిమరాయ దామోదర దిశాపట్ట', 'రక్కసగంగ బెనకొండగండ' అనే బిరుదాలను ధరించడం పై విషయాన్ని స్పష్టం చేస్తూ వుంది. గణపతి దేవుని దక్షిణ దిగ్విజయ యాత్ర తరువాత నెల్లూరు తెలుగుచోళరాజు మనుమసిద్ధికి సహాయంగా జరిపిన యుద్ధంలో గంగయసాహిణి రక్కసగంగదేవుణ్ణి జయించినాడు. ఈ యుద్ధ విజయాన్ని పురస్కరించుకొని గణపతిదేవుడు గంగయసాహిణిని పానగల్లు నుండి మహారాజవాడి వరకు వున్న ప్రాంతానికి అధిపతిగా చేయడమే గాక తన ఆస్థానంలో బాహత్తర నియోగాధిపతి (డెబ్బై రెండు నియోగాలకు అధిపతి)గా నియమించినాడు. మహారాజవాడి, కడప జిల్లా పులివెందల తాలూకా మోపూరు నుండి కర్ణాటక రాష్ట్రంలోని కోలారు జిల్లా చింతామణి తాలూకా మిండగల్లు వరకు వున్న ప్రదేశం[118].

శా.శ. 1176, ఆనంద సంవత్సర మాఘ శుద్ధ పంచమి, గురువారం నాడు మోరట

పట్టణాధీశ్వరుడైన అల్లుగిక్ష్మాపాలుని కుమార్తె హాచలాంబ హాచలేశ్వరమనే శివాలయాన్ని, గంగ సేనాపతి భార్య కామలాబాయి కామలేశ్వరమనే శివాలయాన్ని, పల్లవ క్ష్మాపతి ఖండెరాయడు పల్లవేశ్వరమనే శివాలయాన్ని త్రికూటంగా నిర్మించినట్లు పుష్పగిరిలోని ఒక శాసనం[119] తెలియజేస్తూ వుంది. ఈ శాసనం గంగసేనాపతి (గంగయసాహిణి)ని కాయస్థ వంశార్ణవ కర్ణధారునిగా వర్ణించడాన్ని బట్టి ఈ ప్రాంతంలో కాయస్థుల పాలన ఇతనితోనే ప్రారంభమైనట్లు చెప్పవచ్చు.

శా.శ. 1175 (క్రీ.శ. 1253) నాటి పానగల్లు శాసనం[120] గంగయసాహిణి పానగల్లు నుండి మార్జవాడి వరకు వున్న ప్రాంతాన్ని పరిపాలించినట్లు స్పష్టం చేస్తూ వుంది. ఈ శాసనం ఇతని తండ్రి శ్రీధనవ, పితామహుడు శ్రీ ధనువలను పేర్కొంటూ వుంది. శా.శ. 1178 (క్రీ.శ. 1256) నాటి మాచుపల్లె శాసనం[121], గంగయసాహిణి వల్లూరు పట్టణం రాజధానిగా పాలిస్తూ మరుసపల్లెను మహామండలేశ్వర త్రైలోక్యమల్ల భుజబల వీరనారాయణ నిశ్శంకప్రతాప సోమిదేవరాజు అంగీకారంతో రామిదేవ నాయకునికి ఇచ్చినట్లు తెలుపుతూ వుంది. శా.శ. 1172 (క్రీ.శ. 1250) నాటి నందలూరు శాసనం[122] గంగయసాహిణి మంత్రియైన సారంగ నాయకుణ్ణి పేర్కొంటూ వుంది. శా.శ. 1179, పింగళ సంవత్సర శ్రావణ శుద్ధ పౌర్ణిమ గురువారం (క్రీ.శ. 1257, జులై, 27వ తేదీ) నాటి గంగవరం శాసనం[123], గంగయసాహిణి అర్ధాంగలక్ష్మి కామలాబాయి పుష్పగిరిలోని - - - దేవునికి అంగ రంగ భోగాలకుగాను ములికినాటి సీమలోని గంగాపురం గ్రామాన్ని సర్వబాధాపరిహారంగా ఈశాన్య గురుదేవర హస్తాన ధారాపూర్వకం చేసి ఇచ్చినట్లు తెలుపుతూ వుంది.

గంగయసాహిణికి పుత్ర సంతానం లేకపోవడం వల్ల అతని తరువాత అతని మేనల్లుడు జన్నిగదేవుడు కాయస్థ రాజ్యానికి వారసుడైనాడు. కడప, కర్నూలు, గుంటూరు జిల్లాలలో జన్నిగదేవుని శాసనాలున్నాయి. ఇవి శా.శ. 1180 నుండి శా.శ. 1191 (క్రీ.శ. 1258-69) మధ్యకాలంలో జారీ చేయబడినాయి. ఇతడు తన మేనమామ గంగయసాహిణి వలెనే పానుగల్లు నుండి మహారాజవాడి వరకు వున్న ప్రాంతాన్ని పరిపాలిస్తూ గణపతిదేవునికి విశ్వాస పాత్రుడుగా వుండినాడు[124]. జన్నిగదేవుడు గొప్ప వీరుడు. యువకుడుగా వున్నప్పటి నుండే తన మేనమామ గంగయసాహిణితో కలిసి యుద్ధాలలో పాల్గొన్నాడు. గంగయసాహిణి జీవించి వున్నప్పుడు కూడా ఇతను కొన్ని ప్రాంతాలను పరిపాలించినట్లు తెలుస్తూ వుంది. శా.శ. 1181 (క్రీ.శ. 1259) నాటి మైదుకూరు శాసనం[125] గణపతిదేవుని అగ్రసేనాపతి అయిన గంగయసాహిణి రాజ్య పరిపాలన చేస్తూ వుండగా అతని తోబుట్టువు కుమారుడైన జన్నిగదేవుడు రాజ్యం చేస్తూ వుండి మైతకూరు గంగరాజు గారి పట్టణంలో కొన్ని వృత్తులను బ్రాహ్మణులకు శ్రోత్రియంగా ఇచ్చినట్లు తెలుపుతూ వుంది. గంగయసాహిణి మరణానంతరం ఇతడు కాకతీయుల అశ్వదళాధ్యక్షుడై గణపతిదేవునికి విశిష్ట సేవలను అందించినాడు. ఇతడు 'పశ్చిమరాయ దామోదర దిశాపట్ట', 'రక్కసగంగ బెనకొండ', 'వడ్డెరాయ అభిమాన చూరకార' అనే బిరుదులను ధరించినాడు. గణపతిదేవుని చివరి పరిపాలనా సంవత్సరాలలో జన్నిగదేవుడు,

కాకతీయ రాజ్య వ్యవహారాలలో సమర్థవంతమైన పాత్రను నిర్వహించి చక్రవర్తికి కుడిభుజ మని కీర్తించబడినాడు[126].

శా.శ. 1182 (క్రీ.శ.1260) నాటి పొందలూరు శాసనం[127] జన్నిగదేవుడు ధరించిన సమధిగత పంచమహాశబ్ద, బాహత్తర నియోగాధిపతి, అనేకదేశాధిపతి, అతివిషమ హయారూఢ, ప్రౌఢరేఖారేవంత, పశ్చిమరాయ దామోదర దిశాపట్ట, మహారాజవాడ భోగైక భాజన మొదలైన బిరుదాలను పేర్కొనడమే గాక, అతనిని చాతుర్వర్ణ (ర్ణ్య) సముద్ధరణుడని, చతుష్షష్ఠి విద్యా ప్రవీణుడని ప్రశంసిస్తూ వుంది. ఈ శాసనంలో జన్నిగదేవుడు గణపతిదేవుని పాదపద్మోపజీవిగా చెప్పబడినాడు. ఈ శాసనం జన్నిగదేవుడు అభినవ గోళకీ మఠానికి చెందిన శాంతపూర్వ శివదేశికులకు శివలింగమఠ విద్యామండప అధ్యయన శుశ్రూషక బ్రాహ్మణ అతిథి అభ్యాగత పూజనార్థం పొత్తపినాటిలోని పుఱుందలూరు గ్రామాన్ని సకలాయ సహితంగా ధారాపూర్వకం చేసి ఇచ్చిన సందర్భంలో జారీ చేయబడింది.

జన్నిగదేవుడు, కాంచీపురవరాధీశ్వరుడైన కదంబరాయ భీమదేవ మహారాజు కుమారుడు సిద్ధయదేవ మహారాజును సోమశిల వద్ద జరిగిన యుద్ధంలో వధించినట్లు, ఆ సందర్భాన్ని పురస్కరించుకొని శా.శ. 1183, దుర్మతి సంవత్సర మాఘ శుద్ధ ఏకాదశి నాడు అన్నలూరు (దువ్వూరు తాలూకాలోని బేచిరాకు గ్రామం)లో జయస్తంభ శాసనం వేయించినట్లు గండికోట దుర్గం కైఫీయత్తు[128] తెలుపుతూ వుంది.

శా.శ. 1186 (క్రీ.శ. 1264) నాటి కారెంపూడి (గుంటూరు జిల్లా) శాసనం[129] జన్నిగదేవుని ప్రతినిధియైన గండపెండార మాయిదేవరాజును పేర్కొంటూ వుంది. ఈ శాసనం జన్నిగదేవుని అధిరాజును పేర్కొనలేదు. కాని తరువాతి శాసనాలలో జన్నిగదేవుడు రుద్రమదేవికి సామంతుడుగా పేర్కొనబడినాడు. పైన చెప్పబడిన కారెంపూడి శాసనం జన్నిగదేవుడు పానుగల్లు నుండి కైవారంకోట వరకు వున్న ప్రాంతాన్ని పరిపాలిస్తున్నట్లు తెలుపుతూ వుంది. కైవారంకోట నేటి కోలార్ జిల్లా చింతామణి తాలూకాలోని కైవారం గ్రామంగా గుర్తించబడింది. శా.శ. 1188 (క్రీ.శ. 1266) నాటి రంగపల్లెపాడు (సిద్ధవటం తాలూకాలోని బేచిరాకు గ్రామం) శాసనం[130] జన్నిగదేవుడు, పానుగల్లు, పల్లినాడు, పూగినాడు, ఏఱువ, సకిలి, ములికినాడులను పరిపాలిస్తున్నట్లు తెలుపుతూ వుంది.

జన్నిగదేవుని తరువాత మొదటి త్రిపురారిదేవుడు రాజైనాడు. ఇతడు రుద్రమదేవికి సామంతునిగా వుంటూ తన పూర్వీకులైన గంగయసాహిణి, జన్నిగదేవులు నిర్వహించిన పదవులను నిర్వహించినాడు. ఇతడు కూడా 'పశ్చిమరాయ దామోదర సైన్య దిశాపట్ట' అనే బిరుదాన్ని ధరించినాడు. ఇతని శాసనాలు కడప జిల్లాలోను, త్రిపురాంతకంలోను, దర్శి ప్రాంతంలోను లభిస్తున్నాయి. శా.శ. 1190 (క్రీ.శ. 1268) నాటి అట్లూరు శాసనం[131] కాకతీయ రుద్రదేవ మహారాజు (రుద్రమదేవి) సామంతుడైన మాండలిక బ్రహ్మరాక్షస, మూరురాయ జగద్దళ, గండపెండార త్రిపురారిదేవుడు తనకు ఆయురారోగ్య ఐశ్వర్య జయాభివృద్ధి కోసం సకలి

భూమిలోని సొందపురం గ్రామాన్ని సిద్ధనాథ దేవునికి సహిరణ్యోదక ధారాపూర్వకంగా ఇచ్చినట్లు తెలుపుతూ వుంది. శా.శ. 1192 (క్రీ.శ. 1270)లో గండపెండార త్రిపురాంతక రాజు (త్రిపురారి దేవుడు) బద్దెవోలు తాలూకా వీరపల్లె గ్రామానికి ఈశాన్య దిక్కులోని పొలిమేరలో వుండే పశువుల పాలాన్ని లంకమల్లేశ్వరునికి ఇచ్చినట్లు గండికోట దుర్గం కైఫీయత్తు[132] తెలుపుతూ వుంది. శా.శ. 1193, ప్రజోత్పత్తి సంవత్సర ఆశ్వయుజ శుద్ధ ఏకాదశి, బృహస్పతి వారం (క్రీ.శ. 1271) నాటి తాడిగొట్ల శాసనం[133] మాండళిక బ్రహ్మరాక్షస త్రిపురారి రాజు తాడిగొట్లకు ప్రతినామమైన సోమగూడూరు పురాన్ని బ్రాహ్మణులకు అగ్రహారంగా ఇచ్చినట్లు తెలుపుతూ వుంది.

మొదటి త్రిపురారిదేవుని తరువాత అంబదేవుడు రాజైనాడు. కాయస్థ రాజులందరికంటె ఇతడు శక్తివంతుడు. శా.శ. 1194 - శా.శ. 1224 (క్రీ.శ. 1271-1302) మధ్యకాలంలో ఇతని శాసనాలు లభిస్తున్నాయి. ఇతడు అనేకమంది రాజులను జయించినాడు. కాకతీయులపై తిరుగుబాటుచేసి స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకున్నాడు. శా.శ. 1212 (క్రీ.శ. 1290-91) నాటి త్రిపురాంతకం శాసనం[134] ఇతని యుద్ధ విజయాలను వర్ణిస్తూ వుంది. ఇతడు శ్రీపతి గణపతి అనే రాజును జయించి అతనికున్న 'రాయసహస్రమల్ల' అనే బిరుదాన్ని గ్రహించినట్లు పై శాసనం పేర్కొంటూ వుంది.

గంగయసాహిణి మరణానంతరం కాయస్థులపై తిరుగుబాటు చేసిన వైదుంబ రాజులైన మురారికేశవ సోమేశ్వరులను, వారి మిత్రకూటమికి చెందిన అల్లు గంగరాజును - అంబదేవుడు శా.శ. 1209 ప్రాంతంలో ఓడించి ములికినాడు, పొత్తపి మొదలైన ప్రాంతాలను ఆక్రమించు కోవడమే గాక వారి రాజధానియైన వల్లూరు పట్టణాన్ని స్వాధీనం చేసుకొని తన రాజధానిగా చేసుకున్నాడు[135]. అంబదేవుడు పాండ్యులతో యుద్ధంచేసి వారిని జయించినప్పటికీ తన స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోవడానికి పొరుగు రాజ్యాలతో స్నేహ సంబంధాలు అవసరమని భావించి వారితో సంధి చేసుకున్నాడు.

శా.శ. 1213 ప్రాంతంలో కాకతీయ యువరాజు ప్రతాపరుద్రుడు, రాణి రుద్రాంబ తరపున అంబదేవునిపై దండెత్తి అతని రాజ్యంలోని ఉత్తర ప్రాంతాలను జయించినట్లు తెలుస్తూ వుంది. త్రిపురాంతకం, దాని పరిసర ప్రాంతాలలో శా.శ. 1213 తరువాత కాయస్థుల శాసనాలు కనిపించకపోవడం, అదే సంవత్సరంలో జారీచేయబడిన కాకతీయ సైన్యాధిపతి రేచెర్ల ముమ్మడి నాయునికి సంబంధించిన ఒక శాసనం[136] త్రిపురాంతకంలో లభించడం పై విషయాన్ని ధ్రువీకరిస్తూ వుంది. ఈ అపజయం తరువాత అంబదేవుడు పాండ్యులతోను, కాకతీయులకు శత్రువులైన దేవగిరి యాదవులతోను స్నేహ సంబంధాలు పెంచుకొని మిత్రకూటమిని ఏర్పరచుకున్నాడు.

గండికోట, వల్లూరు పట్టణాలను ఇతని రాజధానులుగా శాసనాలు పేర్కొంటున్నాయి. శా.శ. 1209 (క్రీ.శ. 1287) నాటి అత్తిరాల శాసనం[137] గండపెండార అంబదేవ మహారాజు

వల్లూరు పట్టణం రాజధానిగా గండికోట, ములికినాడు, రేనాడు, పెనదాడి, పెడకల్లు, స
ఏఱువ, పొత్తపినాడు మొదలైన దేశాలను ఏలుతూ వుండగా అతని మహా ప్రధాని ఘోడెరా
గంగిదేవయ్య అఱితురేవుల మహాస్థానంలోని పరశురామేశ్వరునికి, రామనాథునికి, భైరవు
కొన్ని దానాలను ఇచ్చినట్లు లేబాకలో అంత్రగంగను రాయసహస్రమల్లు కాలువను, తాళ్లపా
గండపెండార కాలువను త్రవ్వించి, ఓబిలిలో అంబసముద్రమనే చెఱువు కట్టిం
అంబాపురమనే ఊరు కట్టించి దానిని అగ్రహారంగా చేసినట్లు; బొడ్డదేవరపాడు అనే గ్రామ
అగ్రహారంగా చేసినట్లు-తెలుపుతూ వుంది. శా.శ. 1212 (క్రీ.శ. 1290) నాటి బ్రాహ్మణ
శాసనం[138] గండపెండార అంబయదేవుని మహాప్రధాని గోడెరాయ గంగిదేవయ్య రావుల కొల
శివపురం గ్రామాల మధ్య పొలిమేర నిర్ణయం చేసినట్లు తెలుపుతూ వుంది. శా.శ. 12
(క్రీ.శ. 1292) నాటి రాజంపేట శాసనం[139] అంబదేవ మహారాజు గండికోట రాజధాని
ములికినాడు, పెన్నదాడి, పులివెందల, శిరివోడు, పొత్తపి, జూలపల్లి, ఏఱువ మొదలైన దేశాల
పరిపాలిస్తూ వుండి, ఉత్తమ శివగురుదేవర కొడుకు సిద్ధ శివులకు, గుంజా నాగేశ్వరవ
కలుకుంట మొదలైన గ్రామాలను సర్వమాన్యంగా ఇచ్చినట్లు తెలుపుతూ వుంది. శా.శ. 12
(క్రీ.శ. 1298) నాటి పాత కడప శాసనం[140] గండపెండార అంబదేవ మహారాజు గండికో
రాజధానిగా పరిపాలిస్తూ ములికినాటి సీమలోని కడపలో అఘోర శివాచార్యుల శిష్యు
త్రిపురాంతక శివలయ్యకు క్షేత్రదానాన్ని ఇచ్చినట్లు తెలుపుతూ వుంది.

అంబదేవుని తరువాత అతని కుమారుడు రెండవ త్రిపురారిదేవుడు రాజ్యాని
వచ్చినాడు. శా.శ. 1226, క్రోధి సంవత్సర చైత్ర శుద్ధ సప్తమి, గురువారం నాటి వరికుం
శాసనం[141] అంబదేవ మహారాజు కుమారుడు త్రిపురారిదేవుడు సిద్ధనాథ దేవుని అంగ భోగాని
సకలి సీమలోని వరికుంట గ్రామాన్ని సాదసుంకెణషష్ఠాయ సహితంగా సర్వమాన్యంగా ఇచ్చిన
తెలుపుతూ వుంది. ఇతడు ములికినాడులోని వల్లూరు పట్టణం రాజధానిగా పరిపాలిస్తున్న
శా.శ. 1226, క్రోధి సంవత్సర వైశాఖ శుద్ధ పంచమి (క్రీ.శ. 1304, ఏప్రిల్, 5వ తేదీ) నా
లేబాక శాసనం[142] తెలుపుతూ వుంది. పై శాసనాలు ఇతని అధిరాజును పేర్కొనలేదు. కా
అంబదేవుని మరణానంతరం ఇతడు రాజ్యానికి వచ్చిన వెంటనే కాకతీయ సైన్యాధ్యక్షుడ
పట్టసాహిణి సోమయదండనాయకుడు కాయస్థ రాజ్యంపై దండయాత్ర చేసి త్రిపురారిదేవు
ఓడించడమే గాక అతనినుండి కప్పం వసూలు చేసినాడు. ఈ అపజయం తరువాత త్రిపురా
దేవుడు కొంతకాలం కాకతీయులకు సామంతునిగా వుండినప్పటికీ మరల వారిపై తిరుగుబాట
చేసినాడు. ఈ పర్యాయం కాకతీయుల మహాప్రధాని జుట్టయలెంక గొంకారెడ్డి కాయస్థ రాజ్యంపై
దండయాత్ర చేసి త్రిపురారిదేవుణ్ణి వధించడంతో కాయస్థ వంశం అంతమైంది. ఈ యుద్ధంల
విజయం సాధించినప్పటి నుండి మహమ్మద్ బిన్ తుగ్లక్ చేతిలో కాకతీయ సామ్రాజ్య
అంతరించే వరకు జుట్టయలెంక గొంకారెడ్డి ఈ ప్రాంతాన్ని పరిపాలించినాడు.

## 13. తెలుగు చోళులు

ఈ ప్రాంతాన్ని పరిపాలించిన మొదటి తెలుగుచోళరాజు నల్లసిద్ధి. ఇతడు మొదట కల్యాణీ చాళుక్యులకు సామంతునిగా వుండి క్రీ.శ. 1139లో మూడవ సోమేశ్వరుని మరణం తర్వాత స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకున్నాడు. క్రీ.శ. 1140 నాటి రాపూరు శాసనంలో[143] కాని, శా.శ. 1081 (క్రీ.శ. 1159) నాటి దొంగలసానిలోని చతుర్భాషా (కన్నడ, తెలుగు, తమిళ, మరాఠీ) శాసనంలో[144] కాని ఇతని అధిరాజును గురించిన ప్రస్తావన లేదు. గుండ్లవారిపల్లెలోని ఒక శాసనం[145] నల్లసిద్ధి ఆరవ రాజ్యసంవత్సరాన్ని ప్రస్తావిస్తూ వుంది. ఇతడు రాజ్య విస్తరణ కోసం దిగ్విజయ యాత్ర చేసి దొంగలసాని వద్ద జరిగిన యుద్ధంలో మల్లిదేవ సోమేశ్వరులను జయించి వారి రాజ్యమైన పొత్తపినాడును తన అధీనంలోకి తెచ్చుకున్నాడు[146]. ఆ తరువాత ఇతడు కాంచీ పట్టణంపై దండెత్తి దాన్ని వశపరచుకున్నట్లు తెలుస్తూ వుంది[147]. మొదటి నల్లసిద్ధి దిగ్విజయ యాత్ర తరువాత ముప్పై సంవత్సరాల వరకు తెలుగుచోళుల చరిత్రను గురించిన విషయాలేవీ తెలియడం లేదు.

మొదటి నల్లసిద్ధి తరువాత ఈ జిల్లాలోని తెలుగుచోళ ప్రాంతాను ఎఱమసిద్ధరాస కుమారుడు రెండవ (భుజబల) నల్లసిద్ధి పరిపాలించినాడు. క్రీ.శ. 1189-1217 మధ్య ప్రాంతంలో ఇతడు జారీచేసిన శాసనాలు నెల్లూరు, కడప జిల్లాలలో[148] లభిస్తున్నాయి. ఇతని పరిపాలనా కాలంలో జరిగిన సంఘటనలలో మూడవ కులోత్తుంగుని దండయాత్ర ప్రముఖమైంది. మొదటి నల్లసిద్ధి కాంచీ పట్టణాన్ని జయించినప్పటినుండి ఆ పట్టణం తెలుగుచోళుల అధీనంలోనే వుంది. చోళరాజు రెండవ రాజాధిరాజు దుర్బలుడు కావడంవల్ల కంచిని తిరిగి స్వాధీనం చేసుకోలేక పోయినాడు. కాని అతని తరువాత చోళ సింహాసనాన్ని అధిష్ఠించిన మూడవ కులోత్తుంగుడు క్రీ.శ. 1197లో కాంచీ పట్టణంపై దండెత్తి రెండవ నల్లసిద్ధిని ఓడించి ఆ పట్టణాన్ని స్వాధీనపరచుకున్నాడు[149]. రెండవ నల్లసిద్ధి కులోత్తుంగుని అధికారాన్ని అంగీకరించి నప్పటికీ కులోత్తుంగుడు నల్లసిద్ధి రాజ్యాన్ని రెండుగా విభజించి కాంచీ పట్టణంతోపాటు తూర్పు ప్రాంతమంతటికీ రెండవ నల్లసిద్ధి తమ్ముడు తమ్ముసిద్ధిని రాజుగా చేసినాడు. ఈ విభజన తర్వాత రెండవ నల్లసిద్ధికి పాకనాడులోని కొన్ని ప్రాంతాలతోపాటు అర్ధ రాజ్యం మాత్రమే మిగిలింది.

తిరుకాళత్తిదేవుడు (మొదటి తిక్కచోడుడు) మొదటి మనుమసిద్ధి కుమారుడు. ఇతని పసితనంలోనే తండ్రి మరణించడంవల్ల పినతండ్రులు రెండవ నల్లసిద్ధి, తమ్ముసిద్ధి సింహాసనాన్ని ఆక్రమించుకొని ఇతడు యుక్తవయస్కుడైన తర్వాత కూడా రాజ్యాన్ని ఇతనికి అప్పగించలేదు. అందువల్ల తిరుకాళత్తి దేవుడు కాకతీయ చక్రవర్తి గణపతిదేవుని సహాయాన్ని అర్థించి దాయాదుల (పినతండ్రుల) నుండి తన రాజ్యాన్ని స్వాధీనం చేసుకున్నాడు. పట్టపురాయి లోని విభవ సంవత్సరం నాటి ఒక శిథిల శాసనం[150], శా.శ. 1153 (క్రీ.శ. 1231) నాటి మద్దులేటిగడ్డ[151], బెడుసుపల్లి[152] శాసనాలు, శా.శ. 1159 (క్రీ.శ. 1238) నాటి ఓగూరు[153] శాసనం

తిరుకాళత్తిదేవుని పరిపాలనను ప్రస్తావిస్తున్నాయి. పట్టపురాయి శాసనంలో పేర్కొనబడిన విభవ సంవత్సరం క్రీ.శ. 1208తో సంవదిస్తూ వుంది. ఈ శాసనం తిరుకాళత్తి దేవుని పరిపాలన తొలి సంవత్సరాల నాటిది కావచ్చు.

తిరుకాళత్తిదేవుడు తన పరిపాలన కాలమంతా శత్రువులతో యుద్ధాలతోనే గడపవలసి వచ్చింది. యాదవరాజు సింగణదేవుడు ఇతని రాజ్యంలోని పశ్చిమ ప్రాంతాలపై దాడిచేసి సిద్ధవటం తాలూకాలోని కురుమలూరు వరకు చొచ్చుకొని వచ్చినాడు. కాని తిరుకాళత్తిదేవుని చేతిలో పరాజితుడై వెనుదిరిగినాడు. హోయసలలు దక్షిణ ప్రాంతంపై దాడి చేసినారు. ఈ యుద్ధంలో తిరుకాళత్తిదేవుడు రెండవ బల్లాళుణ్ణి సంహరించి అతని మనుమడైన సోమేశ్వరుణ్ణి ఓడించినాడు.

తెలుగుచోళ వంశస్థులలో తిరుకాళత్తిదేవుడు చాలా శక్తివంతుడు. ఇతని కాలంలో కందుకూరు నుండి కాంచీపురం వరకు గల తూర్పుతీర ప్రాంతం, పశ్చిమంలో కడప జిల్లాలోని రాజంపేట, సిద్ధవటం, ప్రొద్దుటూరు, కడప తాలూకాలు వీరి అధీనంలో వున్నాయి. నలభై సంవత్సరాల పరిపాలన తర్వాత క్రీ.శ. 1247 ప్రాంతంలో తిరుకాళత్తిదేవుడు మరణించి వుండవచ్చు.

తిరుకాళత్తిదేవుని తరువాత అతని కుమారుడు రెండవ మనుమసిద్ధి రాజ్యానికి వచ్చినాడు. ఇతడు రాజ్యానికి వచ్చిన వెంటనే రాజ్యంలో తిరుగుబాట్లను, పర రాజుల దాడులను ఎదుర్కొనవలసి వచ్చింది. కాకతీయ చక్రవర్తి గణపతిదేవుని సహకారంతో వాటిని సమర్థతతో అణచివేసినాడు. కాని పాండ్యరాజు మొదటి జటావర్మ సుందర పాండ్యునితో క్రీ.శ. 1263లో నెల్లూరు సమీపంలోని ముత్తుకూరు వద్ద జరిగిన యుద్ధంలో రెండవ మనుమసిద్ధి మరణించినాడు[154]. ఇతని మరణం తర్వాత అర్థ శతాబ్దికి పైగా ఈ జిల్లాలో తెలుగుచోళుల పరిపాలనకు సంబంధించిన ఆధారాలు లభించలేదు.

శా.శ. 1244 (క్రీ.శ. 1323) నాటి తాళ్ల పొద్దుటూరు శాసనం[155] తెలుగుచోళ వంశానికి చెందిన జగతాపి గంగయదేవ చోడమహారాజు ప్రశస్తిని చాటుతూ వుంది. ఈ శాసనం ఇతణ్ణి ఒఱయూరుపురవరాధీశ్వరునిగా పేర్కొనింది.

## 14. విజయనగర రాజులు

విజయనగర సామ్రాజ్య స్థాపన తరువాత కొద్దికాలానికే కడప జిల్లా ఆ సామ్రాజ్యంలో భాగమైంది. హరిహరరాయలు, బుక్కరాయలు కేంద్రం నుండి పరిపాలన సాగిస్తుండగా వారి తమ్ములు, కంపన, మారప, ముద్దపలు సామ్రాజ్యంలోని వివిధ ప్రాంతాలకు రాజ్యపాలకులుగా వ్యవహరించినారు. కంపన ఉదయగిరి రాజ్యపాలకునిగా నియమితు డైనాడు. ఉదయగిరి రాజ్యం నేటి కడప జిల్లాతోపాటు నెల్లూరు జిల్లాలోని కొన్ని ప్రాంతాలతో కూడిన రాజ్యవిభాగం. కంపరాయలు క్రీ.శ. 1343 నుండి క్రీ.శ. 1354లో అతడు

మరణించేంతవరకు ఉదయగిరి రాజ్యపాలకునిగా వ్యవహరించినాడు. కంపరాయల మరణానంతరం అతని పెద్ద కుమారుడు సావణ్ణ ఉదయగిరి రాజ్యపాలకునిగా నియమించబడినాడు. ఈ జిల్లాలోని శాసనాలలో శా.శ. 12 [84] (క్రీ.శ. 1363-64) నాటి గొడ్లవీడు లోని ఒకే ఒక శాసనం[156] మొదటి కంపరాయల కుమారుడు వీర సావణ్ణ ఒడయలు ఉదయగిరి రాజ్యాన్ని పరిపాలిస్తున్నట్లు తెలుపుతూ వుంది. ఈ శాసనంలో సావణ్ణ, 'పూర్వసముద్రాధిపతి' గా వర్ణించబడినాడు.

మొదటి హరిహరరాయల మరణానంతరం క్రీ.శ. 1356లో మొదటి బుక్కరాయలు విజయనగర సింహాసనాన్ని అధిష్ఠించినాడు. శా.శ. 1272 (క్రీ.శ. 1350) నాటి రామాపురం శాసనం[157] ఈ జిల్లాలో బుక్కరాయల పరిపాలనను పేర్కొంటున్న తొలి శాసనం. మొదటి బుక్కరాయల కాలంలో అతని కుమారుడు భాస్కర భవదూరుడు ఉదయగిరి రాజ్యపాలకునిగా నియమించబడినాడు. ఇతనికి సంబంధించిన శాసనాలు పోరుమామిళ్ల[158], దూలంవారిపల్లె[159] గ్రామాలలో లభించినాయి. శా.శ. 1292 (క్రీ.శ. 1370) నాటి చిన్నదాసరిపల్లె శాసనం[160] బుక్కరాయల సామంతుడైన మహామండలేశ్వర మీసరగండకఠారి సాళువ మంగయదేవ మహారాజు ములికినాటిలోని పెండ్లిమఱ్ఱి, తుమ్మలూరులను పరిపాలిస్తున్నట్లు తెలుపుతూ వుంది. ఈ మంగయదేవుడే కుమార కంపన సేనానాయకుడైన సాళువ మంగు. పై శాసనం సాళువ వంశానికి చెందిన పరిపాలకులను పేర్కొంటున్న మొట్టమొదటి శాసనంగా కనిపిస్తూ వుంది.

మొదటి బుక్కరాయల మరణానంతరం అతని కుమారుడు రెండవ హరిహరరాయలు సింహాసనాన్ని అధిష్ఠించి క్రీ.శ. 1404 వరకు విజయనగర రాజ్యాన్ని పరిపాలించినాడు. రెండవ హరిహరరాయల కాలంలో అతని కుమారుడు మొదటి దేవరాయలు ఉదయగిరి రాజ్యపాలకునిగా నియమించబడినాడు. దుందుభి సంవత్సరం (శక సంవత్సరాన్ని తెలుపుతున్న భాగం చెఱిగిపోయింది. ఈ దుందుభి సంవత్సరం శా.శ. 1204తో సరిపోలుతుంది.) నాటి పంచలింగాల శాసనం[161] మహారాజకుమారుడైన ప్రౌఢ దేవరాయలను పేర్కొంటూ వుంది. ఇతడు రెండవ హరిహరరాయల కుమారుడైన మొదటి దేవరాయలనే విషయం స్పష్టం. మొదటి దేవరాయలు శక్తివంతుడే కాక సామ్రాజ్య విస్తరణ కాంక్ష కలిగినవాడు. ఇతడు ఉదయగిరి రాజ్యపాలకుడుగా వున్న ముప్పై ఆరు సంవత్సరాల (క్రీ.శ. 1370 నుండి క్రీ.శ. 1406 వరకు) కాలంలో కొండవీటి రెడ్డి రాజులను, రాచకొండ వెలమలను ఓడించి విజయనగర సామ్రాజ్యాన్ని కృష్ణానది వరకు విస్తరింపజేయడానికి ప్రయత్నించినాడు.

క్రీ.శ. 1404లో రెండవ హరిహరరాయల మరణానంతరం విజయనగర రాజ్యంలో కల్లోలిత పరిస్థితి ఏర్పడింది. ఈ కల్లోలాన్ని అణగద్రొక్కి క్రీ.శ. 1406లో మొదటి దేవరాయలు విజయనగర సింహాసన్నాన్ని అధిష్ఠించినాడు. ఇతడు తన జ్యేష్ఠ పుత్రుడైన రామచంద్రుణ్ణి ఉదయగిరి రాజ్యపాలకునిగా నియమించినాడు. మొదటి దేవరాయల చివరి పరిపాలనా సంవత్సరాలలో అప్రతిమల్ల వంశానికి చెందిన తెలుగుచోడరాజు అహోబలచోడుడు తిరుగుబాటు

చేసి పుష్పగిరి, దాని పరిసర ప్రాంతాలలో స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించినాడు. శా.శ. 1342 (క్రీ.శ. 1420) నాటి గోటూరు లోని ఒక శాసనం[162] అహోబలచోడరాజును పేర్కొంటూ వుంది. ప్రౌఢదేవరాయలు (మొదటి దేవరాయలు), అతని కుమారుడు విజయరాయలు పెద్ద సైన్యంతో దాడిచేసి అహోబలచోడుని ఓడించి అతని రాజధానిని ధ్వంసం చేసినారు[163].

ఈ జిల్లాలో మొదటి దేవరాయలకు సంబంధించిన కొన్ని శాసనాలు లభించినాయి. తుడుముల దిన్నెలోని కాలనిర్ణయం లేని ఒక శాసనం[164] ప్రౌఢ దేవరాయలు తురుమిళ్లదిన్నె గ్రామాన్ని నాచనసోమునికి ఏకభోగ అగ్రహారంగా ఇచ్చినట్లు తెలుపుతూవుంది.

మొదటి దేవరాయల మరణానంతరం క్రీ.శ. 1422లో రామచంద్రుడు సింహాసనాన్ని అధిష్ఠించి ఆరు నెలలు పరిపాలించినాడు. ఇతని తరువాత ఇతని సోదరుడైన మొదటి విజయరాయలు క్రీ.శ. 1430 వరకు విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించినాడు. ఇతని కాలంలో ఇతని జ్యేష్ఠ పుత్రుడు రెండవ దేవరాయలు పరిపాలనా వ్యవహారాలను నిర్వహించినాడు. క్రీ.శ. 1430లో విజయరాయల మరణానంతరం రెండవ దేవరాయలు సింహాసనాన్ని అధిష్ఠించినాడు. ఇతని కాలంలో విజయనగర సామ్రాజ్యం కృష్ణానది వరకు విస్తరించింది.

క్రీ.శ. 1446లో రెండవ దేవరాయల మరణానంతరం మల్లికార్జునరాయలు సింహాసనాన్ని అధిష్ఠించి క్రీ.శ. 1466 వరకు పరిపాలించినాడు. ఇతని తరువాత రెండవ విరూపాక్ష రాయలు రాజ్యానికి వచ్చినాడు. ఇతడు బలహీనుడు కావడం వల్ల ఇతని సామంతుడైన సాళువ నరసింహరాయలు సంగమ వంశాన్ని నిర్మూలించి క్రీ.శ. 1485లో విజయనగర సింహాసనాన్ని ఆక్రమించుకున్నాడు.

సాళువ నరసింహరాయల పరిపాలనా కాలంలో పురుషోత్తమ గజపతి ఉదయగిరి రాజ్యాన్ని ఆక్రమించుకున్నాడు. ఉదయగిరి గజపతుల వశమైనప్పటికీ గండికోటసీమ నరసింహరాయల అధీనంలోనే వుండినట్లు శా.శ. 1426 (క్రీ.శ. 1503) నాటి పాలగిరి శాసనం ద్వారా[165] తెలుస్తూ వుంది. ఈ శాసనం ఇమ్మడి నరసింహరాయల దండనాయకుడైన నరసా నాయకుణ్ణి పేర్కొంటూ వుంది. సాళువ నరసింహరాయల కాలంలో ఎఱ్ఱపాడు పాలకులైన సంబెట వంశస్థులు తిరుగుబాటు చేసినారు. ఈ వంశానికి చెందిన శివరాజు తన సరిహద్దు సీమలలో పన్నులు వసూలుచేసి విజయనగరాధికారాన్ని ధిక్కరించినాడు. ఇంకొక సంబెట నాయకుడు వీరనరసింహుడు సరిహద్దు ప్రాంతాలను ఆక్రమించినాడు. కాని ఈ తిరుగుబాట్లను సాళువ నరసింహరాయలు సమర్థవంతంగా అణచి వేసినాడు. కడప జిల్లాలో సాళువ నరసింహరాయలకు సంబంధించిన కొన్ని శాసనాలు లభించినాయి. ఇతని సేనాధిపతియైన నరసానాయకుడు ముత్తుకూరు[166], రావులకొలను[167], రామేశ్వరం[168], పాలగిరి[169] మొదలైన గ్రామాలలో శాసనాలను జారీ చేసినాడు.

తుళువ వంశానికి చెందిన వీరనరసింహరాయల శాసనాలు రామేశ్వరం[170], అరకట

వేముల[171] మొదలైన గ్రామాలలో లభించినాయి. శ్రీకృష్ణదేవరాయల కాలంలో పట్టూరుపాళెం స్థాపకుడైన ముసలినాయుడు సైన్యాన్ని సమీకరించుకొని తిరుగుబాటు చేసినాడు. ఈ తిరుగుబాటును అణచడానికి వచ్చిన రాయల సైన్యాన్ని ఎదిరించలేక ముసలినాయుడు లంకమల అడవులలోకి పారిపోయినాడు. శ్రీకృష్ణదేవరాయల పుష్పగిరి యాత్ర సందర్భంలో ముసలినాయుడు తన లొంగుబాటును రాయల సామంతుడైన కామరసు తిమ్మయ ద్వారా తెలియజేసినాడు. శ్రీకృష్ణదేవరాయలు అతనిని క్షమించి పుష్పగిరి, పేర్నిపాడు గ్రామాల మధ్య వుండే అరణ్య ప్రాంతాన్ని జాగీరుగా ఇచ్చినాడు[172].

ఈ జిల్లాలో లభించిన శ్రీకృష్ణదేవరాయలకు సంబంధించిన శాసనాలలో రాచిరాజు[173], బుక్కరాజు తిమ్మరాజు[174], జూపల్లి పెదసింగ మహీపాలుడు[175], అవసరం దేమరుసయ్య[176], రాయసం అయ్యపరుసు[177] మొదలైన నాయంకరులు పేర్కొనబడినారు. శా.శ. 1432 (క్రీ.శ. 1510) నాటి నందిమండలం శాసనం[178] శ్రీకృష్ణదేవరాయల సకల సేనాధిపతియైన కామళ్ళాయనిం గారిని పేర్కొంటూ వుంది. శా.శ. 1439 (క్రీ.శ. 1517) నాటి దేవునికడప శాసనం[179] శ్రీకృష్ణదేవరాయల సర్వ ప్రధానియైన తిమ్మరుసయ్యం గారిని పేర్కొంటూ వుంది. శా.శ. 1449 (క్రీ.శ. 1527) నాటి తిప్పలూరు శాసనం[180] శ్రీకృష్ణదేవరాయ మహారాయలు అష్టదిగ్గజ కవీశ్వరులకు తిప్పలూరును అగ్రహారంగా ఇచ్చినట్లు తెలుపుతూ వుంది. శా.శ. 1431 (క్రీ.శ. 1509) నాటి పులివెందల[181], శా.శ. 1451 (క్రీ.శ. 1529) నాటి తుడుముల దిన్నె[182] శాసనాలు శ్రీకృష్ణదేవరాయల పరిపాలన ప్రారంభం నుండి అతని చివరి రాజ్య సంవత్సరం వరకు కడప జిల్లా విజయనగరాధిపత్యంలో వుండినట్లు తెలుపుతున్నాయి.

అచ్యుతదేవరాయలకు, సదాశివరాయలకు సంబంధించిన అనేక శాసనాలు ఈ జిల్లాలో లభించినాయి. సదాశివరాయల కాలంలో అళియ రామరాయలు పరిపాలనా వ్యవహారాలను నిర్వహించినాడు.

రాక్షసి తంగడి యుద్ధం తరువాత విజయనగర సామ్రాజ్య రాజధాని విజయనగరం నుండి పెనుగొండకు మార్చబడింది. పూర్వపు సామ్రాజ్యమంతా రాక్షసి తంగడి యుద్ధం తరువాత రాజైన తిరుమలరాయల అధీనంలో లేకపోయినప్పటికీ ఇతడు తన రాజ్యాన్ని విజయనగర రాజ్యంగానే పేర్కొన్నాడు. కడప జిల్లా కూడ తిరుమలరాయల పాలనలో వుండింది. తిరుమల రాయల తరువాత అతని కుమారుడైన మొదటి శ్రీరంగరాయలు రాజ్యానికి వచ్చినాడు. శా.శ. 1496 (క్రీ.శ. 1574) నాటి పొన్నతోట శాసనం[183] శ్రీరంగరాయలు పెనుగొండ రాజధానిగా విజయనగర రాజ్యాన్ని పరిపాలిస్తున్నట్టు తెలుపుతూ వుంది. ఈ శాసనం ఈ రాజుకు సంబంధించిన తొలి శాసనం. మొదటి శ్రీరంగరాయల తరువాత అతని సోదరుడైన మొదటి వెంకటపతిరాయలు సింహాసనాన్ని అధిష్ఠించినాడు. ఇతని కాలంలో గోల్కొండ నవాబు కులీ కుతుబ్‌షా మంత్రి అమీర్-ఉల్-ముల్క్ దండయాత్ర చేసి కర్నూలు జిల్లాను; కడప, అనంతపురం జిల్లాలలో కొన్ని ప్రాంతాలను ఆక్రమించుకున్నాడు. కాని కొద్ది కాలానికే వెంకటపతి

రాయలు తన సైన్యాన్నంతటినీ కూడగట్టుకొని ముస్లిం పరిపాలకులను ఓడించి వారిని కృష్ణానది వరకు తరిమి కొట్టినాడు. గోల్కొండ నవాబు కులీ కుతుబ్‌షా కృష్ణానదిని గోల్కొండ, విజయనగర రాజ్యాలకు సరిహద్దుగా అంగీకరించినాడు[184].

రెండవ వెంకటపతిరాయల కాలంలో రాయలసీమలోని అనేకమంది సామంతులు తిరుగుబాటు చేసినారు. గండికోట పాలకుడైన నంద్యాల కృష్ణమరాజు పొత్తపి, సిద్ధవటం సీమలను పరిపాలిస్తున్న కొండరాజు, తిప్పరాజులతో కలసి తిరుగుబాటు చేసినాడు. మట్లి ఎల్లమరాజు, దేవప్ప నాయకుడు, పెమ్మసాని తిమ్మనాయుడు మొదలైన సామంతుల సహాయంతో రెండవ వెంకటపతి రాయలు ఈ తిరుగుబాటును అణచి వేసినాడు. ఈ తిరుగుబాటును అణచి వెయ్యడంలో తనకు చేసిన సహాయానికి ప్రతిఫలంగా రెండవ వెంకటపతిరాయలు, పెమ్మసాని తిమ్మనాయునికి గండికోటను, మట్లి ఎల్లమరాజుకు సిద్ధవటం సీమను ఇచ్చినాడు. శా.శ. 1527 (క్రీ.శ. 1605) నాటి సిద్ధవటం శాసనం[185] వెంకటపతిరాయల తరపున ఎల్లమరాజు, ఊటుకూరు యుద్ధంలో సిద్ధవటాన్ని జయించినట్లు తెలుపుతూ వుంది.

క్రీ.శ. 1645 ప్రాంతంలో గోల్కొండ నవాబు అబ్దుల్ కుతుబ్‌షా మంత్రియైన మీర్ జుమ్లా గండికోట, సిద్ధవటం కోటలను ఆక్రమించినంత వరకు కడప జిల్లా పెమ్మసాని, మట్లి వంశస్థుల పాలనలో వుండింది.

# సూ చి క లు


1. D.C. Sircar : Erragudi Edicts of Asoka; Epigraphia Indica. 1959.
2. S. Beal : Buddhist Records of the Western World.
3. యం. రామారావు (సం.) : శాతవాహన సంచిక.
4. Annual Report of the Department of Archaeology and Museums, Andhra Pradesh, 1976-77.
5. Bh. Sivasankaranarayana : Andhra Pradesh District Gazetteers, Cuddapah.
6. E.I., Vol. XX, pp. 18–19. (Ayaka Pillar Inscription, B.4).
7. యన్.వి. రమణయ్య : కడప శిలా శాసనములు వగయురా; పుట. 8
8. I.A., Vol. V, P. 50.
9. C.I.I., Vol. III, P. 14
10. E.I. Vol. XI, P. 337 (Malepadu Plates of Punyakumara.)
11. E.I., Vol. XXX, pp. 12-17.
12. I.A.P., C.D., Part I, No. 45
13. యన్.వి. రమణయ్య : పూర్వోద్ధృతము, పుట, 19.
14. A.R., No. 339 of 1940-41.
15. S.I.I., Vol. IX. i., No. 49.
16. I.A.P., C.D., Part I, No. 43
17. యన్.వి. రమణయ్య : పూర్వోద్ధృతము; పుట 65.
18. E.I., Vol. XI, p. 337.
19. I.A.P., C.D., Part I, No. I.
20. Ibid. No. II.
21. P.V. Parabrahma Sastry : I.A.P., C.D., Part I, Introduction, p. XI.
22. Ibid.
23. A.R., No. 352 of 1905.
24. I.A.P., C.D., Part I, No. 11.
25. దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డి : తొలి తెలుగు శాసనం - దేశి కవిత; పరిశోధన, ఏప్రిల్, 1954.
26. E.I., Vol. XXVII, pp. 221-22.
27. P.V. Parabrahma Sastry : Opp. Cit., p. X.
28. Ibid.
29. I.A.P., C.D., Part I No. IV & I.
30. Ibid. No. 2
31. Ibid. No. I
32. Ibid. No. 14.
33. మాలేపాడు, దొమ్మరి నంద్యాల తామ్ర ఫలకాలు.
34. E.I., Vol. XXX, p. 12.
35. I.A.P., C.D., Part I, No. 17.
36. E.I., Vol. XXVII, pp. 236-37.
37. Ibid. pp. 238-40.
38. I.A.P., C.D., Part I, No. 18.
39. A.R., No. 407 of 1942-43.
40. A.R., No. 402 of 1940-41.
41. యన్.వి. రమణయ్య : పూర్వోద్ధృతము; పుట. 81.
42. I.A.P., C.D., Part I, No. 106
45. Ibid., No. 69.
46. యన్.వి. రమణయ్య : పూర్వోద్ధృతము; పుట. 81.
47. I.A.P., C.D., part I, No. 65.

48. యన్.వి. రమణయ్య : పూర్వోద్ధృతము; పుట. 83
49. E.I., Vol. XXX, pp. 12-17
50. I.A.P., C.D., Part I, No. 38
51. Ibid., No. 43
52. Ibid., No. 46
53. Ibid., No. 47.
54. Ibid., No. 48.
55. A.R., No. 149 of 1945-46.
56. A.R., No. 327 of 1922.
57. A.R., No. 439 of 1914.
58. I.A.P., C.D., Part I, No. 59.
59. Ibid., No. 72.
60. Ibid., No. 69.
61. A.R., No. 191 of 1937-38.
62. I.A.P., C.D., Part I, No. 61.
63. E.I., Vol. XXIV, p. 183.
64. Journal of the Madras University, Vol. XII–2.
65. Journal of the University of Gauhati, Vol. III, 1952.
66. I.A.P., C.D., Part I, No. 63.
67. P.V. Parabrahma Sastry : Opp. Cit. : P. XVIII.
68. I.A.P., C.D: Part I No. 64
69. Ibid., No. 66
70. Ibid., No. 68
71. Ibid., No. III
72. Ibid., No. 65
73. Ibid., No. 74
74. A.R. No. 446 of 1940-41.
75. I.A.P., C.D., Part I, No. 71.
76. Ibid., No. 121
77. Ibid., No. 131
78. Ibid., No. 133.
79. ఈ శాసనాన్ని ముండ్లపాడు గ్రామ నివాసి శ్రీ విఠపు కృష్ణమూర్తి గారు గుర్తించి నారు. ఈ శాసనం, శాసనాధ్యయన శాఖ నివేదికలలో ఇంకా నమోదు కాలేదు.
80. A.R., No. 106 of 1929-30.
81. A.R., No. 580 of 1907
82. A.R., No. 598 of 1907
83. *రంగదుదార కీర్తియగు రక్కొన గంగన బెంజెలంబుమై*
*భంగమొనర్చి మన్మ నృపాలుడు బల్విడి నాచికొన్న రా*
*జ్యాంగములెల్లనిచ్చి తన యాశ్రిత వత్సలవృత్తి యేర్పడన్*
*గంగయ సాహిణిం బదము గైకొన బంచె బరాక్రమోన్నతిన్*
(1-41)
84. A.R., No. 319, of 1905.
85. యన్.వి. రమణయ్య : పూర్వోద్ధృతము, పుట. 104
86. A.R., No. 226 of 1937-38.
87. A.R. No. 622 of 1907.
88. S.I.I., Vol. X, No. 465.
89. Ibid., No. 448.
90. A.R. No. 143 of 1945-46.
91. I.A.P., C.D., Part I, No. 162.
92. Bh. Sivasankara Narayana : Opp. Cit.; p. 76.
93. I.A.P., C.D., Part I, No. 87.
94. A.R., No. 323 of 1940-41.
95. I.A.P., C.D., Part I No. 84
96. Ibid., No. 85.
97. Ibid., No. 168.
98. Ibid., No. 83.
99. Ibid., No. 88.
100. Ibid., No. 91.
101. S.I.I., Vol. III, No. 52.
102. A.R., No. 279 of 1895.

103. S.I.I., Vol. III, No. 20.
104. Ibid., No. 30.
105. I.A.P., C.D., Part I, No. 123.
106. Bh. Sivasankara Narayana : Opp. Cit.
107. Ibid.
108. Ibid.
109. A.R., No. 315 of 1935-36.
110. యన్.వి. రమణయ్య : పూర్వోద్ధృతము; పుట : 11-12.
111. పైదే, పుట. 2
112. I.A.P., C.D., Part I, No. 124.
113. Ibid., No. 141.
114. యన్.వి. రమణయ్య : పూర్వోద్ధృతము; పుట. 106.
115. A.R., No. 69 of 1929-30.
116. A.R., No. 267 of 1949-50.
117. యన్.వి. రమణయ్య : పూర్వోద్ధృతము; పుట. 103.
118. కుందూరి ఈశ్వరదత్తు : ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము.
119. I.A.P., C.D., Part I, No. 137.
120. Annual Report of the Department of Archaeology and Museums, Andhra Pradesh, 1977-78, pp. 24-25.
121. A.R., No. 33 of 1939-40.
122. A.R., No. 595 of 1901.
123. I.A.P., C.D., Part I, No. 141.
124. A.R., No. 324 of 1930-31.
125. యన్.వి. రమణయ్య : పూర్వోద్ధృతము; పుట. 13.
126. S.I.I., Vol. X, No. 402.
127. I.A.P., C.D., Part I, No. 142.
128. యన్.వి. రమణయ్య : పూర్వోద్ధృతము, పుట. 13.
129. A.R., No. 550 of 1909-10.
130. యన్.వి. రమణయ్య : పూర్వోద్ధృతము; పుట. 13
131. పైదే. పుట. 305-6
132. పైదే. పుట. 14
133. పైదే. పుట. 14
134. S.I.I., Vol. X., No. 465
135. Ibid, App. P-I-II.
136. Ibid. No. 471.
137. యన్.వి. రమణయ్య : పూర్వోద్ధృతము; పుట 976-7.
138. I.A.P., C.D., Part I, No. 145.
139. Ibid., No. 146.
140. యన్.వి. రమణయ్య : పూర్వోద్ధృతము; పుట. 267.
141. I.A.P., C.D., Part I, No. 153.
142. Ibid. No. 152.
143. యన్.వి. రమణయ్య : పూర్వోద్ధృతము; పుట. 98.
144. I.A.P., C.D., Part I, No. 128.
145. Ibid., No. 110.
146. Ibid., No. 128.
147. E.I., Vol. VII, p. 119-28.
148. యన్.వి. రమణయ్య : పూర్వోద్ధృతము, పుట. 99.
149. పైదే.
150. I.A.P., C.D., Part I, No. 120.
151. Ibid., No. 107.
152. Ibid., No. 109.
153. Ibid., No. 111.

154. యన్.వి. రమణయ్య : పూర్వోద్ధృతము; పుట. 101.
155. I.A.P., C.D., Part I, No. 159.
156. Ibid. Part II,No. 10.
157. Ibid., No. 6
158. Ibid. No. 11
159. Ibid. No. 14
160. Ibid. No. 12
161. Ibid. No. 17
162. యన్.వి. రమణయ్య : పూర్వోద్ధృతము; పుట. 49.
163. K.A.N. Sastry and Dr. N.V. Ramanayya : Further source of Vijayanagara Empire, Vol. I, p. 93.
164. I.A.P., C.D., Part II, No. 27.
165. A.R., No. 321 of 1935-36
166. I.A.P., C.D. Part II, No. 52
167. Ibid. Nos. 53, 54
168. Ibid. No. 55
169. A.R. No. 321 of 1935-36.
170. I.A.P., C.D., Part II, No. 62
171. Ibid. No. 63
172. కె. శ్రీనివాసులు : గండికోటసీమ చరిత్ర – సంస్కృతి; పుట. 85.
173. I.A.P., C.D., Part II, No. 69.
174. Ibid., No. 84.
175. Ibid. Nos. 87
176. Ibid. Nos. 88, 89 & 90
177. Ibid. Nos. 97 & 102.
178. Ibid. No. 60
179. Ibid. No. 75
180. Ibid. No. 95
181. Ibid. No. 65
182. Ibid. No. 103
183. యన్.వి. రమణయ్య : పూర్వోద్ధృతము; పుట. 53.
184. పైదే.; పుట. 54
185. I.A.P., C.D., Part III, No. 244.

# మూడవ అధ్యాయం

# సామాజిక జీవనం

## 1. వర్ణ వ్యవస్థ

ఈ అధ్యయన పరిధిలోని కాలంలో భారతదేశంలోని ఇతర ప్రాంతాలలో వలెనే ఈ జిల్లాలో కూడా సామాజిక జీవితం వర్ణ వ్యవస్థతో ముడిపడి వుండేది. వివిధ వర్ణాలవారు నిర్వహించవలసిన విధులనుగురించిన ప్రస్తావనలు శాసనాలలో అక్కడక్కడా కనిపిస్తున్నాయి. వర్ణాశ్రమ ధర్మాలను రక్షించడం రాజధర్మంగా భావించబడింది. ఒక దశలో జైన బౌద్ధాల నుండి, తరువాతి కాలంలో ఇస్లాం మతం నుండి వైదిక ధర్మాన్ని రక్షించడానికి వైదిక సమాజాన్ని సంఘటితం చెయ్యవలసిన అవసరం పరిపాలకులకు ఏర్పడింది. వైదిక ధర్మానికి, వర్ణ వ్యవస్థకు అవినాభావ సంబంధం వుంది. అందుకే వర్ణ వ్యవస్థను పటిష్టం చెయ్యడం, ఆశ్రమ ధర్మాలను రక్షించడం తమ కర్తవ్యంగా వారు భావించినారు. ఈ దీక్షా నిర్వహణలో తమ సాఫల్యాన్ని ప్రశస్తులలో చాటుకున్నారు. ఇటువంటి ప్రశస్తి వాక్యాలు గుప్తుల కాలం నుండి శాసనాలలో కనిపిస్తున్నాయి[1]. శా.శ. 1104 (క్రీ.శ. 1182) నాటి పుష్పగిరి శాసనంలో[2] పల్లవ వంశానికి చెందిన చిద్దణదేవ మహారాజు 'చాతుర్వర్ణాశ్రమధర్మ ప్రతిష్ఠాపితుడు'గా పేర్కొన బడినాడు. శా.శ. 1182 (క్రీ.శ. 1260) నాటి పొందలూరు శాసనంలో[3] గణపతిదేవుని సామంతుడైన జన్నిగదేవుడు 'చాతుర్వర్ణ సముద్ధరణుడు'గా ప్రశంసించబడినాడు. సమాజంలో ప్రధానమైన నాలుగు వర్ణాలు, ఇతర సంకర జాతుల అస్తిత్వాన్ని గురించి శాసనాలు సాక్ష్యమిస్తున్నాయి. శా.శ. 1225 (క్రీ.శ. 1302) నాటి పుష్పగిరిలోని ఒక శాసనంలో[4] సాక్షులుగా 'ముఖ్యమైన చాతుర్వర్ణములవారు' పేర్కొనబడినారు. శా.శ. 1469 (క్రీ.శ. 1547) నాటి లోమడ శాసనంలో[5] బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర, సంకర జాతులు మొదలైన వారి ప్రస్తావన వుంది.

బ్రాహ్మణుల ప్రసక్తి వున్న శాసనాలు అసంఖ్యాకంగా వున్నాయి. క్షత్రియ వర్ణజులైన పరిపాలకుల ప్రసక్తి అక్కడక్కడా శాసనాలలో కనిపిస్తుంది. రేనాటిచోళుల ప్రశస్తిలో 'క్షత్రియ' అనే పదం లేకపోయినా 'దినకరకులనందన కాశ్యప గోత్ర కరికాలాన్వయ' - ఇత్యాది ప్రయోగం

-వారి సూర్యవంశ క్షత్రియత్వాన్ని తెలియజేస్తూ వుంది. శా.శ. 1154 (క్రీ.శ. 1234) నాటి అబ్బవరంలోని ఒక శాసనంలో[6] వైదుంబ వంశానికి చెందిన రాయదేవ మహారాజు 'క్షత్రియ పవిత్రుడు'గా పేర్కొనబడినాడు. అబ్బవరంలోనే వున్న కాలనిర్ణయం లేని ఇంకొక శాసనంలో[7] బహుశః ఇతడే 'క్షత్రియకులపవిత్ర యాత్రేయగోత్ర' – అని ప్రశంసించబడినాడు. శా.శ. 1176 (క్రీ.శ. 1255) నాటి పుష్పగిరిలోని ఒక శాసనంలో[8] పల్లవ వంశానికి చెందిన ఖండెరాయ మహారాజు 'రవికుల క్ష్మాపాల భూషామణి'గా ప్రశంసించబడినాడు. ఈ శాసనంలోనే గంగ సేనాపతి 'కాయస్థ వంశార్ణవ కర్ణధారుడు'గా చెప్పబడినాడు.

వైశ్యుల ప్రస్తావన వున్న శాసనాలు ఈ ప్రాంతంలో కనిపించటం లేదు. శా.శ. 1335 (క్రీ.శ. 1413) నాటి లేబాక శాసనంలో[9] 'కోటనెలూరి వ్యవహారి వేటండ్ల గోత్రం సాదేపల్లి శింగమశెట్టి కొడుకు మల్లు' పేర్కొనబడినాడు. కాని నామాంతంలో శెట్టి అనే పదం వైశ్యులకు మాత్రమే పరిమితమైంది కాకపోవడం వల్ల, 'వ్యవహారి' కేవలం వ్యాపారాన్ని సూచించే పదం కాకపోవడం వల్ల ఈ శాసనంలో వైశ్యుల ప్రసక్తిని నిర్ధారించలేము. కాని గోత్ర నామాన్ని చెప్పుకోవడం అగ్ర వర్ణాల సంప్రదాయం కాబట్టి ఈ విషయాన్ని కొంతవరకు పరిగణనలోకి తీసుకోవచ్చు.

శూద్ర వర్ణజులైన పరిపాలకులను గురించిన ప్రస్తావనలు కూడా శాసనాలలో కనిపిస్తున్నాయి. శా.శ. 1446 (క్రీ.శ. 1525) నాటి ఉప్పరపల్లి శాసనంలో[10] 'విష్ణుపాద సంభూతులు, జాహ్నవియొక్క సోదరులు, పవిత్రులు, చతుర్థ వర్ణ[illegible]' జూపల్లి వంశ ప్రభువుల ప్రశస్తి వుంది. ఈ రాజులు సత్యాచార గుణోపేతులుగా ప్రశంసించబడినారు.

ప్రధానమైన నాలుగు వర్ణాలతో పాటుగా మంగలి, చాకలి, దొమ్మరి ఇరవై నాలుగు కులాలు మొదలైన వృత్తి కులాల ఉనికిని శాసనాలు స్పష్టం చేస్తున్నాయి. శా.శ. 1340 (క్రీ.శ. 1417) నాటి దొంగలసాని శాసనంలో[11] దేవరాయ మహారాయలు (రెండవ దేవరాయలు) పంచాణము వారికిచ్చిన మన్నన పేర్కొనబడింది. వడ్రంగి, కమ్మరి, కంచరి, కంసాలి, కాసె – అనే ఐదు వృత్తుల వారిని పంచాణం వారంటారు. శా.శ. 1355 (క్రీ.శ. 1433) నాటి నందలూరు శాసనంలో[12] రెడ్ల ప్రసక్తి వుంది. ఈ శాసనంలో లేంబాక రెడ్లు, తాళ్లపాక రెడ్లు, తంగటూరు రెడ్లు మొదలైనవారు నందలూరి చొక్కనాథ పెరుమాళ్లకు, అశేష విద్వన్మహా జనాలకు ఇచ్చిన సర్వమాన్యాన్ని గురించి చెప్పబడింది. శా.శ. 1473 (క్రీ.శ. 1551) నాటి పెద్ద ముడియం శాసనంలో[13] తంమళ్లు మొదలైనవారు ఇచ్చే వీరముష్టి పన్ను ప్రస్తావించబడింది. శా.శ. 1453 (క్రీ.శ. 1531) నాటి అనిమెల శాసనంలో[14] వీరబలజలు పేర్కొనబడినారు. శా.శ. 1468 (క్రీ.శ. 1546) నాటి పోట్లదుర్తి శాసనంలో[15] కనిపించే మగ్గ స్తావరం, చక్ర స్తావరం, ఈడిగ స్తావరం అనే పన్నులనుబట్టి నేతపనివారు, కుమ్మరులు, ఈడిగలు భిన్న వృత్తి కులాలుగా వున్నట్లు చెప్పవచ్చు. దూలంవారి పల్లెలోని కాలనిర్ణయం లేని ఒక శాసనంలో[16] బుక్కరాయల

కుమారుడు భవదూరుని సామంతులైన దేశియ నాగయ నాయకులు గోపాలక కులజులుగా చెప్పబడినారు. మాదిగవారు చెప్పులు కుట్టే పని చేసేవారని బెడదూరులోని కాలనిర్ణయం లేని ఒక శాసనం ద్వారా తెలుస్తూ వుంది[17].

పైన చెప్పబడిన కులాలే కాక ఇంకా కొన్ని కులాల అస్తిత్వానికి సంబంధించిన సూచనలు కూడా శాసనాలలో కనిపిస్తున్నాయి. సమాజంలోని అన్ని కులాల వారినీ కలిపి అష్టాదశ ప్రజలుగా వ్యవహరించేవారు. కులాల సంఖ్య పదునెనిమిది కంటే ఎక్కువగా వున్నప్పుడు కూడా పైన చెప్పిన విధంగానే వ్యవహారం వుండేది. శా.శ. 1457 (క్రీ.శ. 1535) నాటిదిగా భావించబడుతున్న పులివెందల శాసనంలో[18] అష్టాదశ ప్రజలు పేర్కొనబడినారు. బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర, వ్యావహారిక, గోరక్షక, శిల్పక, పంచాణ, కుంభకార, తంతువాయ, క్షౌరక, రజక, వస్త్రచ్ఛేదక, చర్మకార, తిలఘాతుక, లుబ్ధక, చండాల, మాతంగులనే పదునెనిమిది కులాల వారిని అష్టాదశ ప్రజలంటారు[19]. ఈ పదునెనిమిది కులాలవారూ తమ తమ వర్గానికి చెందిన ప్రజల బాగోగులను చూసుకోవడానికి కొన్ని సంఘాలుగా ఏర్పడేవారు. ఈ సంఘాలను 'సమయాలు' అంటారు. ఒక్కొక్క సమయం తమ కులానికి సంబంధించిన కొన్ని చట్టాలను, ఆచారాలను అనుసరించి ప్రవర్తించేది. ఈ ఆచారాలను సమయాచారాలు లేదా కులాచారా లంటారు. తమ తమ కులాచారాలను అనుసరించడం గౌరవప్రదమైందిగా ప్రజలు భావించేవారు. కులాచారాన్ని ఉల్లంఘించడం తీవ్రమైన అపరాధంగా పరిగణించబడేది. శా.శ. 1453 (క్రీ.శ. 1531) నాటి అనిమెల శాసనంలోని[20] శాపోక్తులలో ఆ ధర్మ శాసనానికి తప్పినవారు కులాచారానికి తప్పినవారౌతారనే హెచ్చరిక కనిపిస్తుంది.

## *2. సమాజంలో వివిధ వర్గాల స్థానం*

### *2.1 బ్రాహ్మణులు*

ఈ అధ్యయన పరిధిలోని అనేక శాసనాలు నాటి సమాజంలో బ్రాహ్మణులకున్న అప్రతిహతమైన స్థానాన్ని గురించి తెలియజేస్తున్నాయి. దేవ, బ్రాహ్మణులకిచ్చిన దానాలవల్ల పుణ్యం లభిస్తుందని పరిపాలకులు, ప్రజలు విశ్వసించేవారు. ఈ ప్రాంతంలోనే గాక భారతదేశంలోని అన్ని ప్రాంతాలలోను లభించిన దాన శాసనాలు ఈ విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి. తొలి తెలుగు శాసనం వేయించిన రేనాటిచోళులు మొదలుకొని విజయనగర రాజుల వరకు ఈ ప్రాంతాన్ని పరిపాలించిన రాజులందరూ భారతదేశంలో అనూచానంగా వస్తున్న సంప్రదాయాన్ని అనుసరించి దేవ, బ్రాహ్మణులకు భూములను, అగ్రహారాలను దానమిచ్చినట్లు శాసనాలు తెలుపుతున్నాయి. తొలి తెలుగు శాసనంగా భావించబడుతున్న కలమళ్ల శాసనం[21] దాన శాసనమే. క్రీ.శ. 7వ శతాబ్దికి చెందిన ఇందుకూరు శాసనంలో[22] ఎరిగల్లు దుగరాజు, రేవశర్మ అనే బ్రాహ్మణునికి ఇచ్చిన పన్నస నమోదు చేయబడింది. పుణ్యకుమారుని 10వ రాజ్య సంవత్సరానికి చెందిన దొమ్మరి నంద్యాల తామ్ర శాసనంలో[23], ఆ రాజు కొందరు

బ్రాహ్మణుల కిచ్చిన క్షేత్రదానాన్ని గురించి చెప్పబడింది.

క్రీ.శ. 9వ శతాబ్దికి చెందిన అరకటవేముల శాసనంలో[24] పెర్బాణ వంశస్థుడైన భుజంగదిభూపాదిత్యుడు వంగనూర్లకు చెందిన చరువశర్మ పుత్రుడు విన్నశర్మకు ఇచ్చిన పన్నస నమోదు చేయబడింది. క్రీ.శ. 9వ శతాబ్దికి చెందిన బలపనూరు శాసనంలో[25] మహాబలి కులోద్భవుడైన (బాణ వంశము) శ్రీమత్ ధవళెయ మహారాజు శ్రీధరయ అనే బ్రాహ్మణునికి రాచమానంలో ఎనుబది మరుతుడ్ల నేలను దానమిచ్చినట్లు చెప్పబడింది. వైదుంబ వంశానికి చెందిన ఇరిగెయ మహారాజు తమ తండ్రి బెజయిత మహారాజులకు పుణ్యంగా అనిమెల పొలంలో [నూట] ఏబది మరుతుడ్ల నేలను సూర్యక్రమవేది అనే బ్రాహ్మణునికి ఏకోద్దిష్ట భుక్తదక్షిణగా ఇచ్చిన విషయాన్ని శా.శ. 898 (క్రీ.శ. 976) నాటి అనిమెల శాసనం[26] ప్రస్తావిస్తూ వుంది. శా.శ. 1046 (క్రీ.శ. 11246) నాటి పెద్దముడియం శాసనంలో[27] చాళుక్య రాజు త్రిభువన మల్లదేవుడు (అరవ విక్రమాదిత్యుడు) జయంతీపురం రాజధానిగా పాలిస్తుండగా మహామండలేశ్వర చిద్దణచోళ మహారాజు ముదివేము అగ్రహారంలోని మహాజనాలకు ఆ గ్రామాన్ని త్రిభోగాభ్యంతరసిద్ధిగా ధారాపూర్వకంచేసి ఇచ్చినట్లు చెప్పబడింది.

ప్రౌఢ దేవరాయలు తుడుములదిన్నె గ్రామాన్ని నాచనసోమునికి ఏకభోగ అగ్రహారంగా ఇచ్చిన విషయం తుడుములదిన్నె లోని కాలనిర్ణయం లేని ఒక శాసనంలో[28] నమోదు చేయబడింది. సోమిరెడ్డిపల్లె లోని కాలనిర్ణయం లేని ఒక శాసనంలో[29] శ్రీమదఘోర శివాచార్యులకు, వారి ప్రియ శిష్యుడైన మహామండలేశ్వర గుండయదేవ మహారాజు తమ తల్లిదండ్రులైన మల్దేవి, జోతిరాజులకు పుణ్యంగా తమ నాయంకరానికి చెల్లే సకలిపాయలోని సిద్ధవటం సీమలో వుండే మాదనపల్లికి తమ తండ్రి పేర జోతిరాజపురమని నామాంకితం చేసి, ఆచంద్రార్క స్థాయిగాను, అష్టభోగ తేజస్వామ్యంగాను, సదక్షిణాకంగాను ధారవోసి అగ్రహారంగా సమర్పించినట్లు చెప్పబడింది. శా.శ. 1326 (క్రీ.శ. 1405) నాటి చియ్యవరం శాసనంలో[30] మీసరగండకఠారు సాళువ కంపరాజు, షడ్దర్శన స్థాపనాచార్యులైన నల్లాన్ చక్రవర్తుల కుమారుడు తివంగర చక్రవర్తులకు పులుకురునాటిలోని చియ్యవర గ్రామాన్ని ధారాపూర్వకంగా ఇచ్చినట్లు వుంది.

ప్రాచీనకాలం నుండి తరతరాలుగా ఎందరో రాజులు, సామంతులు, మాండలికులు వివిధ సందర్భాలలో, వివిధ రీతులలో బ్రాహ్మణులకిచ్చిన భూ, గ్రామ దానాలు సమాజంలో బ్రాహ్మణుల కుండిన ఉన్నతమైన స్థానాన్ని గురించి సాక్ష్యమిస్తున్నాయి.

బ్రాహ్మణులకిచ్చిన భూమిని ఇతరులు ఆక్రమించి అనుభవించరాదని, దానిపై పన్ను గ్రహించరాదని, నిర్దేశిస్తున్న "ఏకైవ భగినీ లోకే సర్వేషామేవ భూభుజామ్ । న భోగ్యా న కర గ్రాహ్యా విప్రదత్తా వసుంధరా॥"[31] అనే మర్యాద శాసనాలలో కనిపిస్తుంది. దేవ ద్రవ్యాన్ని, గురు ద్రవ్యాన్ని, విప్ర ద్రవ్యాన్ని భక్షిస్తే కులక్షయం జరుగుతుందని ప్రజలు విశ్వసించేవారు[32].

అందుకే శ్రీకంఠ చోళాధిరాజు బాలశక్తి గురువుకు మన్దరం గ్రామాన్ని దానమిచ్చిన సందర్భంలో జారీచేసిన శాసనంలో 'పూర్వ బ్రహ్మదేయ, దేవభోగం వర్జయిత్వా"[33] అని అవధి నిర్దేశనం చేసినాడు. అనేక శాసనాలలోని శాపోక్తులలో, కాశిలో బ్రాహ్మణుని చంపిన పాపం అత్యంత ఘోరమైందిగా చిత్రించబడింది. గోహత్య కూడా మహాపాతకమని చెప్పబడింది. "దీని స్థితి దపువాడు గో బ్రహ్మ ఘాతకుండు"[34], "ఈ ధర్మ మనారానువళిదవరు గంగెయొళం, ప్రయాగె యొళం, వారణాసి యొళం సాసిర కవిలెయుమం సాసిర్బర్ఱరు వేదపారగరుమ నళిద పాతకక్కె సలువరు"[35] - మొదలైన ప్రయోగాలు ఈ విషయాన్ని ధ్రువీకరిస్తున్నాయి. 'గోబ్రాహ్మణేభ్య: శుభమస్తు" - అనే సంప్రదాయ వాక్యం ప్రజలకు నిరంతర స్మరణలో వుండేదని స్పష్టమౌతూ వుంది.

బ్రాహ్మణులు తమకు ధర్మశాస్త్రాలు నిర్దేశించిన అధ్యయన, అధ్యాపన, యజన, యాజన, దాన, ప్రతిగ్రహణాలనే షట్కర్మ నిరతులై విశుద్ధ మార్గవర్తనులై వుండేవారు. చిద్దనచోళ మహారాజు పెద్దముడియం అగ్రహార దాన శాసనంలో ప్రతిగ్రహీతలైన విద్వన్మహాజనాలు యమ నియమ స్వాధ్యాయ ధ్యాన ధారణ మౌనానుష్ఠాన జప సమాధి గుణశీల సంపన్నులు, అగ్నిష్టోమాద్యనేక యాగావభృథస్నాన పవిత్రీభూతులు, సకల వేదాధ్యయనశీలురు, షట్కర్మ నిరతులు, మన్వాది పురాణ మునిగణ విశుద్ధ మార్గవర్తులు, చతుర్దశ విద్యాస్థాన పారావార పారగులుగా[36] ప్రశంసించబడినారు. శా.శ. 1448 (క్రీ.శ. 1525) నాటి కత్తెరగండ్ల శాసనంలో[37] సర్వక్రతు వాజపేయ యాజులయిన పడవిటి విరూపాక్ష దీక్షితుల కుమారుడు అన్నాజియ్యవారు పేర్కొనబడినారు. గండికోట సీమలోని దేవస్థానాలు, అగ్రహారాలలోని నానాగోత్ర నానాసూత్ర నానాశాఖాధ్యాయ పవిత్రులైన అశేష విద్వన్మహాజనాలు క్రత్వాది, అనుష్ఠానాలు చేసుకొని సుఖంగా వుండడం కోసం నంద్యాల అవుభళదేవ మహారాజుల నప్తృడైన తిమ్మయదేవ మహారాజు, తమ నాయంకరమైన గండికోట సకలి సీమలోని దేవతా గ్రామాలు, అగ్రహారాలలో వచ్చే దుర్గవర్తన, దణాయ నివర్తన, బెడిగె, కానిక, కట్నాలు మొదలైన పన్నులను సర్వమాన్యం చేసినట్లు శా.శ. 1466 (క్రీ.శ. 1545) నాటి మోపూరు శాసనం[38] తెలుపుతూ వుంది.

## 2.2 విప్రవినోదులు

విజయనగర రాజుల కాలంలో సమాజంలోని భిన్న వర్గాలలో సామాజిక చైతన్యం పెరిగింది. సామాజిక ఐక్యతా బంధాలను దృఢతరం చేసుకోవడానికి ఈ కాలంలో ప్రయత్నాలు జరిగినాయి. ఒక్కొక్క వర్గం తమదైన ప్రతిష్ఠను, గౌరవాన్ని పెంచుకొనే ప్రయత్నం చేసింది. అటువంటి ప్రయత్నం చేసిన వాటిలో ఒక వర్గం విప్రవినోదులు. విప్రవినోదులకు సంబంధించిన శాసనాలు క్రీ.శ. 16వ శతాబ్ది ఉత్తరార్థం నుండి మాత్రమే కనిపిస్తున్నాయి. విప్రవినోదులు బ్రాహ్మణులు. వీరిలో ఆపస్తంబ సూత్రానుయాయులైన యజుశ్శాఖాధ్యాయులు, శుక్ల యజుశ్శాఖాధ్యాయులు వున్నారు. కొందరు విప్రవినోదులు అథర్వ వేదాన్ని అధ్యయనం

చేసినవారుగా పేర్కొనబడినారు. కౌండిన్య, కాశ్యప, వశిష్ఠ సగోత్రులైన విప్రవినోదులు కడప జిల్లాలోని శాసనాలలో పేర్కొనబడినారు. శా.శ. 1477 (క్రీ.శ. 1555) నాటి భీమగుండం శాసనంలో[39] నానాగోత్ర నానాశాఖాధ్యాయులైన విప్రవినోదుల ప్రస్తావన వుంది. విప్రవినోదులు ఇంద్రజాల విద్యను ప్రదర్శిస్తారు. ఇది యక్షిణి విద్యగా శాసనాలలో పేర్కొనబడింది. కొందరు విప్రవినోదులకు మంత్రమూర్తి అనే బిరుదు వుండేది. విప్రవినోదులు బ్రాహ్మణుల నుండి మాత్రమే వర్తనలను స్వీకరిస్తారు. వీరు వర్తనల రూపంలో తమకు వచ్చిన ఆదాయాన్ని కొన్ని సందర్భాలలో దేవాలయాలకు దానమిచ్చినట్లు శాసనాలు తెలుపుతున్నాయి.

శా.శ. 1472 (క్రీ.శ. 1550) నాటి కొప్పోలు శాసనంలో[40] కొందరు విప్రవినోదులు, కొప్పోలులో మహాజనాలు తమకు ఇచ్చే వరుసాంవధి వర్తనను కొప్పోలి సిద్ధేశ్వరుని దీపారాధనకు గాను సమర్పించినట్లు నమోదు చేయబడింది. శా.శ. 1477 (క్రీ.శ. 1555) నాటి కృష్ణంగారిపల్లె శాసనంలో[41], గుండ్లమడుగు సర్వమాన్య అగ్రహారంలోని మహాజనాలు తమకు ఇచ్చే పన్నును గుండ్లమడుగు చెన్నకేశవరాయునికి విప్రవినోదులు ధారవోసి ఇచ్చినట్లు చెప్పబడింది. శా.శ. 1477 (క్రీ.శ. 1555) నాటి మేడిదిన్నె శాసనంలో[42] కొందరు విప్రవినోదులు తమకు వచ్చే వర్తనలను మేడిగుడిదిన్నెకు ప్రతినామమైన కృష్ణరాయ సముద్రం అగ్రహారంలోని చెన్నకేశ్వర దేవునికి, హనుమంత దేవునికి దశమీ మాస మహోత్సవానికిగాను శ్రీరామనవమి పుణ్యకాలంలో ధారవోసి ఇచ్చినట్లు చెప్పబడింది. శా.శ. 1476 (క్రీ.శ. 1554) నాటి కొసనేపల్లి శాసనంలో[43] కొసనేపల్లి మహాజనాలు తమకు ఇచ్చే త్యాగవర్తనలను కొందరు విప్రవినోదులు కోనతిరువెంగళనాథుని చెంప్పతిరునాళ్లకుగాను సర్వమాన్యంగా సమర్పించినట్లు నమోదు చేయబడి వుంది. శా.శ. 1477 (క్రీ.శ. 1555) నాటి భీమగుండం శాసనంలో[44] కొందరు విప్రవినోదులు, భీమగుండంలో తమకు వచ్చే త్యాగవర్తనులను భీమగుండానికి ప్రతినామమైన అచ్యుతరాయపురం చెన్నకేశవ పెరుమాళ్లకు, తెప్పతిరుణాళ, ఉట్ల మహోత్సవం, పాఱువేట మహోత్సవాలకు, ధూపదీప నైవేద్య పణ్యారాలు మొదలైన షోడశోపచారాలకుగాను ధారవోసి ఇచ్చినట్లు వుంది.

## 2.3 దొమ్మరులు

విజయనగర రాజుల కాలంలో సమాజంలో తమ ప్రతిష్ఠను పెంచుకొనే ప్రయత్నం చేసిన ఇంకొక వర్గం దొమ్మరులు. వీరు దేశ ద్రిమ్మరులు. ఛప్పన్న (యాభై ఆరు) దేశాలలో వీరు తమ విద్యను ప్రదర్శించేవారని శాసనాలవల్ల తెలుస్తూ వుంది. వీరు ప్రదర్శించే అద్భుత విన్యాసాలను ఆంధ్రదేశంలో దొమ్మరాటలనే అంటారు. తమను 'విళవారు' అని శాసనాలలో వీరు చెప్పుకున్నారు. ఈ పదానికి అర్థం తెలియదు. దొమ్మరులలో ఇరవై నాలుగు కులాలవారు వున్నట్లు తెలుస్తూ వుంది. వీరు కూడా తమకు వచ్చే ఆదాయాన్ని కొన్ని సందర్భాలలో దేవాలయాలకు దానంగా ఇచ్చినారు. శా.శ. 1442 ప్రమాది సంవత్సర, కార్తిక శుద్ధ పౌర్ణమి

(క్రీ.శ. 1520) నాడు సోమగ్రహణ పుణ్యకాలంలో కొందరు దొమ్మరులు, పుష్పగిరి అగ్రహారంలోని కాపులు తమకు ఇచ్చే దొమ్మరి పన్నును చెన్నకేశవుని దీపారాధనకు, పుష్పాల తోటకు దానమిచ్చినట్లు పుష్పగిరిలోని ఒక శాసనంలో[45] నమోదు చేయబడి వుంది. శా.శ. 14[70], కీలక సంవత్సర, భాద్రపద శుద్ధ చతుర్దశి (క్రీ.శ. 1548) నాడు కొందరు దొమ్మరులు కోడూరు గ్రామంలో తమకు వచ్చిన దొమ్మరి పన్ను నాలుగున్నర గద్యాణాలను ఆ గ్రామంలోని చెన్నకేశ్వరుని దీపారాధన, అమృతపళ్లకుగాను ధారవోసి ఇచ్చినట్లు కోడూరులోని ఒక శాసనం[46] తెలుపుతూ వుంది. శా.శ. 1475, ప్రమాది (ప్రమాదీచ) సంవత్సర ఆషాఢ శుద్ధ దశమి (క్రీ.శ. 1553) నాటి వల్లూరు శాసనంలో[47], పెదవల్లూరికి ప్రతినామమైన తిమ్మసముద్రం అగ్రహారంలో తమకు వచ్చే దొమ్మరి పన్నును, కాకి పద్మరాజు మొదలైన దొమ్మరులు అక్షతదియ పుణ్యకాలంలో హరిహరాదులకు ధారవోసి ఇచ్చినట్లు చెప్పబడింది. నిటూరి సీమలోని అగ్రహారం గొల్లలదిన్నె పల్లెకు ప్రతినామమైన ప్రతాపదేవరాయపురం గ్రామంలోని ప్రజలు తమకు ఇచ్చే వర్తనలలో రెండు వరహాలు ఆ గ్రామంలోని మల్లికార్జున దేవునికి, మాధవరాయనికి, అమృతపళ్లకు, దశమీ మాస మహోత్సవానికి, సంధ్యాదీపానికి గాను సోమగ్రహణ పుణ్యకాలంలో కొందరు దొమ్మరులు ఛప్పన్న దేశాలలో చరించే తమ ఇరవై నాలుగు కులాల వారికి పుణ్యంగా ధారవోసి ఇచ్చినట్లు శా.శ. 1476 ప్రమాదీచ సంవత్సర, మాఘ శుద్ధ పౌర్ణమి (క్రీ.శ. 1554) నాటి అగ్రహారం శాసనం[48] తెలుపుతూ వుంది. బెడదూరు లోని కాలనిర్ణయం లేని ఒక శాసనంలో[49] దొమ్మరి కులానికి చెందిన ముగ్గురు వ్యక్తులు బెడదూరికి ప్రతినామమైన నరసింహపురం అగ్రహారంలో తమకు వచ్చే దొమ్మరి పన్ను సంవత్సరానికి ఎనిమిది వరహాలను ఆ గ్రామంలోని కొండమీది తిరువెంగళ నాథునికి, చెన్నకేశ్వరునికి, మహాలింగానికి ధారవోసి ఇచ్చినట్లు చెప్పబడింది.

## 2.4 వీరముష్టులు

దేవాలయాల ఆస్తులను, హక్కులను సంరక్షించే జాతివారు వీరముష్టులు[50]. వీరిని వీరపురాంతకులు, వీరభద్రులు అనికూడా అంటారు. శా.శ. 1473 (క్రీ.శ. 1551) నాటి పెద్ద ముడియం శాసనం[51], వీరముష్టులు 'జుంజుంను, కాసెను, నారసముంను, మోటుపలకాను పట్టెడి' వారని తెలియజేస్తూ వుంది. నెమలి ఈకల కట్టను జుంజు అంటారు. ఒకవైపు కొసలను విడిచిపెట్టి కట్టే దట్టీని కాసె అంటారు. నారసము అంటే బాణం. తప్పెట వంటి వాద్య విశేషం మోటుపలక. విప్రవినోదులు, దొమ్మరుల వలెనే వీరముష్టులు కూడా తమ ఆదాయాన్ని కొన్ని సందర్భాలలో దేవాలయాలకు దానమిచ్చినారు. బ్రాహ్మల ముడియంలోని తంమ్మళ్లు మొదలైన వారు ఇచ్చే వీరముష్టి పన్నును, వీరముష్టి భూమయ కుమారుడు చెన్న బసవయ్య, సకల పురాంతకులకు పుణ్యంగా ఆ గ్రామంలోని సోమేశ్వర దేవుని దీపారాధనకుగాను ఇచ్చినట్లు శా.శ. 1473 (క్రీ.శ. 1551) నాటి పెద్దముడియం శాసనంలో[52] చెప్పబడింది. దేవాలయాలకు

దానమిచ్చిన సందర్భాలలో, ఇకమీదట వీరముష్టులు ఆ గ్రామంలో జుంజువు, కాసెను వేయరాదనే నిర్ణయాన్ని ప్రకటించినారు[53]. ఈ సంప్రదాయానికి సంబంధించిన వివరాలు తెలియడం లేదు. తాము వీరశైవ సిద్ధభిక్షావృత్తయ్యవారి శిష్యులమని, ఆజ్ఞాధారులమని వీరముష్టులు శాసనాలలో చెప్పుకున్నారు. సిద్ధభిక్షవృత్తయ్యవారే స్వయంగా గణాచారి వీరయ్య చేత వీరముష్టి పన్నును దానమిప్పించినట్లు శా.శ. 1472 (క్రీ.శ. 1551) నాటి రామేశ్వరం శాసనం[54] తెలుపుతూ వుంది.

### 2.5 మంగలివారు

సదాశివరాయల కాలంలో మంగలివారు ప్రభుత్వం నుండి ప్రత్యేకమైన ప్రతిపత్తిని, గౌరవాన్ని పొందినారు. సదాశివరాయలు, అతని మంత్రి రామరాయలు వీరికి మన్ననలను కల్పించడానికి కారణాలు తెలియవు. ప్రభుత్వం నుండి మన్ననలను పొందినవారిలో కందనవోలి తిమ్మోజు, అతని కొడుకు కొండోజుల పేర్లు ప్రముఖంగా కనిపిస్తున్నాయి. ఈ మన్ననలకు సంబంధించిన శాసనాలు ఈ జిల్లాలో క్రీ.శ. 1546-47 సంవత్సరాలలో కనిపిస్తున్నాయి. శా.శ. 1469 (శా.శ. 1468, పరాభవ సంవత్సరం, క్రీ.శ. 1546) నాటి చిలమకూరు శాసనంలో[55] రామరాజయ్యవారి ఆనతిని చాంగలమఱ్ఱి నలతిమ్మరాజయ్య కందనవోలి తిమ్మోజు కొడుకు కొండోజుకు తుంగభద్రా తీరమందు విఠలేశ్వరుని సన్నిధిలో మూడు సీమలకు (పేర్లు తెలియవు) చెల్లివచ్చే ఊళ్లకు మంగలిపన్ను సర్వమాన్యంగా మానినట్లు చెప్పబడింది. ఇదేరోజు జారీ చేయబడిన పోరుమామిళ్ల శాసనంలో[56] కందనవోలి తిమ్మోజు కొడుకు కొండోజుకు ఘండికోట సకలి సీమకు చెల్లే గ్రామాలలో మంగళ్ల పన్ను సర్వమాన్యంగా ఇచ్చినట్లు చెప్పబడింది. శా.శ. 1468, (క్రీ.శ. 1546) నాటి కత్తెరగండ్ల శాసనంలో[57] శ్రీ సదాశివదేవ మహారాయల ఆనతిని, అళియ రామరాజయ్యదేవ మహారాయల ముదులను, నంద్యేల తిమ్మరాజయ్యవారు తమ గండికోట సీమకు చెల్లే అమర గ్రామాలు, వుంబళిక గ్రామాలు, బండారవాడ గ్రామాలు అగ్రహార, దేవస్థానాలలో మంగలివారు ఇచ్చే దణయ, కావలి, కానుక, దొమ్మరి పన్నులను సర్వమాన్యం చేసినట్లు నమోదు చేయబడింది. శా.శ. 1467 (శా.శ. 1468, క్రీ.శ. 1546) నాటి వరికుంట శాసనం[58], నాగరాజయ్యదేవ మహారాజులు వరికుంట మంగళవారికి కటపన్ను, కానికె, వెటికూటం, దొమ్మరి పన్నులను సర్వమాన్యంగా పాలించి విడిచినట్లు తెలుపుతూ వుంది. శా.శ. 1469, (క్రీ.శ. 1547) నాటి పుష్పగిరి శాసనంలో[59] నంద్యాల తిమ్మయ్యదేవ మహారాజు ఇంద్రనాథ దేవుని స్థానం గ్రామాలైన పుత్తూరు, రావులపల్లె, దుంపలగట్టులలో మంగళ తిమ్మోజు ఇచ్చే పన్ను మన్నించినట్లు నమోదు చేయబడింది.

## 3. సమాజంలో స్త్రీల స్థానం

సమాజంలో సాధారణ స్త్రీలకున్న స్థానాన్ని గురించి తెలుసుకోవడానికి ఈ జిల్లాలోని శాసనాలు అంతగా ఉపకరించడం లేదు. కాని రాజవంశాలకు చెందిన స్త్రీలకు ఉన్నతమైన

స్థానం వున్నట్లు రేనాటిచోళుల రాణులు చోళ మహాదేవి మఞ్చిపోట్టియారు[60], వసన్తిపోతి చోళ మహాదేవి[61] మొదలైనవారు జారీచేసిన దాన శాసనాలు సూచిస్తున్నాయి. వారు భూదాన మిచ్చిన సందర్భాలలో రాచమానాన్ని పేర్కొనడం, ప్రభుత్వాధీనంలోని భూములపై వారికున్న అధికారాన్ని స్పష్టంచేస్తూ వుంది. పరిపాలనా వ్యవహారాలలో కూడా రాణులకున్న సంబంధాన్ని క్రీ.శ. 8వ శతాబ్ది నాటి చిలమకూరు శాసనం[62] తెలియజేస్తూ వుంది. ఈ శాసనంలో విక్రమాదిత్య చోళ మహారాజు పరిపాలనా కాలంలో చోళ మహాదేవి, ఉత్తమాదిత్య సామంతకుడు చిఱుంబూరును ఏలుతున్నట్లు చెప్పబడింది.

పాతివ్రత్యం ఉత్తమమైన స్త్రీధర్మంగా కీర్తించబడింది. శాసనాలలో కనిపించే 'సాధ్వి'[63], 'ధర్మపత్ని'[64] 'పాతివ్రత్య పరాయణా'[65] వంటి విశేషణాలు ఈ విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి. శా.శ. 1446 (క్రీ.శ. 1525) నాటి ఉప్పరపల్లె శాసనం[66] జూపల్లి వంశస్థుడైన రామ మహీపాలుని భార్య చల్లాంబ వ్యక్తిత్వాన్ని వర్ణిస్తూ -

*"త స్యాసీ దరవిందసుందరముఖీ మందస్మితా మానినీ*
*చల్లాంబా సహధర్మిణీ సువచనా బంధువ్రజాం హ్లాదినీ*
*దేవబ్రాహ్మణవందనార్చనసదాచా రాత్మజామోదినీ*
*సాధ్వీ సజ్జనసంస్తుతైకచరితా రేంబల్లెవంశోద్భవా" -*

అని సమాజంలో ఉత్తమ స్త్రీ ధర్మాలను సూచించింది.

భార్యను అర్ధాంగలక్ష్మిగా గౌరవించి ఆమె పేరుతో దానాలను ఇవ్వడం జరిగేది. శా.శ. 1153 (క్రీ.శ. 1231) నాటి బెడుసుపల్లి శాసనంలో[67] తిరుకాళత్తిదేవుని మహాసామంతుడైన కంటపా నాయకుడు తన అర్ధాంగలక్ష్మి చియసాని పేర ఐదునూర్ల వృత్తులకు చాలినంత క్షేత్రంతో కూడిన ఒక అగ్రహారాన్ని దానమిచ్చినట్లు చెప్పబడింది.

విధవలకు సమాజంలో సరైన స్థానం వుండేది కాదు. అందుకే కాబోలు భర్త మరణించిన తరువాత వైధవ్యమనే నరకాన్ని అనుభవించడంకంటె సహగమనం చేసి భర్తతో పాటుగా స్వర్గాన్ని పొందడం మేలని స్త్రీలు భావించినట్లు సింహాసనద్వాత్రింశిక తెలుపుతూ వుంది[68]. రామేశ్వరం స్తంభ శాసనంలో[69] రాష్ట్రకూటరాజు మూడవ కృష్ణుని ప్రశస్తిలో కనిపించే-

*"ఆయోధనార్థ మధిగచ్ఛతి కృష్ణరాజే*
*కృష్ణీబభూవ వదనం రిపుకామినీనాం*
*వైధవ్యతాపపరితాపితమానసానాం" -*

అనే వర్ణనలోని మాటలు వైధవ్యం వల్ల స్త్రీలకు కలిగే మనస్తాప తీవ్రతను తెలియ జేస్తున్నాయి.

## 4. వారసత్వపు హక్కులు

సాధారణంగా వారసత్వపు హక్కు ఇప్పుడున్నట్లుగానే తండ్రినుండి కుమారునికి సంక్రమించే సంప్రదాయం వుండేది. పుణ్యకుమారుని మాలేపాడు తామ్ర ఫలకాలలో[70] "తే పుత్రాను పుత్ర్యనుభూత రాజ్యశ్రియ:" అని చెప్పబడడం ఈ విషయాన్ని స్పష్టం చేస్తూ వుంది. రాజ్యాధికారం అగ్రమహిషి జ్యేష్ఠ పుత్రునికి సంక్రమించడం సంప్రదాయం. కొన్ని సందర్భాలలో కారణాంతరాలవల్ల దీనికి భిన్నంగా కూడా జరిగేది. పుణ్యకుమారుని దొమ్మరి నంద్యాల తామ్ర ఫలకాలలో[71] "తేషా మానుపూర్వ్యనుభూత రాజ్యశ్రియాం కనీయసో ధనఞ్జయ వర్మణ:" - ఇత్యాదిగా చెప్పబడింది. నందివర్మ కుమారులైన సింహవిష్ణు, సుందరనంద, ధనఞ్జయులలో కనిష్ఠుడైన ధనఞ్జయుడు రాజ్యాధికారాన్ని పొందడం గమనించదగింది. ధనఞ్జయుని తరువాత అతని కుమారుడైన మహేంద్రవర్మ, అతని తరువాత అతని జ్యేష్ఠ పుత్రుడు గుణముదితుడు రాజ్యాధికారాన్ని స్వీకరించినాడు. గుణముదితుని తరువాత అతని కుమారులుకాక అతని తమ్ముడు పుణ్యకుమారుడు రాజ్యాధికారాన్ని స్వీకరించినాడు. గుణముదితుని తరువాత పుణ్యకుమారుడు సింహాసనాన్ని అధిష్ఠించడం బలప్రయోగంతో కాక వారసత్వ క్రమంలోనే జరిగినట్లు 'తస్య ప్రియభ్రాతా'[72] - అనే మాటలు సూచిస్తున్నాయి. పుణ్యకుమారునికి వారసత్వ క్రమంలో రాజ్యాధికారం సిద్ధించడానికి కారణం గుణముదితునికి పుత్రసంతానం లేకపోవడమే కావచ్చు.

శ్రీకంఠచోళుని మద్రాస్ మ్యూజియం తామ్ర ఫలకాలు[73] నందివర్మ రెండవ కుమారుడైన సుందరనందుని వంశవృక్షాన్ని తెలియజేస్తున్నాయి. రేనాటిచోళ వంశానికి మూలపురుషుడైన కరికాలచోళుని నుండి వారసత్వ క్రమంలో సుందరనందునికి రాజ్యాధికారం లభించినట్లు ఈ శాసనంలోని "ప్రవర్త్తత తత శ్శుద్ధో రాజ్ఞాం వంశ: క్రమాగత:" - అనే ప్రయోగం తెలుపుతూ వుంది. కాబట్టి నందివర్మ కుమారులైన సుందరనంద ధనఞ్జయులు వేరువేరు రాజ్య భాగాలను వారసత్వంగా పొందినట్లు ఊహించవచ్చు. నందివర్మ జ్యేష్ఠ పుత్రుడైన సింహ విష్ణువు పరిపాలనను గురించి కాని అతని వారసులను గురించి కాని తెలియడం లేదు.

పుత్ర సంతానం లేనప్పుడు పుత్రికకు రాజ్యాధికారం సంక్రమించడం సంప్రదాయం కాకపోయినప్పటికీ గణపతిదేవుని తరువాత అతని కుమార్తె రుద్రమదేవి కాకతీయ సింహాసనాన్ని అధిష్ఠించడం జరిగింది. కాని రుద్రమదేవికి కూడా పుత్ర సంతానం లేకపోవడం వల్ల ఆమె తరువాత ఆమె కుమార్తె కాక దౌహిత్రుడైన ప్రతాపరుద్రుడు సింహాసనాన్ని అధిష్ఠించినాడు. కాబట్టి స్త్రీలకు వారసత్వక్రమంలో రాజ్యాధికారం సంక్రమించడం సాధారణంగా సంప్రదాయం కాదని, గణపతిదేవుని తరువాత రుద్రమదేవి కాకతీయ సింహాసనానికి వారసురాలు కావడానికి ఆమెకున్న సైనిక పరిపాలనా దక్షత కారణమని భావించవచ్చు.

బ్రాహ్మణులకు దానమిచ్చిన సందర్భాలలో ప్రతిగ్రహీత ఆ దానాన్ని పుత్రపౌత్ర

పారంపర్యంగా అనుభవించే హక్కును కలిగి వున్నట్లు దాన శాసనాలు తెలుపుతున్నాయి. నంద్యాల తిమ్మయదేవ మహారాజు, తనకు సదాశివరాయలు నాయంకరంగా ఇచ్చిన గండికోట సీమలోని దేవస్థానాలు, అగ్రహారాలలోని నానాగోత్ర, నానాసూత్ర, నానాశాఖాధ్యాయ పవిత్రులైన అశేష విద్వన్మహాజనాలకు కొన్ని పన్నులను సర్వమాన్యంగా ఇస్తూ శా.శ. 1446, క్రోధి సంవత్సర, మాఘ శుద్ధ సప్తమి సోమవారం (క్రీ.శ. 1545, జనవరి, 18వ తేదీ) నాడు మోపూరులో శాసనాన్ని[74] జారీచేసి దానగ్రహీతలు ఆ సర్వమాన్యాన్ని పుత్రపౌత్ర పారంపర్యంగా ఆచంద్రార్క స్థాయిగా అనుభవించి క్రత్వాది అనుష్ఠానాలు చేసుకొని సుఖంగా జీవించవలసిందని కోరినాడు. శా.శ. 1470 (క్రీ.శ. 1549) నాటి ఎగువపల్లి శాసనం[75], అరవీటి బుక్కరాజు గారి ప్రపౌత్రుడైన చినతిమ్మయదేవ మహారాజు, తనకు సదాశివరాయలు నాయంకరంగా ఇచ్చిన హోరగ్రామం అంభవరం కరణం మురారిగారికి ఆ గ్రామంలోని కరణీక మాన్యాలు, వృత్తి మాన్యాలు, వరిమళ్లను పుత్ర పౌత్ర పారంపర్యంగా ఆచంద్రార్క స్థాయిగా అనుభవించడానికి రథసప్తమి పుణ్యకాలంలో ధారవోసి ఇచ్చినట్లు తెలుపుతూ వుంది.

చెఱువులు, కాలువలు త్రవ్వించడం, వాటిని సక్రమంగా నిర్వహించడం, అవసర మైనప్పుడు మరమ్మత్తులుచేసి వ్యవసాయ భూములకు నీటిపారుదల సౌకర్యాన్ని కలిగించ డానికి సంబంధించిన పనులను ప్రభుత్వం కొందరు వ్యక్తులకు అప్పగించినప్పుడు వారికి ప్రతిఫలంగా దశబంధ మాన్యాలను ఇచ్చిన సందర్భాలలో కూడా ఆ మాన్యాలను పొందిన వ్యక్తులు క్రమం తప్పకుండా పైన చెప్పబడిన పనులను నిర్వహిస్తూ దశబంధాన్ని పుత్రపౌత్ర పారంపర్యంగా అనుభవించడానికి అనుమతించబడినట్లు సంబంధిత శాసనాలు తెలియ జేస్తున్నాయి.

కృష్ణదేవరాయల పరిపాలనా కాలంలో గంజికుంటసీమ నాయంకరుడైన బుక్కరాజు తిమ్మరాజు నుండి వనిపెంట గ్రామాన్ని గుత్తకు తీసుకున్న మచ్చికంటి కామరాజు కుమారుడు రాయసం గంగరసు ఆ గ్రామంలోని చెఱువుకట్ట శిథిలమై వుండగా దానిని బాగుచేసి సక్రమంగా నిర్వహించే పనిని కొందరికి అప్పగించి, వనిపెంట గ్రామస్థులు ప్రతి సంవత్సరం కొంత గుత్తను వారికి చెల్లించే విధంగా ఏర్పాటుచేసి చెఱువు కట్టను సక్రమమైన స్థితిలో వుంచుతూ ఆ గుత్తను వారు పుత్రపౌత్ర పారంపర్యంగా అనుభవించవలసిందిగా ఆదేశించినట్లు శా.శ. 1442 (క్రీ.శ. 15 21) నాటి వనిపెంట శాసనం[76] తెలియజేస్తూ వుంది. అచ్యుతదేవరాయల కాలంలో మహానాయంకరాచార్యుడైన నరసానాయుడు, బుక్కరాజు తిమ్మరాజు తనకు వుంబళికి ఇచ్చిన కూచిపాపల (కుచ్చుపాప) గ్రామంలో అంతరగంగ కాలువ త్రవ్వించి చెఱువు కట్టించడంకోసం కూచిపాపల గ్రామ కరణం రంగరాజు మొదలైనవారికి దశబంధ మాన్యాన్ని ఇచ్చి దానిని వారు పుత్రపౌత్ర పారంపర్యంగా అనుభవించేటట్లు కట్టడి చేసినట్లు శా.శ. 1452 (క్రీ.శ. 1530) నాటి కుచ్చుపాప శాసనం[77] తెలుపుతూ వుంది.

భూమిని, లేదా వృత్తిని క్రయంగా తీసుకున్న వ్యక్తులు వంశపారంపర్యంగా వాటిని అనుభవించే హక్కును కలిగివున్నట్లు క్రయపత్ర సంబంధమైన శాసనాలు తెలుపుతున్నాయి. పుష్పగిరి ఇంద్రేశ్వర దేవర స్థానాపతి అన్నామజియ్యల కొడుకు దేవజియ్యలు ఇంద్రేశ్వర, సోమనాథ దేవాలయాలకు సంబంధించిన మడులు, పిండికాద్రవ్యాలలో తనకు తాత తండ్రుల తరం నుండి లభిస్తున్న ఐదవ భాగం వృత్తిలో సగం వృత్తిని ఇనంగలూరి మల్లజియ్యలకు, భైరజియ్యలకు తన జ్ఞాతుల అనుమతితో మున్నూట ఇరవై పణాలకు ధారాపూర్వకంగా విక్రయించి, తాను అమ్మిన వృత్తిని మల్లజియ్యలు, భైరజియ్యలు బిడ్డబిడ్డ తరం ఆచంద్రార్క స్థాయిగా అనుభవించడానికి సమ్మతిని తెలిపినట్లు శా.శ. 1225 (క్రీ.శ. 1302) నాటి పుష్పగిరి శాసనం[78] తెలుపుతూ వుంది.

## 5. విద్యా విధానం

సుప్రతిష్ఠితమైన విద్యా విధానం ధార్మిక, సాంస్కృతిక పునరుజ్జీవనాన్ని సూచిస్తుంది. విజయనగర రాజుల కాలం వరకు వేద విద్యలకు ఎక్కువ గౌరవం, ఆదరణ వుండేవి. అధీతమైన వేదాన్ని అనుసరించి బ్రాహ్మణులు భిన్న శాఖలుగా విభజించబడినారు. బ్రాహ్మణుల ప్రస్తావన వున్న శాసనాలలో వారు ఒక నిర్దిష్టమైన వేదాన్ని అధ్యయనం చేసినవారుగా పేర్కొనబడినారు.

ఈ ప్రాంతంలో యజుశ్శాఖాధ్యాయులు ఎక్కువగా వున్నట్లు కనిపిస్తుంది. శా.శ. 1357 (క్రీ.శ. 1435) నాటి పెద్దనపాడులోని ఒక శాసనంలో[79] యజుశ్శాఖాధ్యాయులైన చెంగుంట మల్లమరాజు గారి కుమారుడు నాగరాజు పేర్కొనబడినాడు. శా.శ. 1447 (క్రీ.శ. 1555) నాటి భీమగుండం శాసనంలో[80] ఆపస్తంబ సూత్రానికి చెందిన శుక్లయజుశ్శాఖాధ్యాయుల ప్రస్తావన వుంది. శా.శ. 1452 (క్రీ.శ. 1530) నాటి మోపూరులోని ఒక శాసనం[81] ఋక్ శాఖాధ్యాయులైన రాయసం కొండమరుసయ్య గారి కుమారుడు అయ్యపరుసును పేర్కొంటూ వుంది. కొందరు విప్రవినోదులు అథర్వ వేదాన్ని అధ్యయనం చేసినట్లు శాసనాల ద్వారా తెలుస్తూ వుంది. శా.శ. 1472 (క్రీ.శ. 1550) నాటి కొప్పోలు శాసనంలో[82] కాశ్యప గోత్రం అథర్వణ శాఖ పెద గోవిందయ్య మనుమడు పినగోవిందయ్య మొదలైన విప్రవినోదులను గురించిన ప్రస్తావన వుంది. శా.శ. 1473 (క్రీ.శ. 1551) నాటి పెదకొమర్ల శాసనంలో[83] కాశ్యప గోత్రం అపస్తంబ సూత్రం అథర్వణి శాఖాధ్యాయులైన కొందరు పేర్కొనబడినారు. ప్రత్యేకించి సామవేదాన్ని అధ్యయనం చేసినవారిని గురించిన ప్రసక్తి ఈ జిల్లాలోని శాసనాలలో కనిపించడం లేదు. కాని శా.శ. 1046 (క్రీ.శ. 1124) నాటి పెద్ద ముడియం శాసనంలో[84] సకల వేదాధ్యయన యజన యాజన దాన ప్రతిగ్రహణ షట్కర్మ నిరతులైన మహాజనాలకు ఇచ్చిన దానాన్ని గురించి చెప్పబడింది. సుభాను సంవత్సర శ్రావణ శుద్ధ పౌర్ణిమ శుక్రవారం (శక సంవత్సరం పేర్కొనబడలేదు) నాటి సోమిరెడ్డిపల్లె శాసనంలో[85] శ్రీమ దఘోరశివాచార్యులు నానావిధ

నిగమాగమతాత్పర్య పర్యాలోచన ధురీణులుగా ప్రస్తుతించబడినారు.

వేదవిద్యలతోపాటు షడ్దర్శనాలు, శాస్త్రాల అధ్యయనం ఎక్కువ ప్రచారంలో వుండేది. శా.శ. 1383 (క్రీ.శ. 1460) నాటి ఊటుకూరు శాసనంలో[86] వీరశైవ సిద్ధభిక్షావృత్తయ్య వారు షడ్దర్శన స్థాపనాచార్యులుగా పేర్కొనబడినారు. శా.శ. 1326 (క్రీ.శ. 1405) నాటి చియ్యవరం శాసనంలో[87] షడ్దర్శన స్థాపనాచార్యులైన నల్లాన్ చక్రవర్తుల కుమారుడు తివంగర చక్రవర్తుల ప్రస్తావన వుంది. పుణ్యకుమారుని దొమ్మరి నంద్యాల తామ్ర శాసనంలో[88] మహేంద్రవర్మ 'శబ్దశాస్త్ర విద్యానేక పారగ:' అని ప్రస్తుతించబడినాడు. శా.శ. 1244 (క్రీ.శ. 1323) నాటి తాళ్ల ప్రొద్దుటూరు శాసనం[89] గంగయదేవచోళ మహారాజును 'విదిత సకల శాస్త్రాన్వయు'నిగా పేర్కొంటూ వుంది. వ్యాకరణ, మీమాంసా, తర్క శాస్త్రాల అధ్యయనం ప్రచారంలో వుండినట్లు శా.శ. 1470 (క్రీ.శ. 1549) నాటివైన ఎగువపల్లి[90], నిడుజువ్వి[91] శాసనాలు తెలియ జేస్తున్నాయి. ఈ శాసనాలు ఆరవీటి బుక్కరాజుగారి ప్రపౌత్రుడైన చినతిమ్మదేవ మహారాజును పదవాక్య ప్రమాణజ్ఞునిగా పేర్కొన్నాయి. శా.శ. 1291 (క్రీ.శ. 1369) నాటి పోరుమామిళ్ల శాసనం[92] శ్రుతి స్మృతి పురాణేతిహాసాగమ విశారదుడు, దేశకాల విశేషజ్ఞుడు, శుభవాక్కు అయిన వ్యక్తి శాసనాన్ని రచించాలని నిర్దేశించింది. ఈ శాసనకర్త, నందపుర విప్రాగ్రేసరుడు, కౌత్సవంశజుడు, ఋగ్వేది అయిన లింగయ మాచనార్యకవికి పై లక్షణాలున్నాయని ఊహించవచ్చు. ఇంతకుముందు చెప్పబడిన పెద్ద ముడియం శాసనంలోని దానగ్రహీతలైన అగ్రహారికులు మన్వాది పురాణ మునిగణ విశుద్ధ మార్గవర్తులు చతుర్దశ విద్యాస్థాన పారావార పారగులుగా ప్రస్తుతించబడినారు.

పదమూడవ శతాబ్దిలో ఆచార్యులు విద్యామంటపాలను నిర్వహించినట్లు శాసనాల ద్వారా తెలుస్తూ వుంది. శా.శ. 1182 (క్రీ.శ. 1260) నాటి పొందలూరు శాసనంలో[93] గణపతి దేవుని సామంతుడైన జన్నిగదేవుడు అభినవ గోళకీమఠ గురువు శాంతశివదేశికునికి, విద్యా మంటపాన్ని నిర్వహించడానికి పొత్తపినాటిలోని పుఱుందలూరు గ్రామాన్ని దానమిచ్చినట్లు చెప్పబడింది. ఈ శాసనంలోనే జన్నిగదేవుడు 'చతుష్షష్ఠి విద్యాప్రవీణుడు'గా పేర్కొనబడినాడు.

## 6. ఆచారాలు – సంప్రదాయాలు

### 6.1 ఛాయా స్తంభాలు

రాజులు, రాణులు, వీరులు మరణించినప్పుడు ఛాయా స్తంభాలు నిలిపే ఆచారం వుండేది. మతగురువులు, వృత్తి పనివారికి కూడా ఇటువంటి ఛాయా స్తంభాలు నిలిపేవారు. మరణించినవారి ఛాయ ఈ స్తంభంలో వుంటుందని ప్రజల విశ్వాసం. ఈ స్మృతి చిహ్నాలు క్రీ.శ. 250-325 మధ్య ప్రాంతం నుండి కనిపిస్తున్నాయి. ఇవి వీరగల్లులకంటె ప్రాచీనమైనవి[94]. గంగపేరూరులోని కాలనిర్ణయం లేని బ్రాహ్మీలిపిలోని ఒక ప్రాకృత శాసనంలో[95] పరిఆచరియ పుత్రుడు భరద్వాజ సగోత్రుడు అయిన శివదాస అనే వ్యక్తి స్మృత్యర్థం ఛాయాకంబాన్ని

ఎత్తించినట్లు నమోదు చేయబడింది. క్రీ.శ. 14వ శతాబ్ది లక్షణాలున్న రాచుపల్లి శాసనం[96], కాశెబోరోజు కొడుకు ప్రోలోజు, ప్రభవ సంవత్సర జ్యేష్ఠ శుద్ధ తదియ, సోమవారం నాడు ఇరుగ మహారాజుకు కంబాన్ని ఎత్తించినట్లు తెలుపుతూ వుంది. ఈ కంబం, ఛాయా స్తంభం కావచ్చు.

## *6.2 వీరగల్లులు - స్మారక శిలలు*

యుద్ధంలో మరణించిన వీరులకు, దైవానుగ్రహం కోసం ఆత్మబలి చేసుకున్న భక్తులకు స్మారక శిలలను ప్రతిష్ఠించే ఆచారం వుండేది. బృహచ్ఛిలా యుగం నాటి సమాధులు, చారిత్రక యుగం నాటి బౌద్ధ స్తూపాలు కూడా స్మారక చిహ్నాలేనని చరిత్రకారుల అభిప్రాయం. యుద్ధంలో మరణించిన వీరుల స్మారక శిలలు, సహజంగా మరణించిన వ్యక్తుల స్మారక శిలలు మొట్టమొదటి సారిగా ఇక్ష్వాకుల కాలంలో నెలకొల్పబడినాయి. ఈ స్మారక శిలలు నాగార్జున కొండ త్రవ్వకాలలో బయల్పడినాయి. ఈ జిల్లాలో లభించిన స్మారక శిలలను ప్రధానంగా రెండురకాలుగా విభజించవచ్చు. 1. యుద్ధాలలో (లేదా మందపోటులలో) మరణించిన వీరుల నుద్దేశించినవి. 2. మతసంబంధమైన కార్యక్రమాలలో ఆత్మబలి చేసుకున్న వ్యక్తుల కోసం నిర్మించబడినవి.

ప్రాచీనకాలం నుండి భారతదేశంలో ప్రజల ప్రధానమైన జీవనాధారం వ్యవసాయం. వ్యవసాయ నిర్వహణలోను, ఆహారపుటవసరాలను తీర్చడంలోను గోవులు కీలకమైన పాత్ర వహిస్తాయి. గోధనం ఆనాటి ఆర్థిక వ్యవస్థకు సంకేతం. ఒకరికి చెందిన గోవులను ఇంకొకరు బలవంతంగా తరలించుకొని పోవడం అప్పుడప్పుడూ జరుగుతుండేది. ఈ మందపోటులలో ప్రత్యర్థిని ఎదిరించి పోరాటంలో మరణించడం ప్రతిష్ఠాత్మకమైందిగాను, గౌరవప్రదమైంది గాను భావించబడింది. ఈ విధంగా మరణించిన వీరుల స్మృత్యర్థం వీరగల్లులను నిలపడం తమ కర్తవ్యంగా ప్రజలు భావించేవారు. రాయవరంలోని క్రీ.శ. 9వ శతాబ్దికి చెందిన ఒక శాసనంలో[97] 'క్త్రొకిల ఆడియమ్మ' అనే వీరుడు గోగ్రహణం జరిపే సందర్భంలో మరణించినట్లు నమోదు చేయబడింది. దేవపట్లలో తొమ్మిది వీరగల్లులున్నాయి. వీటిలో నాలుగు శిలలు మందపోటుకు సంబంధించినవి. ఈ గ్రామంలోని ఒక వీరగల్లు శాసనం[98] 'కొమ్మరడియ' కొడుకు 'అచిరాచపోత' అనే వీరుడు ఒక గోగ్రహణానికి సంబంధించిన ప్రతిఘటనలో మరణించినట్లు తెలుపుతూ వుంది. మందపోటులలోనే కాక పశువులను తినే క్రూర మృగాలను వేటాడే సందర్భంలో మరణించిన వారికి కూడా స్మారక శిలలను నిలిపేవారు. ఒక వీరుడు చెంగలేరు గ్రామంలోని ఆవులను తినిన పెద్దిని (పెద్దపులిని?) పొడిచి తానుకూడా మరణించినట్లు చాగలేరులోని క్రీ.శ. 8 లేదా 9వ శతాబ్దికి చెందిన ఒక శాసనంలో[99] చెప్పబడింది.

యుద్ధాలలో మరణించిన వీరుల స్మృత్యర్థం నిలిపిన వీరగల్లులు ఈ జిల్లాలో వైదుంబుల కాలానికి చెందినవి ఎక్కువగా వున్నాయి. ఈ వీరగల్లులు సమకాలీన సమాజాన్ని

గురించి కాని ఆర్థిక వ్యవస్థను గురించి కాని అంతగా తెలియజేయలేక పోయినప్పటికీ ఆనాటి యుద్ధాలవల్ల ఏర్పడిన రాజకీయ అస్థిరతను సూచిస్తున్నాయి.

గండత్రిణేత్రుని కాలానికి చెందిన అరిబల్లిలోని ఒక వీరగల్లు శాసనంలో[100] గండ త్రిణేత్రునికి, బాణరాజుకు మధ్య జరిగిన తిరువూళ కయ్యంలో చంద్రాదితుని సైనికుడైన ఒక వీరుడు (లేదా చంద్రాదితుడనే వీరుడు) అనేకమందిని సంహరించి తానుకూడా మరణించిన విషయం నమోదు చేయబడింది. ఈ వీరునికి నిరవద్య, త్రిభువన వేటాళ, నయధీర అనే బిరుదులున్నాయి. గండత్రిణేత్రుని కాలానికే చెందిన బండపల్లిలోని ఒక వీరగల్లు శాసనంలో[101] బాణరాజు సోరమేటికోటను ముట్టడించినప్పుడు గండత్రిణేత్రునికి సామంతునిగా [వళాకంబ్లు] ఏలే విన్నమ్మ విక్రమరెడ్డి అనే వీరుడు రాచమల్ల, నోలిబి మ్మి, మైన్దడి, దడిగ అనే వీరులను ఎదుర్కొని వారి ఏనుగులను, గుఱ్ఱాలను చంపి తాను ఇంద్రలోకానికి వెళ్లినట్లు చెప్పబడింది. ఈ వీరునికి సాహస ప్రతిబల కణ్ఠక, ప్రభవ గంభీర మొదలైన బిరుదులున్నాయి.

దేవగుడిలో కల్యాణీ చాళుక్యుల కాలం నాటి వీరగల్లులున్నాయి[102]. త్రైలోక్యమల్ల మహారాజు కాలంలో ఈ ప్రాంతంపై దండనాయకుడుగా వున్న మహామండలేశ్వర కటకచంద్ర దండనాయకుడు, అతని బావమఱది మధువరస, స్థానిక నాయకుడైన భీమరసల వీరగల్లులు దేవగుడిలోని తలకంటీశ్వరి ఆలయ ప్రాంగణంలో వున్నాయి. కురుమారి (దానవులపాడు), పెద్దపసుపుల గ్రామాల మధ్య పొలిమేర విషయంలో తగాదా రాగా ఈ తగాదాను పరిష్కరించడానికి త్రైలోక్యమల్ల మహారాజు ఆజ్ఞను అనుసరించి కటకచంద్ర దండనాయకుడు ఈ రెండు గ్రామాల పొలిమేర వద్ద రాళ్లు పాతించగా భీమరస, పసువుల గ్రామస్థులు మంది గుఱ్ఱాలతో వచ్చి ఆ రాళ్లను తీసివేసినారు. అప్పుడు జరిగిన ఘర్షణలో కటకచంద్ర దండనాయకుడు, మధువరస, భీమరస, మల్లోజ సేవకుడు మరణించినారు. వారి స్మృత్యర్థం వీరగల్లులను శాసన సహితంగా చెక్కించి దేవగుడిలో నిలిపినారు. ఈ వీరగల్లులలో కటకచంద్ర దండనాయకుడు, భీమరస గుఱ్ఱాలపై ఆయుధధారులై వున్నట్లు, వారి శత్రువులు ఎటువంటి వాహనాలు లేక భూమిపై నిలబడినట్లు చూపబడినారు.

మంటపం పల్లెలోని వీరగల్లులు[103] యుద్ధంలో మరణించిన వీరులకు సంబంధించినవి. వీటిలో ఎక్కువమంది వీరులు ధనుర్బాణాలను ధరించి వింటినారిని ఆకర్ణాంతం లాగినట్లు లేదా ఒకచేతిలో ఈటె మరొక చేతిలో ధనుస్సు, నడుముకు ఖడ్గంతో వున్నట్లు చిత్రించబడినారు.

మోపూరులోని భైరవేశ్వరాలయం వద్ద 32 వీరగల్లులున్నాయి[104]. వీటిలో ఎక్కువ భాగం ఆత్మబలి చేసుకున్న వీరశైవ భక్తుల స్మృత్యర్థం వేయించబడినాయి. మిగిలిన వీరగల్లులలో అశ్వంపై వున్న వీరుల శిలలు ముఖ్యమైనవి. ఈ వీరగల్లులను మూడు అంతస్థులుగా విభజించి, పై అంతస్థులో వీరుడు స్వర్గానికి వెళుతున్నట్లు, మధ్యభాగంలో వీరుడు అశ్వారూఢుడై ఈటె, ఖడ్గాలను ధరించి వున్నట్లు, క్రింది భాగంలో అతని చేతిలో

మరణించినవారి శవాల బొమ్మలు చెక్కబడినాయి. ఇంకొక వీరగల్లుపై ఆయుధ ధారియైన వీరుడు అశ్వారూఢుడై వుండగా క్రింద ఆవుల మంద వున్నట్లు చెక్కబడింది. ఈ వీరగల్లు మందపోటులో మరణించిన వీరునిదని స్పష్టమౌతూ వుంది. ఇప్పటికీ చుట్టుపక్కల గ్రామాల ప్రజలు ఈ వీరగల్లులను పసుల పిల్లలని వ్యవహరించడమే కాక పండుగ రోజులలో వీటిని నూనెతో అభిషేకించి పూజలు చేస్తారు.

ఆత్మబలికి సంబంధించిన శిలలలో వీరశైవ భక్తులు ఖడ్గంతో కంఠాన్ని కత్తిరించు కున్నట్లు లేదా గుండెను చీల్చుకున్నట్లు లేదా కడుపు నుంచి పేగులు బయటకు వచ్చేటట్లు పొడుచుకున్నట్లు వివిధ భంగిమలలో కనిపిస్తారు. ఈవిధమైన బలిదానం సాధారణంగా వీరభద్ర, కాళిక లేదా దుర్గ ఆలయాలలో జరుగుతుంది. తల తరిగి ఇస్తే రెండు కన్నులు పోయి మూడు కన్నులు, రెండు భుజాలు పోయి పది భుజాలు, ఒక ముఖం పోయి పంచముఖాలు వస్తాయని వీరశైవుల విశ్వాసం[105]. అష్టదిక్కులలో వుండే అష్ట భైరవులకు అష్టాంగ రుధిరంతో అర్చన చేసి రక్తసిక్తమైన కంఠాన్ని బలి ఇస్తే శక్తి తమ కోర్కెలన్నింటినీ తీరుస్తుందనే వీరశైవుల విశ్వాసం సింహాసనద్వాత్రింశికలో కనిపిస్తూ వుంది[106].

రాజు కోసం లేదా యజమాని కోసం మరణించిన వీరుల కుటుంబాలకు భూమిని దానంగా ఇచ్చే ఆచారం కూడా వుండేది. ఆ భూమిని నెత్తుటిపట్టు మాన్యమని అంటారు. పుష్పగిరిలోని ఒక శాసనం[107] ఇటువంటి మాన్యాన్ని గురించి తెలుపుతూ వుంది.

## 6.3 కీలుగ్గుంట

రాచపీనుగ తోడులేనిదే పోదనే సామెత ఆంధ్ర దేశంలో ప్రచారంలో వుంది. దీనికి నిదర్శనగా కీలుగుంట సంప్రదాయం వ్యాప్తిలో వుండినట్లు శాసనాల ద్వారా తెలుస్తూ వుంది. ఈ సంప్రదాయంలో రాజులు - లెంక, గరుడ, వేళవాడి వంటి భృత్యులను నియమించుకుంటారు. వీరు రాజు శారీరకంగా బాధపడితే తాముకూడా కృత్రిమంగా బాధను కలిగించుకుంటారు. రాజు మరణిస్తే ఆత్మబలి పద్ధతులలో వీరుకూడా మరణిస్తారు. ఈ విధంగా మరణించిన భృత్యుని శరీరంపై రాజు మృత శరీరాన్ని వుంచి అంత్యక్రియలు జరుపుతారు. కీలుగుంట సంప్రదాయానికి సంబంధించిన రెండు శాసనాలు రాయచోటి తాలూకాలోని వండాడి గ్రామంలో లభించినాయి. ఈ రెండు శాసనాలూ వైదుంబ గండత్రిణేత్రుని కాలానికి చెందినవి.

మొదటి శాసనంలో[108] గండత్రిణేత్ర వైదుంబరాజుకు, నోళంబ రాజుకు మధ్య ముదుమడువులో జరిగిన యుద్ధంలో ఎఱెయమ్మ అనే వీరుడు మరణిస్తే అతనితోపాటు ఒక వ్యక్తి (పేరు చెరిగిపోయింది) కీలుగుంట చొచ్చినట్లు వుంది. ప్రభుతేజాచారి కొడుకు సుభదేవాచారి, కీలుగుంట చొచ్చినట్లు డా॥ పి.వి. పరబ్రహ్మశాస్త్రి గారు అభిప్రాయపడినారు. కాని గండత్రిణేత్రుని కాలానికే సంబంధించిన రెడ్డివారిపల్లె లోని ఒక వీరగల్లు శాసనంలో[109]

కూడా పేర్కొనబడిన ఈ వ్యక్తిని శాసన లేఖకునిగా శ్రీ శాస్త్రిగారు గుర్తించినారు. వండాడి శాసనంలో "ప్రభుతేజ[చా]ర్జి కొడుకు సుభదేవాచారి ప[ణ]న పణియు" - అని, రెడ్డివారిపల్లె శాసనంలో "గటు ప్రభుతేజ ఆచర్జి కొడుకు సొబదేవు పణయు" - అని ఒకేవిధమైన వ్యాక్యం వుంది. ఒకే వ్యక్తిని ఒక శాసనంలో కీ ఱు గుంట చొచ్చినవానిగాను, ఇంకొక శాసనంలో శాసనలేఖకునిగాను శ్రీ శాస్త్రిగారు పేర్కొనడం ప్రామాదికం. పై రెండు శాసనాలలోనూ పేర్కొనబడిన సుభదేవాచారి లేఖకుడు మాత్రమే.

ఈ శాసనంలో పేర్కొనబడిన ఎఱెయమ్మ సాధారణ సైనికుడు కాక ఒక ప్రాంతానికి పరిపాలకుడై వుంటాడు[110]. శాసనానికి క్రింది భాగంలో వున్న శిల్పంలో ఎడమ వైపునుండి కుడివైపుకు వస్తున్న ఒక వీరుడు అశ్వారూఢుడై ఖడ్గాన్ని ధరించి ఆలీఢభంగిలో వున్నట్లు, అశ్వానికి వెనుక అతని సేవకుడొకడు రాజలాంఛనమైన ఛత్రాన్ని పట్టుకొని నిలబడి వున్నట్లు, ఇతని శత్రువు గజారూఢుడై అంకుశాన్ని మాత్రం చేత పట్టుకొని కుడివైపు నుండి ఎడమవైపుకు వస్తున్నట్లు చిత్రించబడింది. పై శాసనంలో ఎఱెయమ్మ ఏనుగుపై వున్న వీరుని ఎదుర్కొన్నట్లు చెప్పబడింది. కాబట్టి అశ్వారూఢుడైన వీరుడు ఎఱెయమ్మ అనే విషయం స్పష్టం. ఇతనితో పాటుగా రాజలాంఛనమైన ఛత్రాన్ని చిత్రించడాన్ని బట్టి ఇతడు రాజ ప్రముఖుడని తెలుస్తూ వుంది. పై శాసనం ఇతనిని "పుల్కవేళ్ళుళాళువర్హ్హ" - అని పేర్కొంటూ వుంది. పై మాటలలో లేఖన దోషం వల్ల 'ళే' - 'ళా'గా చెక్కబడింది. పై వాక్యభాగానికి 'పుల్కవేళ్ళులు' అనే ప్రాంతాన్ని ఏలుతున్నవాడు అని అర్థం. వండాడిలో గండత్రిణేత్రుడు వేయించిన ఇంకొక కీ ఱు గుంట శాసనంలో కూడా పుల్కవేళ్ళు ప్రస్తావన వుంది. వండాడిలోనే వున్న బిరుద త్రిణేత్రుని కాలం నాటి ఇంకొక శాసనంలో[111] నాలుగవ పంక్తిలోని "మ - - ల్క వేళ్ళు ఏళువ ర్హ్హ " అనే మాటలు కూడా పుల్కవేళ్ళు ఒక పరిపాలనా మండలమనే విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి. ఈ ప్రాంతమేదో ఇంతవరకు గుర్తించబడలేదు. కాని పుల్కవేల్పును పేర్కొంటున్న మూడు శాసనాలూ వండాడిలోనే వుండడం ఆధారంగాను, గండత్రిణేత్రుడు వేయించిన శాసనంలో 'పుల్కవేళ్ళు సాసనంబు' అని పేర్కొనడాన్ని బట్టి దీనిని వండాడిగానే భావించవచ్చు.

రెండవ శాసనంలో[112] కలిగత్రిణేత్ర సింగధరుని సేనాపతి రేనాంటిపోద ర్హ్హ వీరస్వర్గ మెక్కగా, కాణ్ణనూఱ్లు అనే అణివెట్టి కీ ఱు గుంట చొచ్చిన సందర్భంలో గండత్రిణేత్రుడు వైదుంబ వంశం వారి తరపున కణ్ణనూఱ కులం వారికి (ఏదో) ప్రతిఫలం సమర్పించి పుల్కవేళ్ళులో శాసనం వేయించినట్లు చెప్పబడింది. పై శాసనంలోని అణివెట్టి అనేమాట గమనించదగింది. అణి (అని) అంటే యుద్ధం. యుద్ధానికి సంబంధించిన వెట్టి అని పై సమాసానికి అర్థం. మొదటి శాసనంలో ఇటువంటి మాట ఏదీ వాడబడలేదు. కానీ ఈ రెండు శాసనాలూ గండత్రిణేత్రుని కాలానికి (క్రీ.వ. 9వ శతాబ్ది) సంబంధించినవి కావడం వల్ల ఆ కాలంలో 'అణివెట్టి' అనేమాట అటువంటి భృత్యులను రాజులు, సేనానాయకులు

నియమించుకునే సంప్రదాయం అక్కడక్కడా ప్రచారంలో వుండినట్లు తెలుస్తూ వుంది.

### 6.4 సతి

సహగమన లేదా అనుగమన సంప్రదాయం అక్కడక్కడా ప్రచారంలో వుండినట్లు జగతాపి గంగయదేవచోడ మహారాజుకు సంబంధించిన తాళ్ల ప్రొద్దుటూరు ప్రశస్తి శాసనంలో[113] సూచించబడింది. జగతాపి ఖడ్గముచేత నిహతుడైన వైరివీరుడు వీరస్వర్గాన్ని అలంకరించగా అతనిని పొందడానికి రంభ ఉత్సహించిన సమయంలో తూర్పు దిక్కున ఘృతాచి అపశకున సూచకంగా కిసుక్కున తుమ్మింది. అంతలోనే ఆ సూచనను నిజం చేస్తూ ఆ వీరుని కులభామిని అగ్నిపథంలో స్వర్గానికి చేరగా రంభ నిష్ఫలతకు తోడి కామినులు నవ్వినారని ఈ శాసనంలో ఒక కల్పన వుంది.

### 6.5 ఉత్తర సంస్కారాలు

వ్యక్తి మరణానంతరం అతనికి ఉత్తర సంస్కారాలు జరిపేవారు. వీటిలో ప్రధానమైంది శ్రాద్ధకర్మ. ద్విజులలో ఈ పద్ధతి నేటికీ ఆచరణలో వుంది. శ్రాద్ధం రెండు విధాలు. ఒకటి పార్వణ విధానం, ఇంకొకటి ఏకోద్దిష్ట విధానం. పార్వణ విధానంలో మూడు తరాల వారికి అంటే పితృ పితామహ ప్రపితామహ లేదా మాతృ పితామహి ప్రపితామహి - ఈ ముగ్గురికి శ్రాద్ధకర్మ నిర్వహిస్తారు. వీరు వసు రుద్ర ఆదిత్య రూపాలలో వుంటారని శ్రాద్ధం నిర్వహించడం వల్ల వీరికి శాశ్వత బ్రహ్మలోకావాప్తి కలుగుతుందని విశ్వాసం. ఏకోద్దిష్ట విధానంలో ఆ పేరు సూచిస్తున్నట్లు ఒకరిని మాత్రమే అంటే తండ్రి లేదా తల్లిని మాత్రమే ఉద్దేశించి శ్రాద్ధం నిర్వహిస్తారు. మరణించిన వ్యక్తి సాపిండ్యం జరగకముందు ప్రేత రూపంలో వుంటాడు. ఈ రూపంలో వున్న వ్యక్తికి ఏకోద్దిష్ట శ్రాద్ధాన్ని నిర్వహిస్తారు. శ్రాద్ధ భోక్తలకు దక్షిణలను ఇవ్వడం నేటికీ అనుసరిస్తున్న సంప్రదాయం. ఏకోద్దిష్ట శ్రాద్ధానికి సంబంధించిన సూచిక ఈ మండలంలోని ఒక శాసనంలో వుంది. వైదుంబ వంశానికి చెందిన ఇరిగెయ మహారాజు తమ తండ్రి బెజయిత మహారాజుకు ఉత్తర సంస్కారాలు జరిపిన సందర్భంలో సూర్యక్రమవేది అనే బ్రాహ్మణునికి అనిమెల పొలంలో కొంత భూమిని ఏకోద్దిష్టభుక్తదక్షిణగా ఇచ్చినట్లు శా.శ. 898 (క్రీ.శ. 976) నాటి అనిమెల శాసనంలో[114] నమోదు చేయబడింది. క్రీ.శ. 7వ శతాబ్ది నాటి ఎర్రగుడిపాడు శాసనం[115], ఎరికల్ ముతురాజుల కుణ్డికాళ్లు, 'నివాపం'గా ఒక బ్రాహ్మణునికి ఇరవై నాలుగు మఱున్తుర్ల నేలను పన్ననగా ఇచ్చినట్లు తెలుపుతూ వుంది. నివాపం అంటే మరణించిన పితరులకు పుణ్యావ్యాప్తి కోసం ఇచ్చే తిలతర్పణపూర్వకమైన దానం.

## 7. సామాజికమైన విలువలు

సమాజంలో ప్రధానంగా కనిపించే విలువలు రెండు. ఒకటి పరాక్రమం, రెండవది దాననిరతి. వీటితోపాటు యశఃకాంక్ష, శరణాగత రక్షణ, దుష్టశిక్షణ శిష్టరక్షణ, సత్యనిష్ఠ

ఉత్తమమైన సామాజిక మూల్యాలుగా కీర్తించబడినాయి.

## 7.1 పరాక్రమం

తన భూభాగాన్ని, సంపదను రక్షించుకోవడం, విస్తరింపజేయడం రాజధర్మం. అంతేకాక శత్రురాజుల నుండి, క్రూరమృగాల నుండి, దొంగల నుండి తన ప్రజల ప్రాణాలను, ఆస్తులను రక్షించవలసిన బాధ్యత కూడా రాజుదే. ప్రాచీనకాలంలో రాజు క్షత్రియుడు. కాళిదాసు 'రఘువంశం'లో దిలీపుడు, 'క్షతాత్ కిల త్రాయత ఇత్యుదగ్రః క్షత్రస్య శబ్దో భువనేషు రూఢః' అని క్షత్రియ శబ్దానికి రూఢమైన అర్థాన్ని గుర్తుచేసి, ఆ శబ్దార్థాన్ని ఆచరించనప్పుడు రాజ్యాధికారం వ్యర్థమని భావించినాడు[116].

ఈవిధంగా తమకు రక్షణ కల్పించే ప్రభువు జరిపే యుద్ధాలలో అతనికి బాసటగా నిలిచిన వీరులకు సమాజంలో ఉన్నతమైన స్థానముండేది. వీరుడు యుద్ధంలో మరణిస్తే స్వర్గానికి పోతాడని విశ్వసించేవారు. ఈ విశ్వాసం స్మృతి సాహిత్యంలో కూడా చోటుచేసు కొనింది.

యఆహవేషు వధ్యన్తే భూమ్యర్థ మపరాఙ్ముఖాః ।
అకూటై రాయుధై ర్యాన్తి తే స్వర్గం యోగినో యథా ॥

భూమి కోసం ఎవరైతే యుద్ధంలో విషపూరితాదులైన నిషిద్ధ ఆయుధాలను ప్రయో గించకుండా శత్రువుకు అభిముఖంగా పోరాడి వధింపబడతారో వారికి యోగులకు లభించే స్వర్గం లభిస్తుందని యాజ్ఞవల్క్య స్మృతి పేర్కొంటూ వుంది[117].

*ద్వా విమౌ పురుషౌ లోకే సూర్యమండల భేదినః ।*
*పరివ్రాట్ యోగముక్త శ్చ రణేచాభిముఖో హతః ॥*

పరివ్రాజకుడై యోగముచేత ముక్తుడైనవాడు, యుద్ధంలో శత్రువుకు అభిముఖంగా పోరాడి మరణించినవాడు - ఈ ఇద్దరు పురుషులు మాత్రమే సూర్యమండలాన్ని భేదించి ఊర్ధ్వలోకాలను చేరుకుంటారని ఒక అనుశ్రుతి. కృష్ణదేవరాయలకు సంబంధించి ఒక చాటువులో కూడా ఈ భావం ప్రతిఫలించింది.

*కలనన్ తావక ఖడ్గఖండిత రిపుక్ష్మాభర్త మార్తాండ మం*
*డల భేదంబొనరించి యేగునెడ తన్మధ్యంబునన్ హారకుం*
*డలకేయూరకిరీట భూషితుని శ్రీ నారాయణుం గాంచి లో*
*గలగన్ బాఱుచు నేగె నీవ యను శంకన్ కృష్ణరాయాధిపా*

యుద్ధంలో వీరుడు మరణించిన విషయాన్ని 'వీరస్వర్గంబెక్కె', 'సురలోకమ్బోయె', 'ఇంద్రలోకంబున కేగె' వంటి మాటలతో సూచించడానికి పై విశ్వాసమే కారణం.

పరాక్రమవంతులైన వారికి ఈక్రింది శ్లోకం ఆదర్శమైనట్లు కనిపిస్తుంది.

*జితేన లభ్యతే లక్ష్మీ: మృతేనాపి సురాంగనా ।*
*క్షణవిధ్వంసనే కాయే కా చిన్తా మరణే రణే ॥*

వీరుడు యుద్ధంలో జయిస్తే విజయలక్ష్మి లభిస్తుంది. మరణించెనా, స్వర్గంలో అప్సరసలు లభిస్తారు. శరీరం క్షణభంగురమైంది. కాబట్టి యుద్ధంలో మరణించడానికి చింతించ వలసిన అవసరం లేదు. ఈ విశ్వాసం వీరులకు సమరోత్సాహాన్ని కలిగించి విజయమో, వీర స్వర్గమో అనే ఆశయంతో రణరంగంలో తమ పరాక్రమాన్ని ప్రదర్శించడానికి నైతిక, ధార్మిక బలాన్ని చేకూర్చింది. యుద్ధంలోను, ప్రజల ధన ప్రాణాలను రక్షించడంలోను, వేట సందర్భంలోను మరణించిన వీరులకు వీరపూజలు నిర్వహించడం, వారి స్మృత్యర్థం వీరగల్లులు నిలపడం తమ కర్తవ్యంగా ప్రజలు భావించేవారు. పరిపాలకులు కూడా ఆ వీరులు తమకోసం తమ రాజ్యం కోసం చేసిన త్యాగానికి కృతజ్ఞతగా వారి కుటుంబాలకు భూములను లేదా మాన్యాలను ఇచ్చేవారు.

పరిపాలకులు తమ ప్రశస్తులలో పరాక్రమాన్ని సూచించే బిరుదాలను చాటుకునేవారు. ఇవి సాధారణంగా మూడు రకాలుగా కనిపిస్తాయి.

### *7.1.1 వ్యక్తిగత పరాక్రమాన్ని సూచించే సాధారణ వాచకాలు*

మూడవ కృష్ణుని రామేశ్వరం శాసనంలో[118] యదువంశంలో జన్మించిన రాష్ట్రకూటులు 'విక్రమైకాశ్రయు'లని చెప్పబడినాడు. ఈ శాసనంలోనే దంతిదుర్గుడు 'దుర్ధర బాహువీర్య:' అని ప్రశంసించబడినాడు. శా.శ. 1153 (క్రీ.శ. 1231) నాటి మద్దులేటిగడ్డ శాసనంలో[119] తిరుకాళత్తిదేవచోడ మహారాజు 'అపరిమిత ప్రతాప', 'భుజబలవీర' అని చెప్పబడినాడు. శా.శ. 1169 (క్రీ.శ. 1247) నాటి జ్యోతి శాసనంలో[120] రాయదేవ మహారాజు, శా.శ. 1104 (క్రీ.శ. 1182) నాటి పుష్పగిరి శాసనంలో[121] చిద్దణ దేవుడు, శా.శ. 1182 (క్రీ.శ. 1260) నాటి పొందలూరు శాసనంలో[122] జన్నిగదేవుడు, శా.శ. 1244 (క్రీ.శ. 1323) నాటి తాళ్ల ప్రొద్దుటూరు శాసనంలో[123] గంగయదేవ చోడుడు 'ఏకాంగవీర' బిరుదాన్ని ధరించినారు. శా.శ. 1169 (క్రీ.శ. 1247) నాటి జ్యోతి శాసనంలో[124] రాయదేవ మహారాజు 'వజ్రభుజదండ' బిరుదాన్ని, విభవ సంవత్సర ఆషాఢ శుద్ధ దశమి, సోమవారం నాటి (శక సంవత్సరం పేర్కొనబడలేదు) పుష్పగిరి శాసనంలో[125] వైదుంబ రాజైన మురారికేశవుడు, శా.శ. 1325 (క్రీ.శ. 1403) నాటి సోమిరెడ్డిపల్లె శాసనంలో[126] జోతిరాజు గుండయదేవ మహారాజు 'నిశ్శంక ప్రతాప' బిరుదాన్ని, శా.శ. 1182 (క్రీ.శ. 1260) నాటి పొందలూరు శాసనంలో[127] జన్నిగదేవుడు 'నిరతిశయ వీరరస' బిరుదాన్ని ధరించినారు.

కొందరు రాజులు తమ పరాక్రమాన్ని సూచించే బిరుదాలలో పౌరాణిక వీరులతో సామ్యాన్ని ఆపాదించుకోవడం కనిపిస్తుంది. రేనాటిచోళ రాజు పుణ్యకుమారుడు 'పోర్ముఖరామ'

బిరుదాన్ని[128], వైదుంబ రాజు రాయదేవ మహారాజు (రక్కసగంగదేవుడు) 'గడియంక భీమ', 'కోదండ పరశురామ', 'రణరంగభైరవ' బిరుదాలను[129]; గణపతిదేవుని సామంతుడైన జన్నిగదేవుడు 'రణరంగరాక్షస' బిరుదాన్ని[130], తెలుగుచోడ వంశానికి చెందిన గంగయదేవచోడుడు 'రణరంగ భైరవ' బిరుదాన్ని[131] ధరించినారు. శా.శ. 1367 (క్రీ.శ. 1445) నాటి ఎగువరాచపల్లి శాసనంలో[132] వైదుంబ వంశానికి చెందిన తిరుమలేశ్వర నాయకుడు 'భుజబల భీమ' బిరుదాన్ని ధరించినాడు.

### *7.1.2 శత్రు రాజులపై తమ ఆధిపత్యాన్ని ప్రకటించే సాధారణ వాచకాలు*

వైదుంబులు తమ ప్రశస్తిలో "అనేక సమర సంఘట్టణోపలబ్ధ జయలక్ష్మీ సమాలింగిత వక్షస్థలు"లమని, మలి రేనాటిచోళులు "అరిదుర్ధరవరభూజాసి భాసురు"ల మని చెప్పుకున్నారు. తెలుగుచోడ రాజు చిద్దణచోళుడు "గర్వితారాతినృపతికులకుధర కులిశధరుడ"నని[133], పల్లవ వంశానికి చెందిన చిద్దణదేవుడు "కామకోట్యంబికాదేవీ వరప్రసాదానేక రిపున్నపతి మణిమయ మకుట సంఘట్టిత చరణయుగళుడ"[134] నని చెప్పుకున్నారు. శా.శ.. 1182 (క్రీ.శ. 1260) నాటి పొందలూరు శాసనంలో[135] గణపతిదేవుడు "ప్రణత సకల నరపతి మణిమకుటకోటి మకరికా చుంబ్యమాన చరణనఖ కిరణకందళు"డని ప్రశంసించబడినాడు. ఈ శాసనంలోనే అతని సామంతుడైన జన్నిగదేవుడు "రిపుకులకంజ కుంజరు'డని, 'విజయ లక్ష్మీకాంతు'డని ప్రశంసించబడినాడు. శా.శ. 1244 (క్రీ.శ. 1323) నాటి తాళ్ల ప్రొద్దుటూరు శాసనంలో[136] గంగయదేవచోడ మహారాజు 'ప్రతిబలదావ పావక', 'విరోధిమాండళిక కాలదండ', 'చలమర్తిగండ' బిరుదాలను ధరించినాడు. శా.శ. 1169 (క్రీ.శ. 1247) నాటి జ్యోతి శాసనంలో[137] రాయదేవ మహారాజు 'స్వామిద్రోహరగండ', 'వైరినాయక గోత్ర నక్షత్ర', 'చలమర్తిగండ', 'రిపునాయక శిర:ఖండన' అనే బిరుదాలను ధరించినాడు. శా.శ. 1153 (క్రీ.శ. 1231) నాటి మద్దులేటిగడ్డ శాసనంలో[138] తిరుకాళత్తిదేవచోడుడు, కాలనిర్ణయం లేని తూడూరు శాసనంలో[139] బీరచిద్దచోడ మహారాజు 'వైరిఘరట్ట/వైరిగరట్ట' బిరుదాన్ని ధరించినారు. కాలనిర్ణయం లేని కొమ్మనూతల శాసనంలో[140] సాళువ నరసింహరాయలు 'అష్టదిక్కరాయ మనోభయంకర' అనే బిరుదాన్ని ధరించినాడు.

### *7.1.3 శత్రురాజులను లేదా రాజవంశాలను జయించినప్పుడు ఆయా రాజులను లేదా రాజవంశాలను పేర్కొంటూ ప్రకటించుకున్న బిరుదాలు*

తెలుగుచోళులు తమ వంశానికి మూలపురుషుడైన కరికాలచోళుడు, త్రిలోచన పల్లవుడు మొదలైన రాజులను జయించి వారిని బందీలుగా పట్టుకొని వారిచేత కావేరీ నదికి గట్టుపోయించిన విషయాన్ని "త్రిలోచన ప్రముఖాఖిల పృథివీశ్వర కారిత కావేరీతీర" అని చాటుకున్నారు. దంతిదుర్గుడు చాళుక్యులను ఓడించి రాష్ట్రకూట సామ్రాజ్యాన్ని స్థాపించిన విషయం 'చాళుక్యసింధు మథనోద్భవ రాజ్యలక్ష్మీం య స్సంబభార చిర మాత్మకులైక కాన్తాం' - అని మూడవ కృష్ణుని రామేశ్వరం శాసనంలో[141] వర్ణించబడింది. తెలుగుచోడ వంశానికి

చెందిన తిరుకాళత్తిదేవుడు, శా.శ. 1153 (క్రీ.శ. 1231) నాటి బెడుసుపల్లి శాసనంలో[142] 'పృథ్వీశ్వరుని తలగొండుగండ', 'సోమవంశ ధూమకేతు' అనే బిరుదాలను, శా.శ. 1159 (క్రీ.శ. 1238) నాటి ఓగూరు శాసనంలో[143] 'పృథివీశ్వర శిర:కందుక క్రీడా వినోద' అనే బిరుదాన్ని ధరించినాడు. శా.శ. 1244 (క్రీ.శ. 1323) నాటి తాళ్ల ప్రొద్దుటూరు శాసనంలో[144] గంగయ దేవచోడుడు, 'సేవణసేనాదుగ్ధాంభోనిధాన పరిమథన లబ్ధ లక్ష్మీ దక్షిణభుజ మందర', 'నిశితాసి కులిశ నిపతన శకలిత జోగులకుమార మహీధర', 'ఒఱటర భీముని శిర:కందుకోత్పాటన సంశోభిత' అని చెప్పుకున్నాడు. శా.శ. 1214 (క్రీ.శ. 1292) నాటి రాజంపేట శాసనంలో[145] కాయస్థ అంబదేవుడు 'ఏరువ మల్లిదేవ తలగొండు గండ' అని చెప్పుకున్నాడు. సుభాను సంవత్సర, శ్రావణ, శుద్ధపౌర్ణమి సోమగ్రహణం (శక సంవత్సరం పేర్కొనబడలేదు) నాటి సోమిరెడ్డిపల్లె శాసనంలో[146] జోతిరాజు గుండయదేవ మహారాజు 'పాండ్యరాయగజ కేసరి' అనే బిరుదాన్ని ధరించినాడు.

పైవిధంగా బిరుదాల ద్వారా ప్రకటించడంతో పాటు కొన్ని శాసనాలు పరిపాలకుల పరాక్రమాన్ని కావ్యశైలిలోకూడా వర్ణించినాయి. పొందలూరు శాసనం[147] గణపతి దేవుడిని 'కరకరవాళ క్షపిత విపక్షవిలాసినీ విళంబమానాలకవల్లరీ వినిస్సారిత లలాటతళ కస్తూరికా తిలకు'డని వర్ణించింది. రామేశ్వరం శాసనం[148] మూడవ కృష్ణుని పరాక్రమాన్ని "ఆయోధనార్థమధిగచ్ఛతి కృష్ణరాజే కృష్ణీ బభూవ వదనం రిపు కామినీనాం । వైధవ్యతాప పరితాపిత మానసానాం - అని వర్ణించింది. శా.శ. 1446 (క్రీ.శ. 1525) నాటి ఉప్పరపల్లి శాసనం[149] చెన్నూరు, పోట్లదుర్తి సీమలకు నాయంకరుడైన పెదసింగ భూపాలుని పరాక్రమాన్ని

*"శింగక్ష్మాపాల ధాటీ తురగ ఖుర పుటోద్ఘట్టితక్ష్మాతలోద్య*
*ద్ధూళీపాళీనిపీతే చతురుదధిజలే రేణుమాత్రావశేషే*
*జాతే నిద్రావిఘాతే నవజలనిధిభి స్తోషిత శ్శార్ఙ్గ ధన్వా*
*శత్రుస్త్రీ భాష్పపూరై రనవరత మహా దానధారాంబు సిద్ధై:"* - అని వర్ణించింది.

### 7.2 దాననిరతి

ధర్మాచరణం స్వర్గప్రాప్తికి మూలం. మానవుడు తన జీవితంలో అనుభవించే సౌఖ్యాలు, సంపదలు ఏవీ శాశ్వతం కావు. ఆచరించిన ధర్మమొక్కటే శాశ్వతమైంది.

*"అనిత్యాని శరీరాణి విభవో నైవ శాశ్వత: ।*
*నిత్యం సన్నిహితో మృత్యు: కర్తవ్యో ధర్మసంగ్రహ: ॥"*[150]

శరీరాలు అనిత్యమైనవి, సంపదలు అశాశ్వతమైనవి. మృత్యువు ఎల్లప్పుడు పొంచి వుంది. కాబట్టి ధర్మ సంగ్రహమే కర్తవ్యం. ఈ విధమైన ఆశయం ప్రాచీన కాలం నుండి భారతదేశంలో ధర్మానురక్తులైన వారందరు పయనించిన ఘంటాపథమైంది.

పైన చెప్పబడిన శ్లోకానికి అనువాదమనదగిన పద్యమొకటి క్రీ.శ. 9 లేదా 10వ శతాబ్ది నాటి చిడిపిరాల శాసనంలో వుంది[151].

*అర్థఁ మశాశ్వతమ్ము యొడ లన్నది త[త్]క్షణ భంగురమ్ము త*
*త్వార్థఁ ముగాదు జీవము క్రి(కృ)తాన్తక మారక మిట్టిదనిని (మీ)*
*రత్తి (రర్థి) గుఱించి నమ్మక పరార్థఁ ము నెన్నణ్డు (డు) జేటులేని ధ*
*మార్ఁ ర్థఁ మ(ము) చేయుణ్డీ (డీ) మనుజు లమ్మెనపెగ్గడయట్లు వేమిఁ తో*

ధర్మంలో ఒక భాగం దానం. దానఫలాన్ని గురించి స్మృతులు ప్రాచీన కావ్యాలు కీర్తించినాయి. రాజు మొదలుకొని సామాన్య ప్రజలవరకు సర్వులు దాననిరతిని ప్రదర్శించినారు. భారతదేశంలో లభించిన శాసనాలలో ఎక్కువ భాగం దాన శాసనాలే కావడం ఇందుకు ప్రబల సాక్ష్యం. పరిపాలకులు వేయించిన శాసనాలలో వారి దానగుణాన్ని ప్రకటించే రూపకాలు చోటుచేసుకున్నాయి. శ్రీకంఠచోళుని మద్రాస్ మ్యూజియం తామ్ర ఫలకాలలో[152] సుందర నందుడు 'కల్పవృక్ష ఇవాపర:' అని కీర్తించబడినాడు. శా.శ. 1104 (క్రీ.శ. 1182) నాటి పుష్పగిరి శాసనం[153] పల్లవ వంశానికి చెందిన చిద్దణదేవ మహారాజును 'సతత దాన ముదితుడ'ని పేర్కొనింది. శా.శ. 1159 (క్రీ.శ. 1238) నాటి ఓగూరు శాసనంలో[154] తిరుకాళత్తిదేవ చోడ మహారాజు 'వితరణ వినోద' అని చెప్పబడినాడు. శా.శ. 1169 (క్రీ.శ. 1247) నాటి జ్యోతి శాసనంలో[155] రాయదేవ మహారాజు 'యాచకజన పారిజాత' అని ప్రశంసించబడినాడు. శా.శ. 1244 (క్రీ.శ. 1323) నాటి తాళ్ల ప్రొద్దుటూరు శాసనం[156] గంగయదేవచోడ మహారాజును 'దానవినోద సముదిత సత్పాత్రుడని" పేర్కొంటూ వుంది.

శ్రీకంఠచోళుడు శత్రురాజులను జయించి, వీరలక్ష్మిని సంపాదించి, తులాపురుష దానాల చేత లోకాన్ని నింపి, ప్రతాప దానానుగుణానుషంగియైన కీర్తిని జగత్తుయొక్క అంతం వరకు తీసుకొని పోయినాడని; నివృత్తి కాంక్షలేనివాడైనప్పటికి శాశ్వతమైన త్రివర్గసిద్ధిని (ధర్మార్థ కామములు) పొందగోరినవాడై శివభక్తి దీక్షా తత్పరుడైన బాలశక్తి గురువుకు మందరం గ్రామాన్ని దానమిచ్చినట్లు ఈ రాజు జారీచేసిన మద్రాస్ మ్యూజియం తామ్ర ఫలకాలు[157] తెలియజేస్తున్నాయి.

ఈవిధంగా రాజులు తమ దాతృత్వాన్ని కేవలం ప్రశస్తులలో ప్రకటించుకోవడమే కాదు, ఆచరించి తమ ప్రజలకు ఆదర్శప్రాయులైనారు.

దానం ఎంతటి ఫలాన్ని ఇస్తుందో అంతకంటె ఎక్కువ ఫలం తదనుపాలనం వల్ల లభిస్తుందని భారతీయుల విశ్వాసం. క్రింద చెప్పబడిన శ్లోకం పై విశ్వాసానికి తార్కాణం.

*దానపాలనయో ర్మధ్యే దానా చ్ఛ్రే యోనుపాలనం ।*
*దానా త్స్వర్గ మావాప్నోతి పాలనా దచ్యుతం పదం ॥*

(దానమివ్వడం, ఇతరులు ఇచ్చిన దానాన్ని క్షతి లేకుండా అమలు పరచడం - ఈ రెండింటిలో దానానుపాలనమే అధిక ఫలాన్ని ఇస్తుంది. దానంవల్ల స్వర్గాన్ని, తదనుపాలనం వల్ల అచ్యుత పదాన్ని పొందుతారు) - ఈ విశ్వాసం ప్రజలకు పరిపాలకులకు వున్నప్పటికీ, క్వాచిత్కంగా ఈ ఆశయాతిక్రమణం జరిగిన సందర్భాలు కనిపిస్తున్నాయి.

ఒక రాజు తన రాజ్యంలోని గ్రామాన్ని పుత్ర పౌత్ర పారంపర్యంగా అనుభవించడం కోసం బ్రాహ్మణునికి దానంగా ఇచ్చినప్పటికీ, ఇతర రాజులు ఆ ప్రాంతాన్ని ఆక్రమించుకున్నప్పుడు ఆ గ్రామాన్ని ప్రతిగ్రహీతకు లేదా అతని వారసులకు చెందకుండా చేయడం, ఆ ప్రాంతం మరల పూర్వపు రాజుల అధీనంలోకి వచ్చినప్పుడు వారు తమ పూర్వీకులు ఇచ్చిన దానాన్ని పునరుద్ధరించడం జరిగిన సందర్భాలు కొన్ని శాసనాలలో నమోదు చేయబడినాయి. హరిహరరాయలు నిత్యానందపుష్పినాథయ్యంగారికి ములికినాటి సీమలోని నిత్యానంద పుష్పినాథపురం అనే గ్రామాన్ని దానమియ్యగా రాజ్యాంతరంలో సంబెటవారు మొదలైన 'మంన్యహావళ్లు' ఆ గ్రామాన్ని ప్రతిగ్రహీత పుత్రపౌత్రులకు చెందకుండా చేసినారు. తరువాతి కాలంలో ఆ ప్రాంతాన్ని మరల ఆక్రమించుకున్న వీరనరసింహరాయలు పై విషయాన్ని తెలుసుకొని నీళ్లులేని పోటిపాడు అని వ్యవహరించబడుతున్న ఆ గ్రామాన్ని పూర్వగ్రహీతకు మునిమనుమడు, భారద్వాజ సగోత్రుడు, ఆశ్వలాయన సూత్రుడు అయిన కామరసుగారి కొడుకు పెదతిమ్మయగారికి శ్రీశైల మల్లికార్జున దేవుని సన్నిధిలో పాతాళగంగలో సహిరణ్యోదక ధారాపూర్వకంగా ఇచ్చి ఆ గ్రామాన్ని ప్రస్తుత గ్రహీత పుత్రపౌత్ర పారంపర్యంగా, ఏకభోగంగా ఆచంద్రార్క స్థాయిగా అనుభవించేటట్లు శా.శ. 1430 విభవ సంవత్సర వైశాఖ శుద్ధ పౌర్ణిమ (క్రీ.శ. 1508, ఏప్రిల్, 15వ తేదీ) నాడు అరకటవేములలో శాసనాన్ని[158] వేయించినాడు.

ఇటువంటి సంఘటనలను అనుమానించడం వల్లనే దాతలైన కొందరు రాజులు ఆశయ వాక్యాలలో

"మద్వంశజాః పరమహీపతి వంశజా వా
యే భూమిపాః సతత ముజ్జ్వల ధర్మచిత్తాః ।
మద్ధర్మమేవ పరిపాలన మాచరంతి
తత్పాదుకాద్వయ మహం శిరసా వహామి"[159] - అని ప్రార్థించినారు.

అంతేకాదు భావి పరిపాలకులు ఈ ధర్మసేతువును అతిక్రమించ రాదని సాక్షాత్తు శ్రీరామచంద్రుడు యాచిస్తున్నట్లు

"సామాన్యోయం ధర్మసేతు ర్నృపాణాం
కాలేకాలే పాలనీయో భవద్భిః ।
సర్వా నేతాన్ భావినః పార్థివేంద్రాన్
భూయోభూయో యాచతే రామచంద్రః"[160] - అని శ్లోకం ప్రకటిస్తూ వుంది.

### 7.3 యశః కాంక్ష

పరాక్రమంతో శత్రురాజులను జయించడం, ధనాన్ని సంపాదించి పాత్రులకు దానం చెయ్యడం యశస్సు కోసమే. ప్రాచీనకాలం నుండి చక్రవర్తులు యశస్సంపాదనకు ప్రతాపదానాలను ప్రధాన మార్గాలుగా ఎంచుకున్నారు. చిన్నచిన్న భూభాగాలకు అధిపతులైనవారు కూడా తమ కీర్తి అన్నిదిక్కులలోను ప్రసరించినట్లు చెప్పుకోవడం శాసనాలలోను, కావ్యాలలోను కనిపిస్తుంది. పల్లవ వంశానికి చెందిన చిద్దణదేవుడు "ధవళయశోలహరీ పయః పూరిత దిగంతరాళ"[161] అని, జన్నిగదేవుడు "విశదయశః ప్రహ(సా)ర కల్పిత కులశిఖరీ (రి) శేఖర"[162] అని శాసనాలలో పేర్కొనబడినారు.

సప్త సంతానాలు యశస్సును చిరస్థాయిగా నిలువుతాయి. కాబట్టి ఎందరో పరిపాలకులు సప్తసంతానాలను పొందడం కోసం తమ ధనాన్ని వ్యయించినారు.

*పుత్రః కృతి స్తటాకశ్చ నిధానం శివమందిరం ।*
*వనం విప్రాగ్రహార శ్చ సత(ప్త) సంతాన ముత్తమం ॥* – అని

శా.శ. 1291 (క్రీ.శ. 1369) నాటి పోరుమామిళ్ల శాసనం[163] సప్త సంతానాల పట్టికను ఇస్తూ భవదూర మహీపతిని ఏతాదిక సత్పుణ్యకర్తగా అభివర్ణించింది.

### 7.4 శరణాగత రక్షణ

శరణాగత రక్షణ ఉత్తమమైన రాజధర్మం. పరిపాలకులు తాము శరణాగత రక్షణ పరాయణులమని ప్రశస్తులలో చాటుకున్నారు. బెడుసుపల్లి శాసనంలో[164] తిరుకాళత్తిదేవుడు, తూడూరు శాసనంలో[165] బీరచిద్దచోళుడు, పొందలూరు శాసనంలో[166] జన్నిగదేవుడు 'శరణాగత వజ్రపంజర" అనే బిరుదాన్ని ధరించినారు. పొందలూరు శాసనంలోనే జన్నిగదేవుడు 'స్థిరనిబద్ధ శరణాగత రాజ్యపట్ట' అని చెప్పబడినాడు. శా.శ. 1046 (క్రీ.శ. 1124) నాటి పెద్ద ముడియం శాసనంలో[167] అత్యణచోళ మహారాజు 'శరణాగత రక్షామణి'గా పేర్కొనబడినాడు.

### 7.5 దుష్టశిక్షణ – శిష్టరక్షణ

దుష్టశిక్షణ – శిష్టరక్షణ రాజులకు ప్రధాన కర్తవ్యం. పందివీడులోని కాలనిర్ణయం లేని ఒక శిథిల శాసనంలో[168] శ్వేతధ్వజాధిపతి, వృషభలాంఛన బిరుదాలను ధరించిన ఒక రాజు (పేరు చెరిగిపోయింది), పెద్ద ముడియం శాసనంలో[169] చిద్దణచోళుడు 'దుష్టనిగ్రహ, శిష్టపరిపాలకు'లుగా పేర్కొనబడినారు.

### 7.6 సత్యనిష్ఠ

సత్యనిష్ఠ పరమోదాత్తమైన లక్షణంగా భావించేవారు. కొందరు రాజులు తాము సత్యవాక్పరిపాలకులమని చెప్పుకొని, సత్యవాక్పరిపాలన కోసం సమస్తాన్నీ త్యజించిన మాంధాత,

హరిశ్చంద్రులతో సామ్యాన్ని రూపించుకొన్నారు. రామేశ్వరం శాసనంలో[170] మూడవ కృష్ణుడు "సంరక్షతి క్ష్మా మిమాం సత్య, త్యాగ సమృద్ధ మహిమా బద్ధాన్యథా" - అని కీర్తించబడినాడు. బెడుసుపల్లి శాసనంలో[171] తిరుకాళత్తిదేవుడు "సత్యమాంధాత" అని, పొందలూరు శాసనంలో[172] జన్నిగదేవుడు, శా.శ. 1347, విశ్వావసు సంవత్సర, ఆశ్వయుజ బహుళ తదియ ఆదివారం (క్రీ.శ. 1425, సెప్టెంబర్, 30వ తేదీ) నాటి మోపూరు శాసనంలో[173] కుమారదేవరాయలు 'సత్యహరిశ్చంద్ర' అని పేర్కొనబడినారు. పుష్పగిరి శాసనంలో[174] చిద్దణదేవ మహారాజు 'నిరంతర సత్యవ్రతుడు'గా పేర్కొనబడినాడు.

ఉదాత్తుడైన పరిపాలకునికి వుండవలసిన లక్షణాలన్నీ తనకున్నట్లు కొందరు రాజులు చాటుకున్నారు. రామేశ్వరం శాసనం[175] 'కార్య శ్శత్రుషు బంధుషు ప్రతిపదం స్నేహ స్తత ప్రశ్రయ: దానం చా ర్థిషు దు:ఖితేషు కరుణా దుష్టేషు దణ్డం చిరం సౌభాగ్యం వనితాసు కృష్ణ నృపతే స్సర్వత్ర సర్వాతిగ:" - అని రాష్ట్రకూట రాజు మూడవ కృష్ణుని గుణాలను కీర్తిస్తూ వుంది. తాళ్ల ప్రొద్దుటూరు శాసనంలో[176] గంగయదేవచోడుడు 'సుగుణమణిగణ రత్నాకర' అని ప్రశంసించబడినాడు. శా.శ. 1446 (క్రీ.శ. 1525) నాటి ఉప్పరపల్లి శాసనం[177] కృష్ణదేవరాయల కాలంలో చెన్నూరు పొట్లదుర్తి సీమలకు నాయంకరుడైన జూపల్లి వంశస్థుడైన పెదసింగ మహీపతి తమ్ముడు చినసింగ మహీపతిని

*"సత్యాచార గుణానురాగ కరుణా కీర్తి ప్రతాపోన్నతం*
*మన్యంతే చినశింగ భూప మతుల ప్రాప్తైక పత్నీవ్రతం*
*సత్యే ధర్మతనూభవం భుజబలే భీమం రణే చార్జునం*
*సౌందర్యే నకులం తథా ప్రవిమలజ్ఞానే చ త స్యానుజం"* - అని వర్ణించింది.

# సూ చి క లు

1. Haripada Chakraborti : India as Reflected in The Inscriptions of Gupta Period; 1978 : p. 1.
2. I.A.P., C.D., Part I, No. 129.
3. Ibid., No. 142
4. Ibid., No. 151
5. Ibid., Part II, No. 191
6. Ibid., Part I, No. 131
7. Ibid., No. 132
8. Ibid., No. 137
9. Ibid., Part II, No. 35
10. Ibid., No. 87
11. Ibid., No. 36
12. Ibid., No. 38
13. Ibid., No. 224
14. Ibid., No. 109
15. Ibid., No. 187
16. Ibid., No. 14
17. Ibid., No. 274
18. Ibid., No. 120
19. కుందూరి ఈశ్వరదత్తు : శాసన శబ్దకోశము; 1967.
20. I.A.P., C.D., Part II, No. 109
21. Ibid., Part I, No. 2
22. Ibid., No. 3
23. Ibid., No. I
24. Ibid., No. 45
25. Ibid., No. 48
26. Ibid., .. 74
27. Ibid., No. 123
28. Ibid., Part II, No. 27
29. Ibid., No. 30
30. Ibid., No. 31
31. Ibid., No. 76
32. Ibid., No. 82
33. దేవద్రవ్యం గురుద్రవ్యం విప్రద్రవ్యం తథైవ చ ।
    ఉపేక్షితాని భక్ష్యాణి కులక్షయ మిదం భవేత్ ॥
33. I.A.P., C.D., Part II, No. II
34. Ibid., No. 74
35. Ibid., No. 123
36. Ibid., No. 124
37. Ibid., Part II, No. 89
38. Ibid., No. 170
39. Ibid., No. 241
40. Ibid., No. 215
41. Ibid., No. 236
42. Ibid., No. 237
43. Ibid., No. 238
44. Ibid., No. 241
45. Ibid., No. 81
46. Ibid., No. 199
47. Ibid., No. 228
48. Ibid., No. 235
49. Ibid., No. 274
50. D.C. Sircar : Indian Eipgraphical Glossary.
51. I.A.P., C.D., Part II, No. 224
52. Ibid., No. 224
53. Ibid. No.s 205 & 213.
54. Ibid., No. 217
55. Ibid., No. 178
56. Ibid., No. 179
57. Ibid., No. 183
58. Ibid., No. 184
59. Ibid., No. 194

60. Ibid., Part I,No. 9
61. Ibid., No. 14
62. Ibid., No. 16
63. Ibid., Part II, No. 87
64. Ibid., No. 87
65. Ibid., No. 87
66. Ibid., No. 87
67. Ibid., Part I,No. 109
68. కొరవి గోపరాజు : సింహాసన ద్వాత్రింశిక; 11-147, 148
69. I.A.P., C.D., Part I,No. 88
70. E.I., Vol. XI, p. 337.
71. I.A.P., C.D., Part I,No. I
72. Ibid.,
73. Ibid., No. II
74. Ibid., Part II,No. 170
75. Ibid., No. 203
76. Ibid., No. 84
77. Ibid., No. 106
78. Ibid., Part I,No. 151
79. Ibid., Part II,No. 39
80. Ibid., No. 241
81. Ibid., No. 105
82. Ibid., No. 215
83. Ibid., No. 223
84. Ibid., Part I, No. 123
85. Ibid., No. 162
86. Ibid., Part I, No. 13
87. Ibid., No. 31
88. Ibid., Part II,No. 13
89. Ibid., No. 159
90. Ibid., Part II,No. 203
91. Ibid., No. 204
92. Ibid., No. 11
93. Ibid., Part I,No. 142
94. H. Sarkar : Chāya Stambas From Nagarjunakonda, Seminor on Hero-Stones; Ed. R. Nagaswamy, The State Dept. of Archaeology, Govt. of Tamil Nadu, Madras, 1974.
95. I.A.P., C.D., Part I No. 1
96. Ibid., Part III,No. 4
97. Ibid., Part I,No. 31
98. Ibid., No. 77/Devapatla–8
99. Ibid., No. 34
100. Ibid., No. 59
101. Ibid., No. 61
102. యన్.వి. రమణయ్య : కడప శిలాశాసనములు వగయిరా; పుట. 11-12
103. కె. శ్రీనివాసులు : గండికోట సీమ చరిత్ర - సంస్కృతి; పుట. 75
104. పైదే. పుట. 74
105. M. Somasekhara Sarma; History of Reddy Kingdoms.
106. కొరవి గోపరాజు : సింహాసన ద్వాత్రింశిక; 10-155
అష్ట దిక్కుల నున్న యష్టభైరవులకు
నష్టాంగ రుధిరంబు లర్చనముగ
జేసి కంఠంబు రక్తసిక్తంబు బలియిచ్చు
జనుల కోర్కులెల్ల శక్తి ఇచ్చు.
107. కె. శ్రీనివాసులు : పూర్వోద్ధృతము; పుట. 75
108. I.A.P., C.D., partI, No. 63
109. Ibid., No. 72
110. ఇతడు పశ్చిమ గాంగరాజు మొదటి రాచమల్లు కుమారుడు ఎఱెయగంగ కావచ్చునని డా॥ పి.వి. పరబ్రహ్మశాస్త్రి గారి అభిప్రాయం.
(I.A.P., C.D., Part I, Introduction, P. XVIII)

111. I.A.P., C.D., Part I,No. 66
112. Ibid., No. 64
113. Ibid., No. 159
114. Ibid., No. 74
115. Ibid., No. 10
116. కాళిదాసు : రఘువంశం, ద్వితీయసర్గ.
117. 1–13–324
118. I.A.P., C.D., Part I,No. 88
119. Ibid., No. 107
120. Ibid., No. 133
121. Ibid., No. 129
122. Ibid., No. 142
123. Ibid., No. 159
124. Ibid., No. 133
125. Ibid., No. 134
126. Ibid., Part II,No. 30
127. Ibid., Part I, No. 142
128. Ibid., No. 14
129. Ibid., No. 133
130. Ibid., No. 142
131. Ibid., No. 159
132. Ibid., Part II, No. 44
133. Ibid., Part I,No. 112
134. Ibid., No. 129
135. Ibid., No. 142
136. Ibid., No. 159
137. Ibid., No. 133
138. Ibid., No. 107
139. Ibid., No. 112
140. Ibid., Part II, No. 49
141. Ibid., Part I, No. 88
142. Ibid., No. 109
143. Ibid., No. 111
144. Ibid., No.159
145. Ibid., No. 146
146. Ibid., Part II, No. 30
147. Ibid., Part I, No. 142
148. Ibid., No. 88
149. Ibid., Part II, No. 87
150. Ibid., No. 78
151. Ibid., Part I, No. 122
152. Ibid., No. II
153. Ibid., No. 129
154. Ibid., No. 111
155. Ibid., No. 133
156. Ibid., No. 159
157. Ibid., No. II
158. Ibid., Part II, No. 63
159. Ibid., No. 187
160. Ibid., No. 47 etc.
161. Ibid., Part I, No. 129
162. Ibid., No. 142
163. Ibid., Part II, No. 11
164. Ibid., Part I, No. 109
165. Ibid., No. 112
166. Ibid., No. 142
167. Ibid., No. 123
168. Ibid., No. 119
169. Ibid., No. 123
170. Ibid., No. 88
171. Ibid., No. 109
172. Ibid., No. 142
173. Ibid., Part II, No. 37
174. Ibid., Part I, No. 129
175. Ibid., No. 88
176. Ibid., No. 159
177. Ibid., Part II, No. 87

# నాలుగవ అధ్యాయం

# ఆర్థిక వ్యవస్థ

## 1. భూమి – రకాలు

ఆర్థిక దృష్టితో పరిశీలిస్తే శాసనాలలో పేర్కొనబడిన భూములను ఐదు రకాలుగా వర్గీకరించవచ్చు. 1. నదీ మాతృకము, 2. దేవ మాతృకము, 3. తోటలు, 4. పచ్చిక బయళ్లు, 5. బీడు భూములు. వీటిలో క్షేత్రము, మడి, నీరారంభము మొదలైన వాటిని నదీమాతృకాలుగా, చేను, కాడారంభము మొదలైన వాటిని దేవమాతృకాలుగా; తోట, వనం అనేవాటిని తోట భూములుగా; గోచర్మం చేను, చారున చేనులను పచ్చిక బయళ్లుగా; బీడు చేను, పాండవ బీడు మొదలైన వాటిని బీడు భూములుగా గుర్తించవచ్చు.

'క్షేత్రము' అనేమాట శాసనాలలో చాలాచోట్ల కనిపిస్తుంది. "రాజమానేన పంచదశం క్షేత్రం దత్తమ్"[1], "లక్కరాజు అళ్ళాళ రాజుగారు ఇచ్చునటువంటి క్షేత్రానకు"[2], "ఈ శాసనస్థమైన క్షేత్రాలు"[3], "చెతుస్సీమకుంను లోనుంగాగల క్షేత్రం"[4], మొదలైన ప్రయోగాలు శాసనాలలో కనిపిస్తున్నాయి. 'క్షేత్ర'మంటే సాగుచెయ్యడానికి అనువైన భూమి అని అర్థం. శా.శ. 1375 (క్రీ.శ. 1458) నాటి మాలెమార్పురం శాసనంలో[5] 'సుక్షేత్రానకు' అనే మాట వుంది. దీనికి బాగా పంట పండే భూమి అని అర్థం చెప్పవచ్చు. శాసనాలలో 'క్షేత్ర'మనే మాట సాగుభూములకు సంబంధించిన సాధారణార్థంలో వ్యవహరించబడింది. శా.శ. 1462 (క్రీ.శ. 1539) నాటి కన్నెలూరు శాసనంలో[6] 'చాసర క్షేత్ర' అనే మాట వుంది. 'చాస' అంటే హలవిదారితమైన భూమి అని 'పాఇఅ సద్ద మహణ్ణవో' అనే ప్రాకృత నిఘంటువులో వివరించబడింది. కాబట్టి చాసర క్షేత్రమనే పదానికి వ్యవసాయ యోగ్యమైన భూమి అనే అర్థాన్ని ఊహించవచ్చు.

శా.శ. 1273 (క్రీ.శ. 1352) నాటి మోపూరు శాసనం[7], శా.శ. 1420 (క్రీ.శ. 1498) నాటి రామేశ్వరం శాసనం[8] మొదలైన శాసనాలలో 'మడి' అనే పదం కనిపిస్తుంది. ఈ పదానికి నదీమాతృకమైన భూమి అని అర్థం. చెఱువు, బావి మొదలైన జలాశయాల నీటితో సాగుచేయబడే భూమిని మడి అని వ్యవహరిస్తున్నారు. శా.శ. 1399 (క్రీ.శ. 1477) నాటి

అత్తిరాల శాసనంలో[9] వరిమడి అనే పదం వుంది. శా.శ. 1477 (క్రీ.శ. 1555) నాటి పోరుమామిళ్ల శాసనంలో[10] 'వరిచేను' 'వరిమడి' అనే పదాలున్నాయి. శా.శ. 1308 (క్రీ.శ. 1386) నాటి ఇందుకూరు శాసనంలో[11] కనిపించే 'ప్రభుమాన్య మడి' - రాచమడి లేక ప్రభుత్వానికి సంబంధించిన మడి అనే అర్థాన్ని కలిగి వుంది. శా.శ. 1443 (క్రీ.శ. 1521) నాటి వనిపెంట శాసనంలో[12] 'ఆయకట్టిమడి' అనే పదం వుంది. దీనికి ఆయకట్టులో వున్న మడి అని అర్థం చెప్పవచ్చు. శా.శ. 146[6] (క్రీ.శ. 1544-45) నాటి వంగిమళ్ల శాసనంలో[13] 'నూతి మడి' పేర్కొనబడింది. దీనికి నూతి నీరు ఆధారంతో పండే భూమి లేదా నూతికి సమీపంలో వుండే మడి అని అర్థం చెప్పవచ్చు.

శా.శ. 1304 (క్రీ.శ. 1382) నాటి చిలమకూరు శాసనంలో[14] 'వెలిచేను', 'నీరునేల' అనే పదాలున్నాయి. నీరు నేల అంటే నీటి వసతి వుండే నేల అని అర్థం. ప్రస్తుత వ్యవహారంలో వర్షం ఎక్కువగా పడినప్పుడు నీటితో నిండివుండి అప్పుడు పంటలు పండించడానికి అనుకూలంగా వుండక, వర్షం తక్కువగా వున్నకాలంలో పంటలు బాగా పండడానికి అనుకూలంగా వుండే పల్లపు నేలను నీరునేల లేదా వాకమడి అంటున్నారు. 'వెలినేల' అనే పదానికి ఈశ్వరదత్తు గారు, 'దుక్కి చెయ్యడానికి అనువైన నేల' అనే అర్థాన్ని సూచించినారు. శా.శ. 1448 (క్రీ.శ. 1526) నాటి పోరుమామిళ్ల శాసనంలో[15] రేవూరి కృష్ణమరాజు కొడుకు వెంగళయ్య, ఇరుస వెలిచేని పట్టున పూల తోటను, ఫల వృక్షాలను వెయ్యడానికి లక్ష్మీకాంతనాథ స్వామికి (భూమిని) ధారవోసి ఇచ్చిన విషయం నమోదు చేయబడింది.

'చేను' అనే పదం శా.శ. 1423 (క్రీ.శ. 1501) నాటి మేడిదిన్నె శాసనం[16], శా.శ. (1460?), దుర్ముఖి సంవత్సరం (క్రీ.శ. 1536) నాటి సన్నపల్లి శాసనం[17] మొదలైన శాసనాలలో పేర్కొనబడింది. నేటి వ్యవహారంలో 'చేను' అంటే దేవమాతృకమైన భూమి అనే అర్థం వుంది. క్రీ.శ. 10వ శతాబ్ది నాటి బొందిలిపల్లి శాసనంలో 'చెఱువు చేను'[18] ప్రస్తావించబడింది. చెఱువుకు సమీపంలో వుండే చేను అని దీనికి అర్థం చెప్పవచ్చు. శాసనాలలో 'చేనుమడి'[19], 'మడిచేను[20], 'వరిచేను'[21] అనే పదాలు కనిపిస్తున్నాయి. ఇటువంటి సందర్భాలలో 'చేను' - వ్యవసాయ యోగ్యమైన భూమి అనే సాధారణార్థంలో ఉపయోగించబడింది. కాని పలుగురాళ్లపల్లి శాసనంలో[22] (కాల నిర్ణయం లేదు) చేలు, మళ్లు, తోటలు విడివిడిగా పేర్కొనబడినాయి. కనుక చేను, మడి అనే పదాలను భిన్నార్థ సూచకాలుగా గ్రహించవచ్చు. శా.శ. 1452 (క్రీ.శ. 1529) నాటి కత్తెరగండ్ల శాసనంలో[23], శా.శ. 1458 (క్రీ.శ. 1537) నాటి నెరవాడ శాసనంలోను[24], కాల నిర్ణయం లేని రాయచోటి శాసనంలోను[25] 'నీరారంభ', 'కాడారంభ' అనే పదాలు కనిపిస్తున్నాయి. 'ఆరంభం' అంటే వ్యవసాయం (< క. ఆరంమ్బు). 'కాడారంభం' అంటే వర్షాధారంతో చేసే మెట్టదుక్కు లేదా మెట్ట పంట కోసం చేసే సేద్యం (< త. కాటా రంపం) అని అర్థం. 'నీరారంభ' మంటే శాశ్వత జలాధారంతో సాగుచేసే పంట లేదా అటువంటి పంటలు పండే భూమి అని అర్థం. క్రీ.శ. 9 లేదా 10వ శతాబ్ది నాటి చిడిపిరాల శాసనంలో[26] 'వరిపాలము' పేర్కొనబడింది. శా.శ. 1159 (క్రీ.శ. 1238) నాటి ఓగూరు శాసనంలో[27] చెఱువు

కింది వరిమళ్లు, వెలిపాలము, యెఱనేల పేర్కొనబడినాయి. శా.శ. 1458 (క్రీ.శ. 1536) నాటి మొయిళ్లకాలువ శాసనంలో[28] 'చేనుర్యేగట', శా.శ. 1477 (క్రీ.శ. 1555) నాటి ఉప్పలపాడు శాసనంలో[29] 'రేగటి చేను', శా.శ. 146 [7] (క్రీ.శ. 154[5]) నాటి తలమంచిపట్నం శాసనంలో[30] 'జంబుల రేగడి చేను', అనే పదాలున్నాయి. శా.శ. 1447 (క్రీ.శ. 1528) నాటి పందిళ్లపల్లి శాసనంలో[31] 'రాళ్లచేను' పేర్కొనబడింది. శా.శ. 1318 (క్రీ.శ. 1396) నాటి పలుగురాళ్లపల్లి శాసనం[32] 'ఇసుక తువ్వ'ను పేర్కొంటూ వుంది.

తోట భూములకు సంబంధించిన ప్రస్తావనలు శాసనాలలో అక్కడక్కడా కనిపిస్తున్నాయి. క్రీ.శ. 7వ శతాబ్దినాటి రామేశ్వరం శాసనం[33] వసన్తిపోతి చోలిమహాదేవి, వసన్తీశ్వరానికి విరిపఱితి పొలంలో రెండు తోటలను, రాచమానంలో మున్నూరు మరుతుడ్ల నేలను ఇచ్చినట్లు తెలియజేస్తూ వుంది. పుష్పగిరిలోని కాలనిర్ణయంలేని ఒక శాసనం[34] రాష్ట్రకూట రాజు కృష్ణకన్నిహదేవుడు, పుష్పగిరిలోని నాగేశ్వర, సర్వేశ్వరులకు నైవేద్య, ధూప, దీప భోగాలకుగాను పన్నెండు మఱుతుల నేలను, నన్దన వనాన్ని ధారాపూర్వకంగా ఇచ్చినట్లు తెలుపుతూ వుంది. ఉదయగిరి వీరణొడయల తిమరాజు గారి కుమారుడు రాయసం వెంగళప్ప, మొయిళ్లకాలువ గ్రామంలో తిరువెంగళనాథుని ప్రతిష్ఠచేసి, దేవస్థానం కట్టించి, దేవస్థానానికి ఉభయ పార్శ్వాలలోను నారికేళాలు, మామిళ్లు, ఉసిరికలు, వెలగలు, చింతలు, నేరేళ్లు మొదలైన ఫలవృక్షాలుండే వనం వేయించినట్లు శా.శ. 1458 (క్రీ.శ. 1536) నాటి మొయిళ్ల కాలువ శాసనం[35] తెలియజేస్తూ వుంది.

శా.శ. 1440 (క్రీ.శ. 1518) నాటి కోకటం శాసనంలో[36] 'గోచర్మం చేను' పేర్కొనబడింది. ఆవులు మేయడానికి అనువైన పచ్చిక వుండే భూమి అని దీనికి అర్థం. కొందరు దీనిని భూమి కొలతకు సంబంధించిన ప్రమాణమని పేర్కొన్నారు. కాని ప్రస్తుత సందర్భంలో ఆ అర్థం పొసగడం లేదు. శా.శ. 1473 (క్రీ.శ. 1551) నాటి సంబటూరు శాసనంలో[37] 'చారునచేను' ప్రస్తావించబడింది. ఇది చారాసన శబ్దభవం కావచ్చు. చారాసనలోని 'చార' అనే శబ్దాన్ని బట్టి ఈ పదానికి పచ్చికబయలు అనే అర్థాన్ని ఫ్లీట్ సూచించినారు[38].

శా.శ. 1462 (క్రీ.శ. 1539) నాటి కన్నెలూరు శాసనంలో[39] 'పాటిచేను', శా.శ. 1448 (క్రీ.శ. 1566) నాటి లోమడ శాసనంలో[40] 'చవుటిచేను', శా.శ. 1477 (క్రీ.శ. 1555) నాటి గొల్ల ఉప్పలపాడు శాసనంలో[41] 'పాటిచేను', 'చవుటచేను'లు పేర్కొనబడినాయి. ఈ భూములలో పంటలు సరిగా పండవు. వీటికి నీటిని పీల్చుకునే స్వభావం కూడా తక్కువ. శా.శ. 1446(8) (క్రీ.శ. 1526) నాటి చిడిపిరాల శాసనంలోను[42], శా.శ. 1471 (క్రీ.శ. 1550) నాటి కోడూరు శాసనంలోను[43] 'పాండువ బీడు' ప్రస్తావన వుంది. పాండువబీడు పాండుభువ శబ్ద భవం. ఇదికూడా చవుటి నేలకు సంబంధించిందే. శా.శ. 1467 (క్రీ.శ. 1545) నాటి నిడుజువ్వి శాసనంలో[44] 'బీడు చేను' పేర్కొనబడింది. అంతవరకు దున్నబడని (అప్రాహత) లేదా కొంతకాలం నుండి పంటలు పండించని (ఖిల) భూమిని బీడు భూమి అంటారు.

## 2. భూమిపై స్వామ్యం :

రాజ్యంలోని భూమిపై స్వామ్యం రాజుదా లేక ఆ భూమిని అనుభవిస్తున్న వ్యక్తులదా అనే విషయంపై చాలాకాలం నుండి పండితులు భిన్నాభిప్రాయాలను వ్యక్తం చేస్తున్నారు. స్మృతికారులైన మనువు, నారదుడు, గౌతముడు, అర్థశాస్త్రకర్త కౌటిల్యుడు భూమికంతటికి రాజే అధిపతి అని చెప్పినారు. ఈ అధ్యయన పరిధిలోని శాసనాలు కూడా ఈ అంశాన్ని స్పష్టం చేస్తున్నాయి. రాజు గ్రామాన్నంతటినీ దానమివ్వడాన్ని కొన్ని శాసనాలలో మనం చూడవచ్చు. ఇటువంటి సందర్భాలలో గ్రామస్థులు రాజుకు చెల్లించే పన్నులను దానగ్రహీతకు చెల్లిస్తారు. రాజు తప్ప ఇతరులు గ్రామదానాన్ని ఇచ్చినట్లు ఒక్క శాసనంలో కూడా లేకపోవడం, భూమిపై రాజుయొక్క పరమ స్వామ్యాన్ని స్పష్టం చేస్తూ వుంది. కొన్ని ప్రతివాదాలున్నా, ప్రధానమైన స్వామ్యం రాజుదేననీ భూమిని అనుభవిస్తున్న వ్యక్తులకు ద్వితీయశ్రేణి స్వామ్యం వుంటుందనే అభిప్రాయాన్ని అంగీకార యోగ్యమైనదిగా పరిగణించవచ్చు.

రాజ్యంలోని బంజరు భూమి, అడవులు రాజుకు చెందినవనడానికి ఎవరికీ అభ్యంతరం లేదు. అడవులు నరికి క్రొత్త గ్రామాన్ని నిర్మించినప్పుడు అందులో స్థిరపడిన ప్రజలకు కొన్ని సంవత్సరాలపాటు కొన్ని పన్నులను మినహాయించడం, చెఱువులు త్రవ్వించడం, ఇండ్లు నిర్మించుకోవడానికి స్థలాన్ని ఉచితంగా ఇవ్వడం వంటి సౌకర్యాలను రాజు కల్పించేవాడు. కొంతభూమిని మాత్రమే రాజు దానమిచ్చినప్పుడు ప్రతిగ్రహీత ఆ భూమినుండి లభించే ఫలసాయాన్ని అనుభవించడానికి అనుమతించబడతాడు.

## 3. భూస్వామ్య పద్ధతులు :

భూమిపైన యాజమాన్యం, వివిధ హక్కుదారులు అంటే యజమానులు, సాగుదారులు మొదలైన వారిమధ్య వుండే సంబంధాలను తెలియజేసేది భూస్వామ్య పద్ధతి. భూమిపై హక్కులను, భూమిని అధికారంలో వుంచుకొనే రీతిని భూస్వామ్య పద్ధతి తెలుపుతుంది. భూమే జీవన ప్రాతిపదికగావున్న ప్రాంతాలలో ప్రజల సాంఘిక, ఆర్థిక, రాజకీయ అధికారాలను భూస్వామ్య పద్ధతి నిర్ణయిస్తుంది. సాంఘిక దృష్టితో చూస్తే ఒక్కొక్క సాంఘిక లక్ష్యాన్ని సాధించడానికి ఒక్కొక్క భూస్వామ్య పద్ధతి అనుకూలంగా వుంటుంది[45].

### 3.1 దేవవృత్తులు – అగ్రహారాలు

ఈ విధమైన పద్ధతిలో మాన్యము, సర్వమాన్యము, సర్వకర పరిహారువు, సర్వబాధా పరిహారువు, అష్టభోగ తేజస్వామ్య సహితము, ఏకభోగము, త్రిభోగాభ్యంతరసిద్ధి మొదలైన అవధులు దానశాసనాలలో నిర్దేశించబడినాయి. ఇటువంటి పదాలను ఆ కాలంలోని వ్యవహారాన్ని బట్టి సరిగా అర్థం చేసుకోవలసి వుంది. కొన్ని సందర్భాలలో దేవవృత్తులు, అగ్రహారాలపై కూడా సిద్ధాయము, దుర్గవర్తన మొదలైన ప్రాథమిక పన్నులు విధించబడేవి.

ఇతర భూమి హక్కుదారులకంటె ఎక్కువ సౌకర్యాలు, మినహాయింపులు దేవాలయాలకు, అగ్రహారికులకు వుండేవి.

### 3.2 సేవలకు సంబంధించిన భూస్వామ్యాలు

పరిపాలనా విషయాలలో రాజుకు సహకరిస్తూ చేసే సేవలకుగాను నాయకులు, మంత్రులు, సేనాపతులు, కరణాలు మొదలైన అధికారులకు జీతానికి బదులుగా వారివారి సేవలను అనుసరించి గ్రామాలను గాని, భూములను గాని ఇచ్చే పద్ధతి అమలులో వుండేది. ఈ గ్రామాలు లేదా భూములపై అన్ని రకాల పన్నులను హక్కుదారులనుండి వసూలు చేసేవారు. ఈ హక్కుదారులకు వీటిపై పూర్తి హక్కులు వుండవు. వీరు తమ అధీనంలో వుండే గ్రామాన్ని గాని, భూమిని గాని దానమిచ్చేటప్పుడు రాజు అనుమతి పొందవలసి వుంటుంది.

### 3.3 రాచపొలము

అగ్రహారాలుగా కాని, వృత్తులుగా కాని ఇవ్వబడని భూములన్నీ రాజుకు చెందినవే. ఇటువంటి భూమిని రాచపొలము అనేవారు. ఈ భూములు దాదాపు శాశ్వత పద్ధతిపై వ్యవసాయదారులకు కౌలుకు ఇవ్వబడేవి.

## 4. నీటి పారుదల

ప్రాచీనకాలం నుండి భారతదేశంలో ప్రజల ప్రధాన వృత్తి వ్యవసాయం. దేశ సౌభాగ్యం వ్యవసాయం మీద ఆధారపడి వుంది. కనుక ఆంధ్ర దేశాన్ని ఏలిన రాజులందరూ వ్యవసాయాన్ని ప్రోత్సహించడానికి ఎన్నో చర్యలు తీసుకున్నారు. నీటిపారుదల సౌకర్యాలను మెరుగు పరచడానికి ప్రత్యేకమైన శ్రద్ధ కనపరచినారు. నీటిని నిలువ చెయ్యడం మనుషులకూ, జంతువులకూ, వ్యవసాయానికీ చాలా ముఖ్యం కాబట్టి సహజ నీటివనరులను సంరక్షించడానికి కొంత ప్రభుత్వ ధనాన్ని ఖర్చుపెట్టడం పరిపాలకుల విధిగా భావించబడింది. వ్యవసాయం నిరంతర జలప్రసారంపై ఆధారపడి వుండటంవల్ల, ఇందుకు ఆధారమైన వర్షపాతంలో సమతౌల్యం లోపించడంవల్ల, వ్యవసాయాభివృద్ధికోసం వర్షపు నీటిని రక్షించి నిలువ చెయ్యడం అనివార్యమైంది. నదీ పరీవాహక ప్రాంతాలలో మాత్రం కాలువలు త్రవ్వి నీటిని సరఫరా చేసే వసతి వుంది. మిగిలిన ప్రాంతాలలో నీటిపారుదలకు బావులు, చెఱువులే ఆధారం.

జలదానంవల్ల స్వర్గం ప్రాప్తిస్తుందని భారతీయుల విశ్వాసం. చెఱువులు, సరస్సులు, బావులను పుణ్యం సంపాదించుకోవడానికి వ్యక్తులు త్రవ్వించేవారు. త్రవ్వించినవారి పేరు లేదా వారి తల్లిదండ్రుల పేర్లు చిరకాలం నిలవడానికి వారి పేరుకు చివర సముద్రం, చెఱువు మొదలైన పేర్లు కలిపి పిలిచేవారు. తెలుగుచోడ వంశానికి చెందిన గంగయదేవచోడ మహారాజు తమ తండ్రి అల్లు గంగరాజు, తమ తల్లి గంగాదేవి పేర గంగ సముద్రమనే తటాకాన్ని

నిర్మింప జేసినట్లు శా.శ. 1244 (క్రీ.శ. 1323) నాటి తాళ్ల ప్రొద్దుటూరు శాసనం[46] తెలుపుతూ వుంది.

కీర్తిని చిరస్థాయిగా నిలిపే సప్తసంతానాలలో తటాక నిర్మాణం ప్రముఖమైందిగా భావించబడింది. "మనుషులు, జంతువులు, పక్షులు ఎవరి చెఱువులో నీరుతాగి దాహం తీర్చుకుంటాయో ఆ చెఱువు నిర్మించిన వ్యక్తికి అశ్వమేధయాగ ఫలం సిద్ధిస్తుంది. నిర్మించిన వ్యక్తి తండ్రి సంతోషిస్తాడు. అతని పితామహుడు ఆనందంతో నాట్యం చేస్తాడు. అతనికి సంబంధించిన వారందరి పితరులు ఆ ఆనందాన్ని అనుభవిస్తారు"[47] - ఈ నమ్మకమున్న రాజులు, వారి సామంతులు, రాజోద్యోగులు, వ్యాపారులు, ధనికులు, సాధారణ ప్రజలు చెఱువులను, బావులను నిర్మింపజేసినారు. ఇందువల్ల వ్యవసాయానికి నీటివనరు లేర్పడినాయి.

ఇటువంటి కార్యక్రమాలకు సంబంధించిన ప్రాచీనమైన సూచిక స్కంధగుప్తుని జునాగఢ్ శాసనంలో[48] కనిపిస్తుంది. చక్రపాలితు డనే రాజోద్యోగి కథియవార్‌లోని గిరినార్ పర్వత సమీపంలో పలాస, శిఖతస నదులకు కట్టకట్టి సుదర్శన తటాకాన్ని నిర్మింపజేసినట్లు ఈ శాసనంలో చెప్పబడింది. దక్షిణ భారతదేశంలో పల్లవ మహేంద్రవర్మ వ్యవసాయాభివృద్ధి కోసం మహేంద్ర తటాకాన్ని త్రవ్వించినాడు. ఈ విధంగా చెఱువులు త్రవ్వించి వర్షపు నీటిని నిలువచేసి తూముల ద్వారా పంటపొలాలకు మళ్లించడం ప్రభుత్వ విధానంగా రూపొందింది. ఈ విధానాన్నే చాళుక్య రాజులు అనుసరించి తమ తర్వాతి పరిపాలకులైన కాకతీయులకు అందించినారు. ఈ పూర్వరంగం విజయనగర రాజుల కాలంలో నీటిపారుదల విషయంలో సర్వతోముఖమైన అభివృద్ధి జరగడానికి తోడ్పడింది.

నీటిపారుదల సౌకర్యాలను సహజసిద్ధాలు, కృత్రిమాలు అని రెండురకాలుగా వర్గీకరించవచ్చు. నదులు, వర్షాలు సహజసిద్ధమైన నీటివనరులు. కాని ఈ జిల్లాలో ప్రవహించే పెన్న, చిత్రావతి, పాపఘ్ని, చెయ్యేరు, కుందు నదులు జీవనదులు కాకపోవడం వల్ల ఎండకాలంలో పూర్తిగా ఎండిపోతాయి. అంతేకాక ఈ ప్రాంతంలో వర్షపాతం కూడా అంతంత మాత్రమే. ఈ నీటిఎద్దడిని తట్టుకోవడానికి కృత్రిమంగా నీటిపారుదల సౌకర్యాలను ఏర్పరచుకోవడం అవసరమైంది.

కృత్రిమమైన నీటిపారుదల వనరులు ప్రధానంగా మూడు రకాలు. 1. బావులు, 2. ఏటి కాలువలు, 3. చెఱువులు.

## 4.1 బావులు

నల్లరేగడి నేలలున్న ప్రాంతాలు చెఱువుల నిర్మాణానికి అనుకూలం కాకపోవడంవల్ల వ్యవసాయం వర్షాధారంగాను, బావుల నీటితోను సాగుతుంది. బావినీటితో పరిమితమైన భూమికి మాత్రమే నీటిపారుదల సౌకర్యం కలిగించవచ్చు. కాబట్టి వ్యవసాయ క్షేత్ర విస్తీర్ణాన్ని పెంచడానికి బావుల త్రవ్వకం ఎక్కువగా జరిగింది.

కొన్ని భూదాన సందర్భాలలో దానమిచ్చిన భూమికి నీటిపారుదల కోసం బావులు త్రవ్వించినట్లు కొన్ని శాసనాలు తెలుపుతున్నాయి. శా.శ. 1462 (క్రీ.శ. 1539) నాటి కన్నెలూరు శాసనంలో[49], శ్రీమన్మహామండలేశ్వర సలకరాజు పెదతిరుమలయ్యదేవరాజు, అచ్యుత దేవరాయలు తనకు నాయంకరానికి పాలించిన చెరునూరు సీమలోని కన్నెలూరులో తమ తండ్రి సలకరాజు గారికి పుణ్యంగా, గొడుగుమటి భూమినాయని కూతురు చినపామసానికి భూదానాన్ని ఇచ్చి, నడబావి కట్టించి, దానికి రాతికట్టడం కట్టించి ఆ భూమిలో వనం వేయించినట్లు చెప్పబడింది.

చాలాచోట్ల త్రాగునీటికి బావులే ప్రధానాధారం. మంచినీటి సౌకర్యాన్ని కలిగించడానికి కూడా బావులు త్రవ్వించడం జరిగింది. ప్రభుత్వాధికారులు కొందరు వ్యక్తులకు ప్రతిఫలాన్ని ముట్టజెప్పి మంచినీటి బావులను త్రవ్వించినట్లు కొన్ని శాసనాలు తెలుపుతున్నాయి. సుంకేసులలోని కాలనిర్ణయంలేని ఒక శాసనం[50], మహానాయంకరాచార్యులైన బసువయ్యగారు కొండోజు తిమ్మయ్యకు, సుంకేసులలో ఒక చేద నూయి కట్టించడానికి కొంత చేనును ఇచ్చినట్లు తెలియజేస్తూ వుంది.

## 4.2 ఏటి కాలువలు

నదీ పరీవాహక ప్రాంతాలలో నదుల నుండి కాలువలు త్రవ్వి పంటభూములకు నీటిని సరఫరా చేసేవారు. కాలువలు పూడిపోయినపుడు మళ్లీ త్రవ్వించి బాగుచేసేవారు. చీరేటి (చిత్రావతి) వరదవల్ల దెబ్బతిని పూడిపోయిన కాలువను, ఇరుగప దండనాయకుల పులప్ప ఒడయలు ఏటిగడ్డను పూర్తిగా త్రవ్వించి బాగుచేయించినట్లు శా.శ. 1318 (క్రీ.శ. 1397) నాటి పారనపల్లి లోని ఒక శాసనంలో[51] చెప్పబడింది. శా.శ. 1416 (క్రీ.శ. 1494) నాటి రావులకొలను శాసనంలో[52] మహామండలేశ్వర కఠారి సాళువ ఇమ్మడి నరసింహరాయ మహారాయల కట్టిగ కసవినాయుని కుమారుడు నరసానాయుడు తమ తల్లి కావేరమ్మ పేరిట కటుగాలువ కట్టించినట్లు నమోదు చేయబడి వుంది.

కొన్నిచోట్ల నీటిపారుదల కోసం అంతరగంగ కాలువలు త్రవ్వబడినట్లు కొన్ని శాసనాలు సాక్ష్యమిస్తున్నాయి. అంతరగంగ పద్ధతి ద్వారా నదులు, చిన్న ఏర్లు, కొండపాయల నుండి నీళ్లను కాలువల ద్వారా చెఱువులకు మళ్లించడమో లేదా నేరుగా వ్యవసాయ భూములకు మళ్లించడమో చేసేవారు. ఎండకాలంలో నదులు ఎండిపోతున్నప్పుడు వాటిలో ఇంకుతున్న నీటిని వ్యవసాయానికి ఉపయోగించుకోవడానికి అంతరగంగలు బాగా ఉపయోగపడేవి. కాయస్థ అంబదేవుని మంత్రి ఘోడెరాయ గంగయదేవుడు లేబాకలో అంత్రగంగన రాయ సహస్రమల్లు కాలువ, తాళ్లపాకలో గండపెండార కాలువ త్రవ్వించినట్లు శా.శ. 1201 (క్రీ.శ. 1279) నాటి అత్తిరాల శాసనంలో[53] చెప్పబడింది. మహానాయంకరాచార్యుడైన చారి నరసానాయుడు తన వుమ్మళిక గ్రామమైన కుచ్చుపాపలో అంతరగంగ కాలువ త్రవ్వించడంకోసం కొందరు గ్రామస్థులకు దసబంధాన్ని ఏర్పరచినట్లు శా.శ. 1452 (క్రీ.శ. 1530) నాటి కుచ్చుపాప శాసనం[54]

తెలియజేస్తూ వుంది. శా.శ. 1463 (క్రీ.శ. 1551) నాటి సంబటూరు శాసనంలో[55] ఆ గ్రామంలోని అంతరగంగ కాలువ ప్రస్తావన వుంది.

శా.శ. 1480 (క్రీ.శ. 1558) నాటి పెద్దశెట్టిపల్లె శాసనంలో[56] 'ఊటకాల్వ' పేర్కొనబడింది.

### 4.3 చెఱువులు

ప్రాచీన, మధ్య యుగాలలో ఆంధ్రదేశంలో నీటిపారుదలకు చెఱువులు ప్రధానమైన ఆధారం. కొన్ని చెఱువులు సహజంగా ఏర్పడి వుంటాయి. కాని చాలావరకు పెద్ద పెద్ద చెఱువులన్నీ కట్టుదిట్టమైన ప్రణాళికలతో నిర్మించబడినాయి.

కాకతీయుల పరిపాలనకు ముందున్న చెఱువులు చిన్నవి. నీటిపారుదల పరిమితమైనందున ఆ నీటిపై ఆధారపడిన వ్యవసాయ క్షేత్రాల విస్తీర్ణం కూడా పరిమితమైందే. విశాలమైన వ్యవస్థాయ భూములకు సరిపడే నీటిని సరఫరా చేయగల చెఱువులు, సరస్సులను త్రవ్వించే బాధ్యత రాజ్యవిధులలో ఒకటిగా ఆనాడు భావించినట్లు లేదు. నీటిపారుదల ప్రణాళికల శాఖ అనేది ఆనాటి శాసనాలలో కనిపించదు. ఆ రకమైన పనులు చేయించడానికి రాజు అధికారులను నియమించినట్లు సాక్ష్యం లేదు.

ఈ ప్రాంతంలోని ప్రాచీన తెలుగు శాసనాలలో తటాక నిర్మాణాన్ని గురించి ప్రత్యేకంగా చెప్పబడకపోయినా "తేని సల్పిన వానికి వేగుడ్లు వే సెఱువులు . . . . . నిల్పిన పుణ్యంబు[57] "దీని నఱిసినవారు పాఱను పసులను చెఱువులు గుడ్లు నఱిసిన పాపమ్బున పడువాణ్డు' [58] – వంటి మాటలు తటాక నిర్మాణం పుణ్యప్రదమైందనీ, చెఱువులను నాశనం చేసినవారు పాపాన్ని పొందుతారనీ ప్రజలు విశ్వసించినట్లు తెలియజేస్తున్నాయి. తటాక నిర్మాణం పుణ్యకార్యం కాబట్టి ఆ సందర్భంలో బ్రాహ్మణులకు దానాలు ఇచ్చేవారు. క్రీ.శ. 8వ శతాబ్దికి చెందిన కొట్టపాడు శాసనంలో[59] జతిపమిణ మహారాజు (ఏ వంశానికి చెందినవాడో తెలియదు) చిఱువూరిలో తాను చెఱువు కట్టించిన సందర్భాన్ని పురస్కరించుకొని వెనాయశర్మ అనే బ్రాహ్మణునికి కొఱపరితిలో కొంత భూమిని పన్నువీసగా ఇచ్చినట్లు చెప్పబడింది.

శా.శ. 1159 (క్రీ.శ. 1238) నాటి ఓగూరు శాసనంలో[60] తెలుగుచోళ వంశానికి చెందిన గండగోపాల తిరుకాళత్తిదేవ మహారాజుకు సామంతుడైన, పల్లవ వంశానికి చెందిన కామయదేవ మహారాజుకు భృత్యుడైన నల్ల సూరపనాయుడు ఒంగూరులో మల్లినాథదేవర ప్రతిష్ఠ చేసి, ఆ దేవునికి అంగభోగానికి, ధూప దీప నైవేద్యాల కోసం ఇచ్చిన వృత్తి వివరాలలో యేటినూతులు, మోడపి చెఱువు, పుట్ట చెఱువు పేర్కొనబడినాయి. తెలుగుచోళ వంశానికే చెందిన ముదిగొండ చోడ మహారాజు వేయించిన తాళ్లపాక శాసనంలో[61] (కాలనిర్ణయం లేదు) పాక పడమటి పెద్ద చెఱువు, ప్రోలి చెఱువు సూచింపబడినాయి. ఈ చెఱువులు ఆ కాలానికే కాక ఇప్పటికీ వ్యవసాయ భూములకు నీటి సౌకర్యాన్ని కలిగిస్తున్నాయి.

శా.శ. 1169 (క్రీ.శ. 1247) నాటి జ్యోతి శాసనంలో[62] వైదుంబ వంశానికి చెందిన

రక్కసగంగదేవ మహారాజుకు (రాయదేవ మహారాజుకు) సామంతుడైన చింతరామి నాయకుడు, జోతినాథుని గుడి గోపురాన్ని, తకప్రోలులో ఇరుగల దేవునికి గుడిని కట్టించి, చేటూరులో రెండు చెఱువులు త్రవ్వించి, గుడి కట్టించి ఆ గ్రామాన్ని అగ్రహారంగా విడిచినట్లు నమోదు చేయబడింది.

మధ్య యుగాలలోని తటాక నిర్మాణ కౌశలానికి ప్రబల సాక్ష్యంగా శా.శ. 1291 (క్రీ.శ. 1369)లో భాస్కర భవదూరుడు నిర్మింపజేసిన పోరుమామిళ్ల చెఱువు దర్శనమిస్తుంది. చెఱువు కట్టమీద ఈ రాజు వేయించిన శాసనం[63] తటాక నిర్మాణానికి సంబంధించిన కొన్ని ఆసక్తికరమైన అంశాలను వెల్లడిస్తూ వుంది. జలదాన ప్రాశస్త్యాన్ని గురించిన తార్కిక నిరూపణ ఈ శాసనంలో కనిపిస్తుంది. సప్త సంతానాలలో తటాక నిర్మాణం ప్రముఖమైంది. "ఆపోవా ఇదగుం సర్వమ్" అని వేదవాక్యము. చరాచర జగత్తుకు జలమే బీజం. కాబట్టి జలదానంవల్ల ఉత్తమ ఫలం కలుగుతుందని, చలివెందల, చేదబావి, దిగుడుబావి, కాలువ, కొలను - ఇవి ఒకదానికంటె ఒకటి కోటికోటి గుణాలు అధికంగా కలిగినవని, తటాక జలంతో చరాచర జగత్తుకు రక్షణ కలుగుతుంది; కాబట్టి దాని పుణ్యఫలాన్ని చెప్పడానికి బ్రహ్మకూడా అశక్తుడని పోరుమామిళ్ల శాసనంలో చెప్పబడింది.

తటాక నిర్మాణానికి సంబంధించి శాస్త్రాలు నిర్దేశించిన పన్నెండు అంగాలు (సాధనాలు) ఈ శాసనంలో పేర్కొనబడినాయి. అవి - పాథఃశ్శాస్త్ర విదుడైన బ్రాహ్మణుడు, దృఢమృత్సంశోభితమైన నేల, మాధర్యాంబువహమై మూడు యోజనాల పొడవుండే నది, నదికి ఇరువైపులా రెండు ఎత్తైన కొండలు, అల్పదీర్ఘము స్థిరము అయిన అడ్డుకట్ట, నిమ్నోదరము, తటాక నిర్మాణానికి అవసరమైన పెద్ద రాళ్లు లభించే గని సమీపంలో వుండడం మొదలైనవి. తటాక నిర్మాణానికి సంబంధించిన ఆరు దోషాలు కూడా ఇందులో పేర్కొనబడినాయి. అవి - చెఱువు నుండి నీరు వడిసిపోవడం, ఊషరోర్వి, ద్విరాజ్యసంధాపథము, తటాక మధ్యంలో ఎత్తుగా వుండడం (మధ్యకూర్మం), అల్పాంబు భూవిస్తరము, అల్పభూమి తోయాధికము.

దోషరహితము, గుణరాశి శోభితము అయిన అనంతరాజ సాగరమనే ఈ తటాకాన్ని రోజుకు వెయ్యిమంది పనివాండ్లు, నూరు బండ్లు శ్రమించి రెండు సంవత్సరాలలో పూర్తి చేసినారు. దీని నిర్మాణానికయిన ధనధాన్య వ్యయానికి లెక్కలేదు. ఈ చెఱువుకట్ట ఐదువేల రేఖాదండాల పొడవు, ఎనిమిది రేఖాదండాల వెడల్పు, ఏడు రేఖాదండాల ఎత్తు వుంది. వ్యవసాయ భూములకు నీటిని వదలడానికి నాలుగు జలగతులు (తూములు) నిర్మించబడినాయి. ఇప్పటి లెక్కల ప్రకారం ఈ చెఱువు ఏడు మైళ్ల పొడవు, రెండున్నర మైళ్ల వెడల్పు కలిగి వుంది. రాయలసీమలో అతి పెద్ద చెఱువు ఇదే.

భవదూర మహీపతి సామంతులైన వీతినాయక దేశియులు కలుచపల్లి పుంతకు పశ్చిమ దిశలో ఒక చెఱువును త్రవ్వించినట్లు దూలంవారి పల్లెలోని కాలనిర్ణయం లేని ఒక శాసనంలో[64] వుంది. మొదటి దేవరాయల కాలానికి సంబంధించిన శా.శ. 1308 (క్రీ.శ. 1386) నాటి

ఇందుకూరు శాసనంలో[65] ఇరుగమరెడ్డి మారమరెడ్డి దక్షిణం చెఱువు కట్టించినట్లు వుంది. ఈ చెఱువు పారుబడిలో పుట్టికి ఇద్దుము చొప్పున దశబంధాన్ని ఏర్పరచినట్లు ఈ శాసనం తెలుపుతూ వుంది. ఇమ్మడి నరసింహరాయల కట్టిగ కసవినాయని కుమారుడు నరసా నాయకుడు తమ తల్లి కావేరమ్మ పేరిట చెఱువును కట్టించినట్లు శా.శ. 1416 (క్రీ.శ. 1494) నాటి రావులకొలను శాసనం[66] ద్వారా తెలుస్తూ వుంది.

### *4.3.1 చెఱువుల నిర్వహణ, మరమ్మత్తులు*

చెఱువులను, కాలువలను నిర్మించే వ్యక్తులను ప్రోత్సహిస్తూ విజయనగర రాజులు దశబంధ మాన్యాలను ఇచ్చేవారు. ఈ పద్ధతి ప్రకారం చెఱువులను నిర్మించే బాధ్యతను లేదా వాటిని సరైన స్థితిలో నిర్వహించే బాధ్యతను ఒక్కరికో లేక కొంతమందికో గుత్తకు ఇచ్చేవారు. ఆ పని పూర్తిచేసినందుకు ఒప్పందం ప్రకారం వారికి ఆ చెఱువు క్రింద కొంత భూమిని ఇస్తారు. ఈ భూమిపై పన్ను వుండదు. వంశపారంపర్య హక్కు వుంటుంది. కొన్ని సందర్భాలలో వీరికి భూములను కాక ఆ చెఱువు పారుబడిలో వుండే భూములలో పండే పంటనుండి కొంత భాగాన్ని (సాధారణంగా పదవ వంతును) గ్రామస్థులు ఇచ్చే ఏర్పాటు చేసేవారు. దీన్ని 'కట్టుగుత్త' అనికూడా అంటారు. వనిపెంట శాసనంలో కనిపిస్తున్న 'మడిబడి' అనే మాటను కూడా దీనికి సమానార్థకంగా భావించవచ్చు. ఈ దశబంధ మాన్యాలకు సంబంధించిన శాసనాలు కడప జిల్లాలో కూడా అక్కడక్కడా కనిపిస్తున్నాయి.

మొదటి దేవరాయల కాలంలో అబ్రచింతల రంగానాయని కుమారుడు మలా నాయుడు పెండ్లిమర్రిలోని కొందరు గ్రామస్థులకు, పెండ్లిమర్రి పడమటి పెద్ద చెఱువు కట్టమీద మన్ను వేయడానికి మూడు పుట్ల మడిని దశబంధ మాన్యంగా ఇచ్చినట్లు శా.శ. 1334 (క్రీ.శ. 1412) నాటి పెండ్లిమర్రి శాసనం[67] తెలియజేస్తూ వుంది. కృష్ణదేవరాయల కాలంలో బుక్కరాజు తిమ్మరాజు గారి నాయంకరానికి చెందిన గంజికుంటసీమ వనిపెంట గ్రామంలోని చెఱువుకట్ట శిథిలమౌతుండగా దాన్ని బాగు చేయించడానికి మచ్చికంటి కామరాజు కుమారుడు రాయసం గంగరాజు, 'మడిబడి' వేయించి, గ్రామంవారు చెఱువుక్రింద పండిన మడి తూము ఒకటికి, వడ్లు ఒక తూము లెక్కన దశబంధం చెల్లించమని కోరినట్లు శా.శ. 1443 (క్రీ.శ. 1521) నాటి వనిపెంట శాసనం[68] తెలుపుతూ వుంది. సదాశివరాయల కాలంలో మహానాయంకరాచార్యు లయిన వొన్నం ఆదినాయని కుమారుడు పెదవోబుల్నాయుడు గండికోట రాజ్యంలోని సకలిసీమలో నంద్యాల తిమ్మయదేవ మహారాజు తమకు ఇచ్చిన నాయంకరంలోని కల్చపాటికి చెల్లే తెల్లపాటిలో బోడిరెడ్డి చినవోబయ్య, మూరారెడ్డి సురుబయ్య, కమ్మన పోతయ్యలకు దశబంధ మాన్యాన్ని ఇచ్చినట్లు శా.శ. 1472 (క్రీ.శ. 1551) నాటి తెల్లపాడు శాసనంలో[69] నమోదు చేయబడింది.

## 5. పంటలు

ఈ పరిశోధన పరిధిలోని కాలంలో ఈ జిల్లాలో 'వరి' ప్రధానమైన పంటగా కనిపిస్తుంది. అనేక భూదాన శాసనాలలో, దానమిచ్చిన భూములలో వరిమళ్లు ఎక్కువగా వుండడాన్ని మనం గమనించవచ్చు. ఇతర పంటలలో జొన్నలు, రాగులు మొదలైన ధాన్యాలు, పెసలు, నువ్వులు, ప్రత్తి, ఆముదాలు మొదలైన పంటలను గురించి శాసనాలు తెలియజేస్తున్నాయి[70]. చెఱకు పంటకు సంబంధించిన ప్రత్యక్ష ఆధారం ఈ జిల్లాలోని శాసనాలలో కనిపించకపోయినా దేవతా నైవేద్య ద్రవ్యాలలోను, ప్రధాన మార్గాలగుండా రవాణా అయ్యే సరుకులలోను బెల్లం వున్నట్లు శాసనాలవల్ల తెలుస్తూ వుంది[71]. తోట భూములలో మామిడి, చింత, నారికేళ, పనస, ఉసిరిక, నేరేడు, వెలగ, పోక, తాటి, ఈత మొదలైన ఫలవృక్షాలను పెంచేవారని దేవాలయాలకు తోటలను దానమిచ్చిన సందర్భాలను నమోదు చేసిన శాసనాలు తెలియజేస్తున్నాయి[72]. దేవాలయాలలో అర్చన, అలంకరణ కోసం పూలతోటలు పెంచేవారు[73].

## 6. వాణిజ్యం

ఈ జిల్లాలో విజయనగర రాజుల కాలం నాటికి వాణిజ్యం బాగా అభివృద్ధి చెందింది. నగరాలలో పేటలు కట్టుకోవడానికి పరిపాలకులు వర్తకులకు ఎన్నో సౌకర్యాలు కలిగించేవారు. ఈ వర్తకులు మొదటి ఏడు సంవత్సరాలలో ఎటువంటి సుంకాలు చెల్లించ నవసరం లేదు. తరువాత క్రమంగా సుంకాలను విధించేవారు. ప్రతి గ్రామంలోను ఒక్కొక్క రోజు సంత జరుగుతుండేది. పరిసర గ్రామాలలోని ప్రజలు ఆయా సంతలకు వచ్చి తమకు కావలసిన సరుకులను కొనడం, తమవద్ద వుండే సరుకులను అమ్మడం చేసేవారు. ఒక ప్రాంతం నుండి ఇంకొక ప్రాంతానికి సరుకులు రవాణా అవుతుండేవి. సరుకులను రవాణా చెయ్యడానికి కావళ్లను, ఎద్దులను, బండ్లను, గాడిదలను ఉపయోగించేవారు. రవాణా అవుతున్న కొన్ని వస్తువులను, రవాణా మార్గాలను గురించి శాసనాలు, స్థానిక చరిత్రలు తెలియజేస్తున్నాయి. వీరబలిజ వర్తక శ్రేణులు పులివెందల కనుమ, చింత కనుమ, గండి కనుమ పెండ్లిమర్రి మార్గాలలో దూదికంట్ల (కంటం), మూలపెరికె, రసవర్గాలు, పోకలు, మిరియాలు, బెల్లం, నువ్వులు, జవళిక, జాల్చి, బియ్యం, జొన్నలు, రాగులు మొదలైన సరుకులను రవాణా చేస్తూ వుండినట్లు అనిమెలలో వున్న శా.శ. 1453 (క్రీ.శ. 1531) నాటి శాసనాలు[74] తెలియజేస్తున్నాయి. కడప స్థానిక చరిత్రలో[75] తిరుపతి పెందెరువు ప్రస్తావన వుంది. దాసరిపల్లె కైఫీయత్తు[76] బద్వేలు, పోరుమామిళ్లల ద్వారా అహోబిలానికి వెళ్లే మార్గాన్ని ప్రస్తావిస్తూ వుంది. ఈ మార్గాలు కూడా సరుకుల రవాణాకు ఉపయోగపడి వుండవచ్చు.

వర్తకులు శ్రేణులుగా ఏర్పడి వాణిజ్యాన్ని నిర్వహించేవారు. ఈ ప్రాంతంలో వీరబలిజ కులానికి చెందిన అయ్యావళి, ఉభయ నానాదేశి, చాలుమూల సమస్త పెక్కండ్రు, యాభై ఆరు దేశాల శెట్టి సమస్త పెక్కండ్రు మొదలైన వర్తక శ్రేణులు వాణిజ్యాన్ని నిర్వహిస్తున్నట్లు

శాసనాలు తెలియజేస్తున్నాయి. వర్తక శ్రేణుల అధ్యక్షులుగా పేరు ప్రతిష్ఠలున్న వారిని ఎన్నుకునేవారు. ఈ అధ్యక్షులను సెట్టి, పట్ను స్వాములు అనేవారు. శా.శ. 1457 (క్రీ.శ. 1535) నాటి పులివెందల శాసనంలో[77] శెట్టి, పట్నుస్వాములు పేర్కొనబడినారు. వీరు శ్రేణులు, శ్రేణి సభ్యులు చెల్లించవలసిన సుంకాలను వసూలుచేసి ప్రభుత్వ ఖజానాలో కట్టేవారు.

ఉత్పత్తిదారులు నియమిత కాలంలో సరుకును సరఫరా చెయ్యాలనే నిబంధనతో వారికి వర్తకులు బయానాలు ఇచ్చేవారు. బయానా తీసుకున్న నేతపనివాండ్లు నియమిత సమయంలో సరుకును సరఫరా చెయ్యలేక పోయినందువల్ల ఛప్పన్న దేశాల వర్తకులు పెన్నబడి, ములికినాడు, రేనాడు, సకలిసీమ, ఔకు, కోయిలకుంట్ల, పెద్ద నంద్యాల, పులివెందల గ్రామాలలో మగ్గాల నుండి రావలసిన బాకీలను శ్రీశైల మఠాధిపతికి ఇచ్చినట్లు లావనూరు శాసనం[78] తెలియజేస్తూ వుంది. వర్తకులు వ్యక్తిగతంగాను, శ్రేణులుగాను తమకు వచ్చిన లాభాల నుండి కొంతభాగాన్ని పుణ్య సంపాదన కోసం దేవాలయాలకు దానం చేసేవారు.

## 7. పన్నులు

ప్రభుత్వానికి ప్రధానమైన ఆదాయం పన్నులనుండే లభిస్తుంది. ప్రాచీన కావ్యాలు, స్మృతుల ననుసరించి ప్రజల ప్రాణాలకు, ఆస్తులకు రక్షణ కల్పిస్తున్నందుకు ప్రతిఫలంగా వ్యవసాయోత్పత్తుల నుండి ధర్మషడ్భాగాన్ని (పంటలో ఆరవ వంతును) పన్నుగా రాజ్యం గ్రహించేది. కాని రాజులు పన్ను గ్రహించేటప్పుడు క్రింది సూత్రాలను పాటించాలని స్మృతికారులు నిర్దేశించినారు.

1. పన్నులు ప్రజల ఆర్థిక స్థితిని దిగజార్చేవిగా వుండకూడదు.
2. ఒక్కసారిగా కాకుండా చాలా కొద్ది మొత్తాలలో అంచెలవారీగా పన్ను విధించాలి.
3. అనుకూలమైన సమయ, స్థానాలలో విధించాలి.

రాజు, తాను ప్రజలకు రక్షణ కల్పిస్తున్నందుకు ప్రతిఫలంగా పన్నులు వసూలు చేసినట్లు యాజ్ఞవల్క్య[79], బోధాయన[80], మను[81], వశిష్ఠ[82], నారద[83] స్మృతులు; మహాభారతం[84] మొదలైన గ్రంథాలవల్ల తెలుస్తూ వుంది.

పైన చెప్పబడిన పన్ను విధింపు సూత్రాలు ప్రాచీన భారతదేశ చక్రవర్తుల కోసం నిర్దేశించబడిన ఆదర్శాలుగాను, రాజుయొక్క, ప్రజలయొక్క ప్రయోజనాలను దృష్టిలో వుంచుకొని ఆచరించబడినవిగాను మహాభారతం[85], అర్థశాస్త్రం[86], మనుస్మృతి[87], కామందకం[88], పంచతంత్రం[89] మొదలైన గ్రంథాలలోని ఉపమానాలు, రూపకాలు సూచిస్తున్నాయి. పన్ను విధింపు విషయంలో స్థిరమైన సూత్రాలు నిర్దేశించబడి సర్వసాధారణంగా అంగీకార యోగ్యాలై ఆచరించబడుతున్నప్పటికీ, కొన్ని సందర్భాలలో రాజులు ప్రజలను పీడించి అధికమైన పన్నులను వసూలు చేసినట్లు అర్థశాస్త్రం[90], మహాభారతాలలోని[91] సూచనలవల్ల తెలుస్తూ వుంది.

విపరీతంగా పెరిగిపోయిన పన్నులను చెల్లించలేకపోవడం వల్ల అధికారులు పెట్టే బాధలు భరించలేక ప్రజలు ఊళ్లను వదిలిపెట్టి వెళ్లిన సంఘటనలు ఈ అధ్యయన పరిధిలోని కాలంలో కూడా జరిగినట్లు శాసనాలవల్ల తెలుస్తూ వుంది. పులివెందల సీమలోని ప్రజలు అధికమైన పన్నులు కట్టలేక ఇతర ప్రాంతాలకు వలస పోతున్నట్లు తెలుసుకొని తిమ్మరాజు సలకయ్యదేవ మహారాజుల కార్యకర్త అయిన తుళువ ఎల్లప్ప నాయకుడు పులివెందల సీమలో వున్న సెట్టి, పట్నస్వామి, రెడ్లు, కరణాలు, అష్టాదశ ప్రజలు మొదలైన కాపులకు శా.శ. 1457 (క్రీ.శ. 1535)లో పులివెందలలో ఒక నమ్మిక శాసనాన్ని[92] జారీ చేసినాడు. అంతకుముందు పన్నులు కట్టలేక ఊరువిడిచి వలసపోయిన కాపులకు, కొత్తగా వచ్చే కాపులకు, ఊరనున్న కాపులకు, పూర్వం ఏ విధమైన పన్నులు వసూలు చేసేవారో అంతకంటే ఎక్కువ పన్నులు వసూలు చేయబోమని, ఏ నేరం చేసినా పన్నెండు రూకలకంటే ఎక్కువ అపరాధం వసూలు చేయబోమని హామీ ఇచ్చి, పులివెందల సీమను ఏలే దొరలెవ్వరూ ఈ మర్యాదను తప్పరాదని ఈ శాసనం ద్వారా ఆదేశించినాడు.

మధ్య యుగాలలోని పన్నులను గురించి తెలుసుకోవడం చాలా క్లిష్టమైన అంశం. ఎన్నోవిధామైన పన్నులు శాసనాల ద్వారా తెలుస్తున్నా వాటిలో చాలా పన్నులను ప్రస్తుతం వివరించడానికి వీలుకావడం లేదు.

రేనాటిచోళుల కాలంలో వున్న పన్నులేవీ మనకు శాసనాలలో కనిపించడం లేదు. కాని వీరు పల్లవులకు, చాళుక్యులకు కొంతకాలం సామంతులుగా వుండడం వల్ల వారు విధించిన పన్నులనే రేనాటిచోళులు కూడా విధించి వుండడానికి అవకాశముంది.

వైదుంబుల కాలంలోని పన్నులు కూడా ఈ జిల్లాలోని శాసనాలలో కనిపించడం లేదు. కాని చిత్తూరు జిల్లాలోని కలకడ గ్రామంలో లభించిన భువనత్రినేత్ర ఇరుగయ మహారాజు పట్టాభిషేక సందర్భాన్ని పురస్కరించుకొని వేయించిన శాసనం[93] ఆ రాజు తన రాజ్యంలోని కాపులకు దొగరాచపన్ను, పడెవాళ పన్ను, పడియేరి పన్ను, సంధివిగ్రహి పన్నులు - తప్ప మిగిలిన తివుల్దెసము మొదలైన చిరుపన్ను లన్నింటినీ ఆ శుభ సందర్భంలో మినహాయించినట్లు తెలియజేస్తూ వుంది. తెలుగుచోళ వంశస్థులైన చోళ మహారాజుకు సంబంధించిన క్రీ.శ. పదవ శతాబ్ది నాటి ప్రొద్దుటూరు శాసనం[94], గిళెగెయ మహారాజుకు సంబంధించిన వేల్పుచర్ల శాసనం[95] 'సిద్ధాయ' మనే భూమి పన్నును ప్రస్తావిస్తున్నాయి. శా.శ. 1153 (క్రీ.శ. 1231) నాటి మద్దులేటిగడ్డ శాసనంలో[96] తిరుకాళత్తిదేవచోడ మహారాజు కాలంలో ధాన్యరూపంలో వసూలు చేసే 'కొలుచు' అనే పన్ను ప్రస్తావించబడింది. కాయస్థ వంశస్థుడైన త్రిపురారిదేవుని కాలంలో సాదము, సుంకెణ, షష్ఠాయము అనే పన్నులు వుండినట్లు శా.శ. 1226 (క్రీ.శ. 1304) నాటి వరికుంట శాసనం[97] తెలుపుతూ వుంది. కాకతీయ ప్రతాపరుద్రుని కాలంలో రాచశ్రోత్రియము, అరి, కోరు, పన్నులు, కానికలు అనే పన్నులు వుండినట్లు శా.శ. 1241 (క్రీ.శ. 1319) నాటి చెండువాయి శాసనం[98] తెలియజేస్తూ వుంది.

పైన పేర్కొనబడిన పన్నులే కాక ఇంకా ఎన్నో రకాలైన పన్నులను వైదుంబుల నుండి కాకతీయుల వరకు వున్నకాలంలో ప్రజలు చెల్లించవలసి వచ్చేది. ఈ జిల్లాలోని శాసనాలలో పేర్కొనబడనప్పటికీ, అంగడి, అరిధిళవాది, కానిక, అడ్డవట్టు సుంకము, అప్పనము, అమ్ముబడి సుంకము, ఇల్లరి, పసులపుల్లరి, ఉప్పు సుంకము, ఎడ సుంకము, త్రాసునాయము, కోటివీసాలు, గడ్డుగ, తోట సుంకము, దరిశెనము, పంగాయము, పశులబడి, పుట్టిమాడలు లేదా పుట్టిపహిండి, పెండ్లి ఆయము, బుఙ్జి సుంకము, బోగర పన్ను, ముద్ర సుంకము, రేవు సుంకము మొదలైన పన్నులు ఈ కాలంలో వుండినట్లు ఆంధ్రదేశంలోని ఇతర ప్రాంతాలలో వున్న శాసనాలు తెలియజేస్తున్నాయి. పన్ను విధింపునకు సంబంధించి చాళుక్యులు అనుసరించిన విధానాన్నే కాకతీయులు పాటించినప్పటికీ, వీరు తమకు పూర్వముండిన రాజులకంటె ఎక్కువ పన్నులను వసూలు చేసినట్లు కనిపిస్తుంది. బహుశ: బంజరు భూములను సాగుచెయ్యడానికి, నీటిపారుదల సౌకర్యాలను కల్పించడానికి కాకతీయులు పూనుకున్నందువల్ల అందుకు అవసరమయ్యే నిధుల కోసం పైవిధంగా పన్నులను వసూలు చెయ్యవలసిన అవసరం ఏర్పడి వుండవచ్చు.

కొన్ని సందర్భాలలో కొన్ని పన్నులను మినహాయిస్తుండేవారు. శా.శ. 894 (క్రీ.శ. 972) నాటి కలకడ శాసనం ఇరుగెయ మహారాజు తన పట్టాభిషేక సందర్భంలో రేనాటి కాపులకు కొన్ని చిరుపన్నులను మినహాయించినట్లు తెలియజేయడాన్ని ఇంతకుముందు ప్రస్తావించడం జరిగింది. శా.శ. 1231 (క్రీ.శ. 1309) నాటి నందలూరు శాసనం[99] ప్రతాపరుద్రుడు నందలూరు, దాని గ్రామగ్రాసపు పల్లెలు ఆండపూరు, మందడము, మన్నూరు, అస్తాపురము అనే ఐదు గ్రామాలలోని మహాజనాలకు 'అవనయాలు' అనబడే సుంకము, సాదము, మాడలు అనే పన్నులను మినహాయించినట్లు తెలియజేస్తూ వుంది.

విజయనగర రాజుల కాలంలో వున్న అనేక పన్నులను గురించి ఈ జిల్లాలోని శాసనాల వల్ల తెలుస్తూ వుంది. ఈ పన్నులను ఐదు వర్గాలుగా విభజించవచ్చు. 1. భూమి పన్నులు, 2. వృత్తికి సంబంధించిన పన్నులు, 3. పరిశ్రమలపై పన్నులు, 4. వాణిజ్య పన్నులు, 5. ఇతర పన్నులు.

### *7.1* భూమి పన్నులు

వ్యవసాయదారులకు, దేవాలయాలకు, బ్రాహ్మణులకు, స్థానిక ప్రభువులకు సంబంధించిన భూములన్నింటిమీదా పన్ను వుండేది. గ్రామాలలోని రాచపొలము, బంజరు భూమి, అడవులు మొదలైనవి మాత్రం పన్ను చెల్లించే భూముల క్రిందికి రావు. సర్వమాన్యాలైన బ్రాహ్మణ అగ్రహారాలు, దేవవృత్తులపై కూడా నామమాత్రపు పన్ను వుండేది. కొత్త గ్రామాలు నెలకొల్పినప్పుడు అక్కడ నివాస మేర్పరచుకునే ప్రజలు తమకు చేతనైనంత భూమిని సాగుచేసుకోవడానికి ప్రభుత్వం అనుమతించేది. భూమి స్వభావం, వనరులను బట్టి మూడు లేదా అంతకంటే ఎక్కువ సంవత్సరాలు ఆ భూములపై ఎటువంటి పన్ను చెల్లించనవసరం

లేదు. తరువాత క్రమంగా ఆ భూములపై కూడా పన్ను విధిస్తారు.

వ్యవసాయ భూములను, నీటి వనరులను బట్టి నీరారంభం, కాడారంభం అని విభజించి పన్నులు విధించేవారు. చెఱువులు, బావులు, కాలువల వంటి శాశ్వత జలవనరులు కలిగిన భూములను నీరారంభ భూములంటారు. ఈ భూములలో వరి, చెఱకు, కూరగాయలు పండించేవారు. పండ్ల తోటలు, పోక తోటలు కూడా నీరారంభ భూములే. ఇవికాక ఇతర పంటలను పండించే వర్షాధార భూములను కాడారంభ భూములంటారు. ఈ భూములపై నీరారంభం, కాడారంభం అనే పన్నులను విధించేవారు. పన్నును ధనరూపంలో గాని ధాన్యరూపంలో గాని వసూలు చేసేవారు. శా.శ. 1452 (క్రీ.శ. 1529) నాటి కత్తిరగండ్ల శాసనం[100], శా.శ. 1458 (క్రీ.శ. 1537) నాటి నెరవాడ శాసనం[101] నీరారంభ, కాడారంభ అనే పన్నులను పేర్కొంటున్నాయి.

పండించే పంటతో సంబంధం లేకుండా భూములన్నింటిపై విధించే ప్రాథమికమైన శిస్తును 'పన్ను' అంటారు. భూమిపై స్వామ్యం రాజుది కాబట్టి భూమిని సాగుచేసు కుంటున్నందుకు హక్కుదారులు ధనరూపంలో ఈ పన్నును చెల్లించేవారు. భూమిపై 'సిద్ధాయ' మనే పన్నును కూడా విధించేవారు. విజయనగర రాజుల కాలంలో ధాన్య రూపంలో కూడా ఈ పన్నును వసూలు చేసినట్లు తెలుస్తూ వుంది. తరి, మెట్ట భేదం లేకుండా అన్నిరకాల భూములలో పండిన ధాన్యంలో రాజభాగంగా 'కొలుచు' అనే పన్ను విధించబడేది. వ్యవసాయ భూములపై 'కానిక' అనే పన్నును కూడా విధించినట్లు దేవవృత్తులైన భూములపై ఈ పన్నును మినహాయించినట్లు పేర్కొన్న శాసనాలు తెలియజేస్తున్నాయి.

ఈ కాలంలో వీసబడి పద్ధతి కూడా అమలులో వుండేది. ఈ పద్ధతి ప్రకారం గ్రామంలోని భూమి ఊరందరికి చెందుతుంది. భూమిని సారాన్ని బట్టి విస్తీర్ణాన్ని బట్టి పదహారు వాటాలుగా విభజిస్తారు. రైతులు తమ స్తోమతను బట్టి పదహారో వంతు లేదా దానిలో సగమో లేదా నాలుగోవంతో తీసుకునేవారు. వారు తీసుకున్న భూమినిబట్టి పన్నును కూడా అదేవిధంగా విభజించి నిర్ణయిస్తారు[102]. ఈవిధంగా నిర్ణయించిన పన్నును 'వీసబడి పన్ను' అంటారు. శా.శ. 1355 (క్రీ.శ. 1433) నాటి నందలూరు శాసనం[103], పొత్తపినాటిలోని ప్రోలి, లేంబాక, తాళ్లపాక, తంగటూరు, ఓపిలి - అనే ఐదు గ్రామాల రెడ్లు, పొత్తపినాటి భూమిపై విధించబడిన వీసబడి, పన్ను, కానిక, కప్పాలు, వెట్టి, వేమి, అసగ్రయాలు అనే ఏడు పన్నులను నెలందలూరి చొక్కనాథ పెరుమాళ్లకు సర్వమాన్యంగా ఇచ్చినట్లు తెలుపుతూ వుంది.

ప్రభుత్వం నుండి కౌలుకు తీసుకున్న భూములపై 'గుత్త' అనే ధనరూపమైన పన్నును లేదా 'కోరు' అనే ధాన్యరూపమైన పన్నును వ్యవసాయదారులు చెల్లించేవారు.

పైన చెప్పబడిన పన్నులే కాక చెఱువుల నిర్వహణ కోసం 'కట్టపన్ను', మడిని సాగు చేసుకుంటున్నందుకు 'మడిపన్ను', వ్యవసాయదారుల నుండి వసూలు చేసేవారు.

## 7.2 వృత్తికి సంబంధించిన పన్నులు

ఈ పన్నులలో కొన్ని ఆయా వృత్తుల వారు ప్రభుత్వానికి చెల్లించవలసినవి, కొన్ని ఆ వృత్తిని అనుసరించేవారి జీవనం కోసం ప్రజలు ఇచ్చేవి వున్నాయి. మంగలి పన్ను, చాకలి పన్ను, గొల్ల సిద్ధాయము, ఉప్పర సిద్ధాయము, కోమటి సిద్ధాయము, దొమ్మరి పన్ను, వీరముష్టి పన్ను, విప్రవినోది వర్తనలు మొదలైనవి వృత్తులకు సంబంధించిన పన్నులు.

శా.శ. 1472 (క్రీ.శ. 1550) నాటి గండికోట శాసనం, మంగలివారు వారి వృత్తిని అనుసరిస్తున్నందుకుగాను ప్రతిదినం ఒక వీసం పన్నుగా చెల్లించాలని గండికోట నాయంకరుడైన నంద్యాల తిమ్మరాజు ఉత్తర్వు జారీచేసినట్లు తెలుపుతూ వుంది[104]. శా.శ. 1469 (క్రీ.శ. 1546) నాటి చిలమకూరు[105], పోరుమామిళ్ల[106] శాసనాలు, శా.శ. 1469 (క్రీ.శ. 1547) నాటి పుష్పగిరి శాసనం[107] మొదలైన శాసనాలు మంగలి తిమ్మోజు కొడుకు కొండోజుకు సదాశివరాయలు మంగలి పన్నును సర్వమాన్యం చేసినట్లు తెలుపుతున్నాయి.

చాకలివారు రేవును ఉపయోగిస్తున్నందుకు చాకలి పన్ను చెల్లించేవారు. మన్మథ సంవత్సర శ్రావణ బహుళ దశమి (శక సంవత్సరం పేర్కొనబడలేదు, ఈ సంవత్సరం క్రీ.శ. 1535తో సరిపోలుతుంది) నాటి గండికోట శాసనం[108], గండికోట చాకల రామయ్య మొదలైన వారికి పెదరాజుగారు చాకలి పన్ను మన్నించినందువల్ల గండికోట నాయంకరుడైన నంద్యాల ఔబళదేవ మహారాజు ఆప్రకారంగానే చౌడు, సున్నాలకు పెదకొట్టిపాడు, పోటపాడు గ్రామాలలో చాకలి పన్నును సర్వమాన్యం చేసినట్లు తెలుపుతూ వుంది.

ఈడిగలు ఈడిగ సిద్ధాయం, గొల్లవారు గొల్ల సిద్ధాయం, ఉప్పరవారు ఉప్పర సిద్ధాయం అనే పన్నులను చెల్లించేవారు. శా.శ. 1464 (క్రీ.శ. 1542) నాటి చిడిపిరాల శాసనం[109] గండికోట సుంకరులు మల్లయ్య, ఓబయ్య, ఎల్లయ్యలు తమ సుంక పణ్యానికి చెల్లే చిడిపిరాల, చెప్పలి గ్రామాలలో గ్రామకట్నం, మగ్గ స్థావరాలు, గానుగ సిద్ధాయం, సింజని సిద్ధాయం, ఈడిగ సిద్ధాయం, గొల్ల సిద్ధాయం, ఉప్పర సిద్ధాయం మొదలైన సుంకాలవల్ల వచ్చే ఆదాయాన్ని అగస్త్యేశ్వరునికి అఖండ తిరువళికెకుగాను ధారవోసి ఇచ్చినట్లు తెలియజేస్తూ వుంది.

విప్రవినోదులు అనే బ్రాహ్మణ శాఖ తమ విద్యలతో బ్రాహ్మణులను ఆనందపరచి వారినుండి సంవత్సరానికి కొంత ధనాన్ని స్వీకరించేవారు. దీనిని విప్రవినోది వర్తన లేక విప్రవినోది పన్ను అంటారు. ఈ పన్ను రాజుకు చెందదు. విప్రవినోదులు తమకు వచ్చే సంవత్సర ఆదాయంలో కొంత భాగాన్ని కొన్ని గ్రామాలలోని దేవాలయాలకు దానంగా ఇచ్చినట్లు శాసనాలు తెలియజేస్తున్నాయి.

దొమ్మరులు గ్రామాలలో తిరుగుతూ వ్యాయామ విన్యాసాలను ప్రదర్శించి గ్రామస్థులను ఆనందపరచినందుకు, వారి పోషణకుగాను గ్రామంలోని ప్రజలు కొంత ధనాన్నిగాని, ధాన్యాన్నిగాని వాళ్లకు చెల్లించేవారు. దీనిని దొమ్మరి పన్ను అంటారు. దొమ్మరులు కూడా

కొన్ని గ్రామాలలో తమకు వచ్చిన ఆదాయాన్ని ఆయా గ్రామాలలోని దేవాలయాలకు దానమిచ్చినట్లు కొన్ని శాసనాలు తెలియజేస్తున్నాయి.

వీరముష్టివారు గ్రామంలోని వీరశైవ భక్తుల నుండి ప్రతి సంవత్సరం వసూలు చేసే పన్నును వీరముష్టి పన్ను అంటారు. ఈ పన్నుకూడా రాజుకు చెందదు. ఏదో ఒక వీరశైవ మఠాధిపతి లేదా ఆయన కార్యకర్త ఈ పన్ను వసూలుకు సంబంధించిన బాధ్యత తీసుకుంటాడు. శా.శ. 1471 (క్రీ.శ. 1549) నాటి బెడదూరు శాసనం[110], శా.శ. 1472 (క్రీ.శ. 1550) నాటి చిడిపిరాల శాసనం[111], శా.శ. 1472 (క్రీ.శ. 151) నాటి రామేశ్వరం శాసనం[112], శా.శ. 1473 (క్రీ.శ. 1551) నాటి పెద్ద ముడియం శాసనం[113] మొదలైన శాసనాలు వీరముష్టి పన్నును పేర్కొంటున్నాయి.

స్వర్ణకారులు, కమ్మరులు, కుమ్మరులు మొదలైనవారు తమతమ వృత్తులను అనుసరిస్తున్నందుకు పన్ను చెల్లించేవారు. అడవిలో వేటాడినందుకు బోయ సుంకము, కట్టెలు కొట్టుకున్నందుకు అడవి సుంకము చెల్లించవలసి వచ్చేది. కొట్టిన కట్టెలకు మోపుకు ఇంత అని పన్ను విధించేవారు. ఈ పన్నుకు సంబంధించిన ప్రస్తావన ఈ జిల్లాలోని శాసనాలలో లేదు. కాని ఈ కాలంలో ఈ పన్ను వసూలు అమలులో వుండినట్లు ఇతర ఆధారాల వల్ల తెలుస్తూ వుంది. అడవిలో కట్టెలు కొట్టుకోవడానికి వెళ్లే వ్యక్తి తన వెంట సుంకపు కాసులను కూడా తీసుకొని వెళ్లినట్లు శుక సప్తతిలోని "వలనగు పుట్టగోచి, బిగువాళ్లను సుంకపు కాసులున్ విభాసిలు కరసాన గొడ్డలియు చిక్కమునన్ సొరకాయ బుర్రలో చలిదియు నుంచి . . . . . అరిగెన్ గహనంబునకై రయంబునన్" – అనే పద్యం[11-] తెలుపుతూ వుంది.

## 7.3 పరిశ్రమలపై పన్నులు

నేత పనివారు, గానుగలవారు, కుమ్మరులు, దూదిని శుద్ధిచేసేవారు తమతమ పరిశ్రమలపై పన్నులు చెల్లించేవారు. వీరు పరిశ్రమను స్థాపించడానికి, పరిశ్రమను నడపడానికి, తయారైన సరుకును సంతలో అమ్మడానికి, తమ కుల సమయానికి వివిధ పన్నులను చెల్లించవలసి వచ్చేది. నేత పరిశ్రమ ఈ కాలంలో బాగా అభివృద్ధి చెందిన పరిశ్రమ. నేత పరిశ్రమ మీద, అందుకు ఉపయోగించే మగ్గాలమీద 'మగ్గ స్థావరము'[115], 'మగ్గాల సిద్ధాయము'[116] అనే పన్నులు వుండేవి. గానుగలవారు గానుగలపై 'గానుగ స్థావరం[117], 'గానుగ సిద్ధాయం[118] అనే పన్నులను చెల్లించేవారు. దూదిని ఏకడం లేదా శుద్ధిచేసే పరిశ్రమపై 'పెంజణి స్థావరాలు[119], 'పింజని సిద్ధాయం[120] అనే పన్నులు వుండేవి. కుమ్మరులు కుండలు తయారుచేసే చక్రం మీద 'చక్ర స్థావరం[121] అనే పన్నును చెల్లించేవారు.

శా.శ. 1468 (క్రీ.శ. 1546) నాటి పోట్లదుర్తి శాసనం[122] గండికోట సుంకరులైన మల్లప్ప, తిప్పయ్య, సూరయ్యలు తమ సుంకమాగాణిలోని నల్లబల్లి ఠాణెకు చెందే పోట్లదుర్తి గ్రామంలో

వచ్చే గ్రామకట్నం, అంగడి స్థావరం, చక్రస్థావరం, యీడిగి స్థావరం, బట్టి, పెంజణి స్థావరాలు మొదలైన స్థావర గ్రామకట్నాలను పోట్లదుర్తి చెన్నకేశవస్వామికి ధారవోసి ఇచ్చినట్లు తెలుపుతూవుంది.

ఈ కాలంలో కల్లు పరిశ్రమ కూడా ఒక ప్రధానమైన పరిశ్రమ. ఈ పరిశ్రమపై 'ఈడిగ స్థావరం' అనే పన్నును విధించేవారు. తయారు చేసిన కల్లుమీద 'సురసుంకం' చెల్లించాలి. దేవాలయాలకు లభించే ఆదాయాలలో సురసుంకం కూడా వుండినట్లు శాసనాలు తెలుపుతున్నాయి. అరతురేవుల (అత్తిరాల) లోని క్రత్రీశ్వర, పరశురామేశ్వర, భైరవేశ్వర దేవస్థానాలకు లభించే తాళ్ల, యీందుల సురసుంకాన్ని మధ్యవర్తులు వసూలుచేసి చెల్లించనందువల్ల ఆ దేవస్థానాలలో పూజ, నైవేద్యాలు నడవకుండా వున్నట్లు తెలుసుకొని, సాళువ నరసింగయ్య దేవ మహారాజు 'అవసరం', అన్నమరుసయ్య, ఆ దేవస్థానాలలో పూజ, నైవేద్యాలు నడవడం కోసం కొన్ని భూములను దానమిచ్చినట్లు శా.శ. 1399 (క్రీ.శ. 1477) నాటి అత్తిరాల శాసనం[123] తెలియజేస్తూ వుంది.

పైన పేర్కొనబడిన పన్నులలో సిద్ధాయాలు, స్థావరాలు అనే రెండురకాల పన్నులను ప్రస్తావించడం జరిగింది. ఇవి ఏవిధమైన పన్నులో తెలియదు. అందువల్ల 'ఈడిగ సిద్ధాయం' అనే పన్నును గొల్ల సిద్ధాయం, కోమటి సిద్ధాయం వంటి వాటిలో కలిపి వృత్తికి సంబంధించిన పన్ను గాను, 'ఈడిగ స్థావరాన్ని', పరిశ్రమకు సంబంధించిన పన్నుగాను సందర్భానుసారంగా వివరించడం జరిగింది. ఈ వివరణ ఊహామాత్రమే. ఇందుకు సంబంధించిన స్పష్టమైన అవగాహనకు తగిన ఆధారాలు లభించలేదు.

### *7.4 వాణిజ్య పన్నులు*

వాణిజ్యానికి సంబంధించిన అన్నిరకాల వస్తువులమీదా అమ్మకపు పన్ను వుండేది. సంత జరిగే ప్రదేశాన్ని 'పేట' లేదా 'పేంట' అనేవారు. పేంటలో అమ్మకం కోసం తెచ్చిన ప్రతి వస్తువుపైన వ్యాపారులు పేంట సుంకాన్ని చెల్లించాలి. ఏ కారణం చేతనయినా సరుకులు అమ్ముడుబోక పోయినా సంతలో సరుకు ఉంచినందుకు సుంకాన్ని చెల్లించాలి. ఒక సంతలో అమ్ముడుబోని సరుకులను ఇంకొక సంతకు తీసుకొని వెళ్లినప్పుడు అక్కడ మళ్లీ పేంట సుంకాన్ని చెల్లించాలి. ఈ విధంగా ఒకటి లేదా అంతకంటె ఎక్కువ సంతలలో సరుకును అమ్మకానికి పెట్టినప్పుడు ఆ సరుకు అమ్ముడుబోయినంతవరకు వ్యాపారులు ప్రతి సంతలోను పేంట సుంకాన్ని చెల్లించవలసి వచ్చేది. అంగడిలో వస్తువులను అమ్మినపుడు వాటిపై అమ్మకపు పన్నుతోపాటు అంగడిపై కూడా 'అంగడి స్థావరం' అనే పన్ను విధించబడేది. ఒక గ్రామం వారు ఇంకొక గ్రామంలో సరుకును అమ్మినా, కొన్నా 'ఉభయమార్గ సుంకం' అనే పన్నును చెల్లించాలి. శా.శ. 1448 (క్రీ.శ. 1525) నాటి కత్తెరగండ్ల శాసనం[124], కృష్ణదేవరాయ మహారాయల 'అవసరం' దేమరుసు అన్నాజీ అయ్యవారి కార్యకర్త రేవూరి వెంగళయ్య, గండికోటసీమలోని సకలిసీమలో వున్న చెన్నవరం నగరికి చెందే గ్రామకట్నము, సాహజంపన్ను, గానుగ స్థావరాలు,

మగ్గ స్థావరాలతోపాటు పరస్థళం గవురలు (వ్యాపారులు) ఏమి సరుకు తెచ్చి ఆ గ్రామాన అమ్మినా, కొన్నా చెల్లించే ఉభయమార్గ సుంకాన్ని కత్తెరగండ్ల గ్రామంలోని చెన్నకేశవ దేవుని అమృతపళ్లకు, అంగరంగ వైభవాలకు అఖండ తిరువళికెకుగాను సర్వమాన్యంగా ధారవోసి ఇచ్చినట్లు తెలుపుతూ వుంది. శా.శ. 1469 (క్రీ.శ. 1547) నాటి లోమడ శాసనం[125], రామరాజు ఆనతిన నంద్యాల తిమ్మయదేవ మహారాజు గండికోట సీమలోని నిట్టూరు, లోమడ గ్రామాలకు చెందే ఉభయమార్గ సుంకము, ఆ గ్రామాలలో పండిన జొన్నలు, వడ్లు, పత్తి, దూది, పసులు, గుఱ్ఱాలు, బండితొత్తు సహా అమ్మిన సుంకాన్ని వసూలు చేసుకోవడానికి కృష్ణరాయభూషణ అచ్యుతరాయభూషణు డనే వ్యక్తికి అధికారాన్ని ఇచ్చి, లోమడ గ్రామంలో సరుకు కొనే బేహారులకు అతను ఇచ్చే కొలుబడిని నిటూరి ఠాణెం వెళ్లినంతవరకు చెల్లిస్తామని హామీ ఇచ్చినట్లు తెలియజేస్తూ వుంది.

ఒక ప్రాంతం నుండి ఇంకొక ప్రాంతానికి సరుకులను రవాణా చేసేటప్పుడు వర్తకులు దేవభోగం నిమిత్తం ఐచ్ఛికంగా 'మగమ' అనే పన్నును చెల్లించేవారు. వర్తకులు లేదా వర్తక శ్రేణులు మగమను ఇస్తూ వేయించిన శాసనాలను 'మగమ ధర్మశాసనాలు'గా వ్యవహరించినారు. వీరబలిజ కులానికి చెందిన వర్తకశ్రేణి, అయ్యావలి ముఖ్యమైన చాలుమూల సమస్త పెక్కంండ్రు, పులివెందలకనుమ, చింతకనుమ, పెండ్లిమఱ్ఱి మార్గాలలో తాము రవాణాచేసే దూదికంట్ల, మూలపెరికె, రసవర్గాలు, పోకలు, బెల్లం, నువ్వులు, జవళిక, జాల్చి, బియ్యం, రాగులు, జొన్నలు మొదలైన వాటిపై గోనె ఒకింటికి ఒక రూక లెక్కన అనిమెల సంగమేశ్వరుని దీపారాధన, నైవేద్యాలకు; వీరేశ్వరుని (వీరభద్రుని) నైవేద్యానికిగాను మగమ ధారవోసి ఇచ్చినట్లు అనిమెలలో వున్న శా.శ. 1453 (క్రీ.శ. 1531) నాటి మూడు శాసనాలు[126] (శా.శ. 1453, ఖర సంవత్సర వైశాఖ బహుళ అష్టమి నాటిది ఒక శాసనం, దశమి నాటివి రెండు శాసనాలు) తెలియజేస్తున్నాయి.

## *7.5* ఇతర పన్నులు

గ్రామం యొక్క సమిష్టి వ్యయం కోసం 'గ్రామకట్నం', 'గ్రామవ్రయం' అనే పన్నులను విధించేవారు. శా.శ. 1465 (క్రీ.శ. 1543) నాటి మొయిళ్ల కాలువ శాసనం[127], రాయసం తిమ్మరుసు గారి కుమారుడు వెంగళప్ప లక్ష్మీ ప్రతిష్ఠ చేసి ఆ దేవికి, తిరువెంగళనాథునికి కొన్ని భూములను దానమిచ్చిన సందర్భంలో, సుంకరవారు రంపతాటి గ్రామకట్నం, మూడు మాడలను మొయిళ్ల కాలువ తిరువెంగళనాథునికి సమర్పించినట్లు తెలియజేస్తూ వుంది. రెండవ దేవరాయల కాలానికి చెందిన గుండ్లూరు శాసనం[128] మహామండలేశ్వర రాయదేవ మహారాజుల ప్రధాని నరసింహ ప్రగ్గడ, గుండ్లూరి లక్ష్మీనారాయణస్వామి తిరునాళ మహోత్సవానికిగాను, గుత్త, కొలుచు, సిద్ధాయం, కట్టిగ, తలారిక, మగమ, (తలాపనం), గ్రామవ్రయం అనే పన్నులను ధారాపూర్వకం చేసినట్లు తెలుపుతూ వుంది.

ఇరవై లేదా ముప్పై గ్రామాలతో కూడిన రాజ్య విభాగాన్ని 'స్తళము' అనేవారు. ఒక

స్థళంలో నివసించే ప్రజలు, ఆ స్థళానికి సంబంధించిన సమిష్టి వ్యయం కోసం 'స్థళ సుంకాన్ని' చెల్లించేవారు. శా.శ. 1415 (క్రీ.శ. 1493) నాటి ముత్తుకూరు శాసనం[129], శా.శ. 1458 (క్రీ.శ. 1536) నాటి మొయిళ్ల కాలువ శాసనం[130], స్థళ సుంకాన్ని పేర్కొంటున్నాయి. దుర్గ నిర్వహణ కోసం, 'దుర్గవర్తన'ను, దండనాయకులకు 'దణ్ణాయనివర్తన'ను ప్రజలు చెల్లించేవారు. పుష్పగిరిలోని వైద్యనాథస్వామికి సంబంధించిన దేవతా గ్రామాలకు గండికోట దుర్గవర్తన సంవత్సరానికి అరవై వరహాలని శా.శ. 1463 (క్రీ.శ. 1541) నాటి పుష్పగిరి శాసనంవల్ల[131] తెలుస్తూ వుంది. శా.శ. 1455 (క్రీ..శ. 1533) నాటి చిన్నదాసరిపల్లె శాసనం[132], శా.శ. 1466 (క్రీ.శ. 1545) నాటి మోపూరు శాసనం[133], శా.శ. 1466 (క్రీ.శ. 1545) నాటిదే అయిన పోరుమామిళ్ల శాసనం[134] మొదలైన శాసనాలు గండికోటకు వచ్చే దుర్గవర్తన దణ్ణాయ నివర్తనలను పేర్కొంటున్నాయి. ఇంటిపై 'వుల్లాయము' అనే పన్నును వసూలు చేసేవారు. శా.శ. 1467 (క్రీ.శ. 1545) నాటి పెరియవరం శాసనం[135], మహామండలేశ్వర రాఘవరాజు, తన వుమ్మళిక గ్రామమైన పెరియవరంలో వసూలుచేసే వుల్లాయాన్ని ఆ గ్రామంలోని ఔభళేశ్వరునికి అఖండ తిరువళికెకుగాను సమర్పించినట్లు తెలియజేస్తూ వుంది.

ఆవులు మొదలైన పశువులు, ఇతర చరాస్తులపై కూడా పన్నులుండేవి. శా.శ. 1454 (క్రీ.శ. 1531) నాటి మద్దూరు శాసనం[136], మద్దూరు గ్రామంలోని కాపులు చెల్లించే ఆవు, పసరం, పెయలు మొదలైన సుంకాలను పేర్కొంటూ వుంది. శా.శ. 1415 (క్రీ.శ. 1493) నాటి ముత్తుకూరు శాసనం[137] ఇమ్మడి నరసింగదేవరాయల భృత్యుడైన నరసనాయకుని బంటు, బొక్కసం తిమ్మనాయుని మరది సుంకయ్య, ముత్తుకూరికి చెల్లే స్థళ సుంకం, పెండ్లి, బండి, గుఱ్ఱము, తోల, కొలుచు మొదలైన సుంకాలను ముత్తుకూరి చెన్నకేశ్వరుని తిరువారాధనకు గాను ఇచ్చినట్లు తెలుపుతూ వుంది.

విజయనగర రాజుల కాలంలో, వివాహ సమయంలో వధూవరులనుండి పెండ్లి పన్నును వసూలు చేసేవారు. కృష్ణదేవరాయల ఆనతి ప్రకారం అతని మంత్రి సాళువ తిమ్మరుసు ఘనగిరి, గుత్తి, కందనవోలు, గండికోట, సిద్ధవటం, చంద్రగిరి, నాగమంగళం, ముల్నాడు (ములకనాడు), రాయదుర్గం సీమలలో వివాహ సమయంలో వధూవరులు చెల్లించవలసిన పెండ్లి సుంకాన్ని రద్దుచేసినట్లు శా.శ. 1432 (క్రీ.శ. 1510) నాటి రామేశ్వరం శాసనం[138] తెలియజేస్తూ వుంది. కాని కృష్ణదేవరాయల తరువాత వచ్చిన రాజులు ఈ పన్నును పునరుద్ధ రించినారు. సదాశివరాయల కాలంలో కర్ణగొల్లలు పెండ్లివర్తనను చెల్లించలేక పెండ్లి కాకుండానే వృద్ధులయి వుంటున్నట్లు తెలుసుకొని, సదాశివరాయులు, అతని ప్రతినిధి ఆళియ రామరాయలు ఈ పెండ్లివర్తనను పదహారు మాడలకు తగ్గించి శా.శ. 1468 (క్రీ.శ. 1546)లో తామ్ర శాసనాన్ని జారీ చేసినట్లు సంజీవపల్లె కైఫీయత్తు[139] తెలుపుతూ వుంది.

పైన వివరించబడిన పన్నులే కాక, అడుగుకోళ్లు, బెడిగె, అక్కుల కానుక, అదువ

సుంకలు, కట్టిగ, తలారిక, వెట్టి, వేమి, అసగ్రయాలు, తోల, సాహజం, వెటికూటం, అసవెచ్చం, బట్టి, తలాపనం మొదలైన పన్నులను; మహారాచ, దేవతా ప్రయోజనాల కోసం కానికె, కప్పాలను ప్రజలు చెల్లించవలసి వచ్చేది.

విజయనగర రాజుల కాలంలోని పన్నులలో సిద్ధాయాలు, స్థావరాలు, కానికెలు, కట్నాలు, సుంకాలు, సువర్ణాదాయాలు, వర్తనలు మొదలైన విభాగాలు కనిపిస్తున్నాయి. సందర్భాన్ని బట్టి ఊహించడం తప్ప ఏ విభాగానికి చెందిన పన్నులను ఎందుకు విధించేవారో తెలుసుకోవడానికి ఖచ్చితమైన ఆధారాలు లభించడం లేదు.

పన్నులు వసూలుచేసే హక్కును ప్రభుత్వం గుత్తకు ఇచ్చేది. ఈ హక్కును పొందిన వారిని సుంకరులు[140] లేదా సుంఖమణియగాండ్లు[141] అనేవారు. సుంకరులు పన్నులను వసూలుచేసే హక్కును పొందిన ప్రాంతాన్ని సుంఖమాగాణి[142] లేదా సుంకటణ్యం[143] అనేవారు.

# సూచికలు

1. I.A.P., C.D. Part I, No. I.
2. Ibid., Part III No. 28
3. Ibid., No. 43
4. Ibid., No 115
5. Ibid., No. 45
6. Ibid., No. 134
7. Ibid., No. 7
8. Ibid., No. 55
9. Ibid., No. 51
10. Ibid., No. 243
11. Ibid., No. 19
12. Ibid., No. 84
13. Ibid., No. 172
14. Ibid., No. 16
15. Ibid., No. 90
16. Ibid., No. 60
17. Ibid., No. 125
18. Ibid., Part I, No. 67
19. Ibid., Part II, No. 88
20. Ibid., No. 126
21. Ibid., No. 243
22. Ibid., No. 280
23. Ibid., No. 102
24. Ibid., No. 127
25. Ibid., No. 279
26. Ibid., Part I, No. 122
27. Ibid., No. 111
28. Ibid., Part II, No. 124
29. Ibid., No. 244
30. Ibid., No. 154
31. Ibid., No. 97
32. Ibid., No. 28
33. Ibid., Part I, No. 14
34. Ibid., No. 91
35. Ibid., Part II, No. 124
36. Ibid., No. 80
37. Ibid., No. 220
38. Haripada Chakraborti : India As Reflected in the Inscriptions of Gupta Period, 1978. p. 43
39. I.A.P., C.D., Part II, No. 134
40. Ibid., No. 263
41. Ibid., No. 244
42. Ibid., No. 92
43. Ibid., No. 209
44. Ibid., No. 174
45. డా॥ బి. ప్రసాదరావు, కె. వెంకటరెడ్డి : వ్యవసాయం అర్థశాస్త్రము; తెలుగు అకాడమి, 1973, పుట. 307-8.
46. I.A.P., C.D., Part I, No. 159
47. పిశుపాటి శ్రీరామశర్మ : ఆంధ్రదేశ చరిత్ర – సంస్కృతి; తెలుగు అకాడమి, 1986, పుట. 182.
48. C.I.I., Vol. III, p. 58
49. I.A.P., C.D., Part II, No. 134
50. Ibid., No. 265
51. Ibid, No. 29
52. Ibid., No. 53
53. S.I.I., Vol. X, No. 448
    యన్.వి. రమణయ్య : కడప శిలా శాసనములు వగయురా; పుట. 976-77
54. I.A.P., C.D., Part II, No. 106
55. Ibid., No. 220
56. Ibid., No. 254
57. Ibid., Part I, No. 17

58. Ibid., No. 48
59. Ibid., No. 40
60. Ibid., No. 111
61. Ibid., No. 113
62. Ibid., No. 113
63. Ibid., Part II, No. 11
64. Ibid., No. 14
65. Ibid., No. 19
66. Ibid., No. 54
67. Ibid., No. 34
68. Ibid., No. 84
69. Ibid., No. 216
70. Ibid., Nos. 75, 110, 191
71. Ibid., Nos. 75, 110
72. Ibid., Nos. 25, 45, 124
73. Ibid., No. 90
74. Ibid., No. 109, 110, 111
75. L.R. Vol. IX, p. 407
76. L.R., Vol. V, pp. 77-78
77. I.A.P., C.D., Part II, No. 120
78. కంభంపాటి సత్యనారాయణ : ఆంధ్రుల సంస్కృతి చరిత్ర; రెండవ సంపుటం, పుట. 224
79. I – 335 & 337
80. 1 – 10 – 18 – 1.
81. VII – 2, 35
82. XIX, 1
83. XVIII, 48
84. శాంతిపర్వం, 72, 15
85. శాంతిపర్వం, 72, 16, 19.
86. V, 2.
87. VII, 129.
88. V. 84
89. I – 242 – 43
90. VII, 5.
91. శాంతిపర్వం, 126, 9.
92. I.A.P., C.D., Part II, No. 120
93. E.I., Vol. XXX, pp. 280-84; A.R. No. 446 of 1940-41.
94. I.A.P., C.D., Part I, No. 103
95. Ibid., No. 104
96. Ibid., No. 107
97. Ibid., No. 153
98. Ibid., No. 157
99. యన్.వి. రమణయ్య : పుర్వోద్ధృతము; పుట. 903
100. I.A.P., C.D., Part II, No. 102
101. Ibid., No. 127
102. కావలి బొర్రయ్య : అరవణ వ్యవహార తంత్రం, Mackenzie Records, Vol. 154 (Fd 1. 22-28)
103. I.A.P., C.D., Part II, No. 38
104. కె. శ్రీనివాసులు : గండికోట సీమ చరిత్ర – సంస్కృతి; పుట. 104
105. I.A.P., C.D., Part II, No. 178
106. Ibid., No. 179
107. Ibid., No. 194
108. Ibid., NO. 122
109. Ibid., No. 137
110. Ibid., No. 205
111. Ibid., No. 213
112. Ibid., No. 217
113. Ibid. No. 224
114. 3–245
115. I.A.P., C.D., Part II, Nos. 116 & 117
116. Ibid., No. 166
117. Ibid., Part III, No. 143
118. Ibid., Part II, No. 137
119. Ibid., No. 187

120. Ibid., No. 137
121. Ibid., Part II, No. 187
122. Ibid., No. 187
123. Ibid., No. 51
124. Ibid., No. 88
125. Ibid., No. 191
126. Ibid., Nos. 109, 110, 111
127. Ibid., No. 139
128. Ibid., No. 43
129. Ibid., No. 124
130. Ibid., No. 52
131. Ibid., No. 135
132. Ibid., No. 116
133. Ibid., No. 170
134. Ibid., No. 171
135. Ibid., No. 176
136. Ibid., No. 108
137. Ibid., No. 52
138. Ibid., No. 73
139. యన్.వి. రమణయ్య : పూర్వోద్ధృతము; పుట. 101 - 102.
140. I.A.P., C.D., Part II, No. 88
141. Ibid., No. 108
142. Ibid., No. 187
143. Ibid., No. 137

# ఐదవ అధ్యాయం

# ధార్మిక జీవనం

## 1. వైదిక ధర్మం

బ్రాహ్మణాల కాలంలో ఉచ్ఛస్థితిలో వుండిన వైదిక కర్మాచరణం, జ్ఞాన మార్గాన్ని బోధించిన ఉపనిషత్తుల కాలానికి క్రమంగా తగ్గుముఖం పట్టింది. జన్మ, కర్మ, ముక్తి సిద్ధాంతాలు సమాజంలోని కొన్ని ఉన్నత వర్గాలను ఆకర్షించినాయి. ఈ సమయంలోనే వైదిక కర్మలను నిరసిస్తూ జైన బౌద్ధాలు అవతరించినాయి. ఈశావాస్యం వంటి ఉపనిషత్తులు జ్ఞాన కర్మ సముచ్చయ వాదాన్ని బోధించినాయి. ఈ నేపథ్యంలో సామాన్య ప్రజలు అధిక వ్యయ ప్రయాసలతో కూడిన వైదిక కర్మాచరణానికి బదులుగా భారతీయ ఆధ్యాత్మిక జీవనంలో భాగమైన శివుడు, విష్ణువు మొదలైన పౌరాణిక దేవతలను పూజించడం ప్రారంభమైంది. ఒక్కొక్క దేవతారాధనకు సంబంధించి ప్రత్యేకమైన సంప్రదాయాలు మొలకెత్తినాయి. అనుభూతి ప్రధానమైన, సులభతరమైన ఈ ముక్తిమార్గాలు సమాజంలో ప్రాచుర్యాన్ని పొందినాయి. ఈ విధమైన ఆధ్యాత్మిక విప్లవం సంభవించినప్పటికీ వైదిక కర్మాచరణం నశించలేదు. సనాతన ధర్మానికి వేదాలు మూలస్తంభాలనే భావన ఈనాటికీ భారతీయ సంప్రదాయంలో చెక్కు చెదరలేదు.

ఈ జిల్లా ప్రాంతాన్ని పరిపాలించిన రాజులు వైదిక క్రతువులను నిర్వహించినట్లు శాసనాధారాలు లేవు. వీరిలో ఎక్కువమంది చతుర్థ వర్ణజులు కావడం ఇందుకు కారణం కావచ్చు. రేనాటి చోళులు, వైదుంబులు తాము క్షత్రియులమని చెప్పుకున్నప్పటికీ, వీరు వైదిక క్రతువులను నిర్వహించినట్లు శాసనాలు తెలియజేయడం లేదు. కాని వీరి కాలంనాటి శాసనాలలోని, 'తేని రక్షించి కుడిపినవాణ్డ్ర అడుగు అడుగు అస్వమేదమ్బున పల్లమ్బు ఇచ్చన్'[1], 'నేల నిల్పినవారికి అస్వమేదంబున ఫలంబు'[2], 'నడిపిన వారికి నస్వమేదంబున ఫలంబు'[3] - మొదలైన ఆశీర్వాక్యాలు నాటి పరిపాలకులు, ప్రజలు వైదిక కర్మాచరణం ఉత్తమ ఫలప్రదమని, అశ్వమేధ యాగంవల్ల సర్వోత్తమ ఫలం సిద్ధిస్తుందని విశ్వసించినట్లు తెలుపుతున్నాయి.

వైదుంబ వంశస్థుడైన ఇరిగెయ మహారాజు వైదిక సంప్రదాయంలో భాగమైన స్మృతులు నిర్దేశించిన విధంగా తమ తండ్రి బెజయిత మహారాజుకు ఏకోద్దిష్ట శ్రాద్ధాన్ని నిర్వహించినట్లు శా.శ. 898 (క్రీ.శ. 976) నాటి అనిమెల శాసనంవల్ల[4] తెలుస్తూ వుంది.

చాళుక్యులు, వారి సామంతులు, వేదాధ్యయనాన్ని, వైదిక క్రతువుల నిర్వహణను ప్రోత్సహించడం కోసం బ్రాహ్మణులకు దానాలను ఇచ్చినారు. త్రిభువనమల్లదేవునికి (అరవ విక్రమాదిత్యునికి) సంబంధించిన చాళుక్య విక్రమ శకం 49, శా.శ. 1046, క్రోధి సంవత్సర ఉత్తరాయణ సంక్రాంతి (క్రీ.శ. 1124, డిసెంబర్ 24వ తేదీ) నాటి పెద్ద ముడియం శాసనం[5], త్రిభువనమల్లదేవునికి సామంతుడైన చిద్దణచోళ మహారాజు, ముదివేము గ్రామాన్ని "అగ్నిష్టోమాద్యనేక యాగావబృథస్నాన పవిత్రీభూతులు, సకల వేదవిద్యాధ్యయన యజన యాజనాది షట్కర్మ నిరతులు, మన్వాది పురాణమునిగణ విశుద్ధ మార్గవర్తులు" - అయిన మహాజనాలకు అగ్రహారంగా ఇచ్చినట్లు తెలుపుతూ వుంది.

కాకతీయ సామ్రాజ్య పతనానంతరం ఆంధ్రదేశంలో ముస్లిం పరిపాలకుల దాడులవల్ల వైదిక కర్మాచరణం కుంటుపడింది. విజయనగర రాజుల కాలంలో వైదిక ధర్మం, భారతీయ తాత్త్విక చింతనలు పూర్వ ప్రాభవాన్ని సంతరించుకున్నాయి. ఈ కాలంలో కొందరు ఆచార్యులు 'వేదమార్గ ప్రతిష్ఠాచార్య', 'షడ్దర్శన స్థాపనాచార్య', వంటి బిరుదాలను ధరించడం పై విషయాన్ని ధ్రువీకరిస్తూ వుంది. శా.శ. 1292, సాధారణ సంవత్సర కార్తిక శుద్ధ పాడ్యమి, గురువారం నాటి చిన్నదాసరిపల్లె శాసనంలో[6] నురెగాచార్యులు, సదాశివరాయల కాలం నాటి కాలనిర్ణయం లేని మొయిళ్లకాలువ శాసనంలో[7] తిరుమలగిరి తాతాచార్యులు, వేదమార్గ ప్రతిష్ఠాచార్యులుగా పేర్కొనబడినారు. శా.శ. 1326, పార్థివ సంవత్సర [కార్తి]క శుద్ధ పంచమి, సోమవారం నాటి చియ్యవరం శాసనంలో[8] నల్లాన్ చక్రవర్తుల కుమారుడు తివంగర చక్రవర్తులు షడ్దర్శన స్థాపనాచార్యుడుగా పేర్కొనబడినాడు.

శా.శ. 1448, పార్థివ సంవత్సర పుష్య శుద్ధ పౌర్ణమి (క్రీ.శ. 1525) నాటి కత్తెరగండ్ల శాసనం[9] సర్వక్రతు వాజపేయయాజులయిన పడవిటి విరూపాక్ష దీక్షితుల కుమారుడు అన్నాజియ్యవారిని పేర్కొంటూ వుంది. శా.శ. 1466 క్రోధి సంవత్సర ఆషాఢ శుద్ధ పౌర్ణమి (క్రీ.శ. 1544) నాటి కొప్పోలు శాసనం[10] యజనాది షట్కర్మ నిరతులైన కృష్ణరాయపుర ప్రతినామక కొప్పోలి అగ్రహార స్థితాశేష విద్వన్మహాజనాలను పేర్కొంటూ వుంది. శా.శ. 1446, క్రోధి సంవత్సర మాఘ శుద్ధ సప్తమి సోమవారం (క్రీ.శ. 1545, జనవరి, 19వ తేదీ) నాటి మోపూరు శాసనం[11], గండికోట సీమలోని దేవస్థానాలు అగ్రహారాలలో వుండే నానాగోత్ర నానాసూత్ర నానాశాఖాధ్యాయ పవిత్రులైన అశేష విద్వన్మహాజనాలు పుత్ర పౌత్ర పారంపర్యంగా క్రత్వాది అనుష్ఠానాలు చేసుకొని సుఖంగా వుండడంకోసం నంద్యాల తిమ్మయదేవ మహారాజు ఆయా గ్రామాలలో పన్నులన్నింటిని రథసప్తమి పుణ్యకాలంలో సర్వమాన్యం చేసినట్లు తెలుపుతూ వుంది.

## 2. జైన ధర్మం★

ఆంధ్రదేశంలో జైనం ఎప్పుడు ప్రవేశించిందో చెప్పడం కష్టం. క్రీ.పూ. నాలుగవ శతాబ్దంలో మౌర్య చంద్రగుప్తుని కాలంలో ఉత్తర భారతదేశంలో ద్వాదశవర్ష క్షామం సంభవించి నప్పుడు, భద్రబాహువు కొందరు జైనాచార్యులతో దక్షిణాపథానికి తరలివచ్చినట్లు జైన సంప్రదాయం తెలుపుతూ వుంది. అందువల్ల క్రీ.పూ. నాలుగవ శతాబ్దంలో జైనం ఆంధ్ర దేశంలో ప్రవేశించినట్లు భావించవచ్చు. కాని, మహావీరుడే కళింగ దేశానికి వచ్చి జైన ధర్మాన్ని ప్రచారం చేసినాడని, అందువల్ల భద్రబాహువుకు పూర్వమే ఆంధ్ర దేశంలో జైనం ప్రవేశించిందని కొందరి అభిప్రాయం. పన్నెండవ తీర్థంకరుడైన వసుపూజ్యుని కాలంలోనే ఆంధ్ర దేశంలో జైనం వ్యాపించిందని ధర్మామృతమనే జైన కావ్యం ద్వారా తెలుస్తూ వుంది.

కడప జిల్లాలో (గంగ) పేరూరుకు చెందిన సింహనంది పేరు జైన సంప్రదాయంలో ప్రసిద్ధమైంది. సింహనంది జైన తాత్త్వికచింతనతోపాటు కళలలో కూడా విశేషమైన పరిజ్ఞానాన్ని సంపాదించి తన స్థావరాన్ని రాజులకు, వారి సామంతులకు నిత్యయాత్రాస్థలంగా మలచినాడు. దడిగ, మాధవులనే ఇద్దరు ఇక్ష్వాకు రాజకుమారులు క్రీ.శ. 3 లేక 4వ శతాబ్ది చివరి భాగంలో అయోధ్య నుండి దక్షిణా పథానికి వలసవచ్చి, పేరూరులో ఆచార్య సింహనందిని దర్శించినారు. సింహనంది వారికి కళలలో శిక్షణ ఇచ్చినాడు. ఇతని దర్శకత్వంలోనే ఈ రాజకుమారులు కోలారు పరిసర ప్రాంతాలలో గాంగ రాజ్యాన్ని స్థాపించినారు. ఇది శ్రీకృష్ణదేవరాయల కాలం వరకు పశ్చిమ గాంగుల రాజ్యానికి కేంద్రకంగా వుండేది.

ఆంధ్రదేశ చరిత్రలో మొట్టమొదటిసారిగా చైత్యాలయ నిర్మాణం పేరూరులో జరిగినట్లు మైసూరు శాసనం వల్ల తెలుస్తూ వుంది[12]. ఈ పేరు మొదట బౌద్ధ దేవాలయాలను సూచించేది. తర్వాతి కాలంలో హిందువులు, జైనులు దీన్ని ఉపయోగించినారు. చైత్యాలయాలు ఇటుకతో నిర్మించబడినాయి. ఇవి శిథిలమౌతున్న తరుణంలో గ్రామస్థులు వీటిని ఇళ్ల కోసం ఆక్రమించుకున్నారు.

చాళుక్యరాజు రెండవ పులకేశి (క్రీ.శ. 609-627) కాలంలో కడప జిల్లాలో కొందరు జైనాచార్యులు వుండేవారు. క్రీ.శ. 7వ శతాబ్దంలో పెనికెలపాడులోని 'సన్యాసిగుండు' క్రింద వుండే చిన్న గుహలో వృషభుడనే గొప్ప జైనముని వుండేవాడు. ఇతడు తన పాండిత్యంతో, వాదనాబలంతో ఎందరో విద్యార్థులను ఆకట్టుకొని తనవైపుకు ఆకర్షించుకున్నాడు. ఇతడు కొండకుండాచార్యుని అన్వయానికి చెందినవాడు. కొండకుండాన్వయం సునిశిత వాదనా పటిమకు, జైన నియమావళికి ప్రసిద్ధి చెందింది. కొండకుండాచార్యుడు తన రచనల్లో శౌరసేనీ ప్రాకృతాన్ని వాడగా, వృషభాచార్యుడు సంస్కృతాన్ని ఉపయోగించినాడు. ఇతడు అనుష్టుప్

★ ఈ విభాగంలోని విషయాలకు ఆధారం, యస్. గోపాలకృష్ణమూర్తి గారి **'Jain Vestieges in Andhra'** అనే గ్రంథం.

ఛందస్సులో కొన్ని పద్య గ్రంథాలను కూడా రచించినట్లు తెలుస్తూ వుంది.

ఈ జిల్లాలోని సిద్ధవటం, అర్యవటానికి సమకాలికమైన జైన క్షేత్రం. గంగపేరూరు, పెద్ద ముడియం, దొమ్మరి నంద్యాల, ఇంకా కొన్ని మరుగున పడిపోయిన జైన క్షేత్రాలు ఈ కాలంలోనే స్థాపించబడినాయి. శ్రావణబెళగొళ నుండి వచ్చిన సన్యాసులు ఈ క్షేత్రాలను స్థాపించినారు. సిద్ధవటం క్రీ.శ. 12వ శతాబ్ది వరకు జైన క్షేత్రంగా వుండినట్లు తాడిపత్రిలోని శా.శ. 1130 నాటి ఒక శాసనం[13] ద్వారా తెలుస్తూ వుంది. తరువాతి కాలంలో దీనిని శైవులు ఆక్రమించుకున్నారు. దొమ్మరి నంద్యాలలో లభించిన జైన తీర్థంకరుని విగ్రహం మైలవరంలోని పురావస్తు ప్రదర్శనశాలకు తరలించబడింది.

రాష్ట్రకూట రాజు నిత్యవర్ష ఇంద్రుని కాలంలో (క్రీ.శ. 914-17) దానవులపాడు ప్రముఖ జైన కేంద్రంగా విలసిల్లింది. ఇక్కడ పెన్నానది ఒడ్డులో సుమారు ఒక మైలు పొడవున రాతికట్టను జైనులు నిర్మించినారు. ప్రజలు నదిలోకి దిగడానికి రెండు వరుసల మెట్లు కట్టించినారు. జైనులు ఈ ప్రదేశం నుండి నిష్క్రమించిన తరువాత ప్రతి సంవత్సరం వీచే ఋతుపవనాల గాలులవల్ల పట్టణమంతా ఏటి ఇసుకలో పూడిపోయింది. ప్రస్తుతం దానవులపాడుగా పిలువబడుతున్న (పూర్వ నామం 'కురుమారి') ఈ ప్రదేశంలో కీ.శే. జయంతి రామయ్య పంతులు గారు క్రీ.శ. 1903లో త్రవ్వకాలు జరిపించి ఈ జైన క్షేత్ర అవశేషాలను వెలుగులోకి తెచ్చినారు. ఈ త్రవ్వకాలలో రెండు సర్వతోభద్రికలు, ఒక తీర్థంకరుని పానవట్టం, పది అడుగుల ఎత్తున్న రెండు పార్శ్వనాథ విగ్రహాలు, ఒక పద్మావతి విగ్రహం వెలికి తియ్యబడినాయి. ప్రస్తుతం ఒక పార్శ్వనాథ విగ్రహం మాత్రం ఇక్కడ వుంది. మిగిలినవన్నీ మద్రాసు పురావస్తు ప్రదర్శన శాలలోని జైన విభాగంలో భద్రపరచబడినాయి.

దానవులపాడులోని ఒక శాసనం[14] నిత్యవర్ష ఇంద్రుడు శాంతినాథుని స్నాపనవిధి కోసం శిలాపీఠాన్ని నిర్మింపజేసినట్లు తెలుపుతూ వుంది. శాంతినాథుడు పదహారవ తీర్థంకరుడు. కాబట్టి మిగిలిన తీర్థంకరుల విగ్రహాలు కూడా శిలాపీఠాన్ని కలిగి అంతకుముందే ప్రతిష్ఠించబడి వుండవచ్చునని కొందరు పండితులు అభిప్రాయపడుతున్నారు.

జైనులు శిలా శాసనాలు వేయించనందువల్ల దక్షిణ భారతదేశంలో జైన ధర్మ వ్యాప్తిని గురించి తెలుసుకోవడం కష్టం. రాష్ట్రకూటులు ఆ లోపాన్ని తీర్చి దానవులపాడు, ఎల్లోరా మొదలైన ప్రదేశాలలో అనేక శాసనాలు వేయించినారు.

సమాధి శిలలను స్థాపించడం జైన సంప్రదాయం. జైన గురువుల కోసం, కొన్ని సందర్భాలలో వారి శిష్యుల కోసం సమాధి శిలలు స్థాపించబడేవి. శిష్యుల కోసం స్థాపించిన సమాధి శిలల పైభాగంలో తీర్థంకరుని ప్రతిమ, మధ్యభాగంలో శిష్యుల (సాధారణంగా దంపతులు) ప్రతిమలు చెక్కబడతాయి మిగిలిన మూడవవంతు శిలాభాగంలో శాసనం చెక్కబడుతుంది. ఇందులో శిష్యులు (లేదా భక్తులు) జైన సంప్రదాయంలోని ఏ అన్వయానికి, గచ్ఛ లేదా గణానికి సంబంధించినవారో చెప్పబడుతుంది. ఆ శిల నిశిధి (సమాధి శిల) అనే

విషయం కూడా పేర్కొనబడుతుంది. ఇందులో మరణకాలం, శాసన కాలాలను పరిహరించడం ప్రత్యేకంగా గుర్తించదగింది. జైనులు శాలివాహన శకాన్ని ఉపయోగించరు. సమాధి శిలలపైగాని, ప్రతిమల కోసం తయారుచేసిన పాదపీఠాల మీదకాని విక్రమ శకాన్ని కూడా పేర్కొనలేదు. సమాధి శిలలమీది తీర్థంకర ప్రతిమలు వాటితోపాటు సర్వకాలాలలోనూ వుండవలసిన ప్రతీహార్యాలు లేకుండా నిరాడంబరంగా వుంటాయి. దానవులపాడులోని ఒక తీర్థంకరుని తలపై పాముపడగ దానిపై త్రిఛత్రం చిత్రించబడినాయి. ఇంకొక తీర్థంకరుని తలపై పడగలను విప్పిన పంచశీర్ష సర్పం, విగ్రహ పీఠానికి క్రింద సుపార్శ్వనాథుని లాంఛనమైన 'స్వస్తిక' చిహ్నం చిత్రించబడినాయి. ఇటువంటి ఇతర శిలలమీద చంద్రప్రభుని లాంఛనమైన 'నెలవంక'ను, వర్థమానుని లాంఛనమైన 'సింహాన్ని' కూడా మనం చూడవచ్చు.

తీర్థంకరులందరి జీవిత చరిత్రలు ప్రసిద్ధిలో వుండేవి. భక్తులు తమ తమ అనుభవాలనుబట్టి ఒక్కొక్కరిని సేవించేవారు.

## 3. బౌద్ధ ధర్మం

హ్యూన్‌త్సాంగ్ తన భారతదేశ పర్యటనలో దక్షిణా పథానికి వచ్చినపుడు రేనాటి చోళుల రాజ్యం నుండి కాంచీ పట్టణానికి పోతూ వారి రాజ్యంలోవున్న సంఘారామాలను గురించి తెలుపుతూ రాజధాని నగరానికి ఆగ్నేయ దిశలో కొద్దిదూరంలో అశోక చక్రవర్తిచే నిర్మించబడిన బౌద్ధ స్తూపం వున్నట్లు పేర్కొన్నాడు[15]. ఈ స్తూపం నందలూరు సమీపంలోని ఆడపూరు వద్ద వుండే బౌద్ధ స్తూపం. ఆడపూరు సమీపంలో బాహుదా నదీ తీరంలో వుండే 'లంజకనుమగుట్ట' అనే కొండమీద జరిపిన త్రవ్వకాలలో బౌద్ధ ధర్మ వ్యాప్తిని సూచించే అనేక అవశేషాలు, కట్టడాలు బయల్పడినాయి. వీటిలో చైత్యగృహం, రాళ్లతో నిర్మించబడి సున్నపుపూత కలిగిన అనేక వలయాకార స్తూపాలు, సోపానాలు, బుద్ధపాదం, శాతవాహనులకు సంబంధించిన సుమారు పదహారు వందల సీసపు నాణేలు, మృణ్మయ శకలాలు ముఖ్యమైనవి. బుద్ధపాదంపై క్రీ.శ. మొదటి లేదా రెండవ శతాబ్ది నాటి బ్రాహ్మీ శాసనం వుంది. ఆడపూరు స్తూపం రాయలసీమలో బౌద్ధ ధర్మ వ్యాప్తిని సూచిస్తున్న మొదటి స్థలం.

## 4. శైవ ధర్మం

కడప జిల్లాలో ప్రస్తుత అధ్యయన పరిధిలోని కాలంలో వ్యాప్తిలో వుండిన ధార్మిక సంప్రదాయాలలో శైవం ప్రధానమైందిగా కనిపిస్తుంది. శైవధర్మ వ్యాప్తికి అనేక కారణాలున్నాయి. శైవధర్మంలోని భిన్న శాఖలకు చెందిన ఆచార్యులు ప్రజలలో తమ తమ సంప్రదాయాలను వ్యాపింపజేయడానికి కృషి చేసినారు. అంతేకాక రాజులు, వారి సామంతులు, అధికారులు శైవాన్ని ప్రోత్సహించడం ఇందుకు ప్రధాన కారణం.

ఈ జిల్లా ప్రాంతాన్ని పరిపాలించిన రేనాటిచోళులు శైవధర్మాన్ని అనుసరించినారు. పుణ్యకుమారుని దొమ్మరి నంద్యాల తామ్ర శాసనంలో[16] శివుడు లకుటపాణిగా వర్ణించబడినాడు.

శిల్ప శాస్త్రంలో శివ ప్రతిమా వర్ణనలో లకుటం (లగుడం) ఆయుధంగా చెప్పబడలేదు. లకుటపాణి అయిన శివుణ్ణి పశుపతిగా భావిస్తే రేనాటి చోళులు ఆకాలంలో వ్యాప్తిలో వుండిన పాశుపత సంప్రదాయాన్ని అనుసరించినారని చెప్పవచ్చు. కాని అంశుమద్భేదాగమంలోని కాశ్యప శిల్పం పశుపతిని లగుడపాణిగా వర్ణించడం లేదు.

శ్రీకంఠచోళుని మద్రాస్ మ్యూజియం తామ్ర శాసనం[17] కూడా శివస్తుతితో ప్రారంభమైంది. శివభక్తి తత్పరుడైన శ్రీకంఠచోళాధిరాజు శ్రీ బాలశక్తి గురువుకు మందరం గ్రామాన్ని దానమిచ్చినట్లు పై శాసనం తెలుపుతూ వుంది. బాలశక్తి పాశుపత శైవాచార్యుడు కావచ్చు.

రేనాటిచోళుల రాణులు కూడ శివభక్తి తత్పరలై శివాలయాలకు దానాలను ఇచ్చినారు. క్రీ.శ. 7వ శతాబ్ది నాటి రామేశ్వరం శాసనం[18] పోర్ముఖరామ పుణ్యకుమార పృథివీ వల్లభ చోళిమహారాజుల దేవేరి వసన్తిపోతి చోళి మహాదేవి వసన్తీశ్వరానికి రెండు తోటలు సహితంగా రాచమానంలో మున్నూరు మరుతుర్ల నేలను ఇచ్చినట్లు తెలుపుతూ వుంది.

రాష్ట్రకూటులు, వారి సామంతులు కూడ శైవ ధర్మాన్ని అవలంబించినారు. నిత్యవర్ష పృథివీ వల్లభునికి సామంతునిగా ముల్కి అయ్యూరునాడును పరిపాలిస్తున్న పల్లవధీరుడు ఏఱ్కొంటీశ్వరాయతనానికి చత్పథ (చతుష్పథ/సత్పథ?) ద్వారబంధ మండపాన్ని కట్టించి దేవాలయానికి సుధాకర్మ చేయించినట్లు శా.శ. 847, పార్థివ సంవత్సర ఉత్తరాయణ సంక్రాంతి (క్రీ.శ. 925, డిసెంబర్, 23వ తేదీ శుక్రవారం) నాటి కమలాపురం శాసనం[19] నమోదు చేసింది. రామేశ్వరంలోని కాలనిర్ణయం లేని ఒక శాసనం[20] రాష్ట్రకూటరాజు మూడవ కృష్ణునికి మహాసామంతుడైన కన్నయ్య రామేశ్వర దేవునికి కొన్ని పన్నులను దానంగా ఇచ్చినట్లు తెలుపుతూ వుంది. ఈ శాసనంలో మూడవ కృష్ణుడు శివభక్తి తత్పరుడుగా పేర్కొనబడినాడు.

రేనాటిచోళుల తరువాత ఈ జిల్లా ప్రాంతాన్ని పరిపాలించిన వైదుంబులు శైవ ధర్మావలంబులే. వీరికి సంబంధించిన తొలి తరం శాసనాలలో ఎక్కువ భాగం వీరగల్లులు కావడంవల్ల వీరు అవలంబించిన ధార్మిక సంప్రదాయాన్ని గురించి తెలియడం లేదు. కాని తరువాతి శాసనాలు వీరు శైవ ధర్మాన్ని అవలంబించినట్లు తెలుపుతున్నాయి. మలి వైదుంబులు కలుకడపురవరాధీశ్వరులమని, సిద్ధేశ్వర దివ్యశ్రీపాదపద్మారాధకులమని చెప్పకున్నారు. వీరు కలుకడలో సిద్ధేశ్వర దేవాలయాన్ని నిర్మించినారు. వైదుంబ వంశానికి చెందిన కలిగత్రిణేత్ర భీమ మహారాజు పాలగిరిలోని సమర్థేశ్వర దేవాలయాన్ని జీర్ణోద్ధరణం చేసి, అంతకు మునుపు రాష్ట్రకూటరాజు అకాలవర్ష కన్నారదేవుడు ఆ దేవాలయానికి ఇచ్చిన ఎనభై ఖణ్డుగల భూదానాన్ని పునరుద్ధరించడమే గాక తానుకూడ రెండువందల మత్తరుల భూమిని దానమిచ్చినట్లు, శా.శ. 978, దుర్మతి సంవత్సర ఆషాఢ శుద్ధ త్రయోదశి, గురువారం నాటి పాలగిరి శాసనం[21] తెలుపుతూ వుంది. శా.శ. 1154, విజయ సంవత్సర వైశాఖ శుద్ధ సప్తమి, ఆదివారం. (క్రీ.శ. 1234, ఏప్రెల్, 17వ తేదీ) నాటి అబ్బవరం శాసనం[22] వైదుంబ వంశానికి చెందిన రాయదేవ మహారాజును సిద్ధవట దేవర దివ్యశ్రీపాదపద్మారాధకుడని ప్రశంసించింది. శా.శ. 1367, క్రోధన

సంవత్సర వైశాఖ శుద్ధ దశమి, గురువారం (క్రీ.శ. 1445, ఏప్రిల్, 17వ తేదీ, ఆదివారం?) నాటి ఎగువ రాచపల్లి శాసనంలో[23] ఆవుదుంబరాభరణుడు, కలుకడపురవరాధీశ్వరుడైన తిరుమలేశ్వర నాయకుడు సిద్ధనాథదేవర దివ్యశ్రీపాదపద్మారాధకుడుగా పేర్కొనబడినాడు.

తెలుగుచోడులు, వారి సామంతులు శైవ ధర్మాన్ని అనుసరించినారు. శా.శ. 115[9], హేవిళంబి సంవత్సర మాఘ శుద్ధ ఏకాదశి, సోమవారం (క్రీ.శ. 1238, జనవరి, 27వ తేదీ) నాటి ఓగూరు శాసనం[24] తెలుగుచోడ రాజు గండగోపాల తిరుకాళత్తిదేవచోడ మహారాజుకు సామంతుడయిన వీరనారాయణ కామయదేవ మహారాజుకు నిజభృత్యుడయిన నల్లసూరప నాహిడు ఒంగూరులో మల్లినాథ దేవర ప్రతిష్ఠ చేసి ఆ దేవర అంగ భోగానికి, ధూప దీప నైవేద్యాలకుగాను కొన్ని భూములను దానమిచ్చినట్లు తెలుపుతూ వుంది. తెలుగుచోడ వంశానికే చెందిన ముదిగొండచోడ మహారాజు, పెద్దపాక మహేశ్వర భట్టారనికి అర్చనాభోగంకోసం ఉత్తరాయణ సంక్రాంతినాడు కొంత భూమిని ధారాపూర్వకంగా ఇచ్చినట్లు తాళ్లపాకలోని కాల నిర్ణయం లేని ఒక శాసనంలో[25] నమోదు చేయబడింది.

పుష్పగిరిలోని క్రీ.శ. 13వ శతాబ్ది లక్షణాలున్న ఒక శాసనం[26] యాదవ వంశస్థుడైన సింగణదేవునికి ధండనాయకుడైన లక్ష్మీదేవ దండనాయకుడు పుష్పగిరిలోని వైద్యనాథ దేవుని అంగరంగ భోగాలకోసం కొన్ని దానాలను ఇచ్చినట్లు తెలుపుతూ వుంది.

కాకతీయులు, వారి సామంతులైన కాయస్థులు మొదలైనవారు శైవ ధర్మావలంబులే. కాయస్థ వంశస్థుడైన గండపెండార జన్నిగదేవ మహారాజు పుష్పగిరిలోని ఇంద్రేశ్వరుని అంగరంగ భోగాలకు తురుమిడ్లపాడు గ్రామాన్ని సిద్ధార్థి సంవత్సర వైశాఖ అక్ష తదియనాడు (శక సంవత్సరం పేర్కొనబడలేదు) ధారాపూర్వకం చేసినట్లు అదేరోజు జారీ చేయబడిన పుష్పగిరి శాసనం[27] తెలుపుతూ వుంది. శా.శ. 1226, క్రోధి సంవత్సర చైత్ర శుద్ధ సప్తమి, గురువారం (క్రీ.శ. 1304) నాటి వరికుంట శాసనంలో[28], అంబదేవ మహారాజుల కొడుకు త్రిపురారిదేవుడు శ్రీపర్వత దక్షిణద్వార సమస్తతీర్థ పరిపాలితుడైన శ్రీ సిద్ధనాథ దేవర అంగభోగానికి సకలి భూమిలోని వరికుంట గ్రామాన్ని చతుస్సీమాపర్యంతం సాద సుంకెణ షష్ఠాయ సహితంగా సర్వమాన్యంగా ధారాపూర్వకం చేసి ఆచంద్రార్కస్థాయి అయిన వృత్తిగా ఇచ్చినట్లు చెప్పబడింది.

కాయస్థుల పతనం తర్వాత కాకతీయుల ప్రతినిధిగా ఈ జిల్లా ప్రాంతాన్ని పరిపాలించిన జుట్టయలెంక గొంకారెడ్డి, తంగటూరులోని సిద్ధనాథ దేవర దీపారాధనకు ఒక గానుగను, అంగరంగ భోగాలకు మగమ అనే పన్నును ఇచ్చినట్లు రాక్షస సంవత్సరం (శక సంవత్సరం చెరిగిపోయింది. దాత కాలాన్ని బట్టి ఇది క్రీ.శ. 1315) నాటి తంగటూరు శాసనం[29] తెలుపుతూ వుంది. జుట్టయలెంక తమ్ముడు రుద్రయలెంక, సోమగ్రహణ కాలంలో తీర్థమాడి సకలి భూమిలోని చెండువాయి గ్రామాన్ని రాచశ్రోత్రియము, అరి, కోరు, పన్నులు, కానికెలు సహితమైన సకలాయ సహితంగా శ్రీ సిద్ధనాథ దేవునికి మధ్యాహ్న అవసరం ఉపాహారానికి గాను సర్వమాన్యంగా ధారాపూర్వకం చేసి ఇచ్చినట్లు శా.శ. 1241, సిద్ధార్థి సంవత్సర శ్రావణ

శుద్ధ పౌర్ణమి, బుధవారం (క్రీ.శ. 1319) నాటి చెండువాయి శాసనం[30] తెలుపుతూ వుంది.

విజయనగర సామ్రాజ్యపు తొలి పరిపాలకులు శైవ ధర్మాన్ని అనుసరించినారు. మల్లికార్జునరాయల కాలం నుండి ఈ చక్రవర్తులు వైష్ణవ ధర్మావలంబులైనప్పటికీ ఇతర ధార్మిక సంప్రదాయాలపట్ల సహనాన్ని ప్రదర్శించినారు. శివాలయాల నిర్వహణ కోసం వీరు కొన్ని దానాలను ఇచ్చినట్లు శాసనాలు తెలుపుతున్నాయి. వీరి పాలనలో కొందరు నాయంకరులు, అధికారులు శైవ ధర్మావలంబులై శివాలయాలకు దానాలను ఇచ్చినారు. శా.శ. 138[8], వ్యయ సంవత్సర ఫాల్గుణ అమావాస్య (క్రీ.శ. 1467, మార్చి 6వ తేదీ) నాటి ఎనుమల చింతల శాసనం[31], నిట్టూరి సీమ నాయంకరుడైన హులియ మల్లయదేవ మహారాజు నిట్టూరి నీలకంఠేశ్వర దేవరకు దీపారాధన, నైవేద్యం మొదలైన అంగరంగ భోగాలకుగాను ఒక గ్రామాన్ని (పేరు చెరిగిపోయింది) సూర్యగ్రహణ పుణ్యకాలంలో దానమిచ్చినట్లు తెలుపుతూ వుంది. శ్రీమన్మహామండలేశ్వర మేదిని మీసరగండకఠారి సాళువ ఇమ్మడి నరసింగరాయ మహారాయల పంపున నరసానాయనింగారు పృథ్వీరాజ్యం చేస్తూ వుండగా అతని నాయంకరుడైన గంటకన్నమ నాయుడు ములికినాటిలోని రామేశ్వరం రామయ లింగానికి నిత్యకృత్యమయిన పగలింటి అవసరం నైవేద్యం సాగించే నిమిత్తం స్థానం వారికి నాలుగు పుట్ల పందుము వరిమడిని సూర్యగ్రహణ పుణ్యకాలంలో ధారవోసి ఇచ్చినట్లు శా.శ. 1420, కాళయుక్తి సంవత్సర మార్గశిర అమావాస్య నాటి రామేశ్వరం శాసనంలో[32] నమోదు చేయబడింది.

శ్రీకృష్ణదేవరాయల కాలంలో చెన్నూరు, పోట్లదుర్తి సీమలకు నాయంకరుడైన జూపల్లి పెదసింగ మహీపాలుడు, చెన్నూరికి దక్షిణ భాగంలో నాగేశ్వర దేవునికి గర్భగృహ, ఘంటావేది, అంతరాళ మండప, రంగ మండప, నంది మండప, గోపురాలు కట్టించి వాటికి దక్షిణ భాగంలో మహాతటాకాన్ని నిర్మించి, ఆ నాగేశ్వర దేవునికి అఖండ దీపారాధన, త్రికాల నైవేద్యాలు, అమృతపళ్లు, గంధపుష్పాద్యుపచారాలు నడిచేటట్టు చెన్నూరులో కొన్ని భూములను తమ తండ్రి రామానాయునికి పుణ్యంగా శివరాత్రి పుణ్యకాలంలో సహిరణ్యోదక దానధారాపూర్వకంగా ఇచ్చినట్లు శా.శ. 1446, తారక సంవత్సర మాఘ బహుళ చతుర్దశి సోమవారం (క్రీ.శ. 1525) నాటి ఉప్పరపల్లి శాసనం[33] తెలుపుతూ వుంది.

తమ పూర్వీకుల పేరుతో లేదా తమ ప్రభువుల పేరుతో లేదా తమ పేరుతో శివాలయాలను నిర్మించే సంప్రదాయం వుండేది. శా.శ. 1176, ఆనంద సంవత్సర మాఘ శుద్ధ పంచమి, గురువారం (క్రీ.శ. 1255) నాటి పుష్పగిరి శాసనం[34], మోరటపట్టణాధీశ్వరుడైన అల్లుగి క్ష్మాపాలుని కుమార్తె హాచలాంబ, హాచలేశ్వరమనే శివాలయాన్ని; కాయస్థ వంశస్థుడైన గంగసేనాపతి భార్య కామలాబాయి, కామలేశ్వరమనే శివాలయాన్ని; పల్లవ వంశానికి చెందిన ఖండెరాయుడు, పల్లవేశ్వరమనే శివాలయాన్ని త్రికూటంగా నిర్మించినట్లు తెలుపుతూ వుంది. పుణ్యకుమారుని రాణి వసన్తిపోఱి చోఱి మహాదేవి జారీచేసిన రామేశ్వరం శాసనం[35], రామేశ్వర దేవాలయాన్ని వసన్తీశ్వరంగా పేర్కొనడం గమనార్హం. ఈ దేవాలయం పుణ్యకుమారుని

కాలానికంటె ముందే నిర్మించబడింది. దీనినిబట్టి దాతలు తమకు పూర్వం నిర్మించబడిన దేవాలయాలను తమపేరుతో వ్యవహరించే సంప్రదాయంకూడ వుండినట్లు తెలుస్తూ వుంది.

### 4.1 గోళకీ సంప్రదాయం

చోళుల ప్రోత్సాహంతో క్రీ.శ. పదవ శతాబ్ది నుండి దక్షిణ భారతదేశంలోని ధార్మిక ప్రవృత్తిని ప్రభావితం చేసిన గోళకీ సంప్రదాయం, క్రీ.శ. పదమూడవ శతాబ్ది చివరి ప్రాంతానికి ఎన్నో మఠాలు, శాఖలతో దక్షిణ భారతదేశమంతటా విస్తరించింది. అంతకు పూర్వం వ్యాప్తిలో వుండిన కాలముఖ, పాశుపత మొదలైన శైవ సంప్రదాయాలు గోళకీ సంప్రదాయంతో కలసిపోయి ఈ క్రొత్త సంప్రదాయం 'అభినవ గోళకి'గా వ్యవహృతమైంది. తరువాతి కాలంలో ఈ సంప్రదాయం శృంగేరి, కంచి పీఠాలకు సంబంధించిన శైవాద్వైత సంప్రదాయంతో కలసిపోయింది. ఈ సంప్రదాయంయొక్క ధార్మిక, తాత్త్విక చింతనలను గురించి అంతగా తెలియడం లేదు.

మొదటి రాజరాజు, మొదటి రాజేంద్రచోళుడు ఉత్తర భారతదేశంలోని 'దక్షిణ రథ' ప్రాంతం వరకు దండయాత్రలు జరిపిన సందర్భంలో ఆ ప్రాంతంలోని శైవ సంప్రదాయంపట్ల ఆకర్షితులై, గంగాతీర ప్రాంతం నుండి అనేకమంది శివాచార్యులను పిలిపించి కంచిలో వారికి నివాసాన్ని ఏర్పాటు చేసినారు. చోళుల ఈ ఉత్తర భారత దండయాత్ర తరువాత మాత్రమే గోళకీ సంప్రదాయానికి చెందిన ఆచార్యుల పేర్లు దక్షిణ భారతదేశంలో వినిపిస్తున్నాయి. ఈశానశివుడు, మొదటి రాజరాజుకు[36], సర్వశివుడు మొదటి రాజేంద్రునికి[37] రాజగురువులుగా వ్యవహరించినారు. కాబట్టి ఈ గోళకీ సంప్రదాయం దక్షిణ భారతదేశంలో క్రీ.శ. తొమ్మిది, పదవ శతాబ్దులలో ప్రారంభమైనట్లు చెప్పవచ్చు.

ఆంధ్రదేశంలో గోళకీ మఠ సంప్రదాయానికి చెందిన లక్షాధ్యాయి శాఖ (భిక్షా శాఖ) మొదట ప్రవేశించి స్థిరపడింది. క్రీ.శ. పదమూడవ శతాబ్దిలో గోళకీ మఠానికి చెందిన అనేక శాఖలు ఉద్భవించినాయి. ఈ శాఖలు శివాలయాల నిర్వహణపై పట్టును సాధించినాయి. గోళకీ సంప్రదాయాన్ని పేర్కొంటున్న శాసనాలు ఆ సంప్రదాయానికి సంబంధించి ఎక్కువ సమాచారాన్ని అందించడం లేదు. తమిళనాడులోని రామనాథపురం జిల్లా తిరుపుత్తూరు లోని ఒక శాసనం[38], ఈశాన శివాచార్యుడు గోళకీ సంప్రదాయంలోని లక్షాధ్యాయి శాఖకు చెందినవాడని పేర్కొంటూ వుంది. ఈ సంప్రదాయానికే చెందిన విశ్వేశ్వర శివాచార్యుడు కాకతీయ చక్రవర్తి గణపతిదేవునికి దీక్షాగురువుగాను, రుద్రమదేవికి రాజగురువుగాను వ్యవహరించినాడు. పుష్పగిరి అద్వైత మఠం ఈ గోళకీ సంప్రదాయానికి చెందిన ఆచార్యులు స్థాపించిందే. సోమశివాచార్యులు పుష్పగిరి మఠాధిపతి. దక్షిణామూర్తి శివాచార్యుడు, అఘోర శివాచార్యుడు మొదలైనవారు ఈ మఠానికి చెందిన ఆచార్య పరంపర లోనివారే.

గోళకీ మఠానికి సంబంధించిన విస్తృతమైన సమాచారాన్ని క్రీ.శ. 1261 నాటి మల్కాపురం

(గుంటూరు జిల్లా) శాసనం[39] అందిస్తూ వుంది. గంగా నర్మదా నదుల మధ్యప్రాంతంలోని దాహలదేశంలోని గోళకీ మఠం నుండి దక్షిణ భారతదేశంలోని గోళకీ మఠం ఉద్భవించిందని, షడ్భావశంభు ఈ మఠాన్ని స్థాపించినాడని, ఇతడు గోళకీమఠ స్థాపన కోసం కాలచురి రాజు యువరాజ దేవుని నుండి దానాన్ని గ్రహించినాడని పై శాసనం తెలుపుతూ వుంది. ఈ మఠానికి సంబంధించిన ఆచార్య పరంపరను కూడ పై శాసనం పేర్కొనింది. షడ్భావశంభు తరువాత సోమశంభు అతని తరువాత కీర్తిశంభు, అతని తరువాత విమలశంభు గోళకీ మఠాధిపత్యాన్ని స్వీకరించినారు. విమలశంభు తరువాత విశ్వేశ్వర శివాచార్య నామంతో ప్రసిద్ధి చెందిన ధర్మశివాచార్యుడు గోళకీ మఠానికి అధిపతి అయినాడు. ఇతని కాలంలోనే గోళకీ మఠం త్రిలక్షగ్రామ పరివ్యాప్తమైంది. గణపతిదేవుడు విశ్వేశ్వర శివాచార్యునికి వెలనాడు కంద్రవటిలోని మందర గ్రామాన్ని ఇస్తానని చెప్పిన మాట ననుసరించి రుద్రమదేవి మందర గ్రామంతోపాటు వెలంగపూడి గ్రామాన్ని కూడ దానమిచ్చినట్లు, విశ్వేశ్వర శివాచార్యుడు విశ్వేశ్వర దేవుని పేరుతో ఒక గ్రామాన్ని నిర్మించి దేశంలోని పలు ప్రాంతాల నుండి అన్ని వర్ణాల ప్రజలను రప్పించి వారికి నివాసాన్ని ఏర్పాటుచేసి ఆ గ్రామంలో గోళకీ మఠాన్ని స్థాపించినట్లు; ఆ మఠానికి అనుబంధంగా ఒక సత్రాన్ని ఏర్పాటుచేసి అందులో ఆబ్రాహ్మణ చండాలాంతం అన్ని వర్ణాల ప్రజలకు భోజన వసతిని కల్పించినట్లు; ఒక ప్రసూతి వైద్యశాలను, వైద్యులకు శిక్షణ కళాశాలను స్థాపించినట్లు; కాశీశ్వరపురం, మంద్రకూటం, చంద్రవల్లి, కొమ్మూరు, శ్రీశైలం, దుద్యాల మొదలైనచోట్ల గోళకీమఠ శాఖలను స్థాపించినట్లు పై శాసనం వల్ల తెలుస్తూ వుంది.

ఈ శైవ మఠాలు సామాన్య ప్రజలలో శైవధర్మ వ్యాప్తికి కృషి చేసినాయి. మఠాధిపతులు శైవాగమాలలో నిష్ణాతులై వుండేవారు. వారు విద్యాధ్యయనాన్ని ప్రోత్సహించి కవులను, పండితులను పోషించేవారు. ఈ మఠాలు ప్రజలందరికి అందుబాటులో వుండడం వల్ల వారు శైవధర్మం వైపుకు ఆకర్షితులైనారు.

కడప జిల్లాలో గోళకీ మఠాచార్యులను పేర్కొంటున్న శాసనాలు క్రీ.శ. పదమూడవ శతాబ్ది నుండి కనిపిస్తున్నాయి. శా.శ. 1182, రౌద్రి సంవత్సర చైత్రశుద్ధ ఏకాదశి, గురువారం నాడు మేష సంక్రమణ కాలంలో గణపతిదేవుని సామంతుడైన జన్నిగదేవుడు, త్రిభువనైక త్రిలక్షగ్రామ గోళకీ మహామఠ సామ్రాజ్య పట్టబద్ధ శ్రీమద్రాజగురు చరణ సరసీరుహ భూషిత మస్తకులు, శ్రీ త్రిపురాంతక దేవ దివ్య శ్రీపాదపద్మారాధకులైన శ్రీపర్వతంలోని అభినవ గోళకీ మఠాచార్యుడు శాంతపూర్వ శివదేశికులకు, శివలింగ మఠ విద్యామండప అధ్యయన శుశ్రూషక బ్రాహ్మణ అతిథి అభ్యాగత పూజార్థము అధిరాజేంద్ర చోళమండలము మేల్పాకనాటి పొత్తపినాటిలోని పుఱుందలూరు గ్రామాన్ని చతుస్సీమాపర్యంతం సకలాయ సహితంగా ధారాపూర్వకం చేసి ఇచ్చినట్లు అదేరోజు జారీచేయబడిన పొందలూరు శాసనం[40] తెలుపుతూ వుంది. ఇటిగుళ్లపాడులోని కాలనిర్ణయంలేని ఒక శాసనం[41], జన్నిగదేవుడు శ్రీ త్రిపురాంతకదేవ దివ్యశ్రీపాదపద్మారాధకులైన శ్రీపర్వతంలోని అభినవ గోళకీ మఠాధిపతి శ్రీ మల్లికార్జున శాంతపూర్వ శివదేశికులకు శివలింగ మఠ విద్యామండప అధ్యయన శుశ్రూషక బ్రాహ్మణ

అతిథి అభ్యాగత పూజనార్థం సకలి భూమిలోని ముదుమాల అనే గ్రామాన్ని సకలాయ సహితంగా ధారవోసి ఇచ్చినట్లు తెలుపుతూ వుంది.

శా.శ. 1217, మన్మథ సంవత్సర శ్రావణ బహుళ పాడ్యమి, గురువారం నాటి పుష్పగిరి శాసనం[42] ధర్మశివగురు దేవరను పేర్కొంటూ వుంది. ఇతడు గణపతిదేవుని దీక్షాగురువైన విశ్వేశ్వర శివాచార్యులు కావచ్చు.

సుభాను (స్వభాను) సంవత్సర శ్రావణ శుద్ధ పౌర్ణమి, శుక్రవారం (శక సంవత్సరం పేర్కొనబడలేదు. దానగ్రహీత కాలాన్ని బట్టి ఇది క్రీ.శ. 1403, ఆగస్ట్, 2వ తేదీ కావచ్చు) నాటి సోమిరెడ్డిపల్లె శాసనం[43] యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ మౌనానుష్ఠాన జప హోమ సమాధి శివారాధనశీల గుణసంపన్న, నానావిధ నిగమాగమతాత్పర్య పర్యాలోచన చ్ఛాతుర్య ధురీణ, శ్రీమద్రాయరాజగురు నామధేయాంక, పరమనైష్ఠిక శ్రీమదఘోర శివాచార్య అయ్యంగారికి అతని శిష్యుడైన జోతిరాజు గుండయదేవ మహారాజు, త్రిపురాంతక దేవర సన్నిధిలో తమ తల్లిదండ్రులైన మల్దేవి, జోతిరాజులకు పుణ్యంగా, తన నాయంకరానికి చెల్లే సకలిపాయలోని మాదనపల్లికి తమ తండ్రిపేరుతో జోతిరాజపురమని నామాంకితం చేసి సోమగ్రహణ పుణ్యకాలంలో అష్టభోగ తేజస్వామ్యంగా, అగ్రహారంగా సమర్పించినట్లు తెలుపుతూ వుంది.

పై శాసనంలో పేర్కొనబడిన అఘోర శివాచార్యుడు ఆకాలంలో ప్రసిద్ధ శివాచార్యుడు. మలయమారుతాంకితుడైన ఘంటసింగయకు ఇతడు గురువు. ఘంట సింగయతోడి జంటకవి నందిమల్లయ దక్షిణామూర్తి శివాచార్యుల శిష్యుడు. 'గురు దక్షిణామూర్త్యఘోర శివుల శిష్యుల' మని ఈ జంటకవులు తమను గురించి వరాహ పురాణంలో[44] చెప్పుకున్నారు.

"నెలకొన్న భక్తి సద్గురు
కుల చూడారత్నమగు నఘోర శివాచా
ర్యుల దివ్య పాదపద్మం
బులకు నమస్కృతు లొనర్చి పూతాత్ములమై" - అని

వరాహ పురాణంలో[45] అఘోర శివాచార్యుణ్ణి,

". . . . . పరిపూర్ణ భావ విఖ్యాతులైన
దక్షిణామూర్తి దేశికోత్తము నఘోర
శివుల భజియించి యేకాగ్ర చిత్తమునను" - అని

ప్రబోధ చంద్రోదయంలో[46] దక్షిణామూర్త్యఘోర శివాచార్యులను ఈ జంటకవులు ప్రస్తుతించినారు. నందిమల్లయ పౌత్రుడైన నందితిమ్మన, తాను అఘోర గురువరు శిష్యుడనని పారిజాతాపహరణంలో[47] చెప్పుకున్నాడు. మాదయగారి మల్లన కూడ అఘోర శివాచార్య గురుకరుణా లబ్ధ సారస్వతుడే.

పై శాసనాలలో పేర్కొనబడినవారే కాక, ఈశాన్యగురుదేవర, ఉత్తమశివ గురుదేవర, సిద్ధ శివులనే శివాచార్యుల ప్రసక్తి కాయస్థుల శాసనాలలో కనిపిస్తూ వుంది. ఈ ఆచార్యులు గోళకీ మఠ సంప్రదాయానికి చెందిన వారైందీ లేనిదీ ఇదమిత్థంగా తెలియడం లేదు. శా.శ. 1179, పింగళ సంవత్సర శ్రావణ శుద్ధ పౌర్ణిమ, గురువారం నాటి గంగవరం శాసనం[48], శ్రీ స్వయంభూదేవర దివ్యశ్రీపాదపద్మారాధకుడైన గణపతిదేవ మహారాజుకు సామంతుడైన గంగయసాహిణి, అతని అర్ధాంగలక్ష్మి కామలాబాయి, పుష్పగిరి [- -] దేవరకు అంగరంగ భోగాలకు ములికినాటి సీమలోని గంగవరం గ్రామాన్ని ఈశాన్యగురుదేవర హస్తాన ధారాపూర్వకంచేసి సర్వబాధాపరిహారంగా ఇచ్చినట్లు తెలుపుతూ వుంది. శా.శ. 1214, నందన సంవత్సర జ్యేష్ఠ పాడ్యమి, బుధవారం నాటి రాజంపేట శాసనం[49] శ్రీ వైద్యనాథదేవర దివ్యశ్రీపాదపద్మారాధకుడైన గండపెండార అంబదేవ మహారాజు, ఉత్తమశివగురుదేవర కొడుకు సిద్ధశివులకు, గుంజానాగేశ్వరము, కలుకుంట మొదలైన గ్రామాలను సర్వమాన్యంగా ఇచ్చినట్లు తెలియజేస్తూ వుంది.

గోళకీ మఠాచార్యులు శైవధర్మావలంబులైనప్పటికీ వైష్ణవ దేవాలయాలకు కూడా కొన్ని దానాలను ఇచ్చినట్లు, మరమ్మత్తులు చేయించినట్లు శాసనాలు తెలుపుతున్నాయి. శా.శ. 1423, దుర్మతి సంవత్సర పుష్య శుద్ధ విదియ, సోమవారం (క్రీ.శ. 1501, డిసెంబర్, 12వ తేదీ) నాటి పుష్పగిరి శాసనం[50] అఘోర శివాచార్యులు పుష్పగిరిలోని చెన్నకేశ్వర దేవాలయ శిఖరానికి గారసున్నం వేయించిన విషయాన్ని నమోదు చేసింది.

## *4.2 ఆరాధ్య సంప్రదాయం*

గోళకీ మఠ సంప్రదాయం నుండే ఆరాధ్య సంప్రదాయం ఉద్భవించింది. లింగధారణ, ఇష్టలింగాన్ని చేతిలో వుంచుకొని పూజించడం, షట్స్థల జ్ఞానం మొదలైన వీరశైవాచారాలు ఆరాధ్య బ్రాహ్మణులలో కనిపిస్తాయి. వీటినిబట్టి ఆరాధ్యులు వీరశైవులనే అభిప్రాయం కలగడానికి అవకాశముంది. కాని వీరశైవులు నిరసించిన వేదాలను, వర్ణాశ్రమ ధర్మాలను, దేవాలయ పూజను ఆరాధ్యులు అనుసరించడంవల్ల వీరు వీరశైవులకు భిన్నులని గ్రహించ వచ్చు. ఆరాధ్య సంప్రదాయానికి చెందిన కొందరు ఆచార్యుల ప్రసక్తి కడప జిల్లాలోని కొన్ని శాసనాలలో కనిపిస్తూ వుంది. శా.శ. 1375, ప్రమాదీచ సంవత్సర వైశాఖ శుద్ధ తదియ నాటి వల్లూరు శాసనంలోను[51], శా.శ. 1382, సౌమ్య సంవత్సర అధిక వైశాఖ బహుళ దశమి, సోమవారం నాటి ఊటుకూరు శాసనంలోను[52] వీరశైవ సిద్ధభిక్షావృత్తి అయ్యవారు పేర్కొనబడినాడు. పై రెండు శాసనాలూ వీరముష్టులు/వీరపురాంతకులు ఇతని ఆజ్ఞాధారులని తెలుపుతున్నాయి. వల్లూరు శాసనం, వీరముష్టులు ఆ గ్రామంలోని వీరేశ్వరుని దీపారాధనకు గాను దానాన్ని ఇచ్చినట్లు; ఊటుకూరు శాసనం, వీరపురాంతకులు ఆ గ్రామంలోని వీరేశ్వరునికి ప్రతి సంవత్సరం వైశాఖ శుద్ధ పంచమినాడు కళ్యాణోత్సవం సాగేటట్లుగా దానాన్ని ఇచ్చినట్లు నమోదు చేసినాయి. 'వీరశైవ సిద్ధభిక్షావృత్తి' పేరులోని 'వీరశైవ' శబ్దాన్ని బట్టి ఇతనిని

వీరశైవాచార్యునిగా భావించడానికి అవకాశముంది. కాని, ఊటుకూరు శాసనంలో ఇతడు షడ్దర్శన స్థాపనాచార్యుడుగా పేర్కొనబడినాడు. షడ్దర్శనాలు వైదిక సంప్రదాయానికి సంబంధించినవి. వల్లూరు శాసనంలోని శాపోక్తులలో, ఆ ధర్మశాసనానికి తప్పినవారు గంగకఱుత గోబ్రాహ్మణుల వధించిన పాపాన బోయినవారు' - అని చెప్పబడింది. పై రెండు అంశాలూ సిద్ధభిక్షావృత్తి అయ్యావారు వైదిక ధర్మాన్ని నిరసించిన వీరశైవ సంప్రదాయానికి భిన్నుడనే విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి. ఇతని పేరులోని 'భిక్షా' శబ్దం గోళకీ సంప్రదాయానికి చెందిన లక్షాధ్యాయి శాఖను సూచిస్తూ వుంది. ఊటుకూరు శాసనంలోని శాపోక్తులు ఆ ధర్మానికి అహితం చేసినవారు శివద్రోహులని, వారు జంజలింగ విభూతి రుద్రాక్షలకు వెలి అని; వల్లూరు శాసనంలోని శాపోక్తులు ఆ ధర్మానికి తప్పిన వీరముష్టులు శివాచార, కులాచార, విభూతి, రుద్రాక్షలకు వెలి అని ప్రకటించడాన్ని బట్టి సిద్ధభిక్షావృత్తి అయ్యావారు, వీరశైవ సంప్రదాయాలతో క్యాచిత్కమైన సంపర్కాన్ని కలిగి, గోళకీ సంప్రదాయం నుండి ఉద్భవించిన ఆరాధ్య సంప్రదాయానికి చెందిన ఆచార్యుడని చెప్పవచ్చు.

శా.శ. 1435, ఆంగీరస సంవత్సర శ్రావణ శుద్ధ త్రయోదశి, సోమవారం (క్రీ.శ. 1512, జూలై, 26వ తేదీ) నాటి తిమ్మారెడ్డిపల్లె శాసనం[53] వీర శివాగ్ర భిక్షావృత్తి అయ్యవారిని పేర్కొంటూ వుంది. ఇతడు కూడ ఆరాధ్య సంప్రదాయానికి చెందిన శివాచార్యుడు కావచ్చు. ఇతని ఆజ్ఞాధారులైన కొందరు వీరముష్టులు, మల్లికార్జున దేవుని వివాహ పుణ్యకాలంలో చిలెకాంపల్లి స్థలంలోని నాగనందీశ్వరునికి నైవేద్య, దీపారాధనల కోసం దానాన్ని ఇచ్చినట్లు పై శాసనం తెలుపుతూ వుంది. శా.శ. 1375, బహుధాన్య సంవత్సర మాఘ బహుళ అమావాస్య (బహుధాన్య సంవత్సరం శా.శ. 1380తో సరిపోలుతుంది. ఈ సంవత్సరం మాఘ బహుళ అమావాస్య శనివారంనాడు సూర్యగ్రహణం సంభవించింది.) నాటి మాలెమార్పురం శాసనంలో[54] వీరశైవాచారపరుడైన శ్రీమత్ ఘోడియ శివాచార్యులు పేర్కొనబడినాడు. ఇతని శిష్యుడైన మహామండలేశ్వర మేదిని మీసరగండకఠారి సాళువ తిమ్మయదేవ మహారాజు సూర్యగ్రహణ పుణ్యకాలంలో పినాకినీ నదీ తీరంలో సహస్ర గోదానం చేసి, తమ తల్లిదండ్రులకు పుణ్యంగా తన నాయంకరానికి చెల్లే పొత్తపి భూమిలోని మాలెమార్పురం గ్రామంలోని మూలస్థాన దేవర, మహేశ్వర దేవరలకు నాలుగు కుంటల తోటను, రెండు పనసమ్రాకులను, యాభై కుంటల వరిమడిని ఈశ్వరార్పితంచేసి ఇచ్చినట్లు పై శాసనం తెలుపుతూ వుంది.

### 4.3 కాపాలిక సంప్రదాయం :

కాపాలిక సంప్రదాయానికి చెందిన ఆచార్యుల ప్రసక్తి కడప జిల్లాలోని శాసనాలలో కనిపించడం లేదు. కాని ఈ జిల్లాలో మోపూరు వంటి ప్రసిద్ధ భైరవ క్షేత్రాలున్నాయి. కాపాలికులు భైరవ పూజాపరాయణులు కాబట్టి ఈ భైరవాలయాలు కడప జిల్లాలో కాపాలిక సంప్రదాయ వ్యాప్తికి నిదర్శనాలని చెప్పవచ్చు. ఈ జిల్లాలో భైరవారాధనను గురించి తెలుపుతున్న శాసనాలు క్రీ.శ. పదునాలుగవ శతాబ్ది మొదటి పాదం నుండి కనిపిస్తున్నాయి.

శా.శ. 1231, సౌమ్య సంవత్సర మాఘ బహుళ సప్తమి, గురువారం (క్రీ.శ. 1310, జనవరి, 8వ తేదీ) నాటి మోపూరు శాసనం[55], మహామండలేశ్వర భ్రమ్మిదేవ చోడ మహారాజు మోపూరి భైరవుని మండపాన్ని, ద్వారబంధాన్ని, వాకిలిని ప్రతిష్ఠ చేయించినట్లు తెలుపుతూ వుంది. ఉదయగిరి రాజ్యాధిపతి వీరసావణ్ణ ఒడయలు తమ తల్లిదండ్రులైన మేగాదేవి, కంపరాజులకు పుణ్యంగా మోపూరి భైరవదేవర అంగరంగ భోగాలకు పులివెందల భూమిలోని నాగూరు గ్రామాన్ని, ములికినాటి భూమిలోని చిదుపుతేవుల చెఱువు క్రింద రెండు ఖండుగల మడిని ధారాపూర్వకంచేసి ఇచ్చినట్లు శా.శ. 1273, నందన సంవత్సర చైత్రశుద్ధ పంచమి (క్రీ.శ. 1352, మార్చ్, 21వ తేదీ) నాటి మోపూరు శాసనంలో[56] నమోదు చేయబడింది. రెండవ దేవరాయులకు సామంతుడైన తిరుమలనాయుడు తమ తల్లులు వేమాయమ్మ, నాగాయమ్మలకు, తమ అక్క తిరుమలదేవమ్మకు పుణ్యంగా భైరవదేవునికి పశ్చిమభాగ గోపురాన్ని కట్టించినట్లు శా.శ. 1347 (క్రీ.శ. 1425) నాటి మోపూరు శాసనం[57] తెలుపుతూ వుంది. రాయసం కొండమరుసయ్య కొడుకు అయ్యపరుసు, అచ్యుతదేవరాయలు తనకు నాయంకరంగా ఇచ్చిన గండికోట దుర్గానికి చెల్లే మోపూరి భైరవేశ్వరునికి సంబంధించిన గ్రామాలలో వసూలుచేసే దుర్గ దణాయ నివర్తనలు సంవత్సరానికి ఇన్నూట ముప్పై అయిదు వరహాలను మోపూరి భైరవేశ్వరుని వైశాఖ శుద్ధ మొలకల పున్నమ రథోత్సవానికి, దేవుని అంగరంగ వైభవాలకు, తన స్వామి అచ్యుతరాయలకు పుణ్యంగా అక్షతదియ పుణ్యకాలంలో సిద్ధవటం జ్యోతి సిద్ధేశ్వరుని సన్నిధిలో సహిరణ్యోదక దానధారాపూర్వకంగా ఇచ్చినట్లు శా.శ. 1452, వికృతి సంవత్సర వైశాఖ శుద్ధ తదియ (క్రీ.శ. 1530, ఏప్రిల్ 30వ తేదీ శనివారం) నాటి మోపూరు శాసనం[58] తెలుపుతూ వుంది. శా.శ. 1453, ఖర సంవత్సర కార్తిక శుద్ధ దశమి, మంగళవారం (క్రీ.శ. 1531, అక్టోబర్, 20వ తేదీ) నాటి నల్లచెఱువుపల్లె శాసనం[59], పావులూరి విరూపయ్యంగారు, అచ్యుతదేవరాయలు తనకు అగ్రహారంగా ఇచ్చిన బలపనూరు గ్రామంలో పందుము చేనును మోపూరి భైరవేశ్వరునికి దీప, ధూప, నైవేద్యాలకుగాను ధారవోసి ఇచ్చినట్లు తెలుపుతూ వుంది.

ముక్తినాటి భూమిలోని మోహనాచల భైరవక్షేత్రం మహాసిద్ధ స్థానమని శా.శ. 1415 (క్రీ.శ. 1493) నాటి ముత్తుకూరు శాసనం[60] పేర్కొనింది. మోపూరులో భైరవాలయమున్న ప్రదేశమే మోహనాచలమని ప్రసిద్ధి చెందింది. క్రీడాభిరామంలో వినుకొండ వల్లభరాయుడు-

*మూడు గ్రామగ్రాసములతోడ గూడంగ*
*మోపూరు పాలించె ముల్కినాట*

. . . . . . . . . . . . . . . . .

. . . . . . . . . . . . . . . . . .

*ప్రత్యక్ష మొనరించి భైరవస్వామిచే*
*సిద్ధ సారస్వత శ్రీవరించె* - అని తనను గురించి చెప్పుకున్నాడు[61].

అంతేకాదు వీథ్యంతంలో "ముదమున ముల్కినాట వరమోహనశైల సువర్ణ కందరా సదనుడు కాలభైరవుడు" - అని భైరవస్వామిని కీర్తించినాడు[62].

మోపూరుతోపాటు అత్తిరాల, సిద్ధవటం ఈ జిల్లాలోని భైరవ క్షేత్రాలలో పేర్కొనదగినవి. కొందరు పరిపాలకులు, అధికారులు ఈ క్షేత్రాలకిచ్చిన దానాలను గురించి శాసనాలు తెలుపుతున్నాయి. సాళువ నరసింహరాయల 'అవసరం', అన్నమరుసయ్య గోకులాష్టమి పుణ్యకాలంలో అరతురేవుల (అత్తిరాల)కు వచ్చి, అక్కడి క్రత్రీశ్వర, పరశురామేశ్వర, భైరవేశ్వరులకు పూజ నైవేద్యాలు నడవకుండా వున్నట్లు తెలుసుకొని ఆ దేవస్థానాలలో పూజ నైవేద్యాలు నడవడంకోసం కొంత వరిమడిని ఇచ్చినట్లు శా.శ. 1399, హేవిళంబి సంవత్సర శ్రావణ బహుళ అష్టమి, గురువారం నాటి అత్తిరాల శాసనం[63] తెలుపుతూ వుంది. శ్రీకృష్ణ దేవరాయలు సిద్ధవటం ఇష్టకామేశ్వర భైరవేశ్వరులకు ఇందుపూరు గ్రామాన్ని ధారవోసి ఇచ్చినట్లు అయ్యవారిపల్లెలోని కాలనిర్ణయం లేని ఒక శాసనంలో[64] నమోదు చేయబడింది. శా.శ. 1454, ఖర సంవత్సర చైత్రశుద్ధ పౌర్ణిమ (క్రీ.శ. 1431, ఏప్రిల్, 1వ తేదీ, శనివారం, శా.శ. 1453?) నాటి మద్దూరు శాసనం[65] అచ్యుతదేవరాయల కాలంలో సిద్ధవటం సీమ సుంఖమణియగాడైన పాపరాజు కొండయ, సిద్ధవటానికి చెల్లే సకలిసీమలోని భైరవేశ్వరునికి చెల్లివచ్చే మద్దూరు గ్రామంలో వసూలు చేసే కొన్ని పన్నులను సిద్ధవట ఇష్టకామేశ్వర భైరవేశ్వరులకు సోమగ్రహణ పుణ్యకాలంలో అచ్యుతదేవరాయలకు పుణ్యంగా ధారవోసి ఇచ్చినట్లు తెలుపుతూ వుంది.

### *4.4 కాలముఖ సంప్రదాయం*

ఈ జిల్లాలో కాలముఖ సంప్రదాయానికి చెందిన 'క్రియాశక్తి' అనే ఆచార్యుణ్ణి పేర్కొంటున్న ఒకే ఒక శాసనం లభించింది. ఈ క్రియాశక్తి ఎవరో తెలియడం లేదు. అబ్బవరంలో లభించిన కాలనిర్ణయం లేని ఈ శాసనం[66], శ్రీ క్రియాశక్తి దేవరాయ ఒడయ శివదేవుని శిష్యుడు, విరూపంణొడయల కుమారుడైన హరియణొడయలు త్రియంబక దేవుని అమృతపడి కోసం మారుజవాడిలోని వంగిమడి స్థలంలోని అబ్బవరం గ్రామాన్ని సర్వబాధా పరిహారంగా ఆచంద్రార్క స్థాయిగా ధారాపూర్వకం చేసి ఇచ్చినట్లు తెలుపుతూ వుంది.

### *4.5 రసశైవం*

నవనాథ సిద్ధోపజ్ఞమైన రసశైవం కూడ ఈ జిల్లాలో వ్యాప్తిలో వుండినట్లు తెలుస్తూ వుంది. సిద్ధవటం తాలూకా పొర్నిపల్లె పొలిమేరలో వున్న ఒక శాసనం[67], కలువాయి సిద్ధయ్య అనే వ్యక్తి సర్వసిద్ధులను సేవించి దివ్య (దివ్వె?) చేయించినట్లు తెలుపుతూ వుంది. ఈ శాసనానికి సమీపంలో మంజులనాథుడు, మేఘనాథుడు, సారంగధరుడు, గోరక్షకుడు అని పేర్లు చెక్కివున్న నాలుగు ప్రతిమలున్నాయి. ఈ నలుగురు నవనాథుల లోనివారు. కాబట్టి వీరి ప్రతిమలతోపాటు మత్స్యేంద్రనాథ, విరూపాక్షనాథ, నాగార్జున, ఖనికనాథ, సిద్ధబుద్ధుల ప్రతిమలు కూడ ఇక్కడ ప్రతిష్ఠించబడి వుండి తరువాతి కాలంలో పగిలిపోవడమో లేదా తరలించబడడమో జరిగి వుంటుందని భావించవచ్చు.

## 5. శాక్త సంప్రదాయం

శాక్త సంప్రదాయానికి శైవంతో సన్నిహిత సంబంధముంది. శివుని అర్ధాంగి ఐన శక్తి అనేక రూపాలతో ఆంధ్రదేశంలో, బహుశ: భారతదేశమంతటా చాలా ప్రాచీనకాలం నుండి పూజించబడుతూ వుంది. ఈ జిల్లాలోని కొన్ని శాసనాలు త్రిపురాంతక దేవుణ్ణి పేర్కొంటున్నాయి. త్రిపురాంతకం ప్రధానంగా శక్తి పీఠం. శ్రీవిద్యా సంప్రదాయానికి చెందిన ఉపాసకులు మంత్రసిద్ధి కోసం ఇక్కడి బాలా త్రిపురసుందరి సన్నిధిలో సాధన చెయ్యడం ఇప్పటికీ జరుగుతూ వుంది.

శా.శ. 1104, శుభకృతు సంవత్సర ఆషాఢ బహుళ అష్టమి (క్రీ.శ. 1182, జూన్, 24వ తేదీ) నాటి పుష్పగిరి శాసనం[68] పల్లవ వంశానికి చెందిన చిద్దణదేవ మహారాజును కామకోట్యంబికాదేవీ లబ్ధవరప్రసాదుడని పేర్కొనింది. కామకోట్యంబిక శాక్త సంప్రదాయానికి సంబంధించిన దేవత. ఆదిశంకరులు ప్రవచించిన మార్గంలో శ్రీచక్రార్చన వంటి శాక్త సంప్రదాయాలు కామకోటి పీఠంలో అనుష్ఠించబడుతున్నాయి.

భవదూర మహీపతి పోరుమామిళ్లలో నిర్మింపజేసిన తటాకం మహాదుర్గాభిసంరక్షితమని ఆ చెఱువు కట్టమీద వున్న శాసనం[69] తెలుపుతూ వుంది. అన్నసంభూతికి కారణమైన జల ప్రసారాన్ని కల్పించే ఈ తటాకాన్ని రాక్షసాది దుష్టశక్తులనుండి కాపాడే నిమిత్తం ఇక్కడ దుర్గా ప్రతిష్ఠ జరిగివుంటుంది. చెఱువుకట్ట మీద ఉగ్రరూపిణులైన స్త్రీ దేవతామూర్తులను ప్రతిష్ఠించడం అనూచానంగా వస్తున్న సంప్రదాయం. చింతకొమ్మదిన్నె గ్రామంలోని చెఱువుకట్ట శిథిలమై పోతుండగా దానిని వడ్డెవాండ్లచేత బాగుచేయించిన కాపులకు, కమ్మవారికి ఆ గ్రామంలోని శెట్టి కరణాలు, శా.శ. 1669, ప్రభవ సంవత్సర వైశాఖ శుద్ధ పౌర్ణమి నాడు చెఱువు దశబంధ మాన్యం వ్రాయించి అందుకు సాక్షిగా కట్టమీది గంగమ్మను పేర్కొన్నారు[70].

ఈ జిల్లాలోని శాసనాలలోని అల్లమెయ తల్లేరి, కుఱువ భటారి, సూరమ్మ, జ్ఞానేశ్వరి, తలకంటిదేవి, అంకాళ పరమేశ్వరి, ఆరెమాంబిక, అనే గ్రామదేవతల ప్రసక్తి కనిపిస్తూ వుంది. గ్రామదేవతారాధన శాక్తంలోని వామాచార సంప్రదాయానికి సన్నిహితమైంది. క్రీ.శ. 9వ శతాబ్ది లక్షణాలున్న పులపత్తూరు శాసనం[71] జుద్ధపుట్టిని ఏలుతున్న చోళి మహారాజు అల్లమెయ తల్లేరి గుడికి నాలుగూర్లలో భూదానాన్ని ఇచ్చిన విషయాన్ని నమోదు చేసింది. ఈ శాసనం, ప్రస్తుతం దాసనమ్మగా పిలువబడుతున్న ఒక గ్రామదేవత ఆలయం సమీపంలో వుంది. తెలుగుచోడ వంశస్థుడైన వంకెయచోళి మహారాజు తన నలభై ఒకటవ రాజ్య సంవత్సరంలో (శక సంవత్సరం పేర్కొనబడలేదు) దశమి, ఆదివారం నాడు కుఱువభటారి అనే దేవతకు కొంత భూమిని సర్వపరిహారువుగా ఇచ్చినట్లు దొంగలసానిలోని ఒక శాసనం[72] తెలుపుతూ వుంది.

కాకతీయ ప్రతాపరుద్రుణ్ణి పేర్కొంటున్న భీమగుండంలోని కాలనిర్ణయంలేని ఒక శాసనంలో[73] మున్నూట శివతీర్థాలకు మూలస్థానమైన గండికోటలోని సూరమ్మ అనే దేవత

అనేక నామాలతో ప్రస్తుతించబడింది. ఈ స్తుతి అభిచారికా మంత్రం కావచ్చు. అభిచారికా మంత్రాలు గురుపరంపరాగతంగా ఉపదేశించబడతాయి. గుప్తవిద్యగా ప్రసారాన్ని పొందే ఈ తాంత్రిక సంప్రదాయాలు గ్రంథాలలో చోటుచేసుకున్నప్పటికీ, శిలాఫలకాలపై ప్రకటించబడడం చాలా అరుదైన సంఘటనగా చెప్పవచ్చు.

శా.శ. 1308, క్రోధి సంవత్సర పుష్య బహుళ దశమి (క్రీ.శ. 1385) నాటి నిడుజువ్వి శాసనం[74], జ్ఞానేశ్వరి, మహంకాళిదేవి ఆలయాలను పేర్కొంటూ వుంది. దేవగుడిలోని శా.శ. 1316, భవ సంవత్సర కార్తిక బహుళ ద్వాదశి నాటి రెండు శాసనాలు[75] తలకంటిదేవిని పేర్కొంటున్నాయి. 'తలకంటి' – 'ముక్కంటి' సామ్యంతో ఏర్పడిన రూపం. తలపై (నుదురుపై) కన్ను కలవాడు అని పై సమాసానికి అర్థం. తలకంటి యొక్క దేవి తలకంటిదేవి. ఈ దేవత శాక్త సంప్రదాయానికి సంబంధించిందే.

శా.శ. 1367, క్రోధన సంవత్సర వైశాఖ శుద్ధ దశమి, గురువారం (క్రీ.శ. 1445, ఏప్రిల్, 17వ తేదీ, శనివారం?) నాటి ఎగువ రాచపల్లి శాసనం[76] విజయరాయల పుత్రుడైన దేవరాయ మహారాయలు విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలిస్తున్న కాలంలో కలుకడపురవరాధీశ్వరుడైన తిరుమలేశ్వర నాయకుడు, మార్జవాడ భూమిలోని వరెగిమడ్లలో ఆరెమాంబిక దేవాలయ ప్రతిష్ఠ చేసి, ఆ దేవాలయం ముందు రంగ మండపాన్ని కట్టించినట్లు తెలుపుతూ వుంది.

వేల్పుచర్ల, ఉప్పలూరు, దుద్యాల గ్రామాలకు సంబంధించిన మహారాచ ప్రయోజనాలు కలిగిన స్వామ్యతలలో దేవత, మణిహారి, పంబకాండ్రు, దారపట్టపువారి వర్తనలు పోగా వచ్చే రూకలు, బియ్యం, పోకలు, ఆకులు మొదలైన సకల స్వామ్యతలను, పుష్పగిరి దుర్గిదేవి మహామండపంలో సమావేశమైన అసంఖ్యాతులు, వేల్పుచర్ల అంకాళ పరమేశ్వరికి ధూప దీప నైవేద్యాలకు పారువేట మహోత్సవానికి గాను ఆచంద్రార్క స్థాయిగా ధారవోసి ఇచ్చినట్లు శా.శ. 1468, విశ్వావసు సంవత్సర వైశాఖ శుద్ధ పంచమి (క్రీ.శ. 1545, ఏప్రిల్, 16వ తేదీ) నాటి వేల్పుచెర్ల శాసనం[77] తెలుపుతూ వుంది.

ఓబలంలోని కాలనిర్ణయం లేని ఒక శాసనం[78] మనెౝ కొండేశ్వర (మాలకొండేశ్వర), అంకాళాదిశక్తి దేవాలయాలను పేర్కొనడమే గాక "ఇహము సాధింపను వామవిద్యయె విద్య పరము సాధింపను బ్రం ॥ (బ్రహ్మవిద్య) అని రి తలచేరు" – అని ఉటంకించింది. ఇహపర సాధనలో వామవిద్య, బ్రహ్మవిద్యల ప్రాశస్త్యాన్ని పై వాక్యం తెలుపుతూ వుంది. ఇహసాధన కోసం వామాచార పద్ధతిలో అంకాళాదిశక్తిని, పరసాధన కోసం మాలకొండేశ్వర స్వామిని ప్రజలు పూజించేవారని భావించవచ్చు.

సప్తమాతృకారాధన కూడ ఈ జిల్లాలో వుండిందనడానికి, రామేశ్వరంలోని రామ లింగేశ్వరస్వామి దేవాలయ ప్రాంగణంలోను, పోరుమామిళ్ల చెఱువు కట్టమీద ఇంకా కొన్ని ప్రదేశాలలోను వున్న సప్తమాతృకల శిల్ప ఫలకాలు సాక్ష్యంగా నిలుస్తున్నాయి. బ్రాహ్మి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండ – అనే స్త్రీ దేవతలకు

సప్తమాతృకలని వ్యవహారం. ఈ దేవతల శిల్పాలు సాధారణంగా ఒకే ఫలకంపై అర్ధశిల్పంగా మలచబడతాయి. ప్రతి దేవత శిల్పం క్రింద ఆ దేవత వాహనం చెక్కబడి వుంటుంది. ఇవి వరుసగా హంస, వృషభ, మయూర, గరుడ, వరాహ, కుంజర, మహిష వాహనాలు. సప్తమాతృకారాధనకు సంబంధించిన వివరాలు తెలియడం లేదు. ఈ దేవతలను గర్భగృహంలో ప్రతిష్ఠించి పూజించే సంప్రదాయం వున్నట్లు ఆధారాలు లేవు. సాధారణంగా శివాలయాల ప్రాంగణంలో గోడలలో పొదిగి కాని, విడిగా కాని ఈ ఫలకాలు కనిపిస్తున్నాయి. కొన్ని ఫలకాలలో సప్తమాతృకలతోపాటు ఒకవైపు గణపతి, ఇంకొకవైపు కుమారస్వామి ప్రతిమలుండడం గమనించవచ్చు.

## *6. వైష్ణవ ధర్మం*

విజయనగర పూర్వయుగంలో ఈ జిల్లాలో చాళుక్యరాజు త్రిభువనమల్లదేవుని కాలంలోను, నెల్లూరు తెలుగుచోళ రాజు నల్లసిద్ధరాసదేవచోళ మహారాజు కాలంలోను మాత్రమే వైష్ణవ ధర్మవ్యాప్తికి సంబంధించిన సూచనలు కనిపిస్తున్నాయి. త్రిభువన మల్లదేవుని సామంతుడైన చిద్దణదేవచోడ మహారాజు జారీచేసిన పెద్ద ముడియం శాసనం[79] వరాహావతారుడైన విష్ణుస్తుతితో ప్రారంభమైంది. ఈ శాసనంలో పేర్కొనబడిన దానగ్రహీతలు శ్రీ భగవన్నారాయణ చరణాంబుజ స్మరణ పరిణతాంత:కరణులుగా చెప్పబడినారు. నల్లసిద్ధ రాజుకు పొత్తపి దేశాధీశ్వరులైన మల్లిదేవ సోమేశ్వరులతో జరిగిన యుద్ధంలో నల్లసిద్ధి రాజుకు సంధివిగ్రహియైన రేమన ప్రెగ్గడ అనేకమందిని హతమార్చి తన రాజుకు విజయాన్ని చేకూర్చి స్వర్గస్థుడు కాగా అతని కుమారుడు కామనప్రెగ్గడ తన తల్లిదండ్రులకు పుణ్యంగా పెడనాంటి వాయేట శ్రీ విష్ణు ప్రతిష్ఠ చేసి పదిమంది బ్రాహ్మణులకు ఆచంద్రార్క స్థాయిగా వృత్తులను పెట్టినట్లు శా.శ. 1081 (క్రీ.శ. 1160) నాటి దొంగలసాని శాసనం[80] తెలుపుతూ వుంది.

విజయనగర రాజులలో తొలితరం పరిపాలకులు శైవ ధర్మావలంబులైనప్పటికీ ఇతర ధర్మాలపట్ల సహనాన్ని ప్రదర్శించినారు. వీరికాలంలో కొందరు సామంతులు, ప్రజలు వైష్ణవ ధర్మావలంబులై వున్నట్లు కొన్ని శాసనాలు తెలుపుతున్నాయి. శా.శ. 1272 (క్రీ.శ.. 1350) నాటి రామాపురం శాసనం[81], 'హరేర్లీలా వరాహస్య . . . . . .' ఇత్యాది విష్ణు స్తుతితో ప్రారంభమైంది. ఈ శాసనం, మహామండలేశ్వర వీరబుక్కరాయలు పూళిపజయపట్టణం రాజధానిగా పరిపాలిస్తున్నట్లు తెలుపుతూ వుంది. శా.శ. 1292 (క్రీ.శ. 1370) నాటి చిన్నదాసరిపల్లె శాసనం[82] వీరబుక్కరాయలు విజయనగరాన్ని పాలిస్తున్న కాలంలో మహామండలేశ్వర మీసరగండ కఠారి సాళువ సంకిదేవ మహారాజు కుమారుడు మంగయదేవ మహారాజు, తమ తల్లిదండ్రులైన ముమ్మలదేవి, సంకిదేవరాజులకు పుణ్యంగా బోయినపల్లి అహోబలదేవర అంగరంగ భోగాలకుగాను నాచనపల్లి గ్రామాన్ని నంబి నారణదాసికి ధారవోసి ఇచ్చి, నారణదాసి, అతని సంతతి శ్రీరామ నామము గలంతకాలం ఆ దేవరకు సమారాధన చేసుకొని ఆ గ్రామాన్ని అనుభవించే ఏర్పాటు చేసినట్లు తెలుపుతూ వుంది.

బుక్కరాయల కుమారుడైన మొదటి విరూపాక్షరాయలు వైష్ణవ ధర్మాన్ని అనుసరించినాడు. కాని ఇతని తరువాత రాజ్యానికి వచ్చిన రెండవ హరిహరరాయలు, అతని వారసులు శైవధర్మాన్ని అనుసరించినారు. వీరికాలంలో వైష్ణవ ధర్మానికి కూడ ఆదరణ లభించింది.కొందరు సామంతులు, అధికారులు వైష్ణవ ధర్మాన్ని అవలంబించినారు. వీర ప్రతాపదేవరాయల (మొదటి దేవరాయల) కాలంలో మహామండలేశ్వరుడైన సంబెట పిన్నయదేవ మహారాయలు ఉలిమెళ్ల చెన్నకేశవ స్వామికి దానాన్ని ఇచ్చినట్లు ఉలిమెళ్లలోని కాలనిర్ణయంలేని ఒక శాసనం[83] తెలుపుతూ వుంది. రెండవ దేవరాయల కాలంలో మహామండలేశ్వరుడైన సమ్మెట లక్కయదేవ మహారాజు కుమారుడు రాయదేవ మహారాజుకు ప్రధాని అయిన నరసింహ ప్రగ్గడ, గుండ్లూరి లక్ష్మీనారాయణ పెరుమాళ్ల తిరునాళ్ల మహోత్సవానికి, అమృతపళ్లకు, ఏడు అఖండ దీపాలకుగాను కొన్ని భూములను, కొన్ని పన్నులను శిర్యాదేవి అమ్మగారికి, లక్కయదేవ మహారాజుకు పుణ్యంగా మకర సంక్రమణ కాలంలో బాహుదా నదీతీరంలో ధారాపూర్వకంగా ఇచ్చినట్లు గుండ్లూరులోని కాలనిర్ణయంలేని ఒక శాసనం[84] తెలుపుతూ వుంది.

మల్లికార్జునరాయల కాలం నుండి విజయనగర సామ్రాజ్యంలో వైష్ణవ ధర్మానికి విశేష ప్రాచుర్యం లభించింది. సంగమవంశ పతనానంతరం విజయనగర సింహాసనాన్ని అధిష్ఠించిన సాళువ వంశస్థులు వైష్ణవ ధర్మావలంబులై తిరుపతి వేంకటేశ్వరస్వామికి, అహోబిల నరసింహస్వామికి భక్తులైనారు. వీరికాలంలో కొందరు సామంతులు, అధికారులు కూడ వైష్ణవ ధర్మాన్ని అవలంబించి ఎన్నో వైష్ణవాలయాలకు దానాలను ఇచ్చినారు. శా.శ. 1415 (క్రీ.శ. 1493) నాటి ముత్తుకూరు శాసనం[85], సాళువ ఇమ్మడి నరసింగదేవరాయల కాలంలో ముక్తినాటి భూమినాయంకరుడైన బొక్కసం తిమ్మనాయుని మరది సుంకయ్య, ముత్తుకూరి చెన్నకేశవ దేవుని తిరువారాధన కోసం ముత్తుకూరికి చెల్లే స్థలసుంకం, పెండ్లి, బండి, గుట్టం, తోల, కొల్చు మొదలైన పన్నులను ఇచ్చినట్లు తెలుపుతూ వుంది.

తుళువ వంశస్థుల కాలంలో ఈ జిల్లాలో అనేక గ్రామాలలోని చెన్నకేశవాలయాలు రాజపోషణను పొందినాయి. కడప తిరువెంగళనాథస్వామి, గండికోట రఘునాథస్వామి, పోరుమామిళ్ల లక్ష్మీకాంతనాథస్వామి ఆలయాలకు విశేషమైన రాజాదరణ లభించినట్లు శాసనాలు తెలుపుతున్నాయి. పైన చెప్పబడిన ఆలయాలే కాక వీరి కాలంలో ఈ జిల్లాలోని వైష్ణవాలయాలన్నీ సిరిసంపదలతో తులతూగినాయి.

శ్రీకృష్ణదేవరాయల పరిపాలనా కాలంలో బెజవాడ పురవరాధీశ్వరుడైన నరసయ్యదేవ మహారాజు పులివెందల స్థలంలోని కుందలూడు గ్రామాన్ని పులివెందల శ్రీ రంగరాజ (శ్రీరంగనాథ) స్వామికి నైవేద్యం, అంగరంగ వైభవాలకుగాను సమర్పించినట్లు శా.శ. 1431 (క్రీ.శ. 1509) నాటి పులివెందల శాసనం[86] తెలుపుతూ వుంది. శా.శ. 1435 (క్రీ.శ. 1513) నాటి పొట్లదుర్తి శాసనం[87], మహామండలేశ్వర రాచిరాజు, శ్రీకృష్ణదేవరాయలు తనకు నాయంకరంగా ఇచ్చిన పొట్లదుర్తిలోని చెన్నకేశ్వరునికి ఆ గ్రామంలో వసూలు చేసే స్థలసుంకాన్ని

ధారవోసి ఇచ్చినట్లు తెలుపుతూ వుంది. పుష్పగిరి చెన్నకేశవ దేవుని పూజ పునస్కారాలు, అమృతపడి, నైవేద్యాలకుగాను శ్రీకృష్ణదేవరాయలు చినమాచుపల్లి గ్రామాన్ని సహిరణ్యోదక దాన ధారాపూర్వకంగా సమర్పించినట్లు శా.శ. 1436 (క్రీ.శ. 1514) నాటి పుష్పగిరి[88], చిన్నమాచుపల్లి[89] శాసనాలు తెలుపుతున్నాయి. శా.శ. 1439 (క్రీ.శ. 1517) నాటి కొట్టిపాడు శాసనం[90], రాచిరాజు కుమారుడైన సాళువ గోవిందరాజు గండికోట రఘునాథ దేవునికి, పాళపల్లె గ్రామాన్ని దాన ధారాపూర్వకంగా ఇచ్చినట్లు తెలుపుతూ వుంది.

శ్రీకృష్ణదేవరాయల కాలంలో తిరుమల ప్రముఖ యాత్రాస్థలంగా రూపుదిద్దుకునింది. ఈ జిల్లాలోని వివిధ ప్రాంతాలనుండి తిరుమలకు వెళ్లే యాత్రికుల కోసం మార్గమధ్యంలో వున్న గ్రామాలలోని భక్తులు ధర్మసత్రాలను ఏర్పాటు చేసినారు. శా.శ. 1442 (క్రీ.శ. 1520) నాటి చిడిపిరాల శాసనం[91], తిరువెంగళనాథుని తిరుమల తిరునాళ్లకు వెళ్లే వెంకటాద్రి దాసులకు, చాలిన వైష్ణవులకు, చాతాని వైష్ణవులకు, బ్రాహ్మణులకు, ఇతర వర్గాలకు చెందిన భక్తులకు చడుపిరేల గ్రామంలో ధర్మసత్రం సాగించడం కోసం గురుజపల్లి నరసప్పయ్య గారి కుమారుడు చెన్నయ్య కట్టడ చేసినట్లు తెలుపుతూ వుంది.

ఈ కాలంలోనే కడప తిరువెంగళనాథుని ఆలయం ఈ జిల్లాలోని వైష్ణవాలయాలలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించింది. శా.శ. 1439 (క్రీ.శ. 1517) నాటి దేవుని కడప శాసనం[92], శ్రీకృష్ణదేవరాయల సర్వ ప్రధాని అయిన తిమ్మరుసయ్యంగారు కడప తిరువెంగళనాథుని పూజా పునస్కారాల కోసం కొన్ని భూములను సూర్యగ్రహణ పుణ్యకాలంలో ధారాపూర్వకంగా ఇచ్చినట్లు తెలుపుతూ వుంది.

అచ్యుతదేవరాయల కాలంలోను, సదాశివరాయల కాలంలోను, అళియరామరాయల కాలంలోను, తాళ్లపాక వంశస్థులైన వైష్ణవాచార్యులు ఈ జిల్లాలో వైష్ణవ ధర్మవ్యాప్తికి విశేషమైన కృషి చేసినారు. కొందరు రాజోద్యోగులు వీరి శిష్యులైనట్లు కొన్ని శాసనాలద్వారా తెలుస్తూ వుంది. శా.శ. 1458 (క్రీ.శ. 1536) నాటి మొయిళ్ల కాలువ శాసనం[93], అచ్యుత దేవరాయల కాలంలో మొయిళ్ల కాలువ గ్రామానికి అధికారి అయిన రాయసం వెంగళప్ప, ఆ గ్రామంలో తిరువెంగళనాథుని ప్రతిష్ఠ చేసి, దేవస్థానాన్ని కట్టించి, దేవుని అమృతపళ్లకు, అఖండ తిరువళికెకు, దశమి మహోత్సవాలకుగాను కొన్ని భూములను తన గురువు తాళ్లపాక తిరుమలయ్య గారికి పుణ్యంగా ధారవోసి ఇచ్చినట్లు తెలుపుతూ వుంది. సదాశివరాయల పరిపాలనాకాలం ఈ జిల్లాలో వైష్ణవ ధర్మవ్యాప్తికి స్వర్ణయుగమని చెప్పవచ్చు. ఈ జిల్లాలో ఈ కాలానికి సంబంధించిన శాసనాలలో మూడవవంతుకు పైగా శాసనాలు వైష్ణవ దేవాలయాలకు ఇవ్వబడిన దానాలను గురించి తెలుపుతున్నాయి. తుళువ వంశ పతనానంతరం విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన ఆరవీటి వంశస్థులు కూడ వైష్ణవ ధర్మాన్ని అవలంబించి ఆదరించినారు.

## 7. సౌర సంప్రదాయం

సూర్యునికి ఆలయాలు నిర్మించడం, విగ్రహాలను ప్రతిష్ఠించడం ఈ జిల్లాలో వుండినట్లు కొన్ని శాసనాలు తెలుపుతున్నాయి. కాని సౌర సంప్రదాయం ప్రత్యేకమైన ధార్మిక సంప్రదాయంగా ఈ జిల్లాలో ప్రవర్తిల్లినట్లు నిర్ధారించడానికి తగిన ఆధారాలు లభించడం లేదు. క్రీ.శ. 8వ శతాబ్దినాటి కొట్టిపాడు శాసనం[94], కీర్తివర్మ సత్యాశ్రయ పృథివీవల్లభ మహారాజుకు సామంతుడైన పెర్బాణాధిరాజు కొట్టిపఱితిలో ఆదిత్య భట్టారనికి రాచమానంలో నాలుగు మరుతుల నేలను ఇచ్చినట్లు తెలుపుతూ వుంది. ముద్దనూరులోని క్రీ.శ. 10వ శతాబ్ది లక్షణాలున్న ఒక శాసనం[95], చోళి మహారాజు పరిపాలనా కాలంలో రేయమయ్య అనే సామంతుడు లేదా అధికారి, సిఱుమూరు (చిలమకూరు)లో ఆదిత్య గ్రహాన్ని ప్రతిష్ఠించి, సూర్యగ్రహణ కాలంలో ఆ దేవునికి రాచమానంలో కొంత భూమిని, ఒక గానుగను ఇచ్చినట్లు తెలుపుతూ వుంది. ఈ కాలం నాటిదే[96] అయిన సూర్యవిగ్రహం చిలమకూరులోని అగస్త్యేశ్వరాలయంలో వుంది. ఈ విగ్రహం శిల్పశాస్త్రాన్ని అనుసరించి తయారుచేసిన స్థానకమూర్తి. సమభంగ పద్ధతిలో నిలబడిన ఈ మూర్తి, ప్రభామండలంతోను, యజ్ఞోపవీతం, కర్ణకుండలాలతోను, కిరీట మకుటంతోను, రెండు చేతులలో పద్మాలతోను వున్నట్లు చెక్కబడింది.

# సూ చి క లు

1. I.A.P., C.D., Part I, No. 22
2. Ibid., No. 30
3. Ibid., No. 71
4. Ibid., No. 74
5. Ibid., No. 123
6. Ibid., Part II No. 12
7. Ibid., No. 269
8. Ibid., No. 31
9. Ibid., No. 89
10. Ibid., No. 165
11. Ibid., No. 175
12. S. Gopala Krishna Murthy : Jain Vestieges in Andhra; 1963, p-16.
13. S.I.I., Vol. IV, No. 798
14. I.A.P., C.D., Part I, No. 83
15. S. Beal : Buddhist Records of the Western World; 1969.
16. I.A.P., C.D., Part I, No. I
17. Ibid., No. II
18. Ibid., No. 14
19. Ibid., No. 85
20. Ibid., No. 88
21. Ibid., No. 121
22. Ibid., No. 131
23. Ibid., Part II, No. 44
24. Ibid., Part I, No. 111
25. Ibid., No. 113
26. Ibid., No. 138
27. Ibid., No. 139
28. Ibid., No. 153
29. Ibid., No. 156
30. Ibid., No. 157
31. Ibid., Part II, No. 48
32. Ibid., No. 55
33. Ibid., No. 87
34. Ibid., Part I, No. 137
35. Ibid., No. 14
36. S.I.I., Vol. II, Nos. 9 and 91
37. Ibid., No. 20
38. A.R., No. 178 of 1935-36
39. S.I.I., Vol. X, No. 295
40. I.A.P., C.D., Part I, No. 142
41. Ibid., No. 140
42. Ibid., No. 148
43. Ibid., No. 162
44. 1-31
45. 1-91
46. 1-32
47. 5-108
48. I.A.P., C.D., Part I, No. 141
49. Ibid., No. 146
50. Ibid., Part II, No. 59
51. Ibid., No. 46
52. Ibid., No. 13
53. Ibid., No. 68
54. Ibid., No. 45
55. Ibid., Part I, No. 154
56. Ibid., Part II, No. 7
57. Ibid., No. 37
58. Ibid., No. 105
59. Ibid., No. 113
60. Ibid., No. 52
61. 22వ పద్యం
62. 294వ పద్యం
63. I.A.P., C.D., Part II, No. 51
64. Ibid., No. 99

65. Ibid., No. 108
66. Ibid., No. 1
67. యన్.వి. రమణయ్య : కడప శిలా శాసనములు వగయరా; పుట. 242.
68. I.A.P., C.D., Part I, No. 129
69. Ibid., Part II, No. 11
70. Ibid., Part III, No. 61
71. Ibid., Part I, No. 29
72. Ibid., No. 108
73. Ibid., No. 158
74. Ibid. Part II, No. 18
75. Ibid., Nos. 24, 25
76. Ibid., No. 44
77. Ibid., No. 175
78. Ibid., Part III, No. 237
79. Ibid., Part I, No. 123
80. Ibid., No. 128
81. Ibid., Part II, No. 6
82. Ibid., No. 12
83. Ibid., No. 9
84. Ibid., No. 43
85. Ibid., No. 52
86. Ibid., No. 65
87. Ibid., No. 69
88. Ibid., No. 70
89. Ibid., No. 71
90. Ibid., No. 76
91. Ibid., No. 82
92. Ibid., No. 75
93. Ibid., No. 124
94. Ibid., Part I, No. 43
95. Ibid., No. 98
96. B. Rajendra Prasad : Temple Sculpture of Andhra Pradesh; 1978.

# ఉపయుక్త గ్రంథసూచి


**ాసన సంకలనాలు :**

Epigraphia Indica.

Inscriptions of Andhra Pradesh, Cuddapah District, Part I (1977), Part II (1978), Part III (1981) : P.V. Parabrahma Sastry (Ed.); Government of Andhra Pradesh.

కడప శిలా శాసనములు వగయరా : యన్. వెంకటరమణయ్య (సం.); Government of Tamil Nadu, 1972.

**ప్రాచీన గ్రంథాలు :**

కౌటిల్యుని అర్థశాస్త్రము : మామిడిపూడి వెంకట రంగయ్య (అను.); 1968

క్రీడాభిరామము : వినుకొండ వల్లభరాయుడు; ఎమెస్కో, 1972.

నిర్వచనోత్తర రామాయణము : తిక్కన; ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి.

ప్రబోధ చంద్రోదయము : నందిమల్లయ, ఘంటసింగయ; ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1976.

మనుస్మృతి : చమన్‌లాల్ గౌతమ్ (వ్యాఖ్యా.); బరేలీ, 1973

యాజ్ఞవల్క్యస్మృతి : నారాయణ్‌రామ్ ఆచార్య (సం.) నిర్ణయసాగర్, బొంబాయి, 1949.

వరాహ పురాణము : నందిమల్లయ, ఘంటసింగయ; ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1976.

శుక సప్తతి : పాలవేకరి కదిరీపతి; ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1979.

శ్రీమన్మహాభారతమ్ : గీతాప్రతాప్, గోరఖ్‌పూర్, వి.శ. 2014.

సింహాసన ద్వాత్రింశిక : కొరవి గోపరాజు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1982.

**ఆధునిక గ్రంథాలు :**

Beal, S. : Buddhist Records of the Western World; New Delhi, 1969.

Chakraborti Haripada : India as reflected in the Inscriptions of Gupta Period; Munshiram Manoharlal Publishers Pvt. Ltd., 1978.

Gopalakrsihamoorthy, S. : Jain Vestieges in Andhra; Govt. of Andhra Pradesh, Hyderabad, 1963.

Parabrahma Sastry, P.V. : The Kakatiyas, Govt. of Andhra Pradesh, Hyderabad. 1978.

Rajendra Prasad, B : Temple Sculpture of Andhra Pradesh; Hyderabad, 1978.

Ramanayya, N.V. : The Eastern Chalukyas of Vengi; Vedam Venkataraya Sastry and Brothers, Madras, 1950.

Sampath, M.D. : Chittoor Through the Ages; Delhi, 1980.

Sircar, D.C. : Indian Epigraphy; Motilal Banarasidas, 1965.

Sircar, D.C. : Indian Epigraphical Glossary, Motilal Banarsidas.

Sivasankaranarayana, Bh. : Andhra Pradesh District Gazetteers, Cuddapah, Hyderabad, 1967.

ఈశ్వరదత్తు, కుందూరి : ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము; ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1979.

ఈశ్వరదత్తు, కుందూరి : శాసన శబ్దకోశము (ఆంధ్రప్రదేశము); ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, 1967.

రామారావు, మారేమండ : శాతవాహనత సంచిక; ఆంధ్రేతిహాస సంశోధక మండలి, గుంటూరు, 1950.

లక్ష్మీనారాయణ గంగిశెట్టి : తెలుగు శాసనాల సామాజిక సాంస్కృతిక అధ్యయనం; అముద్రిత పిహెచ్.డి. సిద్ధాంత గ్రంథం, ఉస్మానియా విశ్వవిద్యాలయం, 1984.

శ్రీనివాసులు, కె. : గండికోట సీమ చరిత్ర – సంస్కృతి; 1988.

సత్యనారాయణ కంభంపాటి : ఆంధ్రుల సంస్కృతి – చరిత్ర, హైదరాబాద్ బుక్ ట్రస్ట్, హైదరాబాద్, 1982.

సోమశేఖరశర్మ మల్లంపల్లి, ప్రభృతులు (సం.) : విజ్ఞాన సర్వస్వము, మూడవ సంపుటము, తెలుగు సంస్కృతి-1; తెలుగు భాషా సమితి, మద్రాసు, 1959.

**నివేదికలు, పత్రికలు :**

(Archaeological) Annual Reports.

Annual Reports of the Archaeology and Museums, Andhra Pradesh.

పరిశోధన.

భారతి.

